శ్రీః

॥ ధమ్మం సుచరితం చరే ॥

# ధమ్మపదం



పాళీ, సంస్కృతచ్ఛాయా, ఆంధ్రానువాద
వ్యాఖ్యానసహితము

**డా॥ రత్నాకరం బాలరాజు**, M.A., Ph.D.

బుద్ధం శరణం గచ్ఛామి ।
ధర్మం శరణం గచ్ఛామి ।
సంఘం శరణం గచ్ఛామి ॥

అధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల
సాకేత నిలయం,
(21, S.B.I. Colony)
అనంతపురం (అం.ప్ర.) - 515 001

ప్రథమ ముద్రణ - ౧౦౦౦ ప్రతులు

శ్రీముఖ - ఫాల్గుణము (April–1994)

(శా.శ. చైత్రము - ౧౯౧౬)



ప్రతులకు

**రత్నాకరం రమాదేవి,** M.A.,

(D/o Dr. R. BALA RAJU)

సాకేత నిలయం,

21, S.B.I. Colony,

అనంతపురం (ఆం.ప్ర.) - ౫౧౫౦౦౧



*Printed at :*
**OM SAI GRAPHICS**
3-4-528,
Narayanaguda,
Hyderabad - 500027 (A.P.)
Ph: 663335

# పుణ్యస్మృతి
# In memory of



**Chi. SAI SHIVA NARAYANA**
**(22 June '71 – 4 April '88)**

**చి. సాయి శివనారాయణ**
**స్మృత్యర్థం**

ఓం నమః పరమాత్మనే

# పుణ్యస్మృతి

**"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్,**
**పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః ।**
**తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం,**
**భావస్థిరాణి జననాంతరసౌహృదాని ।"**

(అభిజ్ఞాన శాకుంతలము - V.2)

జనన ధర్మం గల ఏ వ్యక్తి, తనకు ఇష్టులైన వారితో సుఖంగా ఉన్నప్పటికీ, రమ్యములైన రూపాలను చూచినపుడూ, మధురములైన శబ్దాలను (గీతాదులను) విన్నప్పుడూ, ఉత్కంఠతో దుఃఖిస్తాడో, ఆ వ్యక్తి, ఇంతకు ముందు తనకు తెలియనివీ, హృదయనిష్ఠములూ, అయిన జన్మాంతరంలోని స్నేహాలను, మనసుతో స్మరిస్తున్నాడు.

అలాంటి వ్యక్తుల్లో ఒకడు, చి. సాయి శివనారాయణ అనే బాలుడు. ఈ బాలుని తండ్రి LT. COL. K.R. మూర్తి (Rtd.) బొంబాయి నివాసియైన ఆంధ్రులు. వీరితోనాకు పరిచయం కల్గడం కూడా, ఆశ్చర్యకరమైన అపూర్వవిషయమే. జీవితంలో మనకు తారసిల్లే వాళ్లందరూ - వారు మిత్రులు కానీ, శత్రువులు కానీ - మనతో పూర్వభవానుబంధం కలవారే అని అంటారు.

పదారేండ్లు (16) దాటని చిన్న వయసులో, అసాధారణ ప్రజ్ఞావైభవంతో, పరుల దుఃఖానికి పరితపించే కోమల కారుణ్య భావం, చి. సాయిలో అభివ్యక్తమైంది. పద్యరూపంలోనూ, గద్యరూపంలోనూ, ఆంగ్లభాషలో, నిరుపమానభావుకతతో, తాను చూచి, విని, స్పందించిన - తన చుట్టూ ఉన్న సాధారణ జన జీవనదృశ్యాలను నిర్వేదాత్మకమైన కవితారూపంలో అభివర్ణించాడు. గద్యపద్యాత్మకమైన ఈ రచనల్లో, దృశ్యమానమౌతున్న, ఆ బాలుని వ్యక్తిత్వాన్నీ,

చిత్తోన్నతినీ, మనస్సుతో దర్శించే వాళ్లందరూ నావలెనే, విషాదాశ్చర్యాలను, ఏకకాలంలోనే అనుభూతి పొందగలరనడంలో సందేహం లేదు.

తండ్రికి (శ్రీ కె.ఆర్. మూర్తిగారికి) స్వప్నంలో సాక్షాత్కరించిన షిర్డీసాయీశుని వరప్రసాదఫలంగా ఈ బాలుడు 22 జూన్ 71వ సంIలో జన్మించాడు.

చి.సాయి, అద్భుతబుద్ధిసంపన్నుడైన బాలుడు (Prodigy) ఐదేండ్ల అల్పవయసులో (22 జూన్ 76) తిరుమలకు భగవద్దర్శనార్థం కుటుంబ సభ్యులతో వెళ్లిన సందర్భంలో, వరుస (queue)లో కూర్చొని ఉన్నపుడు శ్రీ వేంకటేశ్వరచిత్రపటాలలోని కథలో సగభాగం సాయి, కంఠస్థం చేశాడు. ప్రయాణం పూర్తి అయ్యే లోపల మిగతా సగభాగం నేర్చుకున్నాడు.

ఐదున్నర సంIల ప్రాయంలో జంతువులను గూర్చి తెలిపే పెద్ద పుస్తకం—(Reader's Digest—book of Animals) లోని బొమ్మలన్నిటినీ సాయి, తెలుసుకోగల్గాడు. అక్షరానుక్రమంలో కూర్చిన జంతువుల 1200 పేర్లను కూడా మొదటి నుంచి తుది వరకూ కంఠస్థం చేశాడు.

ఏడేండ్ల ప్రాయంలో, సాయి, BRECHT నాటకం అర్థం చేసుకోడానికీ, చదవడానికీ, సమర్థుడయ్యాడు; అందులోని విషయాలకు సంబంధించి అడిగిన ప్రశ్నలకు సైతం సమాధానాలు చెప్పాడు. ఈ అసామాన్యశక్తిసామర్థ్యాలు, తెలుసుకోడానికి శక్యం కాని గహన విషయాలయ్యాయి. ఈ అసాధారణధారణాశక్తి, ఆ బాలునికి స్వాభావిక గుణంగా భావించడం విషాదకరం.

ఈ వయసులోనే, బాలరామాయణంలోని 5,6 శ్లోకాలు, తండ్రి, ఆ పసివాణ్ణి, ప్రతిదినం వల్లింపజేసేవాడు; **'దయయు సత్యంబులోనుగా తలపడేని,' 'నితాంతాపారభూతదయయును', 'పరోపకారార్థమిదం శరీరమ్'** – ఇత్యాది పద్యాలనూ, శ్లోకాలను, చదివించేవాడు. సాయి, వాటిని వెనువెంటనే కంఠస్థం చేయకల్గాడు. ఈ ధారణాశక్తినే 'శ్రుతిధరత్వం' అని అంటారు. ('ధీర్ధారణావతీ మేధా') దీనికే 'మేధా' అని మరొక పేరు. (Retentive intellect)

ఈ భావాలు, ఆ పిన్నవాని కోమలమనస్సుపై ప్రగాఢసంస్కారాన్ని

కల్గిస్తాయని తండ్రి, అప్పుడు భావించనే లేదు. 1985 సం॥ మేనెలలో, తండ్రి, సాయికి, ఉపనయన సంస్కారం నిర్వహింపతలపెట్టాడు. కాని, ఆశ్చర్యకరంగా, ఆ బాలుడు, తీవ్రంగా వ్యతిరేకించి, ఉపనయనాన్ని నిరాకరించాడు.

ఘృణ(రోత), లజ్జ, కులం, శీలం(స్వభావం) భయం, మానం(ప్రతిష్ఠ), జాతి, అభిమానం - వీటిని అష్టపాశాలని అంటారు. ఈ అష్ట పాశాలు స్వల్పభేదంతో కులార్ణవ తంత్రంలో పేర్కొనబడ్డాయి.

**"ఘృణా, శంకా, భయం, లజ్జా, జుగుప్సా చేతి పంచమీ।**
**కులం శీలం, చ జాతిశ్చేత్యష్ట పాశాః ప్రకీర్తితాః॥"**

సాయికి, తన ముక్తస్థితిని గురించిన పూర్వస్మృతి అస్ఫుటంగానైన ఉందని ఈ చర్య సూచిస్తుంది. కళాశాలలో ఒకరు సాయిని కులమేదని అడుగగా, అతడు దీనికి తీవ్రంగా స్పందించి, దారుణమైన మనోవ్యథను పొందాడు. తొమ్మిది సం॥ల ప్రాయంలో, తండ్రితో కలిసి, జపాన్ దేశానికి వెళ్లిన సాయి, 39 అక్షరాలతోడి జపాన్ భాషా లిపిని $1^1/_2$ దినంలో నేర్చుకోగల్గాడు. భారతదేశంలో తానెప్పుడు చూడని 'కంప్యూటర్ గేమ్సు' (Computer Games) ఆటల్లో ఆశ్చర్యకరంగా ప్రవీణుడయ్యాడు.

14 ఏండ్ల వయసున పరీక్షలో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడై N.T.S. (National Talent Scholarship) కు ఎన్నికైనాడు. ఈ సమయంలోనే (1985) సాయి, రచించిన 'Rat-race' (మూషికధావనం-ఎలుకల పరుగులు), అనే కవిత, తన చుట్టూ ఉన్న సామాన్యజనజీవనగతిని వివరిస్తూ, అపుడపుడే అతనిలో అంకురిస్తున్న నిర్వేదాన్నీ -సంవేగాన్నీ-తెలియజేస్తున్నది. అప్పటి నుండి $2^1/_2$ సం॥ల కొద్ది కాలంలోనే మిగతా గద్యపద్యాత్మక రచనలన్నీ అతడు చేశాడు.

1987 సం॥లో తన తండ్రి తల్లి - (అవ్వ) మరణించింది. అప్పటికే, సంపూర్ణ నిస్సంగత్వం ఆ బాలున్ని ఆవహించింది. ఇక, ఈ సమాజంలో పూర్ణ పరిణతికి మార్గం లేదనే భావన సాయి అంతరంగంలో స్థిరపడింది. జీవితాన్ని విసర్జించాలనే దృఢ నిశ్చయం కూడా కల్గింది.

ఏ మాత్రం ఉద్వేగం లేకుండా, నాల్గు నెలలు ఈ భావంతోనే అతడు జీవించాడు. సాయి, ఆధ్యాత్మికమైన నిర్వేదాన్ని పొందడానికి మాత్రమే మళ్లీ

జన్మమెత్తాడని ఈ రచనలన్నీ వ్యంజిస్తున్నాయి. సాయికి, నేటి సామాజిక విషమపరిస్థితులు, వ్యక్తుల ధర్మభ్రష్టతా, దరిద్రుల దైన్యమూ, ధనవంతుల వ్యామోహదర్పాలూ, రాజకీయనాయకుల ధర్మరహితమిథ్యాచారమూ, హృదయ విహీనతా, పరమనిర్వేదాన్ని కల్గించాయి. రాజకీయనాయకులనే కంపుకొడుతున్న ఈ నక్కలకు ఆకలి యొక్క అర్థం తెలుస్తుందా? ఏ ఒక్క మేధావీ, ఒక్క పూట ఉపాహారాన్ని అయినా, పేదల కోసం వదిలాడా?

(నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథాహ్యసి ।)

నిర్వేదం ఆశాపాశాలకు కత్తిలాంటిది. విజ్ఞానరహితుడు మమతాబంధ విముక్తుడు కాలేనట్లే, నిర్వేదరహితుడు దేహబంధాల నుండి విముక్తుడు కాలేడు.

అధ్యాత్మికతను పణంగా పెట్టి ధనవంతులు సామాజికఆర్థికసమస్యల నుండి విముక్తులైనారు. కానీ, వారు తమకు తామే భారమైన సమస్యలయ్యారు. ఆంతరంగికశూన్యతా, చింతా, మితిలేని విషయసుఖాకాంక్షా, అధికార వ్యామోహమూ, వారిని జీవిత ప్రయోజనాన్ని విస్మరింపజేశాయి. మానవత్వపు విలువలు మంట కలిశాయి. వ్యక్తిత్వం (Personality) ఏకత్వాన్నీ, సాంఘిక జీవనం స్థిరత్వాన్నీ (Solidarity of Social life), కోల్పోయాయి. నాగరిక జీవనం లక్ష్యశూన్యమై దుఃఖకారణమైన భౌతికవాదం వ్యాప్తి చెందింది. సాయి జీవనగాథకు వ్యాఖ్యారూపాలైన అతని కవితలు, ఈ విషమజీవితరంగాన్ని గురించిన అతని ఆవేదననూ తత్పర్యవసానమైన అభినిష్క్రమణాన్నీ కరుణాత్మకంగా వివరిస్తున్నాయి.

ప్రతి వ్యక్తి జీవితం ఒక కథే; వినేవారుంటే. అయితే ఎవరి దారిన వారు పోతూ, ఇటూ, అటూ చూడడానికీ, ఇదీ అదీ వినడానికీ, సమయం, ఓపికా, లేక దైనందిన జీవితంలో సతమతమౌతున్న ఈనాటి ప్రజలకు మరొకరి కథలూ ఊహలూ అనవసరం. అయినా, వ్యక్తులందరికీ ఒకే ఒక ఆవేదన - నాకథ ఎవరైనా రాస్తారా? వింటారా? అని.

మనసులో అగ్నిపర్వతంలో నుంచీ వచ్చే విషవాయువుల్లాగా, విచారభరితాలోచనలూ, తెలియని ఆవేదనా, చుట్టూ బొంబాయి 'ఫుట్‌పాత్స్' (footpaths) లో అగచాట్లు పడే నిరుపేదల జీవితాలూ, వారు పొట్టకూటికై పడే తాపత్రయాలూ, చూస్తూ ఏమీ చెయ్యలేనే అనే కరుణా, దుఃఖమూ.

రాజకీయ సాంఘిక విద్యా సంస్థల్లోని పేలవత్వమూ - వీటి వలన ఒక మహావిపత్తు - అలజడి -14 ఏండ్ల నాటికే సాయి హృదయంలో ప్రారంభమైంది. దుఃఖితుల బాధను నివారింపశక్తిలేని కోమలహృదయం నిష్ప్రయోజనమన్నాడు.

Tenderness, without a capacityof relieving, only makes the man who feels it more wretched than the object which sues for assistance - (A city night - piece- Oliver Gold Smith).

Whilst the poor man groaneth on the bed of sickness, whilst the unfortunate languish in the horrors of a dungeon or the hoary head of age lifts up a feeble eye to thee for pity, O how canst thou riot, in superfluous enjoyments, regardless of their wants, unfeeling of their woes !

(The Economy of Human Life - Pity - P. 22 - Samata Edition - 1989)

ఈ జీవితవలయంలో ఎందుకు నేను చిక్కుకున్నాను? జీవిత మెందుకు? మత మేమిటి? సత్య మేమిటి? వాక్యమిటి? శాంతి - నిశ్చలనిరంతరమైన శాంతి జీవితంలో ఎలా లభిస్తుంది? అంటూ అయోమయంగా ఉండే ఈ జీవితరంగంలో నుంచీ తనకు తానుగా సాయి నిష్క్రమించాడు. **"జీవనలాస్యం, గతించిపోయిన ఉషోదయాచ్ని మళ్లీ ఇంకేమాత్రమూ వంజ్ఞలతో ఆహ్వానింపజాలదు. మోహభ్రాంతులు తొలగి, కనులు మిరుమిట్లుగొల్పే యథార్థజ్ఞానకాంతులు నన్ను వింపివేశాయి." (Disillusion).**

పరమశాంతుడూ ధీమంతుడూ, ప్రగాఢభావుకుడూ, తీవ్ర సంవేదనశాలీ, అయినా, సాయి, తన మిత్రుల నెప్పుడూ, మృదులమైన హాస్యంతో గంటల కొలది వినోదపరిచేవాడు. అలాంటి వ్యక్తి తనకు తానే ప్రాణత్యాగం చేయడం ఒక దుర్భేద్యమైన రహస్యంగా కనపడుతుంది.

ఆనాడు (ఏప్రిల్-4-1988) సుప్రసన్నమైన మనస్సుతో అనేక విషయాల్ని గూర్చి 3,4 గంటలు తండ్రితో సాయి ముచ్చటించాడు. సరిగ 3 గంll సమయంలోనే (2.05.P.M. ) మరి అతడులేడు. **ప్రతిమ రూపొందిన తరువాత ప్రతిమను అచ్చుపోసే సాధనం (mould) తో మరి ప్రయోజనమేముంది.** అని పరమహంస రామకృష్ణుని సూక్తి.

**"దుఃఖం సర్వ మనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్ ।**
**అజం సర్వ మనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి ।"**

(గౌడపాదమాండూక్యకారిక - III-43)

సంసారదుఃఖాన్ని అనుస్మరించి, కామభోగాలనుంచీ మనస్సును నివర్తింపజేసుకోవాలి. పరమాత్మానుస్మరణము వలన జగద్భావం నశిస్తుంది.

**"తత్త్వ మాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాతు బాహ్యతః ।**
**తత్త్వీభూతస్తదారామ స్తత్త్వాదప్రచ్యుతో భవేత్ ।"**

(గౌ.మా.కా. II-38)

పరతత్త్వాన్ని సందర్శించి, బాహ్యాభ్యంతరాల్లో తత్తాదాత్మ్యంతో, తదారాముడై, నిరంతర పరమాత్మదర్శనంలో తన్ను ప్రతిష్ఠించుకోవాలి.

అలాంటి అద్భుతమైన బాలుడు చి. సాయిశివనారాయణ పుణ్యస్మృత్యర్థమై భగవదర్పితమూ, మోక్షార్థగర్భితమూ,చిత్త విశ్రాంతిదాయకమూ బుద్ధోపదేశితము అయిన ధమ్మపదం(అనువాదవ్యాఖ్యాసంవలితము) ప్రకాశితము. ఈ ప్రకాశనము వలన పరమ కారుణికుడైన పరమేశ్వరుడు సంప్రీతుడగుగాక !

**సంప్రీణితో భవతి భూతపతిర్మహేశః ।**

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

# Some of the Poems of Chi. Sai Shiva Narayana

## చి. సాయి శివనారాయణ

## ఆంగ్ల కవితలు (కొన్ని)

## WHY IS LIFE?

Why are we given the gift to life
To look and not see; to see and not observe?
For eating, drinking, laughing: on and on and on
Lacking intelligence; perception, nerve?

The resounding echoing truth around us
Says life is for service; betterment; THOUGHT
Yet we fritter it away in foolish falsehoods;
In excitement we thrive; in mediocrity we rot.

Empty headed imbeciles with no thought
For advancement; for light, for truth

We revel in frivolities; rejoice in amorality
Oblivious of the existence of the multitudes
Oblivious of the mind, spirit, and society

## ఎందుకోసం జీవితం ?

మనకు జీవితప్రదానం ఎందుకోసం,
సంవీక్షణ లేని చూపుతో, నిరూపణలేని సంవీక్షణతో
ప్రవర్తించడానికా ?
ప్రజ్ఞా, సంవీక్షణా, ధృతీ, -
ఇవేవీ లేకుండా,
తింటూ తాగుతూ, నవ్వుతూ
కాలక్షేపం చేయడానికా?
ఎందుకోసమీ జీవితం ?
దిక్కులు నినదించేలా ప్రతిధ్వనిస్తూ
మన చుట్టూ ఉన్న సత్యం ఘోషిస్తోంది;
'జీవితం సేవ కోసం, పరిణతి కోసం, చింతన కోసం', అని
అయినా, ఆసత్యాన్ని బుద్ధిహీనమృషావాదాల్లో,
ఛిన్నాభిన్నం చేస్తున్నాం మనం;
ఉద్వేగంలో వర్ధిల్లుతున్నాం.
మధ్యమావస్థలో - త్రిశంకుస్వర్గంలో,
దుర్గంధంలో స్రుక్కిపోతున్నాం ;
అభ్యున్నతీ, ఆలోకనా, సత్యం - వీటిని గురించి
ఏమాత్రం చింతలేని శూన్యమస్తకులం; వికలచిత్తులం.
అగణితజనగణాల ఉనికినీ,
హృదయాన్నీ, ఆత్మనూ, సమాజాన్నీ విస్మరించి,
నిరర్థక కార్యకలాపాల్లో, కోలాహలంగా,
పానోత్సవాలు చేసుకుంటున్నాం;
నీతిబాహ్యప్రవృత్తిలో ఆనందిస్తున్నాం ।

## ANGER HAS A - VISITED

The momentary prick
Is the catalyst
as suddenly
it grabs hold of your feelings
rendering you devoid
of reason or logic

It's intensity is vast
uncontrollable; though often
unjustified it churns up sentiments of
frustrated hatred,

Blindly it directs a man into
a swirling whirlpool
of profanities
as he, in its grip
unleashes his tremendous
potential energy
in the form of

Evil words and gestures —
He is exhausted

.........The aftermath—
is broken hearts,
wounded feelings,
A sad stunned silence;

For the moment's impulse
Has rendered the offender numb

With shock at the revelation
of hatred;

With sorrow at the rupturing
of love's bond;
With self-justification
at lowered self-esteem.....
He is tense........

The explosion has churned up a plethora of ill feelings
Their constant evocation
Cool in to the molten mass
of hate;

Anger has-a-visited
and the result is
too terrible to conceive....
Why?
Was it worth it, my friend?

## క్రోధం దృగ్గోచరమైంది

ముల్లుపొడుపులాంటి క్షణికావేగం
ఒక ఉత్ప్రేరకంలా, ఆకస్మికంగా,
నీ సంవేదన అన్నిటినీ ప్రగ్రహించి,
నిన్ను విచక్షణారహితునిగా, బుద్ధిహీనునిగా
చేస్తున్నది.
దాని తీవ్రత విస్తారం,
అది నిరర్గళం; నిగ్రహానికి అసాధ్యం.
అది తరచుగా సమర్థనీయం కాదు.
అయినా, ఆశాభగ్న విద్వేషాలను
మనమనస్సును మథించి అది ఉప్పతిల్ల జేస్తుంది.
గుడ్డిగా మనిషిని అది
అపవిత్ర భావాలతో ఘూర్ణిల్లు ఆవర్తం (సుడిగుండం)లోనికి,
నెట్టివేస్తుంది.

## పుణ్యస్మృతి

క్రోధావేశంలో అతని అతిశయ అంతర్గత శక్తులన్నీ
నిందాలాపాలు, అంగవిక్షేపాల రూపాల్లో
ఉప్పొంగి ప్రవహిస్తాయి.
అతడు అలసి పోతాడు
......తరువాతి పరిణామాలు
భగ్నహృదయాలు
క్షత సంవేదనలు,
ఒక విషాద మూర్ఛిత మౌనం, నిశ్శబ్దత;
ఒక క్షణికావేగం
ఆ దోషిని చైతన్యరహితునిగా స్తబ్ధునిగా చేసింది;
విద్వేషం బయలుపడిందన్న
ఆకస్మిక సంక్షోభంతో,
ప్రేమానుబంధాలు భగ్నమైనాయన్న
శోకావేశంతో,
దిగజారిపోయిన ఆత్మగౌరవస్థితిలో
ఆత్మ సమర్థనతో,
అతడు కఠినంగా, రూక్షంగా ఉన్నాడు.
ఈ విస్ఫోటనం దుర్భావపూర్ణరుజావస్థను
ఉత్పాదించింది.
ఈ అసత్ సంవేదనల నిరంతరావాహనం –
కరిగిన విద్వేషఘనరాశి ద్రవంలో చల్లారింది.
క్రోధం దృగ్గోచరమైంది.
దాని పరిణామం ఊహకందని మహోదారుణం
ఎందుకు?
మిత్రమా! అది అర్థమైందా?

("స్ఖలియించు క్రోధాగ్నికణముల చేత
నలుగదే సచ్చిదానందపద్మంబు?")

# THE ACHING SOUL

All is apparently tranquil
But the soul aches
Logic abandoned;
Blind unreasonable uncontrollable
Sadness;

Grief floods the mind
But the tears don't come
The struggle of the Soul
In stifling agony

Amidst surface tranquillity
Deep down the soul aches
Like a bird in a cage
In ignorant rage.

# వ్యథితాత్మ

అంతా శాంతంగా నిశ్చలంగా ఉన్నట్లే కన్పిస్తున్నది.
కానీ, ఆత్మ దుఃఖిస్తున్నది; నిర్హేతుకంగా.
అంధమూ, అహైతుకమూ, అసంయమమూ,
ఈ విషాదం–

మనస్సు శోకపరిప్లుతం;
అయినా అశ్రువులు రాలడం లేదు.
ఆత్మ పోరాటం;
ఊపిరాడని ఆవేదనలో.

ఉపరితలంలో కన్పించే శాంతి నిశ్చలతల అంతరంలో,
లోపల అగాధంలో,
ఆత్మ దుఃఖిస్తున్నది;
పంజర బద్ధ విహంగంలా
అజ్ఞానరోషావేశంలో ।

# ధమ్మపదం – విషయానుక్రమణిక

ఓం నమః పరమాత్మనే ।

# ధమ్మపదం

## అథ భగవద్ధ్యానం గురువందనం కృతి సమర్పణం చ ।

శ్రీ రామరామరామేతి, రామే రన్తుం చిదాత్మని ।
జరామరణమోక్షాయ, మనో మే సంప్రసీదతు ।
శాశ్వతస్యచ ధర్మస్య, గోప్తారం పురుషోత్తమం, ।
జానకీజీవనం రామం, ప్రణమామి జగద్గురుమ్ ।
సర్వదేవరథానాం చ, సారథిం పార్థసారథిం, ।
యోగేశ్వరం ప్రేమపూర్ణం, కృష్ణం వందే సుహృద్వరమ్ ।
కరుణాపూరలహరీ పరీవాహిత చక్షుషం,
నిర్వాణపదదాతారం, బుద్ధం వందే చిరంతనమ్ ।
బాదరాయణ మౌనీంద్రం, సూత్రకారం చ శంకరం ।
భాష్యకారం గురుం వందే, జ్ఞానసిద్ధ్యర్థమాత్మని ।
స్థాపకం శ్రుతిధర్మస్య, సర్వధర్మస్వరూపిణం ।
గురుం పరమహంసానాం, రామకృష్ణం హరిం భజే ।
యోఽర్థః శ్రీరామకృష్ణస్య, వాచో మూర్తపరాత్మనః, ।
తం బోధనిలయం వందే, వివేకానంద సద్గురుమ్ ।
అభయాఽహింసేఽసంగం చ, ఆనందం పరమం స్మరేత్ ।
ఇతియోఽదర్శయత్ ప్రేమ్ణా, తం వివేకిన మాశ్రయే ।
రామమంత్ర స్వరూపం శ్రీరామదాసం కృపాంబుధిం ।
భజామి మద్గురుం శాంతమ్, ఆనందాశ్రమవాసినమ్ ।
స్మరణం దర్శనం స్యాద్ధి, నామ్నైవ పరమేశ్వరః ।
ఇతి యోఽదర్శయత్ ప్రేమ్ణా, రామదాసం గురుం భజే ।
మహర్షిం రమణం మూర్తగుహం శోణాద్రివాసినం ।
చింతావిహీనం గంభీరం, తత్త్వదీపం సమాశ్రయే ।
దివ్యజీవనతత్త్వజ్ఞం, పూర్ణాఽద్వైత ప్రవర్తకం ।
యోగీంద్ర మరవిందాఖ్యం, చింతయామి సనాతనమ్ ।
అభయం సర్వభూతేభ్యో, దాతారం మూర్తశంకరం ।
జగద్గురుం కృపాపూర్ణం, చంద్రశేఖర మాశ్రయే ।

విశ్వధర్మప్రవక్తారం, సత్యసాయీశరూపిణం ।
కృపాంబుధిం భాగధేయనిధిం వందే సనాతనమ్ ॥
సాయిరామాయ సత్యాయ శివాయ పరమాత్మనే ।
సుందరాయ ప్రశాంతాయ, నమః శ్రీసత్యసాయినే ॥
రత్నాకరాన్వవాయోఽహం భారద్వాజర్షిగోత్రజః ।
తనూజో బాలరాజాఖ్యః సుబ్బాంబా భాస్కరార్యయోః ॥
క్వచ 'ధమ్మపద' వ్యాఖ్యా, భావితా బుధసత్తమైః ।
క్వచాఽహమల్పధిషణః, కర్తుం వ్యాఖ్యాం శుభావహామ్ ॥
సూరీణాం నైకవివృతీః, యథామతి వివేచనం ।
శ్రద్ధయా కృతవానస్మి, భావగ్రహణకాంక్షయా ॥
కృత్వాఽనుసరణం తేషాం, బుధానాం వివృతీః సతామ్ ।
సంబుద్ధదేశితం ధమ్మపదం గాథాత్మకం ముదా ॥
అకార్ష మాంధ్రభాషాయాం, వివృతిం చ మనోరమామ్ ।
కృతజ్ఞోఽహం సదాతేషాం, జ్ఞానధర్మప్రవర్తినామ్ ॥
**గురువాయుపురీశాయ, విశ్వక్లేశాఽపహారిణే ।**
**సమర్పయే కృతి మిమాం, కృష్ణాయ పరమాత్మనే ॥**
చిరంతనసుహృద్దేవః, శరణాగతవత్సలః ।
మాతా పితా చ సర్వస్వం, దైవతం పరమం చ మే ॥
ప్రీయతాం శ్రీమనోరామః, కరుణామృతసాగరః ।
అనయా వాఙ్మయీరూపపూజయా భగవాన్ హరిః ॥
**భగవత్కృపయా శశ్వత్శీలధర్మప్రకాశికా ।**
**చిత్త ప్రశమనీ సమ్యక్ సంబుద్ధోపదేశితా ।**
**ప్రచరిష్యతీయం లోకే (ఽస్మిన్) యావత్ చంద్రార్క తారకమ్ ॥**

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు!*

***బుద్ధం శరణం గచ్ఛామి ।***
***ధర్మం శరణం గచ్ఛామి ।***
***సంఘం శరణం గచ్ఛామి***

***ఓం తత్సత్ ।***

**RAMAKRISHNA MATH**
Ramakrishna Math Marg
Domalguda
Hyderabad - 500 029

Phone : { 63936
63937

Date: 12.2.1994




# BENEDICTION

I am glad to know that Sri Ratnakara Balaraju is bringing out in Telugu **Dharmapada** with commentary and based on the earlier and modern commentaries.

Buddha's words have a special relevance for us in India and the Telugu reading public must thank Sri Balaraju for rendering this service. I wish the book a wide circulation.

**SWAMI RANGANATHANANDA**
*Vice President, Rama Krishna Math*
*and Rama Krishna Mission*

# PREFACE

Dr. Ratnakaram Balaraju is known to me for the last forty years as an outstanding scholar in Telugu Sanskrit and English. As a Lecturer in Telugu he impressed his colleagues. the public and the students with his amazing erudition and profound interest in our cultural heritage.

His literary and philosophical works include "Bouddha Yugamu' (2 volumes) "Buddha Darsanamu and 'Brahma Sutramulu'. The last-named treatise won the special encomiums of Dr. Sarvepalli Radhakrishnan, our former Philosopher–President of India.

The present treatise 'DHAMMAPADAM', a rare Jewel in the field of Buddhistic philosophy and Ethics, is in Telugu with scholarly commentary. It provides the original text in Pali and translations in Sanskrit and Telugu.

DHAMMAPADAM (Path of Virtue) is an ethical code which lays special emphasis upon the principles of good conduct.

Buddha's preachings are set forth in Dhammapada in the shape of 423 'gadhas' arranged in 26 'vargas'. These important principles of good conduct are expressed in very simple language by the help of similies drawn from daily life and Nature with which common people are familiar.

All things considered we can say that the wisdom of the ages is in the pages of this book. Dr. Balaraju's translation of DHAMMAMPADA is a mammoth undertaking, especially when we consider his pains-taking research and scholarly interpretation while quoting profusely from scriptures. In my opinion, it is a timely publication to arrest the further decline in the values of life confronting the present –day world which is steeped in materialism. I hope, the book will enjoy the patronage of discerning readers and a wide circulation among our Telugu–speaking people in India and in the rest of the world.

Hyderabad
20/3/94

**Prof. I.V. CHALAPATI RAO**
Editor, Triveni

# A Few Words

The conscious experience of the Buddha of the utter annihilation of the very idea of Being into the supreme Non-Being is in itself a great realisation, but there is still a greater realisation more complete and more profound. It is that of the Para-Brahman who includes both Being and Non-Being as well as transcends them.

A spiritual negation however high and noble it may be does not finally satisfy the human spirit. The everlasting-No is ensnaring and enrapturing, grand and gratifying but lacks the native and positive attraction and completest satisfaction of the everlasting-Yes. The seeker-soul is naturally and simply drawn towards the eternal Being and not to the eternal Non-Being the void of an unintelligible Infinite. Extinction based on negation and renunciation, however glorified and celebrated, does not enjoy the status of full and vibrant freedom which reposes on affirmation and permanence. Impermanence by itself cannot explain the manifold splendour of creation; there is a Permanence which expresses itself in this eternal continuity in Time. In truth Buddha too was aware of a Permanent beyond but was disinclined to describe it as it was supposed to be supra-cosmic and ineffable.

Buddhism by its supreme labour of philosophical intellect formulates to the reasoning mind the truths already discovered by the intuitive and spiritual experience of the earlier Rishis. Although it overtly rejects the synthetic findings of the Upanishads it is essentially rooted in their teachings of Sat and Asat. While the earlier seers behold the two as constituting the last antinomy through which they looked up to the Para-

Brahman, the Buddhists took them as irreconcilable opposites destructive of each other. Inspite of persistent denial the Vedic authority still gleams through Buddhism for there are passages in the Veda which taken by themselves in fragments seem to deny obliquely the existence of the Atman and ascribe everthing to Karma and predicate Non-Existence as the source of things.

The theory of Karma as enunciated by Buddhism is elaborately worked out with thoroughness and perfection, and carries with it the working of an all-pervading ordered Energy. But it implies inevitably a golden chain of inflexible determinism that is disastrous to the innate geatness of the Spirit for it is the soul that carries the seed of creation, and by its realisation alone that one can go beyond all bondage of Karma to utter freedom. The view that the compulsion of Karma is absolute and categorical in the world of birth and can be put an end to only by a withdrawal from birth and the cosmos may satisfy the logical reason but it is certainly suspect to the luminous integral intelligence.

Resorting to the analytical method of reason Buddhism permeates the general conception of existence in the sub-continent and disturbs for sometime the balance of the old Aryan world. Out of the presence of sorrow it unnecessarily makes a gospel of sorrow, **duhkhavada,** which if indulged beyond a certain limit becomes a dangerous habit obstructive of any real spiritual progress. Also, under the influence of its overstated emphasis on quiescence and self-abnegation nearly half the subcontinent accepted spiritual passivity as the law of life and the rest got plunged into naked materialism. Nevertheless Buddhism imparted in a considerable measure the necessary creative impulse to Art and Thought. By its dynamic ethical system and spiritual method it gave a new set of values and a greater idealism to human living. Buddhism leaves behind its ineffaceable imprint on the social and ethical life of the people.

My friend Dr. Ratnakara Balaraju needs no introduction to the philosophical elite of Andhra Pradesh. He is the author of several classical works in the area of Ancient Indian Thought including one on **Brahma Sutras.** His **Buddha Darshanam** is a monumental undertaking which reveals his insight into Buddhism and wide scholarship. The present work **Dhammapada** provides the original text in Pali and its translations in Sanskrit and Telugu with cross-references where ever necessary to other scriptures prior to the advent of the Buddha, especially **Chhandogya, Brihadaranyaka** and **Mandukya Upanishads.** He explains the more important tenets of Buddhism like **Nirvana, Kshanikavada** and **Karma** in the light of the Veda and the Upanishads. While he agrees with the Buddha's teachings in many respects and establishes him in the light of the Vedas he does not see eye to eye with the later Buddhists because of their limited and closed exposition. This is a work that combines scholarship and mature discernment worthy of wide circulation. We feel thankful to Dr. Balaraju for his invaluable gift to scholars in Oriental Studies.

**V. MADHUSUDAN REDDY,**
*Chairman,*
*Institute of Human Study*

2, February, 1994
'Anandamayi'
Sri Aurobindo Darsan,
Sri Aurobindo Marg,
HYDERABAD - 500 044.

ఓం నమః పరమాత్మనే ।

# ప్రస్తావన

**యస్య బోధోదయే తావత్, స్వప్నవద్భవతి భ్రమః ।**
**తస్మై సుఖైకరూపాయ నమః శాంతాయ తేజసే ॥**

గీతాదిమోక్షశాస్త్రములతో పాటు, బాల్యము నుండి ధమ్మపదము నాకత్యంత ప్రియమైన గ్రంథము. బుద్ధోపదిష్టమైన 'ధమ్మము', ఉపనిషద్రష్టలు, దర్శించిన పరమార్థముకంటె భిన్నముకాదని నా నిశ్చయము. **'ఏకంసత్ విప్రా బహుధా వదంతి'।** బుద్ధధర్మమును గూర్చిన నా అధ్యయనము దీనిని స్థిరీకరించినది. అధ్యయనఫలముగ నేను రచించిన బుద్ధదర్శనము (1962), బౌద్ధయుగము (2 సంపుటములు - 1960) అను గ్రంథములందు నిస్సంశయ ఫణితి, గౌతమ బుద్ధుని పరమార్థ దర్శనము, వేదర్షుల దర్శనముతో అభిన్నమని సోదాహరణముగ నిరూపించినాను. శీలప్రతిష్ఠ, నిర్వాణప్రాప్తికి అపరిహార్యమగు సాధన రూపమని ధమ్మపదము బోధించుచున్నది. విజ్ఞానాన్వేషణకు శీలమయజీవిత మత్యంతావసరము కదా!

మన యొక్క కాలవశత్వమునకు, సంసారవశత్వమునకు హేతువు, అవిద్య - విస్మృతి. ఇది మోహమునకు, ధర్మభ్రష్టతకు, మూలము. సాంసారిక జీవితమునకు, అవిద్యా తృష్ణలు రెండును కలసి, అధిష్ఠానమగుచున్నవి. అవిద్య నతిక్రమించి విద్యను - సంబోధిని - పొందవలయును. దర్శనము తోడి జ్ఞానము - 'విపస్సన' - (Clear perception) వలన, సమత -నిశ్చలశాంతి సిద్ధించును. సమ్యక్ జ్ఞానము, అపరోక్షానుభవజన్యము. నిస్సంశయవేదప్రామాణ్యముకు ఈ సమ్యక్ జ్ఞానమే మూలము. అపరోక్షానుభవమనగా **"యథాభూత ఞాన దస్సనం" - యథార్థ పరమార్థ దర్శనము.** దీనిని బుద్ధుడు స్వీకరించినాడు.

బుద్ధుడు నూతనధర్మమును బోధించినట్లు భావింపలేదు. అతడు హిందువుగా పుట్టి, హిందువుగా పెరిగి, హిందువుగానే మరణించినాడు.(1) జన్మమృత్యు జరావ్యాధులు, ఆధులు, భయములు ఎందుండవో అదియే మానవుడు పొందవలసిన పరమపురుషార్థము.

**"పదే తు యస్మిన్ న జరా న భీ ర్నరుజ్,**
**న జన్మనైవోపరమో న చాధయః ।**
**తమేవ మన్యే పురుషార్థ ముత్తమం,**
**న విద్యతే యత్ర పునః పునః క్రియా ।।"**

(బుద్ధచరితము - అశ్వఘోషుడు XI - 59)

# చరిత్ర - ఆధ్యాత్మిక సంకేతము

పద్మాసనస్థుడై ధ్యాననిమగ్నుడై యున్న బుద్ధుని విగ్రహము, బౌద్ధపిటకముల సమగ్రాధ్యయనమున కంటె, నతిశయముగ, మనకు జ్ఞానప్రశాంతులను బోధించుచున్నది. మహాపురుషుల క్రియలన్నిటియందును చరిత్రాంశములు, ఆధ్యాత్మికాంశములు రెండును, సమ్మిళితమై యుండును. కావున బుద్ధభగవానుని జీవితము శ్రీరామ, శ్రీకృష్ణుల జీవితములవలెనే, ఏకకాలమున చరిత్ర (History) ఆధ్యాత్మిక సంకేతరూపము (Spiritual Symbol) నై జ్ఞాన చిత్త విశ్రాంతులను నాకు ప్రసాదించినవి. అందుకే బుద్ధచరితము, ధమ్మపదము, ఆదరణీయము; అనుసరణీయము. వేదములు పాపాత్ముని పాపముల నుండి రక్షింపజాలవు.

(1) He was born, grew up, and died a Hindu. He was restating with a new emphasis the ancient ideals of the Indo Aryan Civilization" (Religion and Culture - S. Radha Krishnan 1968 - p. 124) బౌద్ధ సుత్తముల నాంగ్లమున కనువదించి బౌద్ధ వాఙ్మయమును అవలోడన మొనరించిన టి.డబ్లు. రైస్ డేవిడ్సు (T.W. Rhys Davids) మహాశయుడు సైతమిట్లే నిశ్చయించినాడు. "But on the whole he was regarded by the Hindus of that time as a Hindu...... peacefully the Reformation began and in peace, so far as its own action is concerned, the Buddhist Church has continued till to-day. ......we should not forget that Gotama was born and brought up and lived and died a Hindu.... **without the intellectual work of his predecessors his own work, however original would have been impossible.**" (History and Literature of Buddhism – T.W. Rhys Davids 1896)

**ఆచార హీనం న పునంతివేదాః ।"** (వాసిష్ఠ ధర్మసూత్రము VI-3)
**"న ఛందాంసి వృజినాత్తారయంతి ।"** (సనత్సుజాతీయము II-5)

నిర్వాణప్రాప్తికి శీలము - సదాచారము - పూర్వసాధనాంగము. ధర్మపదమీ శీలరూప సద్ధర్మమును, విశద మనోజ్ఞముగ వివరించును. వ్యష్టి భావరహితమును, శీల భావరహితము (Impersonal non Ethical) నగు సృజనశక్తిగా, దివ్యతత్త్వము ప్రకృతి యందు అభివ్యక్తమగుచున్నది. ఆదివ్యతత్త్వమే, మానవజీవితమున, శీలచేతనగా నభివ్యక్తమగుచున్నది. ధృతి, న్యాయము, ప్రేమ, కారుణ్యము, సంయమము - ఇవి పరస్పర భిన్నములు కావు; వ్యక్తిత్వము యొక్క భిన్నముఖములివి. అంతఃస్ఫురణమగు సత్యము, అనుకంపాత్మకమగు అహింసయు, ఆధ్యాత్మిక జీవితమునకు గల రెండు ప్రధానపార్శ్వములు; శ్రేయస్సులకు మార్గములు.

**"ప్రాణా ఘాతాన్నివృత్తిః, పరధనహరణే సంయమః, సత్యవాక్యం,**
**కాలే శక్త్యా ప్రదానం, యువతిజనకథామూకభావః పరేషామ్ ।**
**తృష్ణాస్రోతోవిభంగో, గురుషు చ వినయః, సర్వభూతాఽనుకంపా,**
**సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధిః శ్రేయసామేషపంథాః ॥"**

(భర్తృహరి I - 54)

తథాగతుడు మహాయోగి. ఆదిశంకరుని దశవతార స్తోత్రమున బుద్ధస్తుతి కలదు.

**"ధరాబద్ధపద్మాసనస్థాఽంఘ్రి యష్టిః, నియమ్యాఽనిలం న్యస్తనాసాగ్రదృష్టిః ।**
**య ఆస్తే కలౌ యోగినాం చక్రవర్తీ, సబుద్ధః ప్రబుద్ధోఽస్తు మచ్చిత్తవర్తీ ।।"**
(శంకరుడు - దశావతార స్తోత్రము)

బద్ధపద్మాసనస్థుడై, ప్రాణాఽపానముల నియమించి నాసాగ్రదృష్టియై, ధ్యానస్థితుడును, కలియుగమున యోగులకు చక్రవర్తియునైన బుద్ధభగవానుడు, నాచిత్తవర్తియై ప్రకాశించుగాక ! అని శంకరుడు బుద్ధుని స్తుతించినాడు.

బుద్ధుని ధ్యానావస్థను ప్రకటించు శిల్పములు, విగ్రములు, ఈ సత్యమును స్థాపించుచున్నవి.

## ఆధ్యాత్మిక శాంతి

వేదర్షుల వలెనే బుద్ధుడు యోగజన్యమైన ప్రజ్ఞాలోకము వలననే జ్ఞానము

(సంబోధిని) పొందినట్లు సుత్తనిపాతము (మాగందియసుత్తము) చెప్పుచున్నది.

"ఇదం వదామీతి న తస్స హోతి (మాగందియాతి భగవా),
ధమ్మేసు నిచ్ఛెయ్య సముగ్గహీతం ।
పస్సఞ్చ దిట్ఠీసు అనుగ్గహాయ,
అజ్ఝత్త సన్తిం పచినమదస్సం ॥ (సుత్తనిపాతం - IV-9-3)

"ధర్మముల పరీక్షించిన తరువాత వాని నిస్సారత నెఱిగి, నేను స్వీకరింపదగినదేదియు వానియందు లేదని చెప్పుదును. మతదృష్టుల యందు గల దుష్పరిణామమును చూచి, వాని యం దనాసక్తుడనై, సత్యమునన్వేషించి, **ఆధ్యాత్మికశాంతిని నేను పొడగంటిని**" -[1] వాదమునకు దర్శనమునకు గల భేదమిది. **మహర్షులు, సాధువులు, యోగుల యొక్క నానామతభేదముల గాంచి** నిర్వేదమును బొందిన మానవుడెవడు పరమశాంతిని పొందకుండును? అని అష్టావక్రుడను మహర్షియు జనకరాజర్షికి బోధించెను.

"నానామతం మహర్షీణాం, సాధూనాం యోగినాం తథా।
దృష్ట్వా నిర్వేదమాపన్నః, కో న శామ్యతి మానవః" ।

(అష్టావక్రసంహిత. IX 5)

'అస్మిత' లేక, 'అహము' యొక్క అనిత్యతను, సంఘాత స్వభావమును బౌద్ధులెఱుగుదురు. బౌద్ధ యోగదర్శనములు రెండును, అహంకారోత్పత్తిహేతువైన చిత్త ప్రవాహము నాపివేయుటను బోధించును. **బౌద్ధులు అస్మితా (అహం వృత్తి) భూమికను నిర్వాణసిద్ధి కొఱ కతిక్రమింపగా, యోగులు వ్యావహారికమగు 'అహము' నతిక్రమించి, సర్వద్రష్టయగు ఆత్మను గాంచిరి.**[2]

---

(1) "యుక్తస్య సర్వదా భానమ్ ।" (భాషాపరిచ్ఛేదము - 66)
యోగికి, పరమార్థసత్యము సర్వదా నిరావరణముగ ప్రకాశించును.

(2) We may very well believe that the Buddhist ideal of realising the non permanent character of the ego finds its parallel in the Yogic ideal of transcending the 'Asmita' stage. Both the systems hold that the stream of thought which is responsible for the generation of the ego-sense must be stopped even though an ultimate divergence of views become noticeable when the question of a transcendental self arises. The Buddhist transcends the ego-stage only to realise 'Nirvana' and the Yogin goes beyond the empirical ego to realise noumenal self. (The Cultural Heritage of India 1969 p. 71. Vol. III)

**'యోగశ్చిత్తవృత్తి నిరోధః।**
**'తదా ద్రష్టుః స్వరూపే వస్థానమ్'।** (యో. ద. I - 1,2)

చిత్తవృత్తుల ప్రవాహము నాపివేయుట వలన, సర్వద్రష్టయగు ఆత్మ సాక్షాత్కారము-కైవల్యము సిద్ధించునని యోగదర్శనము చెప్పును.

**'పంచానం ఖందానం నిరోధో'** - (విసుద్ధిమగ్గము) పంచస్కందములు - (రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానముల Corporeality) నిరోధించుట వలన నిర్వాణము సిద్ధించునని భదన్తబుద్ధఘోషుడు 'నిర్వాణము'ను వివరించెను. పంచస్కందములలో రూపస్కంధము శరీరమును, వేదనాదులగు నాల్గు స్కంధములు కలిసి చిత్తము. దీనినే 'నామ'మని బౌద్ధులు వ్యవహరింతురు. విషయార్థమై వంచునది నామము. 'నం' అనగా, వంగుట యని యర్థము. ఈ నామరూపము లనిత్యములు; నిత్యపరివర్తనాత్మకములు; నిస్సారములు; ఉదయ వ్యయ ధర్మములు గలవగుటచే నిరాత్మకములు; దుఃఖరూపములు, తృష్ణాక్షయము వలన వీని ప్రవాహము నిరోధింపబడును. ఇదియే నిర్వాణము. బుద్ధుడు **'అద్వయవాది'** అని అమరకోశము పేర్కొనును. (I-14)

# నిర్వాణతత్త్వవిచారము

నిర్వాణము, సంపూర్ణజీవ(ఆత్మ)నాశము (Utter-extinction of personality). మరణానంతరము ఆత్మలేదు. ఇదియే బుద్ధుని అనత్త(అనాత్మ) వాదమని కొందఱు బౌద్ధులు వాదింతురు. ఈ వాదము బుద్ధునికి సమ్మతమైనది కాదు. తృష్ణావాహిను లస్తమించుట యే నిర్వాణము ('అత్థం గచ్ఛన్తి ఆసవా'). కామాసవ (Sexual passion), భవాసవ (Passion for existance), అవిజ్జాసవ (Passion of ignorance) - ఈ త్రివిధాసవవిముక్తియే నిర్వాణమనియు చెప్పబడినది. 'అనత్త లక్ఖణసుత్తము', అనాత్మలక్షణముల మాత్రమే నిర్దేశించును. ధమ్మపదమున 'నిబ్బాన' (నిర్వాణ) శబ్దము పది(10) పర్యాయములు ప్రయుక్తమైనది. (చూడు :- గాథలు - 23, 32, 75, 184, 203, 204, 226, 285. 289, 372). **నిర్వాణము అమృతము, యోగక్షేమము, పరమసుఖము, అని ధమ్మపదమున వర్ణింపబడినది.**

అతిప్రాచీనమై బుద్ధవచనామృతముగా ప్రసిద్ధిగాంచిన 'సుత్తనిపాతము'న - (15) పదునైదు పర్యాయములు నిర్వాణ (నిబ్బాన) శబ్దము ప్రయుక్తము. **'జరామచ్చు పరిక్ఖయం' – (జరామృత్యుపరిక్షయము), అమతం (అమృతము) సన్తి (శాంతి) 'దీపం' (ద్వీపము) అచ్చుతం (అచ్యుతము) – ఇత్యాది శబ్దములచే నిర్వాణము అభివర్ణింపబడినది.** ఇందెచ్చటను నిర్వాణము, ఆత్మనాశమని కాని, అభావమని కాని, వర్ణింపబడలేదు.

మనయందలి నిత్యపరివర్తనాత్మకములైన మానసికావస్థలయందు - (అహంకారము (ego) మొదలుకొని, శారీరకావస్థలు, సంవేదనలు (feelings) ) - పంచస్కంధములందు - నిత్యము, అవిక్రియము నగు ఆత్మ నన్వేషించుట నిరర్థకము. **అనాత్మకములైన రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార విజ్ఞానము లందు – నామరూపములందు – ఆత్మలేదని, యెఱిగి వాని యందు నిర్వేదమును పొందుటయే 'అనత్తలక్ఖణసుత్త' (అనాత్మలక్షణసూత్ర) సారము.**

ఆత్మాన్వేషణము, మనయందలి పరివర్తనాంశములు, నానావిధ సంకల్పములు, భావముల కొఱకు కాదు. మన జ్ఞానమునకు విషయమగు (Object of our knowledge) దాని కొఱకు కూడకాదు. **మనయందలి నిత్యమగు తత్త్వము, ఏకత్వము** (Unity within), **సమస్తమునెఱుగుచున్న ద్రష్ట – విజ్ఞాత– కొఱకే అన్వేషణము.**

ఆంతరంగికములైన మానసికావస్థల యందును, బాహ్యమగు విషయ ప్రపంచము నందును నిత్యమగు ఆత్మ లేదని తత్త్వవేత్త అన్నపుడు, అది అంతవఱకు సత్యమే. బాహ్యాభ్యంతరవిషయవర్గమునకు సంబంధించిన మన అనుభవమున గాన్పింపనంత మాత్రమున, నెచ్చటను, నిత్యము (permanent) అద్వయము (ఏకము)నైన ఆత్మలేదని నిర్ణయించుట అయుక్తము. **అపరిణామి (మార్పులేనిది)యు, అద్వయమునగు ఆత్మను, అభ్యూహింపని పక్షమున అనుభవము అసంభవము.** క్షణక్షణము తరలిపోవుచింతనలకు, సమస్తానుభవములకు, అచలము నిత్యమునగు అధిష్ఠానము, ఆధారభూతమునైన ఆత్మయొక్క అస్తిత్వమును, నిరాకరించుట కేవలము మొండివాదము (dogmatism).

కాలత్రయమున నవిచ్ఛిన్నము, నిత్యము, నచలమునైన ఆత్మలేనిచో

ప్రత్యభిజ్ఞాదు లసంభవము.

"న హి కాలత్రయ సంబంధిని,
అనేకస్మిన్ అన్వయిని, అసతి, కూటస్థే వా సర్వార్థదర్శిని,
దేశకాలనిమిత్తాపేక్షవాసనాధీనస్మృతి-
ప్రతిసంధానాది వ్యవహారః సంభవతి ।"

(శంకరుడు. బ్ర.సూ. భా. II-2.30)

భామతీభాష్యకారుడు - వాచస్పతిమిశ్రుడు - మాఱుచు, తరలిపోవుచున్న క్షణభంగురవస్తుజాతము నందు నేమార్పును పొందని నిత్యమగు తత్త్వము, ఆవస్తుజాతమున కంటె, భిన్నమని నిర్దేశించినాడు.

'వ్యావర్తమానేషు య దనువర్తతే తత్ తేభ్యో భిన్నమ్'।

కాన, అనుభవగోచరము కాని తత్త్వము యొక్క అస్తిత్వమునే నిరాకరించుట యుక్తము కాదు.

**వ్యష్టిఅహంకృతి యెట్లు ఆవిర్భవించినది? ఇహపరలోకముల యందు జన్మపరంపరకు హేతువగు అవిద్యకు ఏది మూలము? అను ప్రశ్నలకు బౌద్ధుల 'అనత్త' (అనాత్మ) వాదము సమాధాన మొసగజాలదు.**

నిర్వాణము పరిపూర్ణ ఆత్మనాశనమనుట నిజమైనచో, పరిపూర్ణతకొఱకైన మన ఆకాంక్షలు (all our aspirations), సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము, కేవలానందము (absolute bliss) - ఇవి అన్నియు భ్రాంతులు, హాస్యాస్పదములు, కాగలవు.

మహాత్ములకు, పాపాత్ములకు ,మరణమునందు సమాన గతియే సిద్ధించును. క్రీస్తులు, నీరోలు, వాషింగ్ టన్‌లు, మరణమునందు తుల్యగతినే పొందుదురు. అత్యంతగర్హితులు, నరహంతలు, సద్ధర్మరక్షణకై ప్రాణత్యాగమొనర్చిన మహితాత్ములు, శూన్యమున కొట్టుకొని భగ్నమగుటకు, ఒకే నావయందు పయనించువారగుదురు. వాల్మీకి, వ్యాసాదులగు మహర్షులు, బుద్ధుడు, శంకరుడు, కాళిదాసు, కాంటు (Kant), గౌథే (Goethe) మొదలగు మహాత్ములు మానవజాతి పరిపూర్ణత కొఱకొనర్చిన తపస్సు, నిర్విరామకృషి, నిష్ఫలమై వ్యర్థభాజనము

కాగలదు. ఇదే నిజమైనచో దుఃఖితులగు మానవుల కందఱికి, ఆత్మహత్యయే పరమోపకారకము, సుఖదాయకము కాగలదు.

తత్త్వశాస్త్రము, నీతి, విజ్ఞానశాస్త్రము మొదలైన శాస్త్రవిద్య లన్నియు నిష్ఫలములు, కేవల విడంబనములు కాగలవు. కాన, నిర్వాణము ఆత్మనాశనమను బౌద్ధులవాదము నిరసింపదగినది. **జగము వివేకబద్ధమైనచో, మరణానంతర జీవితము – ఆత్మ అస్తిత్వము–హేతుసహమైన సిద్ధాంతము; ఇది మహర్షులు దర్శించిన సత్యము.**

విశ్వము యాదృచ్ఛిక సంఘటన యొక్క ఫలితము కాదనియు, దాని యొక్క విస్తార సృజనాత్మక యోజనకు, అద్భుత నిర్మాణమునకు (అచింత్య రచనకు), (బ్రహ్మము – (ఈశ్వరుడు), ప్రకాశకమును, ఐక్యకారకమును, వ్యాఖ్యానకమును అగు మూలతత్త్వమని తత్త్వద్రష్టల సిద్ధాంతము.

మనస్సున కచింత్యమగు క్రమవికాసము, యోజన (Plan) వీనితో గూడిన విశ్వమును పరిశీలించుటవలన, సర్వజ్ఞము, సర్వశక్తిమంతమునైన కారణము యొక్క సత్యతను, మనము అనుమాన ప్రమాణము వలన సైతము కాంచగలము.

వివేకము (Reason) మానవుని యందు అభివ్యక్తి నొందిన తత్త్వరూపములలో నొకటి. పరతత్త్వము (Supreme Reality) వివేకాతిశాయియే కాని, దానికంటె న్యూనమైనది మాత్రము కాదు. **జగము, వివేకయుక్తము; వివేకముచే పాలితము. కాన, మానవుడు సాధించినదేదియు నిష్ఫలము, నిరర్థకము, కాదు. పాపాత్ములు, పుణ్యాత్ములు వారి వారి దుష్కృతములకు సుకృతములకు అర్హమైన ఫలసిద్ధినే పొందగలరు.**

అన్నమయ (Physical) ప్రాణమయ (the sensitive appetitive) మనోమయ (Thinking and willing) విజ్ఞానమయ (intellectual) కోశములకు (జాగ్రత్స్వప్నావస్థలురెంటికి) సంబంధించిన అనుభవము, గాఢసుషుప్తి (deep sleep) యందు, అభావమగుచున్నది. కాని, గాఢసుషుప్తియందు అస్ఫుటమైన ఒకానొక ఆనందమయానుభూతి యున్నది. తురీయావస్థ–సమాధ్యవస్థ–యందు 'ద్రష్ట', 'దర్శనములు' అను ద్వంద్వభావముల నతిక్రమించి, సుషుప్తియందలి

ఆనందమయానుభూతి ప్రస్ఫుట-(విశద)మైన పరమానందానుభూతిగ ఐకాత్మ్యానుభవముగ పరిణమించుచున్నది. ఇట్లు జాగ్రత్స్వప్న సుషుప్తులయందు - సర్వావస్థల యందు - నిరంతరముగ (గాఢసుషుప్తియందుసైతము) ఆత్మ, సంవిద్రూపమున (as awareness of consciousness) ప్రకాశించుచున్నది. సంవిత్తు (Consciousness) లేని ఆవస్థయేదియు లేదు. సుషుప్తియందు సర్వేంద్రియయుక్తముగ మనస్సు లయించియున్నపుడు గల, సర్వాఽభావమును, అస్ఫుటమైన ఆనందమయానుభూతిని, తెలిసికొనుఆత్మ ఉండుటవలననే, మేల్కొన్న తరువాత గాఢనిద్రయందు మనస్సు లేమిని, సర్వాఽభావమును స్వప్నరహితమైన నిద్రయొక్క సుఖానుభూతిని, స్మరించుకొనుచున్నాము. **అనుభవములేనిచో స్మృతియుండదుగదా!** నిద్రయందలి ఆనందమయానుభూతిని స్మృతి వలన తెలిసికొనుచున్నాము. స్మృతి మానసికావస్థాదర్శనమే కావున, గాఢనిద్రయందు, నిద్రాసౌఖ్యము, అన్యవస్తురాహిత్యము, ఏమియు నెఱుగని అజ్ఞానము, నిద్రావస్థయందే ప్రతిపాదనములై-సమర్పితములై-యుండవలయును. వీని స్మృతి, నిద్రాపూర్వమానసికావస్థాస్మరణము వలనను, నిద్రానంతర దర్శనము వలనను కలుగుచున్న దన్నచో, మన కనుభవపూర్వకము కాని దేదియు తెలిసికొనుట కవకాశము లేదనియే నమాధానము. అభావమునకు భావాత్మకదృశ్యమేదియు నుండదుకాన, నిద్రాసమయమున అశాంతియు, జ్ఞానమును లేవని ఊహింపబడినవన్నచో, జ్ఞానాఽభావాదికము నభ్యూహించుటకైన మొదట నవి, మనోగోచరములు కావలెను. అనగా, అవిలేని కాలమున లేనట్లు ప్రత్యక్షముగ చూడబడియుండవలెను. కావున, నిద్రావస్థ యందు నెఱుకయు, అశాంతియు, లేవని ప్రత్యక్షముగా దర్శించియుండవలెను. ఈ అవస్థయందు వ్యావహారిక మనస్సు చేష్టారహితమై యుండగా, శుద్ధసంవిత్తు-చైతన్యము-మాత్రమే యుండును.

(See: Prof. S. Radhakrishnan - Indian Philosophy Vol. II. p. 478-479)

కాన, సంవిద్రూపమైన ఆత్మలేని కాలమేదియు లేదు. అగణితములగు మాసములు, సంవత్సరములు, యుగములు గతాగాములయందు ఉదయాస్తమయములు లేనిదొక స్వయంప్రకాశకమైన చైతన్యమే.

**'ఏవం స్థానత్రయేఽప్యేకా సంవిత్ తద్వద్దినాంతరే ।**
**మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యేష్వనేకధా ।**
**నోదేతి నాఽస్తమే త్యేకా సంవిదేషా స్వయంప్రభా' ।**

(విద్యారణ్యుడు-పంచదశి -I.6,7)

**సంవిదో వ్యభిచారస్తు, నైవ దృష్టోఽస్తి కర్హిచిత్ ।**
**యది దృష్టః తదా ద్రష్టా, శిష్టః సంవిద్వపుః స్వయమ్ ।**

(దేవీభాగవతము)

(ఈసంవిత్తునకు (చైతన్యమునకు) విచ్ఛిత్తియెప్పుడును చూడబడలేదు. అట్లు చూడబడినపుడు ద్రష్టయే స్వయముగా చైతన్యశరీరుడై నిలిచియున్నాడు.)

కావున, పరమార్థము-నిర్వాణము - శూన్య రూపము కాదు. నాగార్జునాదుల (Nihilism) శూన్యవాదమును సూక్ష్మముగ పరిశీలించిన, **ఆశూన్యత (0) సర్వపరిపూర్ణత, అనిర్వచనీయమైన అనంతతత్త్వము, అనియే మనము కాంచగలము.** కాని, సోపాధిక నిర్మాణములను మాత్రమే గ్రహింపగల మనస్సునకీ నిరుపాధికమైన తత్త్వము, కేవలము శూన్యముగ దోచును. వాస్తవమున నిదియే సత్యమైన సత్పదార్థము. (True existance)

Actually when we examine closely the Nihil of certain Philosophers, we begin to perceive that it is a zero which is All or an indefinable Infinite which appears to the mind a blank, because mind grasps only the finite constructions, but is in fact the only true existance. (The Life Devine - Sri Aurobindo – first University Edition 1955- p.35)

చైతన్యము, కేవలము విభాగరహితము. ఈ చైతన్య మేకకాలముననే ద్రష్టయు, దృశ్యము కూడ. '**ఆశ్రయత్వ విషయత్వ భాగినీ, నిర్విభాగచితిరేవ కేవలా ।**' (సంక్షేపశారీరకము)

**ఊర్ధ్వశూన్య మధః శూన్యం, మధ్యశూన్యం యదాత్మకమ్ ।**
**సర్వశూన్యం స ఆత్మేతి, సమాధిస్థస్య లక్షణమ్ ।**
**శూన్యభావితభావాత్మా, పుణ్యపాపైః ప్రముచ్యతే ॥**

**అదృశ్యే భావనా నాఽస్తి, దృశ్యమేతద్వినశ్యతి ।**
**అవర్ణమస్వరం బ్రహ్మ, కథం ధ్యాయన్తి యోగినః ॥**
**ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం, మధ్యపూర్ణం యదాత్మకమ్ ।**
**సర్వపూర్ణం స ఆత్మేతి, సమాధిస్థస్య లక్షణమ్ ॥**

(ఉత్తరగీత -I-35, 36, 37)

నాగార్జునుడు సత్యమును-నిర్వాణము-నిట్లు నిర్వచించును.

**'అప్రహీణ మసంప్రాప్త మనుచ్ఛిన్న మశాశ్వతమ్ ।**
**అనిరుద్ధ మనుత్పాత మేతన్నిర్వాణ ముచ్యతే ।'**

అపరిహార్యము, అసంప్రాప్తము, అవినాశి, అశాశ్వతము; ఉదయాస్త మయములు లేనిది. నిర్వాణమని చెప్పబడును. సర్వాతీతమైన తత్త్వము నిర్వాణమని ఈ నిర్వచనము వెల్లడించుచున్నది.

అంతరంగమున,సంపూర్ణనిశ్చలత్వము, వ్యష్టిభావరహితము, సర్వమనో వికార శూన్యమైన పరమశాంతి, వీని యొక్క సంభవము, బాహ్యమున నిత్యసత్యములగు ప్రేమ, సూనృతము, ధర్మము - వీనికి సంబంధించిన కర్మాచరణమే బుద్ధుని బోధసారము కావచ్చునని శ్రీఅరవిందులు వచించిరి.

బౌద్ధము ప్రధానముగ వేదాంతభావమే యని కూడ శ్రీ అరవిందులు వచించిరి.

"This possibility of an entire motionless impersonality and void calm within doing outwardly the works of the eternal verities, Love, Truth, and Righteousness, was perhaps the real gist of the Buddha's teaching.

.............Buddhism, ............. yet goes back to this essentially Vedantic conception."

(Sri Aurobindo: The Life Divine p. 37, 43)

పరతత్త్వము కేవలము క్షణికము, శూన్యము అను బౌద్ధుల సర్వక్షణభంగవాదమును, విజ్ఞానవాదముయొక్క ప్రాతీతికభావవాదమును

(Subjective idealism) శంకరుడు బ్రహ్మసూత్ర భాష్యమున (II-2. 18-31) ఖండించినాడు.

**నిరాకరింపసాధ్యము కాని ఒకానొక సత్యవస్తువును అంగీకరించిన తప్ప, సర్వమును శూన్యమని నిరాకరించుట సంభవింపదని, శంకరుడు శూన్యవాదమును ఖండించెను.**

మోక్షావస్థను శంకరుడు ఝరీసదృశ వాగ్గుంభనతో వర్ణించును.

**"ఇదంతు పారమార్థికం, కూటస్థం, నిత్యం, వ్యోమవత్ సర్వవ్యాపి, సర్వక్రియారహితం, నిత్యతృప్తం, నిరవయవం, స్వయంజ్యోతిఃస్వభావం, యత్ర ధర్మాऽధర్మౌ సహకార్యేణ కాలత్రయం చ నోపావర్తతే తదశరీరం మోక్షాఖ్యమ్.**

(ఇది పారమార్థికము, కూటస్థము, నిత్యము, ఆకాశము వలె సర్వవ్యాపకము, సర్వవికారరహితము, నిత్యతృప్తము, నిరవయవము, స్వయంజ్యోతిఃస్వభావము, ధర్మాధర్మములును తత్ఫలములును, కాలత్రయమును, దానిని సమీపింపజాలవు. ఇది మోక్షాఖ్యమగు అశరీరత్వము.)

బుద్ధుని పరమార్థవర్ణనము పైతమిట్టిదే.

**"అత్థి భిక్ఖవే అజాతం, అభూతం, అకతం, అసంఖతం, నోచేద్ భిక్ఖవే అభవిస్స అజాతం, అభూతం, అకతం, అసంఖతం, న ఇదంజాతస్స భూతస్స సంఖతస్స నిస్సరణం పఞ్ఞాయాం యస్మా చ ఖో భిక్ఖవే అత్థి అజాతం, అభూతం, అకతం, అసంఖతం, తస్మా జాతస్స భూతస్స కతస్స నిస్సరణం పఞ్ఞాయాతి ।"** (ఉదానగ్రంథము)

"భిక్షువులారా! అజాతము (పుట్టనిది) అభూతము, అకృతము, (చేయబడనిది) అసంఘాతమునైనది యొకటున్నది. అజాతము అభూతము, అకృతము, అసంఘాతమునైన అట్టి వస్తువే లేకున్నచో, జాతము, భూతము, కృతము, సంఘాతమునైన దాని నుండి (జీవికి) తరణోపాయ ముండెడిది కాదు' - అని సత్యపదార్థమును బుద్ధుడు వర్ణించినాడు. ఉదానగ్రంథముననే ఆ పరతత్త్వమున **సూర్యచంద్రులు ప్రకాశింపజాలరనియు, మౌనధ్యానమున ఆసత్యమును సాక్షాత్కరించుకొన్న బ్రాహ్మణుడు రూపారూపముల నుండి సుఖదుఃఖముల**

నుండి విముక్తుడగునని నిర్వాణావస్థను బుద్ధుడు వర్ణించినాడు. కావున నిర్వాణము సంపూర్ణ ఆత్మ నాశనమను వాదము అసంగతము. దోషయుక్తము శ్రేయస్కాము లాశ్రయింపదగినదికాదు.

అస్తిత్వ నాస్తిత్వ భావములు రెంటిలోను, తత్త్వభావముచే, ఉన్నదనియే (అస్తి ఇతి ఏవ), ఆత్మ (పరతత్త్వము) పొందదగినది. అస్తి (కలదు) అని నిర్ణయము పొందిన వానికి, ఆత్మతత్త్వభావము ప్రసన్నమగుచున్నది. విశ్వమునకు మూలాధారమగు పరమతత్త్వము లేదని వాదించు విపరీతదర్శియైన నాస్తికునికి తత్త్వసాక్షాత్కార మసంభవమని ఉపనిషత్సిద్ధాంతము.

'అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః ।
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి ॥' (కఠ. ఉ. II.3.14 )

'అసన్నేవభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్ ।
అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః ॥'

(తైత్తిరీయ-ఉ- II-6)

సత్యవస్తువు, సర్వకారణమగు బ్రహ్మమును 'అసత్తు'గ-లేదని-యెఱుగువాడు, కేవల మసద్భావమునే పొందును. (నశించును). బ్రహ్మమును 'సత్తు'గ - ఉన్నదని- యెఱుగువాడు సద్భావమునే పొందునని, తత్త్వవేత్త లెఱుగుదురు. ఇదియే ఉపనిషత్తుల నిస్సందిగ్ధ సిద్ధాంతము.

When man attains nirvana what does he realise and what happens to him? Does he attain something positive or something negative? On this subject the language of the Upanishads is clear, inspite of all the prefaces with which they have expounded it, stating that the ultimate truth is that from which speech and thought recoil, that it transcends all specifications. Inspite of this kind of reservation the Upanishads leave us in no doubt that the Ultimate Truth is a "**Yes**" and not a "**No**".

[Swami Ranganathananda - Bhagavan Buddha and Our Heritage–Eternal Values for A Changing Society - Vol II P. 29 - (1985)]

సింహళాది దేశములలో నున్న బౌద్ధము సరియైనది కాదని, పరమధర్మమగు అహింస యెడ వారికేమాత్రము గౌరవము లేదని, హిందువులు మాత్రము బుద్ధుని అవతారమూర్తిగా నారాధింతురని శ్రీమతి ఓలె బుల్ (Mrs. Ole Bull) సతీమణికి వ్రాసిన లేఖలో (కలకత్త, 5-5-1897) శ్రీమద్వివేకానందస్వామి వివరించిరి[1]

ఆధునికచారిత్రకపరిశోధకుల సిద్ధాంతముల తిరస్కరించి బౌద్ధ సంప్రదాయములు రెంటి యందును మహాయానము, హీనయానమునకంటె, విశేషప్రాచీనమని స్వరూపానందునికి వ్రాసిన లేఖ(9-2-1902)లో వివేకానందులు నిరూపించిరి. బౌద్ధ వాఙ్మయమున వేదాంతమతమును సూచించు ఘట్టములు కలవు. మహాయాన సంప్రదాయము తుదకద్వైత పరముగనున్నది. బౌద్ధుడగు అమరసింహుడు బుద్ధనామావళిలో 'అద్వయవాది' యను నామము నేలచేర్పవలయును"? అని శ్రీస్వామి ప్రశ్నించినారు[2]

---

(1)... As for the ancient form which the Buddha preached, I have the greatest respect for it, as well as for His person. And you well know that we Hindus worship Him as an Incarnation. Neither is the Buddhism of Ceylon any good. My visit to Ceylon has entirely disillusioned me and the only living people there are the Hindus. The Buddhists are all much Europeanised....... The only respect the Buddhists pay to their great tenet of non-killing is by opening "Butcher-stalls" in every place! And the priests encourage this. The real Buddhism, I once thought would yet-do *much good*. But I have given up the idea entirely, and I clearly see the reason why Buddhism was driven out of India, and we will only be too glad if the Ceylonese Carry off the remnant of this religion with its hideous idols and licentious rites.

(Complete works of Swami Vivekananda - Vol. VII (Epistles) P. 505, 506. Mayavati Memorial Edition 1989).

(2) "There are references though in Buddhistic literature, to Vedanta, and the Mahayana School of Buddhism is even Advaitistic. Why does Amarasingha, a Buddhist, give as one of the names of Buddha–Advayavadi? (C.W. Swami Vivekananda - Epistles - Vol V. P. 172 – Mayavati - Memorial Edition 1989)

మహాయానతత్త్వము, భగవద్గీత నుండి గ్రహింపబడినదని లోకమాన్య బాలగంగాధర తిలకు, తన గీతారహస్యమున నిరూపించెను.(1)

వేదధర్మనిర్ఝరిణీతటమున గల స్నానఘట్టములలో నొక విశిష్టమైన స్నానఘట్టమీ బుద్ధధర్మము. సనాతనమైన ధర్మమును పవిత్రముగ సమగ్ర స్వభావయుక్తముగ పరిరక్షించు విశిష్టాధికారము భారత వర్షమునకే చెందినదనుట యథార్థమని కంచి పరమాచార్యులు జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వాములవారు వచించిరి.

"The Veda which is the basic scripture of Hinduism is not a sectarian Text. Whatever truth was declared by any prophet can be traced to the Vedas. On the river-banks of the Vedic Dharma, the various religions are like the bathing ghats. In the distant past, the Vedic religion was spread throughout the world. Gradually other religions appeared in other parts of the globe, each emphasizing some aspects of the religion of the Veda. To India belongs the privilege of preserving the ancient *Dharma* in its purity and comprehensive nature." (A Philosopher looks back – The Sage of Kanchi - T.M.P. Mahadevan –Bhavan's Edition - 1982 p. 71)

---

(1) It is clearly stated in the book written by the Buddhist Taranatha in the Tibetan language which deals with the history of the Buddhist religion, that 'Rahulabhara', the preceptor of Nagarjuna was a Brahmin converted to Buddhism and the jnanin **Sri Krishna** and **Ganesa** were responsible for this Rahulabhadra getting these ideas (of the Mahayana sect) and there is a similar statement in another Tibetan book. "He (Nagarjuna) was a pupil of the Brahmana Rahulabhadra who himself was a Mahayanist. This Brahmana was much indebted to the sage **Krishna** and still more to **Ganesa**. This quasi-historical notice, reduced to its less allegorical expression, means that Mahayanism is much indebted to **Bhagavad Gita** and more to **Shaivism**". (Dr. Kern's Manual of Indian Buddhism p. 122)

It would seem that Dr. Kern understands the word 'Ganesa' as indicating Saivism.

(Gita-Rihasya-Tilak - 1986 Edition p. 818)

దీనిని బట్టి సమస్త భారతీయతత్త్వదర్శనములును, పరిపూర్ణత ద్వారా, ఆత్మకు మోక్షము సిద్ధించుచున్నదని ఏకగమ్యమునే స్థాపించుచున్నవనుట సిద్ధాంతమగుచున్నది.

**పరమార్థద్రష్టలైన మహర్షులందఱు పరమాత్మప్రతిరూపులు; పరమాత్మయందు వారందఱు నొక్కటే. చిత్తశుద్ధితో నిండు హృదయముతో ప్రయత్నించినచో, మనకు నూతనమతధర్మము కాక, సర్వధర్మహృదయమే సిద్ధింపగలదు.**[1] అట్లు, ధర్మహృదయమును సాక్షాత్కరించుకొన్న సర్వజ్ఞుడగు భగవంతునిచే దర్శితమైన 'ధమ్మపదము' శ్రేయః సిద్ధికై మానవజాతికి, సర్వదా శ్రద్ధాపూర్వకముగ అనుసరణీయము. ఉపశమార్థమై, స్వాంతఃసుఖమునకై, భగవదంకితముగ, నేను అనువదించి వ్యాఖ్యానించిన, మోక్షార్థగర్భితమగు ఈ ధమ్మపదము, ముద్రించి ప్రకటించుటకు ధనాభావము వలన, ఇతరుల యాచింపనోపక, ముద్రణ ప్రయత్నమే విరమించుకొనియున్న సందర్భమున, నేనూహింపని, యెదురు చూడని దిక్కునుండి సహాయసందేశము వచ్చుటకు ఈశ్వరానుగ్రహమే హేతువని నా విశ్వాసము. ధమ్మపద, బుద్ధదర్శన ప్రకాశనము ఈశ్వరసంకల్పమని భావింతును.

**ఆధ్యాత్మికమైన విలువలే నాగరికతావృక్షమునకు మూలములు.** మూలమునకు హాని కల్గినచో, వృక్షము ఆకులు రాలి నిర్జీవమైన మోడు కాగలదు. సంస్కృత, ఆంగ్ల, హిందీభాషల యందలి అనేకానువాదములు వ్యాఖ్యానములు, అధ్యయన మొనర్చి, శ్రద్ధాభక్తులతో వివేచించి ధమ్మపదము ననువదించి వ్యాఖ్యానమొనరించినాను. ధమ్మపదవ్యాఖ్యాతలైన మహాత్ముల కందఱికి నా కృతజ్ఞతాపూర్వక ప్రణామములు.

**"గుణదోషౌ బుధో గృహ్ణన్, ఇందుక్ష్వేళా వివేశ్వరః ।**
**శిరసా శ్లాఘతే పూర్వం, పరం కంఠే నియచ్ఛతి ।"**

---

(1) "The great sages are symbols of the spirit in which they are one. While we have to communicate our faith through words and symbols forms and creeds in accordance with the accidents of our race nation or training, we use them to help us to realise the presence of the spirit in us. If we strive with a sincere intent and a whole heart, we get not a new faith but to the heart of all faiths." – (The Brahmasutra. S. Radha Krishnan - 1960 - p. 251)

చంద్రుని, హాలాహలవిషమును, ఈశ్వరుడు గ్రహించినట్లు, బుధుడు- (పండితుడు)- గుణదోషముల రెంటిని గ్రహించి, ప్రథమము (గుణము)ను, శిరసా శ్లాఘించి, ద్వితీయము (దోషము)ను, కంఠమందే నిల్పుకొనును; బహిర్గతమొనరింపడు.

అను ఆర్యోక్తిని బుధులు పాటింతురని నా విశ్వాసము. "బుద్ధి మాంద్యము వలన, దోషయుక్తములైన వాక్యములందును, వివరణముల యందును, నేను చేసిన తప్పులను, ఆర్యచిత్తులు మాత్సర్యమును వీడి, కృపతో సవరింతురు గాక!" అను హేమచంద్రుని వాక్యము నేకీభావమున నుదాహరించి ఈ ప్రస్తావనను ముగింతును.

**"ప్రమాణసిద్ధాంతవిరుద్ధ మత్ర,**
**యత్కించి దుక్తం మతిమాంద్యదోషాత్ ।**
**మాత్సర్య ముత్సార్య తదార్యచిత్తాః,**
**ప్రసాద మాధాయ విశోధయంతు ।।"**

ధర్మము యొక్కయు తత్త్వజ్ఞానము యొక్కయు సమన్వయమునకీ వ్యాఖ్యానమున నేను ప్రయత్నించితిని:

అనుబంధమందలి బౌద్ధసాహిత్యదర్శనము -(పిటకత్రయపాళీ సాహిత్యము, అశ్వఘోషాదికవినిర్మితసంస్కృతసాహిత్యము) పఠితల హృదయమున ధర్మజిజ్ఞాసను, తత్త్వజిజ్ఞాసను, మేల్కొల్పి, మధుస్నిగ్ధము, అమృతము, అవ్యయమునగు మహోన్నతభారతీయసంస్కృతి యందొక భాగమగు నీ భవ్యసాహిత్యము నందు అభిరుచిని కల్గించి, అధ్యయనావగాహనములకు ఉద్దీపకము కాగలదని ఆకాంక్షింతును.

భాషా విషయమున సుబోధమునకై సంధినియమములు, సరళాదేశములు, పాటింపలేదు. శాస్త్ర విషయమగుటచే భాషా కాఠిన్యము కొన్నిచోట్ల తప్పలేదు. పునరుక్తులు కొన్ని యున్నను, సందేశాత్మకములగు ధర్మగ్రంథము లందవి దోషములు కాక, గుణములే యగునని నా నిశ్చయము.

అనువాదవ్యాఖ్యలు రచించుటకు, పాళీగాథలను, సంస్కృతచ్ఛాయా

సహితముగ శ్రద్ధాభక్తిపూర్వకముగ నధ్యయన మొనర్చితిని. భాష్యకారుడైన బుద్ధఘోషుని వివరణములతో పాటు, ఆంగ్ల, హిందీ, తెలుగుభాషల యందు పండితులు రచించిన పెక్కు అనువాదవ్యాఖ్యానముల సాయమును గ్రహించితిని. ఆ వ్యాఖ్యాతల కందఱికి సర్వదా కృతజ్ఞుడను. ధమ్మపదార్థమును పురాతన ఋషిప్రోక్త శ్రుతి స్మృతి పురాణేతిహాసముల విశదకాంతులలో అసందిగ్ధముగ దర్శించుటకు ప్రయత్నించితిని. మూలగాథల నొకసారి చూచి, ఆంధ్రా నువాదమును గాంచినచో గాథల భావార్థము పాఠకులకు సుగమము, కాగలదని ఆకాంక్షింతును.

**సంసార క్లేశములకు వశ్యమై కృశపరిణతిగల నాచిత్తము, ధమ్మపదమును ఆంధ్రీకరించి వ్యాఖ్యానించుటకు సమర్థము కాకున్నను, కారుణ్యమూర్తియగు ఆ భగవంతుని యందనురక్తి వలన తచ్ఛాస్త్రమును శ్రద్ధతో నధిగమించి, ఈ రచనను తత్కృపావశమున నిర్వర్తించితిని.**

ఆంధ్ర జనతకిది ఆదరణీయమైనచో, నా అధ్యయనపరిశ్రమ, సాఫల్య సిద్ధిని పొందును. పరమేశ్వరుడు కర్మాధ్యక్షుడు; సర్వకర్మ ఫలప్రదాత - కర్మమునకు ఫలమును కూర్చుటయందు నిరంతర జాగరూకుడని - '**క్రతుఫల విధానవ్యసని**' యని శాస్త్రవచనము. కావున నీ విషయమున చింత నిరర్థకము.

ఈ గ్రంథమును సర్వాంగసుందరముగ శ్రద్ధ వహించి ముద్రించిన Om Sai Graphics, Offset Processing and Printing, Hyderabad- అధిపతులు పూజ్యమిత్రులు శ్రీ ఎమ్. రాంరెడ్డి గారికి, వారి సిబ్బందికి మా కృతజ్ఞతలు.

ఉపశాంతి కొఱకు రచితమై మోక్షార్థగర్భితమైన ఈ ధమ్మపద వ్యాఖ్యానకృతి, విరాడ్రూపియగు పరమపురుషునకు వాక్యపుష్పోపహారముగ సమర్పితము. పరమేశ్వర కారుణ్యమునకు నిరంతర శరణాగతి.

**బుద్ధం శరణం గచ్ఛామి ।**
**ధర్మం శరణం గచ్ఛామి ।**
**సంఘం శరణం గచ్ఛామి ।**

ఓం తత్సత్ శ్రీ కృష్ణార్పణమస్తు.

శ్రీముఖ-భాద్రపదము - (1994) **డా॥ రత్నాకరం బాలరాజు.**



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## విషయప్రవేశము

**కరుణాపూరలహరీ పరీవాహిత చక్షుషే।**
**భాగధేయవిధానాయ భగవన్! భవతే నమః ।।**

(పద్యచూడామణి IX-76)

బుద్ధదర్శితమైన విశ్వకల్యాణధర్మమును, అష్టాంగమార్గమును, విశద మధుమయ ఫణితి వివరించు అమృతగీతము 'ధమ్మపదము'. ధార్మికసిద్ధాంతమునకు, సాధనమార్గమునకు సరళము, సుబోధమునైన వివరణమే ధమ్మపదము.

భగవద్గీత, ధమ్మపదము, రెండును చిరంతనమహనీయధర్మగ్రంథములు. పరమచిత్తవిశ్రాంతిని, నిష్కామకర్మానుష్ఠానమును, సర్వభూతహితరతిని, సుందరమైన సులభశైలి నాబాలవృద్ధమునకు బోధపఱచు దివ్యతత్త్వకావ్యము (Philosophical Poem) భగవద్గీత.(*) పాళీభాషయందు మనోజ్ఞకావ్యలక్షణసంపన్నమై, రమ్యోపమాలంకృతమై, ఆబాలవృద్ధమునకు శాశ్వతధర్మమును సరళశైలి బోధించు ధర్మగీతము ధమ్మపదము.

---

(*) "The most beautiful, perhaps the only true philosophical Song existing in any known tongue" - –**Aldous Huxley.**

భగవద్గీత, సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులయందు గాన్పించు సమస్తవేదధర్మము యొక్క సారసంగ్రహము; తరువాతి కాలమున పెంపొందిన ధర్మములకు సైతము మూలాధారము. సమస్తభారతీయధర్మమున కిది కేంద్రమని భావింపవచ్చును. అక్షయ్యమైన తత్త్వజ్ఞానము (Perennial Philosophy) యొక్క విశదము, వ్యాపకమునైన సారగ్రంథమిది.

గీత, వేదములకు ఉత్తమోత్తమమైన భాష్యము, సర్వశ్రుతిసారము. కాన, '**శ్రీమద్భగవద్గీతా ఉపనిషత్**' - అని ఇది ప్రసిద్ధి గాంచినది.

"Than the Gita no better commentary on the Vedas has been written or can be written".

(Swami Vivekananda - C.W. Vol. III-p. 261 -
Mayavati Memerial Edition 1989)

**శీలము మోక్షారంభముల కాశ్రయము**

భగవద్గీత, కర్మ భక్తి జ్ఞానాత్మకమైన పరమార్థమార్గమును - పూర్ణ యోగమును, తద్గమ్యమును, జగన్మంగళకరముగ ప్రతిపాదింపగా, ధమ్మపదము నిర్వాణసౌధ సోపానపంక్తిరూపమగు శీలమును - సదాచారమును, హృదయంగమముగ బోధించుచున్నది. శీలము, అధ్యాత్మపథచరిష్ణువులకు అత్యంతప్రధానమని వేఱుగ వివరింప పనిలేదు. చరాచరవిశ్వమునకు వసుంధర ఆధారమైనట్లు, సకల సద్గుణములకు శీలము శుభాశ్రయము. శీలరహితులైన మానవులు, ధనపతులైనను మదనసుందరులైనను, ఫలపుష్పరమ్యమై, కంటకాఢ్యమైన వృక్షమట్లు, లోకమునకు దుఃఖప్రదులే యగుదురు. **శీలము, మోక్షారంభములందు యోగులకు సైతము అనన్యమగు ఆశ్రయమని బుద్ధోపదేశము.**[(1)]

---

(1) **"చరాచరస్య విశ్వస్య, యథాఽఽధారో వసుంధరా ।
నిఖిలానాం గుణానాం చ, తథా శీలం శుభాశ్రయః ।"** (బుద్ధచరితము -XXIII-18)
**"అమృతస్యాఽఽప్తయే సౌమ్య! వృత్తం రక్షితు మర్హసి ।"** (సౌందరనందము -XIII-20)
**"యతః శీల మతః సౌమ్య! శీలం సంస్కర్తు మర్హసి !
ఏతత్ స్థాన మథాఽన్యే చ మోక్షారంభేషు యోగినామ్ ।"** (సౌందరనందము XIII-29)

శీలమును ప్రాచీనస్మృతి ఇట్లు నిర్వచించుచున్నది :-
**"అద్రోహః సర్వభూతేషు కర్మణా మనసా గిరా ।
అనుగ్రహశ్చ జ్ఞానం చ శీలమేతద్విదుర్బుధాః ।"**
(సకలప్రాణుల యెడ, కర్మము, మనస్సు, వాక్కు, అను త్రికరణములతో ద్రోహచింత చేయకుండుట, కారుణ్యము, జ్ఞానము - ఈ గుణసంపదయే శీలమని జ్ఞానులెఱుగుదురు.)

భగవద్గీత, (XIII-7-11) అమానిత్వాదిగుణములను జ్ఞానమనియు, తద్గుణ వ్యతిరిక్తమైనది అజ్ఞానమనియు బోధించినది. **' ఏతద్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ।'** -

'Virtue alone constitutes knowledge' - శీలజ్ఞానము లభిన్నములని సోక్రటీస్ మహాశయుని ఆశయము. కాని, భగవద్గీత (XII - 13-20) సమస్త సద్గుణమణిగణములను కూర్చు సువర్ణసూత్రము, పరమేశ్వరభక్తి యని నిరూఢముగ బోధించినది.

"God-devotion is the central thread of virtues". (The Bhagavad - Gita: Philosophy of God-realisation P. 188 -- R.D. Ranade). ధమ్మపదమున పేర్కొనబడని అర్థమిదియే.

**ధమ్మపదమున పేర్కొనబడని సత్యము**

పరమేశ్వరుని దివ్యకృపయందు ప్రగాఢ విశ్వాసము, ఆ దివ్యసంకల్పమునకు సంపూర్ణాత్మసమర్పణము, జనులను ఫలకాంక్షారహితముగ కర్మము ననుష్ఠింపజేయు ఆ దివ్యయోజన (Divine Plan) యందు సమగ్రసంసక్తి - సంలగ్నత - ఇదియే పరిపూర్ణవిముక్తికి అర్థము. ఇదియే ధమ్మపదమున బోధింపబడనిది [1] (See: Dhammapada - The Mother – Sri Aurobindo Ashram).

**ఈశ్వరజ్ఞానము దుఃఖనివృత్తికి ఏకైకమార్గము**

**'యదా చర్మవదాకాశం, వేష్టయిష్యన్తి మానవాః ।**
**తదా దేవ మవిజ్ఞాయ, దుఃఖస్యాఽన్తో భవిష్యతి ।**

(శ్వేతాశ్వతరోపనిషత్ -VI-20)

ఆకాశమును చర్మము వలె చుట్టుట అసంభవము. అట్లే జ్యోతిర్మయుడగు పరమేశ్వరుని తెలిసికొనక, దుఃఖవినాశము అసంభవము. దుర్బలుడు, నశ్వరుడునైన మర్త్యుడు, కేవలపురుషప్రయత్నము చేతనే, తన జీవితము నుత్కృష్ట మొనరించుకొనజాలడు. ఆరాధన ధ్యానముల ద్వారా ఈశ్వరానుగ్రహ మాతడా కాంక్షింపవలయును. పరమపురుషధ్యానజలముల స్నాతమై మనస్సు స్వీయ

---

(1) పోల్చు :- భ.గీ. - XVIII - 61, 62, 66

మాలిన్యములనుండి విముక్తము కాగలదు.

The frail mortal cannot improve his life by self-effort alone; he must seek God's Grace through worship and meditation. It is by bathing in the holy waters of meditation that the mind gets cleansed of its impurities – [The Sage of Kanchi – T.M.P. Mahadevan – A philosopher looks Back - p. 72. (1982)]

శ్రుతి యొక్క ఈ పరమార్థమును ధమ్మపదము ప్రతిపాదింపలేదు. దీనికి కారణము నాటి సామాజిక పరిస్థితులే. కామాత్మకములు, స్వర్గపరములు క్రియావిశేష బహుళములునైన యజ్ఞాచరణములు, మీదుమిక్కిలి పశువిశసనాత్మకమునైన యజ్ఞాదుల వ్యాప్తి, ధర్మపాతిత్యము, నాటి మానవసమాజమున వ్యాపించి యుండుటచే, శీలధర్మములకు ప్రాణప్రతిష్ఠ చేయవలసి వచ్చినది. అందుకే తథాగతుని ఆవిర్భావము. ఈ ధర్మగ్లానిని, నైతికపాతిత్యమును, దీఘనికాయమందలి బ్రహ్మజాలసుత్తము వివరించును.(1) ఉపనిషత్తులయందు ఏకదేశముగా చెప్పబడిన సచ్ఛీలయోగమునే బుద్ధభగవానుడు సంపూర్ణముగ బోధించినాడు.

హృదయమున శీలప్రతిష్ఠ జరిగినచో, చిత్తము సత్త్వసంపన్నమై మెఱపు మెఱసినట్లు జ్ఞానోదయమగునని మహాత్ముల అనుభూతి. **"చిత్తే సత్త్వోత్పత్త్యా తటిదివ బోధోదయో భవతి I"** (శంకరుడు-ప్రబోధసుధాకరము-శ్లో. 166) కావున, భగవద్గీత (XVI-2-4) శ్లోకములందు చర్చించిన దైవాసుర ప్రకృతులకు, ధమ్మపదమున సమగ్రమైన వివరణము కలదని పండితాభిప్రాయము. (*)

**జయదేవమహాకవి దర్శనము**

జయదేవమహాకవి (12వ శతాబ్దము) తన గీతగోవిందకావ్యమున బుద్ధావతారము నిట్లు స్తుతించును. పశువిశసనాత్మకమగు యజ్ఞవిధిని బుద్ధభగవానుడు ఖండించెనని జయదేవుడు వర్ణించెను.

---

(1) బౌద్ధయుగము. 2 సంపుటము. పుట - 700 - 708 - డా॥ రత్నాకరం బాలరాజు-1960

(*) The Dhammapada is an extensive work, and the virtues enumerated in the XVI chapter of the Bhagavad Gita find a full exposition in the Dhammapada. [The Bhagavad Gita: Philosophy of God-realisation – R.D. Ranade – P.105 1965)]

"నిన్దసి యజ్ఞవిధే రహహ! శ్రుతిజాతం,
సదయహృదయదర్శితపశుఘాతమ్ ।
కేశవ! ధృతబుద్ధశరీర ! జయ జగదీశ ! హరే !"

"కారుణ్యమాతన్వతే.... నమః । " కారుణ్యము (అహింస) యోగోపదిష్టములగు యమములలో మొదటిది కదా!

'నిందసి యజ్ఞవిధే రహహ శ్రుతిజాతమ్'

అను జయదేవుని గీతపాదమును వ్యాఖ్యాత ఇట్లు వివరించెను. 'యజ్ఞాశయ విధానబోధకం వేదసమూహం నిందసి, న తు సర్వమిత్యర్థః –

'కారుణ్యమాతన్వతే' – కారుణ్యం కృపాం
ఆతన్వతే బుద్ధరూపేణ విస్తారయతే (వ్యాఖ్య.)

సమస్త శ్రుతిజాతమును బుద్ధుడు నిరసింపలేదు; పశుహింసాత్మక యజ్ఞముల విధించు వేదభాగమును మాత్రమే ఆకారుణ్యమూర్తి నిరసించినాడు.

'ఇష్టఫలప్రాప్తికి యజ్ఞక్రియాచరణము కులోచితధర్మము కదా' యని ప్రశ్నించినపుడా కరుణామూర్తి "యజ్ఞములకు నమస్కారము. ఇతరుల దుఃఖము వలన లభించు సుఖము నాకాంక్షింప"నని సమాధానమొసగెను.

"యదాత్థ చాऽపీష్టఫలాం కులోచితాం
కురుష్వ ధర్మాయ మఖక్రియా మితి ।
నమో మఖేభ్యో న హి కామయే సుఖం,
పరస్య దుఃఖక్రియయా యదిష్యతే ।"

(బుద్ధచరితము XI-64)

వేదధర్మమును బుద్ధుడు తిరస్కరించినాడని విపరీతవ్యాఖ్యలు చేయుట సులభము. తన ఆత్మయం దధ్యాత్మజీవనసాక్షాత్కారమే పరమధర్మము – సత్యము – అను విస్మరింపబడిన వేదోక్తధర్మమును బుద్ధుడు పునః ప్రతిష్ఠించినాడు. తరువాతి కాలమున బౌద్ధులు వేదభాగమందలి యజ్ఞములను – కర్మకాండను – బుద్ధుడు నిరసించుటను, సమస్తవేదధర్మము నాతడు తిరస్కరించుటగా, అనాలోచితముగ భావించి, వేదధర్మదూరులై, భ్రష్టదర్శనులైనారు. కాన,

## విషయప్రవేశము

**భారతభూమియందు వికృతపరిణామమందిన బౌద్ధము స**
కాని, సజీవమగు ఆధ్యాత్మికశక్తిగా, బుద్ధభగవానుడు మాత్ర
భారతీయుల హృదయమున శాశ్వతముగ ప్రతిష్ఠిత
ప్రసాదించుచునేయున్నాడు.

**అత్యంత తేజస్వంతము, నిర్మలమునగు రెండు దివ్య**

కావున భగవద్గీత, ధమ్మపదము -రెండును ఒక
ధర్మమును పరిపూరణమొనరించినవి. రెండును చిత్తశుద్ధి
కోమల కారుణ్యభావయుక్తమైన అవగాహనమును,
సంస్కరించి, హృదయమున ప్రకాశమానమగు జ్ఞానదీప
ఉదయ ప్రాతఃసంధ్యలయందీ రెండు దివ్యరత్న
కర్తములగుచున్నవి. భగవద్గీత మహాభారతాంతర్గతము.
మందలి ఖుద్దకనికా యాంతర్గతము.

ఖుద్దక నికాయ మందలి పదునైదు గ్రంథములల
పిటకత్రయమును పాళీసాహిత్యమును గుఱించి తరు

**గాథలు సన్నివేశాత్మకములు**

ధమ్మపదమున గౌతమమునీంద్రుని వ
నన్నూటయిరువదిమూడు (423) గాథలు కలవు.
వర్గములుగ నిది విభజింపబడినది. దీనిలో ఒక్కొక్క
ఒక్కొక్క సన్నివేశము కలదు. అనగా, ఎవరికి,
నుచ్చరించినది '**ధమ్మపదాట్ఠకథ**' యను భదన్త
వివరించును. ఒకే స్థానమున కూర్చుండి సాధా
తథాగతుడు చేసిన ఉపదేశము లివి కావు.

### ఉపదేశ స్థానములు

ఒక స్థానమునుండి మఱొక స్థానమున
పరివ్రజించుచుండుట వలన, ఉపదేశస్థానములును
పరిశీలించినచో, అధిక గాథలు, శ్రావస్తీనగరమున - జేత

విశదమగును. శాక్యమునీంద్రునికి భక్తుడు, శ్రావస్తీ నగర మహాధనికుడు, **'సుదత్తుడు'** ఈ ఉద్యానవనమును, రాజకుమారుడగు 'జేతుని' నుండి పదునెనిమిది కోట్ల కార్షాపణముల[1] (సువర్ణముల Gold Coins) ఖరీదుకు కొని మహాశ్రమణుని నివాసార్థమై సమర్పించుటకు నిశ్చయించినాడు. దీనజనాశ్రయుడగుటచే ఈ సుదత్తుడే, **'అనాథపిండికుడ'**ను నామమున లోక విఖ్యాతుడయినాడు. సుదత్తుని ఔదార్యమునకు దానశీలమునకు ముగ్ధుడైన జేతుడు, సగము సొమ్ము మాత్రమే స్వీకరించి, భూమి మాత్రము సుదత్తునికి స్వాధీన పఱచి, వృక్షములను తన భాగముగ భగవంతునికి సమర్పించి ధన్యుడైనాడు. ఈ జేతవనముననే, బుద్ధభగవానునికి విహారమును **(గంధకుటివి)** అనాథపిండికుడు నిర్మించి అమరకీర్తియైనాడు. ఇదియే **జేతవనవిహారము.** ఈ విహారశిథిలములను నేడును కాంచవచ్చును. ఇది ప్రస్తుతము **'సాహెత్-మాహెత్'** అని వ్యవహరింపబడుచున్నది.

జేతవనము తరువాత, రాజగృహము **(వేణువనము)** శ్రావస్తి **(పూర్వారామము)** వైశాలి **(కూటాగారశాల)** కపిలవాస్తు **(న్యగ్రోధారామము)** రాజగృహసమీపమందలి **గృధ్రకూటము,** కోసలదేశము నందలి **ఆలవీ, బేలువగ్రామము,** మొదలగు స్థానములందు సర్వజ్ఞుడగు సుగతుడు విభిన్నవ్యక్తులకు ధర్మము నుపదేశించినాడు.

## 'ధమ్మపద' నామనిరుక్తి

ధమ్మపదము - ఈ సమాసపదమున ధమ్మ+పదము అని రెండు శబ్దములున్నవి. 'ధమ్మ' శబ్దము సంస్కృత 'ధర్మ' శబ్దమునకు పాళీరూపము. ధర్మశబ్ద మతి విస్తృతార్థము కలది. కాని, ఈ గ్రంథమున నీ శబ్దము **'శీలము' - సదాచారము** - అనునర్థమున ప్రయుక్తము.

పదశబ్దమున కర్థము మార్గమని **'పమాదో మచ్చునో పదం** (21) **'ఆకాసే చ పదం నత్థి'** (255) అను గాథలందలి ప్రయోగము వలన స్పష్టమగుచున్నది. దీనిని బట్టి ధమ్మపదమునకు ధర్మము యొక్క మార్గమని విశదమగును. (The path of virtue)

---

(1) ఏబది నాల్గు కోట్ల కహాపనాలు (కార్షాపణములు) అని మఱొకచోట చెప్పబడినది. 'కహాపనము' - 146 గింజల (grains) ఎత్తుగల రాగినాణె మను కొందఱి అభిప్రాయము సరికాదు.
చూడు - ధమ్మపదం - గాథ - 186

**కార్షాపణములు,** బంగారు, వెండి, రాగి, ధాతువులు మూడింటిలోను, ముద్రింపబడుచుండెనని విద్వాంసుల నిర్ణయము.

పద శబ్దమునకు వాక్యమని మఱొక అర్థము. 'ఏకం ధమ్మపదం సెయ్యో' (102) 'కో ధమ్మపదం – సుదేసితం కుసలో పుప్ఫమివ పచెస్సతి' (44, 45) అను గాథలందలి ప్రయోగము వలన నిది స్పష్టము.

ఇంకను పద శబ్దమునకు ప్రయత్నము, ప్రదేశము, పాదము, అడుగుజాడ, స్థానము, ఉపాయము, రక్షణము, గుర్తు, వస్తువు, శ్లోకము యొక్క చరణము, కిరణమునను అర్థములు కలవు.(1)

**కాన ధమ్మపదమున కర్థము భగవంతుడగు బుద్ధగౌతముని సదాచార–శీల–సంబంధియగు ఉపదేశవాక్యమనియును, ధర్మము యొక్క పదచిహ్నము – అడుగుజాడ (foot step or the foot path of virtue) అనియును భావింపవచ్చును.**

మార్గజీవి

'యో ధమ్మపదే సుదేసితే, మగ్గే జీవతి సంయతో సతీమా।
అనవజ్జపదాని సేవమానో, తతియం భిక్ఖున మాహు మగ్గజీవిం।
(సుత్తనిపాతము – చున్దసుత్తము – 6)

ధమ్మపదమున చక్కగా నుపదిష్టమైన **మార్గమున** సంయమశాలి, స్మృతిమంతుడై జీవించువాడు, అనవద్య (అనింద్య) పథమున చరించువాడు 'మార్గజీవి' అను తృతీయ భిక్షువు. దీనిబట్టి ధర్మమార్గము, లేక, ధర్మము యొక్క పదచిహ్నము – అడుగుజాడ (footstep or footpath of Virtue) అనునర్థమే 'ధమ్మపదము'నకు సమంజసమైన అర్థమని సిద్ధాంతము.

**'అమతస్స అధిగముపాయ' – (అమృతస్య అధిగమోపాయః)** అని భాష్యకారుడు భదన్త బుద్ధఘోషుడు, **'అప్పమాదో అమతపదం'** అను గాథను (21) వివరించుచు, 'అప్రమాదము, అమృతము – (నిర్వాణము) – పొందుటకు 'ఉపాయము!' అని వివరించును. **(ఉపాయో, మగ్గో).**

---

(1) పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయ ప్రదేశయోః।
పాద తచ్చిహ్నయోః స్థాన త్రాణయో రంక వస్తునోః।
శ్లోకపాదేఽపి చ క్లీబం, పుంలింగః కిరణే పునః।
(మేదినీకోశము–ద–ద్వికం)
అభిధానపదదీపిక యందును నీ యర్థములు కలవు.

ధమ్మపదము 92, 93, మఱియు 254, 255 గాథలందు పదశబ్దము గత్యర్థకముగ నుండుట వలన, 'పద' శబ్దార్థము 'మార్గము' అని స్పష్టమగుచున్నది.

**'సంపత్త – సద్ధమ్మపదో సత్థా ధమ్మపదం సుభం దేసేసి' ।** 'సద్ధమ్మపద సంపన్నుడగు 'శాస్త' (బుద్ధుడు) శుభావహమైన ధమ్మపదమును (పావనమగు ధర్మమార్గమును) చూపెను – ఉపదేశించెను.' – అను భదన్త బుద్ధఘోషుని వాక్యమీ యర్థమునే స్థిరీకరించుచున్నది.

పదశబ్దమునకు ఆధారము, మూలము (Base) అను అర్థమును స్వీకరించుచో, ధమ్మపదమునకు ధర్మము యొక్క ఆధారము (The foundation or base of religion) అనియు భావింపవచ్చును.

**ధమ్మపదప్రతిపాద్యము** శీలము – సదాచారమని ముందే చెప్పబడినది. చతురార్యసత్యములు, అష్టాంగమార్గము – శీల ప్రజ్ఞాసమాధులు – మొదలగు ధర్మ స్వరూపమంతయు ధమ్మపదమున ప్రతిపాదింపబడినది. ఇంద్రియ సంవరము, దుఃఖపునర్జన్మరాహిత్యములకు పరమకారణముగా నిందు ప్రాతిపాదింపబడిన దనుట సిద్ధాంతము.

**ధమ్మపదమహత్త్వము**

**ఆబాలగోపవిదితముగ** నిరుపాధిక కారుణ్యమూర్తి, బుద్ధభగవాను డిందు అధ్యాత్మ జీవితమునకు పరమాధారమగు శీలము నుపదేశించినాడు. గ్రహించుటకు సులభము గాని దేదియు భగవంతు డిందుపదేశింపలేదు. మానవునికి గల్గు దుఃఖోపద్రవములన్నిటికి నా సర్వజ్ఞుడు హేతువును దెల్పి, ఉపశమమును విధించును. హితమును, జీవితమున దాపురమగు అనేకదుఃఖముల నుండి విముక్తిని, ప్రమోదసందేశమును, సునిశ్చితజ్ఞానమును ఆకాంక్షించి, నిరుపమానరమ్యములైన ఈ గాథల నాశ్రయించువారెన్నడును వైఫల్యమును బొందరు.

శాక్యముని దీనులకు, నిఱుపేదలకు, ఉపదేష్ట. ప్రజల భాషయందే సంభాషించి, వారి హృదయముల చేరుటకై దేవభాష (సంస్కృతము) ను సైతమామహాత్ముడు నిరాకరించెను. రాజ్యసింహాసనమును పరిత్యజించి,

భిక్షువులతో, దీనులతో, దుఃఖితుల (విషణ్ణుల)తో కలసి, యాకరుణామూర్తి జీవించెను. ద్వితీయ శ్రీరాముని వలె అంత్యజుని నాలింగనమొనర్చి హృదయమునకు హత్తుకొనెను.

**"దుఃఖితులమైన మనయెడల పరమకారుణ్యమున**
**గౌతముడు మన యొద్ద కిపుడు వచ్చుచున్నాడు.**
**దేవతల కతీతుడైన ఆతని వాక్కు వలన**
**ద్రష్ట, జ్ఞాతయునైన మహితాత్మునికి సన్నిహితముగ**
**సమాకర్షితుల మైతిమి"**

అను అర్హంతుని వాక్కు సహజరమణీయము కదా!

**ఉపమల రామణీయకత**

శాక్యమునీంద్రుని నైతికతాత్త్వికబోధల నిరూపించు ధమ్మపదగాథ లందలి ఉపమలస్వారస్యము, సారల్యము, హృదయైక వేద్యము. ఇవి సర్వజనసుబోధములు, ఆలోచనామృతములు. **'చక్కం వ వహతో పదం'**(1) **'కలిం'వ కిత వా సఠో'** (252) **'అస్సం భద్రం'వ వాణిజో'** – (380) **'యథా'గారం దుచ్ఛన్నం'** (13) **ఉసుకారో'వ తేజనం**(33) **'సుత్తం గామం మహోఘో'వ'** (47) **'యథా పి రహదో** గమ్భీరో' (82) ఇత్యాదులు గమనార్హములు. **ఇందలి ఉపమలన్నియు పఠితల సౌకర్యార్థము అధోరేఖా చిహ్నితములై సూచింపబడినవి.**

**శాస్త యొక్క ఉపదేశవిధానము**

ఆబాలగోపవిదితముగ, వారి వ్యవహారభాషలో తేటతెల్లముగ వారి వారి మనోభూమికల ననుసరించి భగవంతు డిందు బోధించుట కాంచనగును.

**"దేవా దేవీం, నరా నారీం, శబరాశ్చాఽపి శాబరీమ్ ।**
**తిర్యఞ్చోఽపి చ తైరశ్చీం, మేనిరే భగవద్గిరమ్ ।"**

అని జైనమహావీరతీర్థంకరుని బోధను గుఱించి వర్ణించు ఈ శ్లోకము, తథాగతుని బోధలకును అన్వయించు ననుట సత్యదూరము కాదు. 'భగవద్వాక్కు (మహావీరుని వాక్కు)ను, దేవతలు దేవభాషగా, మానవులు మానవ భాషగా,

శబరులు శబరభాషగా, తిర్యగ్జంతువులు, తిర్యగ్జంతుభాషగా భావించెను. సమస్త ప్రాణికోటికి, వాని వాని భాషలో భగవంతుని వాణి వినబడినదని అర్థము.

**బుద్ధోపదేశసారము**

బుద్ధబోధ యందు సాధారణశీలధర్మముతో పాటు, **'అభిధమ్మము'** (తత్త్వజ్ఞానాంశము) సైతము కలదు. సదాచారము - శీలము - పరమజ్ఞానమునకు సంబోధమునకు - సోపానపంక్తిగ నిందు నిరూపితము. **ధమ్మపదము, గౌతమబుద్ధుని ఆధ్యాత్మికబోధనసంహిత** (Spiritual Testament of the Buddha)-గ భావింపవచ్చును. ఆ సర్వజ్ఞుని హృదయప్రకాశకములగు జ్ఞానదీప్తులు, పావనభాసురములైన ఈ గాథల రూపమును దాల్చినవి. ఇవి శ్రవణసుఖదములై, జీవదధ్యాత్మగభీరజ్ఞానమున కభివ్యంజకములై వెలయుచున్నవి.

**బుద్ధోపదేశసారసంగ్రహమైన ఈ గ్రంథము జనసామాన్యమునకు సానుభూత్యాత్మక ఉపదేశప్రదమై, జ్ఞానభారశిరస్కులైన పండితులకు సరళవివేక సూక్తులతో చిత్తవిశ్రాంతిదాయక మగుచున్నది.**

**సమ్రాట్టు అశోకుని ధమ్మపదశ్రవణము**

ఇం దభివర్ణితమైన సదాచారమును - శీలమును - అనుష్ఠించుట వలన భవతాపతప్తులగు జనులు తరింపగలరు. భౌతికవాదప్రధానమైన నేటి యుగమున, ఇందలి దివ్యసూక్తులు, మానవజీవితమున కధికాధికముగ కల్యాణకరములు కాగలవు. ధమ్మపద శవణ,అధ్యయన,మనన,నిదిధ్యాసనములు,జగత్కల్యాణమున కత్యంతావశ్యకము. కళింగయుద్ధానంతరమున, హింసావిరక్తుడై కారుణ్యాభరితుడైన సమ్రాట్టు-అశోకుడు, ఈ గ్రంథరత్నమున రెండవదియగు **'అప్పమాదవగ్గము'**ను, న్యగ్రోధభిక్షువు వలన ధర్మదీక్షను స్వీకరించిన సమయమున శ్రద్ధాసంపన్నుడై శ్రవణ మొనరించెనని మహావంశగ్రంథము వలన తెలియుచున్నది.

శతాబ్దములు గడచినను ఇందలి సద్ధర్మము, జాతిదేశకాలసమయరహితముగ, సర్వదా, అనుష్ఠానమున కత్యంతానురూపముగ నున్నది. హింసాక్రౌర్య విధ్వంసకత్వదారుణ చ్ఛాయలు క్రమ్ముకొనుచున్న నేటి కాలమున, సకలోపద్రవముల కీధర్మము అత్యుత్తమ నివారణమార్గము; శాంతిసంధాయకము. ప్రపంచమహాగ్రంథములలో నొకటిగ ప్రసిద్ధమగుటచే, ధమ్మపదము

ప్రపంచప్రధానభాషలన్నిటి యందును అనువదింపబడినది. కొన్ని భాషలలో దీనికి అనేకముగ అనువాదములున్నవి.

**“దీనాః సముద్ధృతా యేన, మార్గో ధర్మస్య శోధితః।**
**కృతజ్ఞాః కిన్న చాఽర్చన్తు, బుద్ధం లోకహితే రతమ్ ॥”**

దీనజనసముద్ధారకుడు, ధర్మపదమును నిష్కంటక మొనర్చి పరిష్కరించినవాడు, లోకహితరతుడునైన బుద్ధభగవానుని, కృతజ్ఞులగు రెవ్వరు పూజింపకుందురు?

**“కోఽన్యోహి సదృశః పూజ్యో యేన ముక్తేన మోచితాః।**
**పునర్భవాన్మహా దుఃఖాత్, ప్రాణినః సతతం భువి? ॥”**

(బు.చ. XXVIII-74,76)

ప్రాణికోటిని పునర్భవమహాదుఃఖము నుండి విముక్తమొనరించినవాడు, నిత్యముక్తుడునైన ఆ భగవంతునకు సదృశులగు పూజ్యులెవ్వరు?

**‘ధమ్మపద’** రూపమున నున్న భగవంతుని అమృతవాణిని, విశ్వ మాలకించుగాక! కరుణానిర్భరమైన ఆ వాణికి విధేయులగువారు, తమ్ముతాము, పరమశాంతి పదమున ప్రతిష్ఠించుకొందురు.

ఓంతత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## యమకవగ్గో పఠమో

## (యమకవర్గః ప్రథమః)

## I యమకవర్గము—ప్రథమాధ్యాయము

స్థానము :— సావత్థి (జేతవనము) వ్యక్తి :— చక్ఖుపాలథేరుడు

### పాళీగాథ

1. మనో పుబ్బఙ్గమా ధమ్మా(1), మనోసేట్ఠా మనోమయా।
మనసా చే పదుట్ఠేన, భాసతి వా కరోతి వా ।
తతో నం దుక్ఖమన్వేతి చక్కం వ వహతో పదం ॥ 1 ॥

### సంస్కృతచ్ఛాయ

(మనః పూర్వఙ్గమా ధర్మా, మనః శ్రేష్ఠా మనోమయాః ।
మనసా చేత్ ప్రదుష్టేన, భాషతే వా కరోతి వా ।
తత ఏనం దుఃఖ మన్వేతి చక్రమివ వహతః పదమ్ ॥ 1॥ )

---

(1) బౌద్ధశాస్త్రములందు 'ధమ్మ' (ధర్మ) శబ్దమునకు పెక్కర్థములు కలవు. ఆ శబ్దమునకిచట 'కుశల' 'అకుశల' చేతసికములు – మానసికావస్థలని యర్థము. ఈ మనోవస్థ లుదయించి కదలిపోవుచున్నవి. వీని కన్నిటికిని మనస్సే మూలము. (ఏకుప్పాద-ఏక నిరోధ-ఏకాలంబన వత్థుకా). భాష్యకారుడు

సర్వధర్మములు (వాచిక కాయిక మానసిక కర్మములును, సుఖదుఃఖాద్యనుభవములు)ను, మనో మూలములు; మనః ప్రధానములు; మనోమయములు. కాన, దుష్టమైన మనస్సుతో భాషించినను, కర్మమొనరించినను, బండ్లను లాగు వృషభాశ్వముల పదములను చక్ర మనుసరించునట్లు, (మానవుని) దుఃఖ మనుసరించును.

**2. సావత్థి (జేతవనము)** **మట్ఠకుణ్డలి**

**మనో పుబ్బఙ్గమా ధమ్మా, మనోసెట్ఠా మనోమయా ।**
**మనసా చే పసన్నేన, భాసతి వా కరోతి వా ।**
**తతో నం సుఖమన్వేతి ఛాయా వ అనపాయినీ ॥ 2 ॥**

*(మనః పూర్వఙ్గమా ధర్మాః, మనః శ్రేష్ఠా మనోమయాః ।*
*మనసా చేత్ ప్రసన్నేన భాషతే వా కరోతి వా ।*
*తతః ఏనం సుఖమన్వేతి ఛాయేవాఽనపాయినీ[1] ॥ 2 ॥)*

---

బుద్ధఘోషుని, ప్రాచీనశాస్త్రపరంపరను, అనుసరించి 'ధమ్మ' శబ్దమునకు వేదనా, సంజ్ఞా, సంస్కారములను మూడు స్కంధములని అర్థము. మనస్సు, లేక, చిత్తమే, విజ్ఞాననామకస్కంధము. దీనినే వేదనాసంజ్ఞా - సంస్కారము లనుసరించుచున్నవి. దాని యధీన మందున్నవి; దానిచే నియుక్తము లగుచున్నవి.

(1) పోల్చు :- **"మానసం ప్రాణినామేవ, సర్వకర్మైక కారణమ్ ।**
**మనోనురూపం వాక్యంచ, వాక్యేన ప్రస్ఫుటం మనః" ।**

(నారదపంచరాత్రము 1-7-8)

(ప్రాణుల సర్వకర్మములకు మనస్సే కారణము. వాక్యము (మాట), మనస్సున కనురూపముగ నుండును. మాటచే మనస్సు విశదమగును.)

మఱియు పోల్చు **"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః ।**
**బన్ధాయ విషయాసక్తం, ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ।"**

(అమృతబిన్దూపనిషత్-2)

(మానవుల బంధమోక్షములకు మనస్సే కారణము. విషయాసక్తమైన మనస్సు బంధమునకు, విషయాసక్తము కాని మనస్సు మోక్షమునకు, హేతువని భావింపవలెను.)

**"చిత్తం వావ సంకల్పాద్భూయో, యదా వై**
**చేతయతే ఽథ సంకల్పయతే ఽథ మనస్యత్యథ**
**వాచమీరయతి, తాము నామ్నీరయతి,**
**నామ్ని మన్త్రా ఏకం భవన్తి, మన్త్రేషు కర్మాణి".**
**"తాని హ వా ఏతాని చిత్తైకాయనాని, చిత్తాత్మాని**

సర్వధర్మములును మనోమూలములు; మనః ప్రధానములు; మనోమయములు. కాన ప్రసన్నమైన మనస్సుతో భాషించినను కర్మమొనరించినను, విడువని నీడవలె (మానవుని) సుఖమనుసరించును.

**సావత్థి (జేతవనము)** **థుల్లతిస్సథేరుడు**

3. **'అక్కొచ్ఛి[1] మం అవధి మం, అజిని మం అహాసి మే' ।**
**యే చ తం ఉపనయ్హన్తి, వేరం తేసం న సమ్మతి ॥ 3 ॥**

*('అక్రుక్షన్ మా మవధీన్మామ జైషీన్ మా మహార్షీ న్మే' ।*
*యే చ తదుపనహ్యన్తి, వైరం తేషాం న శామ్యతి ॥ 3 ॥ )*

'అతడు నన్ను దూషించెను, కొట్టెను, ఓడించెను, దోచుకొనెను'. – ఇట్టి విచారములు మనస్సున నిలుపుకొను వారి వైర మెప్పటికిని శాంతింపదు.

4. **'అక్కొచ్ఛి మం అవధి మం, అజిని మం అహాసి మే' ।**
**యే తం న ఉపనయ్హన్తి[2], వేరం తేసూపసమ్మతి ॥ 4 ॥**

---

**చిత్తే ప్రతిష్ఠితాని, తస్మాద్యద్యపి బహువిదచిత్తో**
**భవతి, నాఽయమస్తీత్యేవైన మాహుః ।**

(ఛాందోగ్యోపనిషత్ VII - 5-1,2)

(సంకల్పము, మనస్సు, వాక్కు, నామము (శబ్దము), మంత్రములు, కర్మములు–వీనికన్నిటికిని, చిత్తమే ముఖ్యాశ్రయము (నిలయము). ఇవియన్నియు, చిత్తాత్మకములు; చిత్త ప్రతిష్ఠితములు. సర్వజ్ఞుడైనను, చిత్తరహితుడు, సంకల్పింపజాలడు. వాడు వాస్తవముగ లేని వాడే. కాన, చిత్తమే సంకల్పాదులకు ఆయతనము; బృహత్తు (గొప్పది).)

జగద్గురువైన బుద్ధుడు, జాగరూకతతో తన ధర్మబోధయందు పురాతన శ్రుతులను – ఋషి సూక్తులను – ప్రతిధ్వనింప చేసినాడు. ఆ మహాత్ముడు సర్వజ్ఞుడు. కాన, పూర్వఋషి సూక్తులు నాత డపేక్షించెనని భావింపరాదు. అజ్ఞానులగు జనులు, తన బోధయందు, పూర్వఋషి దృష్టమైన ధర్మము ప్రతిధ్వనింపకున్నచో భ్రాంతులై, తమ పితరుల ధర్మవిశ్వాసములనుండి భ్రష్టులగుదురని భావించి, దాని నిరోధించుట కట్లాచరించెను. ఇట్టిది, బుద్ధోపదేశమున సర్వత్ర కాన్పించును. వేదవిరుద్ధమగు నూతన ధర్మమును బుద్ధుడు బోధించెనని, తరువాతి కాలమునందలి బౌద్ధులు మిథ్యా దృష్టి వలనను, విపరీతార్థముల వలనను, అయథార్థ కథనముల వలనను, తథాగతుని మాతృదేశమైన ఈ భారతావని యందు స్వజాతీయులైన ప్రజల మధ్యముననే, ఆ మహితాత్ముని ధర్మపదము సంశయాస్పదమై తిరస్కరింపబడుట దురదృష్టకర పరిణామము.

(1) అక్కొచ్ఛి = కుస్ ధాతు భూతకాల రూపము. దీని సరియైన రూపము 'అక్కొసి'. పాళి వ్యాకరణానుసారము 'ఇ' స్థానమున 'ఛి' ఆదేశము. ఇది సంస్కృత 'క్రుశ్' ధాతుజన్యము. 'క్రుధ్' ధాతు జన్యము కాదు.

(2) 'యే చ తం నుపనయ్హన్తి' – పాఠాంతరము
ఉప + నహ్ = నహ్ బంధనే. (ఉప +నహ్యతి)

('అక్రుక్షన్ మా మవధీన్మా, మజై షీన్మా మహార్షీన్మే' ।
యే తన్నోపనహ్యాన్తి, వైరం తేషూపశామ్యతి ॥ 4 ॥)

'అతడు నన్ను దూషించెను, కొట్టెను, ఓడించెను, దోచుకొనెను'-ఇట్టి విచారములు మనస్సున నుంచుకొనని వారి యందు వైరము శాంతించును.

సావత్థి (జేతవనము) కాళి (యక్షిణి)

5. న హి వేరేన వేరాని, సమ్మన్తీధ కుదాచనం ।
అవేరేన చ సమ్మన్తి, ఏస ధమ్మో సనన్తనో ॥ 5 ॥

(నహి వైరేణ వైరాణి, శామ్యన్తీహ కదాచన ।
అవైరేణ చ శామ్యన్తి, ఏష ధర్మః సనాతనః ॥ 5 ॥)

వైరముతో వైరమెన్నడీ లోకమున శాంతింపదు. అవైరము చేతనే శాంతించును. ఇది సనాతనమగు ధర్మము.

సావత్థి (జేతవనము) కోసంబిక భిక్షువు

6. పరే చ న విజానన్తి, మయమేత్థ యమామసే ।
యే చ తత్థ విజానన్తి, తతో సమ్మన్తి మేధగా(1) ॥ 6 ॥

(పరే చ న విజానన్తి, వయ మత్ర యంస్యామః* ।
యే చ తత్ర విజానన్తి, తతః శామ్యన్తి మేధగాః ॥ 6 ॥)

'సంసారమున మన మందఱము, ఒకనాడు మృత్యువు పాలు కావలసిన వారమే' అని అన్యు (మూర్ఖు) లెఱుగరు. ఇట్లెఱిగిన వారి మనోవికారము లన్నియు నుపశమించుచున్నవి. (* యమ్ = ఉపరమే. సంస్కృతమున ఈ ఛాయ కేవల మర్థపరమైనది. భాషా విజ్ఞాన సమ్మతము కాదు; వైదిక ప్రయోగానుకరణము.)

సేతబ్యనగరము (సీసపావనము) (సావత్థి (జేతవనము) వేటౌక సంస్కరణ మునసువరించి) చుల్లకాలుడు, మజ్ఝిమ కాలుడు, మహాకాలుడు

7. సుభానుపస్సిం విహరన్తం, ఇంద్రియేసు అసంవుతం ।
భోజనమ్హి అమత్తఞ్ఞుం, కుసీతం[1] హీనవీరియం[2] ।
తం వే పసహతి మారో వాతో రుక్ఖం[3] వ దుబ్బలం ॥ 7 ॥

(శుభాఽనుపశ్యన్తం విహరన్త మింద్రియేషు అసంవృతమ్ ।
భోజనే అమాత్రజ్ఞం, కుసీదం హీనవీర్యం ।
తం వై ప్రసహతే మారో,[4] వాతో వృక్ష మివ దుర్బలమ్ ॥ 7 ॥

ఇంద్రియసంయమరహితుడై, ఆహారమున మితి నెఱుగక, అలసుడును, పౌరుషహీనుడునునై, కేవలము సుఖము నన్వేషించుచు విహరించువానిని, దుర్బలవృక్షమును పెనుగాలి వలె మారుడు పెల్లగించును.

8. అసుభానుపస్సిం విహరన్తం, ఇంద్రియేసు సుసంవుతం ।
భోజన మ్హి చ మత్తఞ్ఞుం, సద్ధం ఆరద్ధ వీరియం ।
తం వే నప్పసహతి మారో, వాతో సేలం వ పబ్బతం ॥ 8 ॥

(అశుభ మనుపశ్యన్తం విహరన్తం, ఇంద్రియేషు సుసంవృతం ।
భోజనే చ మాత్రజ్ఞం, శ్రద్ధ మారబ్ధ వీర్యం ।
తం వైన ప్రసహతే మారో, వాతః శైల మివ పర్వతమ్ ॥ 8 ॥)

దేహమందలి అశుద్ధిని, (కాయగతానుస్మృతి) ధ్యానించుచు, ఇంద్రియ

(1) కుసీత – కుసీదః (సం) సంస్కృత శబ్దమందలి 'ద' కారము పాళీ శబ్దమున 'త' కారమగును.
(2) సంస్కృతమందలి 'వీర్య' శబ్దమునకు పాళీ రూపము 'వీరియ' లేక, విరియ. అలసుడు, ప్రమాది అని అర్థము. (3) రుక్ఖం = వృక్షమ్.
(4) మారుడు :- బౌద్ధమతము ననుసరించి, సత్పురుషుల ప్రలోభపెట్టు అధమదేవయోని విశేషము. ఆర్షమతమున మారుడు మన్మథుడు, కాముడు; దూష్యుడు కాడు. సత్పురుషుల పవిత్రతను పరిశోధించు వాడు మాత్రమే.
మారుడు :- క్లేశరూపుడు (నారదమహాథేరుడు)

సంయమముతో మితాహారియై, శ్రద్ధాపౌరుషశాలియై విహరించువానిని, శిలామయపర్వతమును వాయువు వలె మారుడు కంపింపజేయజాలడు.

**సావత్థి (జేతవనము)** **దేవదత్తుడు**

9. **అనిక్కసావో కాసావం, యో వత్థం పరిదహేస్సతి ।**
**అపేతో దమసచ్చేన, న సో కాసావ మరహతి**[(1)] **। 9 ।**

*(అనిష్కషాయః కాషాయం, యో వస్త్రం పరిధాస్యతి ।*
*అపేతో దమసత్యాభ్యాం, న స కాషాయ మర్హతి । 9 । )*

రాగద్వేషాదిమలయుక్తుడై, ఇంద్రియదమమునకు, సత్యమునకు దూరుడైనవాడు, కాషాయవస్త్రధారణకు యోగ్యుడు కాడు.

10. **యో చ వన్తకసావస్స, సీలేసు**[(2)] **సుసమాహితో ।**
**ఉపేతో దమసచ్చేన, స వే కాసావ మరహతి । 10 ।**

*(యశ్చ వాన్త కషాయః స్యాత్, శీలేషు సుసమాహితః ।*
*ఉపేతో దమసత్యాభ్యాం, స వై కాషాయ మర్హతి । 10 ।*

రాగాదిమలరహితుడై, శీల (ఆచార) సంపన్నుడై ఇంద్రియసంయమసత్య సంయుక్తుడునగు వాడే కాషాయవస్త్రధారణ కర్హుడు.

---

(1) **అనిష్కషాయే కాషాయ, మీహార్థమితి విద్ధి తమ్ ।**
**ధర్మధ్వజానాం ముణ్డానాం, వృత్త్యర్థమితి మే మతిః ।**
(మ.భా. శాంతి-18-34)

'రాగద్వేష కలుషచిత్తునికి కాషాయవస్త్రధారణ, కేవలము కామము కొఱకేయని తెలియుము. అది ధర్మధ్వజులు (మిథ్యాచారులు), అగు సంన్యాసులకు, జీవనోపాయమని నా అభిప్రాయము'.
కషాయము :- మలము

(2) సీల (శీల)ము పాళీటీకాకారుని మతముననుసరించి నాల్గు విధములు :- పాతిమోక్ఖసంవరసీలము, ఇంద్రియసంవరసీలము, ఆజీవపారిసుద్ధిసంవరసీలము, పచ్చయసన్నిస్సితసంవరసీలము.
పోల్చు :- **'అద్రోహః సర్వభూతేషు, కర్మణా మనసా గిరా ।**
**అనుగ్రహశ్చ జ్ఞానం చ, శీల మేతద్విదుర్బుధాః ।'**
**'ఆచారహీనం న పునన్తి వేదాః ।**(స్మృతి)(బ్ర.సూ. రత్నప్రభా వ్యాఖ్యయం దుదాహృతము)

'త్రికరణములచే జీవకోటికి ద్రోహచింత చేయకుండుట, కరుణ, జ్ఞానము - ఇదియే శీలమని బుధులెఱుగుదురు'.

'శీలరహితుని వేదములు పవిత్రుని చేయజాలవు'

**రాజగృహము (వేళు(ణు)వనము)  సంజయుడు (అగ్గసావకుడు)**

11. **అసారే సారమతినో, సారే చాసారదస్సినో ।**
**తే సారం నాధిగచ్ఛన్తి, మిచ్ఛాసఙ్కప్పగోచరా ॥ 11 ॥**

*(అసారే సారమతయః, సారే చాఽసార దర్శినః ।*
*తే సారం నాఽధిగచ్ఛన్తి, మిథ్యాసఙ్కల్పగోచరాః ॥ 11 ॥)*

అసత్యమున సత్యమును, సత్యమున అసత్యమును గాంచువారు మిథ్యా సంకల్పముల గాంచువారు. వారు సత్యము నెన్నటికిని ప్రాపింపజాలరు.

(ప్రాపంచికసంపదలు, భావనలు, దర్శనములు, లౌకికముగ ప్రయోజన కరములైనను, ప్రవాహతుల్యములు; అనిత్యములు. చరమ సత్యముతో పోల్చినపుడవి అసారములు. పరమార్థము యొక్క విలువలపైన ఆధారపడిన ఆధ్యాత్మికజీవితమున నివి సారహీనములే. శీల ప్రజ్ఞా సమాధులు పరమార్థమున వాస్తవమైనవి కాన, సారరూపములు.) *

12. **సారఞ్చ సారతో ఞత్వా, అసారఞ్చ అసారతో ।**
**తే సారం అధిగచ్ఛన్తి, సమ్మాసఙ్కప్ప గోచరా ॥ 12 ॥**

*(సారఞ్చ సారతో జ్ఞాత్వా, అసారఞ్చ అసారతః ।*
*తే సార మధిగచ్ఛన్తి, సమ్యక్సఙ్కల్ప గోచరాః ॥12 ॥)*

సారమును సారముగ, అసారమును అసారముగ తెలిసికొను (వస్తుతత్త్వజ్ఞులైన) వారు సమ్యక్సంకల్ప దర్శనులు. వారే సారతత్త్వమును పొందగలరు.

---

* ప్రాచీనబౌద్ధపరంపర ననుసరించి 'సారము' ఆఱు (6) విధములు. శీలసారము, సమాధిసారము, ప్రజ్ఞాసారము, విముక్తిసారము, విముక్తిజ్ఞానదర్శనసారము, పరమార్థసారము. కాని, అనేక విద్వాంసులు 'సార' శబ్దమును సత్యమనియు 'అసార' శబ్దమును అసత్యమనియు వివరించినారు. మఱికొందఱు 'సారము'ను మూలభూతస్థిరవస్తువనియు వివరించినారు. దార్శనికదృష్టి (Metaphysical sense) ననుసరించి 'సార'మనగా చరమసత్త (Highest Reality). నైతిక దృష్టి (Moral sense)యందు సత్యమని మాక్స్ ముల్లర్ పండితుని వివరణము.

**సావత్థి (జేతవనము)** **నందథేరుడు**

13. **యథా అగారం దుచ్ఛన్నం, వుట్ఠీ[1] సమతివిజ్ఝతి ।**
**ఏవం అభావితం చిత్తం, రాగో సమతివిజ్ఝతి ॥ 13 ॥**

*(యథాఽగారం దుశ్ఛన్నం, వృష్టిః సమతివిధ్యతి ।*
*ఏవం అభావితం చిత్తం, రాగః సమతివిధ్యతి ॥ 13 ॥)*

ఇంటి పై కప్పు సరిగ లేనిచో, వర్ష(జల)ము (ఇంటి)లోనికి ప్రవేశించును. అట్లే అసంస్కృత (సంయమరహిత) చిత్తమున రాగము ప్రవేశించును.

14. **యథా అగారం సుచ్ఛన్నం, వుట్ఠీ న సమతివిజ్ఝతి ।**
**ఏవం సుభావితం[2] చిత్తం, రాగో న సమతివిజ్ఝతి ॥ 14 ॥**

*(యథాఽగారం సుచ్ఛన్నం, వృష్టిర్న సమతివిధ్యతి ।*
*ఏవం సుభావితం చిత్తం, రాగో న సమతివిధ్యతి ॥ 14 ॥)*

ఇంటి పై కప్పు సరిగనున్నచో వర్ష(జల)ము(ఇంటి)లోనికి ప్రవేశింపజాలదు. అట్లే సుసంస్కృత(సంయమయుక్త) చిత్తమున రాగము ప్రవేశింపజాలదు.

**రాజగృహము (వేళు(ణు)వనము** **చుందుడు (సూకరికుడు)**

15. **ఇధ సోచతి పెచ్చ సోచతి, పాపకారీ ఉభయత్థ సోచతి ।**
**సో సోచతి సో విహఞ్ఞతి, దిస్వా కమ్మకిలిట్ఠ మత్తనో ॥ 15 ॥**

*(ఇహ శోచతి ప్రేత్య శోచతి, పాపకారీ ఉభయత్ర శోచతి ।*
*స సోచతి స విహన్యతే, దృష్ట్వా కర్మ క్లిష్ట మాత్మనః ॥ 15 ॥)*

ఇహ పర(లోక)ముల రెంటను పాపకర్ముడు శోకించును. అతడు తన కుత్సిత కర్మముల గాంచి శోకించును, పీడితు డగును.

---

(1) వుట్ఠీ - పాఠాంతరము. సమ్ + అతి + విద్ = సమతి విధ్యతి - విద్ = తాడనే
(2) 'అభావిత' 'సుభావిత' శబ్దములకు విశిష్టపారిభాషికార్థములు బౌద్ధశాస్త్రములందు కలవు.

**సావత్థి (జేతవనము)** **ధమ్మికుడు (ఉపాసకుడు)**

16. **ఇధ మోదతి పెచ్చ మోదతి, కతపుఞ్ఞో ఉభయత్థ మోదతి ।**
**సో మోదతి సో పమోదతి, దిస్వా కమ్మవిసుద్ధి* మత్తనో ॥ 16 ॥**

*(ఇహ మోదతే ప్రేత్య మోదతే, కృతపుణ్య ఉభయత్ర మోదతే ।*
*స మోదతే స ప్రమోదతే, దృష్ట్వా కర్మవిశుద్ధి మాత్మనః ॥ 16 ॥*

ఇహ పర(లోక)ముల రెంటను పుణ్యకర్మములొనర్చువాడు ఆనందించును. అతడు తన కర్మవిశుద్ధిని గాంచి ముదితుడు, ప్రముదితుడునగును.

**సావత్థి (జేతవనము)** **దేవదత్తుడు**

17. **ఇధ తప్పతి పెచ్చ తప్పతి, పాపకారీ ఉభయత్థ తప్పతి ।**
**పాపం మే కతన్తి తప్పతి, భియ్యో[1] తప్పతి దుగ్గతిం[2] గతో ॥ 17 ॥**

*(ఇహ తప్యతి ప్రేత్య తప్యతి, పాపకారీ ఉభయత్ర తప్యతి ।*
*పాపం మయా కృతమితి తప్యతి, భూయస్తప్యతి దుర్గతిం గతః ॥ 17 ॥)*

పాపకర్ముడు ఇహపర(లోక)ముల రెంటను (జీవించినపుడును, మరణానంతరముననను) మిక్కిలి తపించును. నేను పాపమొనరించితినని సంతప్తుడగును. దుర్గతిని బొంది, మరల మరల దుఃఖమును బొందును.

**సావత్థి (జేతవనము)** **సుమనాదేవి**

18. **ఇధ నన్దతి పెచ్చ నన్దతి, కతపుఞ్ఞో ఉభయత్థ నన్దతి ।**
**పుఞ్ఞం మే కతన్తి నన్దతి, భియ్యో నన్దతి సుగతిం గతో ॥ 18 ॥**

---

* బుద్ధఘోషుడు 'విశుద్ధిమార్గము'ను రచించెను.

(1) భియ్యో; భియో – పాఠాంతరములు.

(2) దుగ్గతి (దుర్గతి) – దుఃఖస్థానములు నాల్గు :- 1 పశులోకము, 2 పిశాచ (ప్రేత) లోకము, 3 అసురలోకము, 4 నరక (నిరయ)ము. నరకము ఊహ కసాధ్యమగు దుఖానుభవమునకు, బాధానుభూతికి, సంకేతము. బౌద్ధమున నరకము నిత్యము కాదు. ఇదియు కర్మహేతుకమగు పరివర్తనాత్మకమగు అవస్థయే. సుగతి, దుర్గతి – ఇవి ఊర్ధ్వ, అధో లోకముల దెలుపు పారిభాషిక పదములు. కర్మానుగుణములు. స్వర్గనరకములని 'శాబ్టాల్' అనువదించెను.

(ఇహ నన్దతి ప్రేత్య నన్దతి, కృతపుణ్య ఉభయత్ర నన్దతి ।
పుణ్యం మయా కృతమితి నన్దతి, భూయో నన్దతి సుగతిం గతః ॥ 18 ।

ఇహమునను, మరణానంతరము పరమునను, రెంటను, పుణ్యమొనర్చువాడు ఆనందము బొందును. నేను పుణ్యము జేసితినని యానందించును; సుగతిని బొంది మరల మరల నానందించును.

**సావత్థి (జేతవనము) ఇద్దఱు సహాయక భిక్షువులు**

19 **బహుమ్పి చే సంహితం* భాసమానో, న తక్కరో హోతి నరో పమత్తో।**
**గోపోవ గావో గణయం పరేసం, న భాగవా సామఞ్ఞస్స హోతి ॥ 19 ॥**

*(బహ్వీమపి చేత్ సంహితాం భాషమాణో, న తత్కరో భవతి నరః ప్రమత్తః।*
*గోప ఇవ గా గణయన్ పరేషాం, న భాగవాన్ శ్రామణ్యస్య భవతి ॥ 19 ॥)*

అధికముగ సంహిత (త్రిపిటకము)లను ఉచ్చరించుచున్నను, ప్రమత్తుడగు నరుడు, వానిననుసరించి చరింపడు (అనుష్ఠింపడు). అట్టివాడు ఇతరుల

---

సుగతి :- ఆనంద స్థానములు నాల్గు :- (1) కామసుగతి (మానుషానందముల తోడి ఇహలోకము), (2) దేవతానందముల తోడి తుషితలోకము, (3) రూపసుగతి (సూక్ష్మరూపము గల బ్రహ్మదేవతల లోకము) (4) అరూపసుగతి (రూపరహితమగు బ్రహ్మదేవతల లోకము)

* సహితం – పాఠాంతరము. ఇది పాశ్చాత్య విద్వాంసులకు సమ్మతము. సంహితం :- పాళీ టీకాకారుననుసరించి సుసంగతమైన పాఠము. (... తే పిటకస్స బుద్ధ వచనస్సేతం నామం' – బుద్ధ వచన రూపమగు త్రిపిటకములకిది పేరని పాళీటీకా. (భదన్తబుద్ధఘోషుడు). 'సంహిత' అనగా వేదము. భారతదేశమున, సంహితా, ఆగమ శబ్దములు, అన్ని దర్శనములందును పవిత్ర గ్రంథములను సూచించును.

పోల్చు :- **'యథా ఖర శ్చన్దనభారవాహీ,**
**భారస్య వాహీ న తు చన్దనస్య ।**
**ఏవం హి శాస్త్రాణి బహూన్యధీత్య,**
**సారం త్వజానన్ ఖరవద్వహేత్ సః ।'** (ఉత్తరగీత – II-42)

శ్రీ గంధపు చెక్కలను మోయుచున్న గాడిద, చందన సారానుభూతిని పొందనట్లే, అనేక శాస్త్రముల చదివి వాని సారమగు పరమార్థము నెఱుగని వాడు గాడిద వలెనే భారము మాత్రము మోయువాడగుచున్నాడు.

గోవులను లెక్కపెట్టుకొను గొల్లని పోలును; శ్రామణ్య (సంన్యాస) ఫలభాగి కాజాలడు.

20. అప్పమ్పి చే సంహితం భాసమానో
ధమ్మస్స హోతి అనుధమ్మచారీ ।
రాగఞ్చ దోసఞ్చ పహాయ మోహం,
సమ్మప్పజానో సువిముత్తచిత్తో,
అనుపాదియానో[1] ఇధ వా హురం[2] వా
స భాగవా సామఞ్ఞస్స హోతి ॥20 ।

(అల్పా మపి చేత్ సంహితాం భాషమాణో,
ధర్మస్య భవత్యనుధర్మచారీ ।
రాగఞ్చ ద్వేషఞ్చ ప్రహాయ మోహం,
సమ్యక్ప్రజ్ఞానః సువిముక్తచిత్తః,

---

(1) అనుపాదియానో : నాల్గవ నిదామగు 'ఉపాదానము'నకు (Clinging to life; loving the World.) ఇది వ్యతిరేకపదము. ఉపాదానమే భవమునకు హేతువు.
అనుపాదియానో = భవహేతువగు రాగము లేనివాడు
పోల్చు :- 'యమ్హి న మాయా వసతీ న మానో,
యో వీతలోభో అమమో నిరాసో ।
పనుణ్ణకోధో అభినిబ్బుతత్తో,
యో బ్రాహ్మణో సోకమలం అహాసి ।
తథాగతో అరహతి పూరళాసం ।'

'నివేసనం యో మనసో అహాసి, పరిగ్గహా యస్స న సన్తి కేచి ।
అనుపాదియానో ఇధ వా హురం వా, తథాగతో అరహతి పూరళాసం ।'
(సుత్తనిపాతము-III-4-15,16.)
(ఎవనియందు మాయ (వంచన) గర్వము, లోభము, మమకారము (స్వార్థము), తృష్ణయులేవో, ఎవడు క్రోధరహితుడు, ఉపశాంతుడు, శోకమాలిన్యరహితుడైన బ్రాహ్మణుడో, అట్టి తథాగతుడు, హవ్యమునకు (పురోడాశము-యజ్ఞార్థమగు పిండి వంటకమునకు) అర్హుడు. ఎవని మనస్సు వాసనాదూరమో, ఎవడు పరిగ్రహరహితుడో, ఇహపరకాంక్షా అనాసక్తుడో, అట్టి తథాగతుడు హవ్యమున కర్హుడు.)
(2) 'హురం' శబ్దమునకు సంస్కృత రూపము లేదు. పాళీ వాఙ్మయమున దీనికి బహుళ ప్రయోగము కలదు.

అనుపాదాన[1] ఇహ వా పరత్ర వా[2]
స భాగవాన్ శ్రామణ్యస్య భవతి । 20 ।।

అల్పముగ సంహితల నుచ్చరించుచున్నను, తద్ధర్మనిష్ఠుడగువాడు, రాగద్వేషమోహరహితుడై సమ్యక్ప్రజ్ఞాశాలియై విముక్తచిత్తుడగును. అట్టి వానికి ఇహపరముల రెంటను ఆసక్తి యుండదు. శ్రామణ్య[3]ఫలభాగి ఆతడే.

## *1 యమక వగ్గో నమత్తో*

## యమకవర్గము సమాప్తము



---

(1) అనుపాదదాన - పాఠాంతరము

(2) వాఽముత్ర :- పాఠాంతరము

(3) 'శ్రమణ' శబ్దమునకు సంన్యాసి యని అర్థము. ఇది భారతీయదర్శనములకన్నిటికి సామాన్యము. వాల్మీకి రామాయణమున శబరి 'శ్రమణి' అని వర్ణింపబడినది. బుద్ధుడు మహాశ్రమణుడనియు చెప్పబడినది. మహాభారతమున సైతమీ అర్థముననే ఈ శబ్దము ప్రయుక్తము. 'ఆశ్రమః శ్రమణః' - అని విష్ణుసహస్ర నామస్తోత్రమున నిది భగవద్వాచకముగ నున్నది.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## అప్పమాదవగ్గో దుతియో

## (అప్రమాదవర్గో ద్వితీయః)

## 2 అప్రమాదవర్గము – ద్వితీయాధ్యాయము

కోసమ్బి (ఘోసితారామము) సామావతి రాణి

21. అప్పమాదో(1) అమతపదం,(2) పమాదో మచ్చునో పదం ।
అప్పమత్తా నమీయన్తి, యే పమత్తా యథామతా ॥ 1 ॥

---

(1) బౌద్ధశాస్త్రములందు 'పమాద' (ప్రమాద) శబ్దమొక పారిభాషికపదము. కుశలధర్మములన్నియు అప్రమాదమూలకములు (**'యే కేచి కుసలా ధమ్మా సబ్బే తే అప్పమాద మూలకా।**)

(2 ) అమత – (అమృత) శబ్దమున కర్థము 'నిర్వాణ'మని బుద్ధఘోషుని వివరణము. ఈ గాథ దీపవంశము (VI-53) నందును, మహావంశము నందును అశోక చక్రవర్తికి బోధించినట్లు చెప్పబడినది. అప్రమాదము, వీర్యము-(non- delay and diligent activity) రెండును ధర్మసాధనకు ప్రధానాంగములని బుద్ధుడు బోధించెను.

పోల్చు :- **'ఉభే సత్యే క్షత్రియాద్య ప్రవృత్తే
మోహో మృత్యుః సమ్మతో యః కవీనామ్ ।
ప్రమాదం వై మృత్యుపదం బ్రవీమి,
సదాఽ ప్రమాదమమృతత్వం బ్రవీమి ।**

(సనత్సుజాతీయము (మ. భా. ఉద్యోగ- II. 4)

(ప్రమాదము, మృత్యువునకు మార్గమనియు, అప్రమాదము, అమృతత్వము (మోక్షము)నకు మార్గమనియు, సనత్కుమారుడు ధృతరాష్ట్రునకు బోధించెను.)

*'ప్రమాద' శబ్దార్థము ఆలస్యమనియు కలదు.

*(అప్రమాదోఽ మృతపదం, ప్రమాదో మృత్యోః పదమ్ ।*
*అప్రమత్తా న మ్రియన్తే, యే ప్రమత్తా యథా మృతాః ॥ 1 ॥)*

అప్రమాదము (నిరంతర జాగరూకత – సావధానత) అమృతత్వమునకు (నిర్వాణమునకు) మార్గము. ప్రమాదము (అనవధానత) మృత్యువునకు మార్గము. అప్రమత్తులు మృతి బొందరు; ప్రమత్తులు మృతి బొందినవారే.

**22. ఏతం విసేసతో ఞత్వా, అప్పమాదమ్హి పణ్డితా ।**
**అప్పమాదే పమోదన్తి, అరియానం గోచరే రతా ॥ 2 ॥**

*(ఏతం విశేషతో జ్ఞాత్వా, అప్రమాదే పణ్డితాః ।*
*అప్రమాదే ప్రమోదన్త, ఆర్యాణాం గోచరే రతాః ॥ 2 ॥)*

పండితులు అప్రమాద విషయము యొక్క విశేషతను విశదముగ నెఱిగి, అందు ఆనందించుచు, ఆర్యుల జ్ఞానమున సంసక్తులగుచున్నారు (రమించుచున్నారు) (ఆర్యులు నిర్వాణపథగాములు). 37 'బోధిపక్షీయ' ధర్మముల జ్ఞానమును' గోచర శబ్దము సూచించుచున్నది.
(చూడు:- బుద్ధ దర్శనము (1962) పుట 207.)

**23. తే ఝాయినో సాతతికా, నిచ్చం దళ్హ[1]పరక్కమా ।**
**ఫుసన్తి ధీరా నిబ్బానం, యోగక్ఖేమం[2] అనుత్తరం ॥ 3 ॥**

---

**'సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యమ్' – (తై. ఉ. 1–20)**
**అప్రమాదగుణము, ఆధ్యాత్మతత్త్వమున ప్రవేశించుటకు ప్రథమద్వారము. '**
ప్రమాదము' తమోగుణమని భగవద్గీత పేర్కొనును.

**'అప్రకాశోఽప్రవృత్తి శ్చ, ప్రమాదో మోహ ఏవ చ**
**తమస్యేతాని జాయన్తే, వివృద్ధే, కురునన్దన ! ।** (భ.గీ. XIV - 23)

(1) 'డ' కారస్థానమున 'ళ' కారమును 'ఢ' కార స్థానమున 'ళహ' కారమును. ప్రాచీనవైదిక ఉచ్చారణరీతి యందును కలదు.

**'అజ్మధ్యస్థ 'డ' కారస్య 'ళ' కారం బహ్వృచో జగుః ।**
**అజ్మధ్యస్థ 'ఢ' కారస్య 'ళ హ' కారం వై యథాక్రమమ్'**
ఉదా :- 'అగ్నిమీళే పురోహితమ్ ।' (ఋ. సం. I.1.1)
'పృథివీ చ దృళ్హా' ।(ఋ.స. 10–121–5)

(2) యోగక్షేమము :- ఆధ్యాత్మికసంపద
'శ్రేయో మన్దో యోగక్షేమాద్ వృణీతే ।(కఠ. ఉ.)
'తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్ । (భ.గీ. IX – 22)

(తే ధ్యాయినః సాతతికా, నిత్యం దృఢ పరాక్రమాః ।
స్పృశన్తి ధీరా నిర్వాణం, యోగక్షేమ మనుత్తరమ్ । 3 ।)

నిరంతరధ్యానరతులును, నిత్యము దృఢపరాక్రమశాలులునగు ధీరులు, అనుపమము యోగక్షేమ స్వరూపమునగు నిర్వాణమును ప్రాపించు చున్నారు. (నిర్వాణ మిందు యోగక్షేమరూపమని వర్ణింపబడినది. దీని వలన, నిర్వాణము శూన్యము (annihilation of life) అను దుర్వాదము నిరస్తము.)

**రాజగృహము (వేళు(ణు)వనము)** **కుంభఘోసకుడు**

**24. ఉట్ఠానవతో సతిమతో[1], సుచికమ్మస్స నిసమ్మకారినో ।
సఞ్ఞతస్స చ ధమ్మజీవినో, అప్పమత్తస్స యసోఽ భివడ్ఢతి । 4 ।**

(ఉత్థానవతః స్మృతిమతః, శుచికర్మణో నిశమ్యకారిణః ।
సంయతస్య చ ధర్మజీవినో, ఽప్రమత్తస్య యశోఽభివర్ధతే ।4 ।)

ప్రయత్న (ఉద్యోగ) శాలియు, స్మృతిమంతుడును, పరిశుద్ధవర్తనుడును, చిరకారియు, సంయమశాలియు, ధార్మికజీవనుడును అప్రమత్తుడునగు మానవుని యశము వర్ధిల్లును.

**రాజగృహము (వేణు(ళు)వనము** **చూళపంథకథేరుడు**

**25. ఉట్ఠానేనప్పమాదేన, సంయమేన దమేన చ
దీపం[2]కయిరాథ మేధావీ, యం ఓఘోనాభికీరతి । 5 ।**

(ఉత్థానేనాఽ ప్రమాదేన, సంయమేన దమేన చ ।
ద్వీపం కుర్వీత మేధావీ, యమోఘో నాఽభికిరతి । 5 ।)

---

(1) సతిమతో – బ్రహ్మదేశీయపాఠాంతరము.

(2) దీపం :- ద్వీపము :- ఔపచారిక (సాలంకార) వర్ణనము. ఇది భద్రస్థితికి ఉపలక్షణము. చుట్టునున్న పల్లపునేల ప్రవాహజలములలో మునిగిపోయినను, ద్వీపభాగమునకు జలములు చేరజాలవు. కాన, ఇది, అట్టి జలసంప్లవవిపత్తులందు, జనుల కాశ్రయము కాగలదు. అట్లే మేధావియగు సత్పురుషుడు అప్రమాదాది గుణాభ్యాసమున, కామ, భవ, మిథ్యాదృష్టి, అవిద్యలను ప్రవాహవేగము లాక్రమింపజాలని భద్రభూమికా (అర్హత్త్వఫల) రూపమగు ద్వీపమును నిర్మించుకోగలడు.

ప్రయత్నము, అప్రమాదము, సంయమము, దమము - వీని ద్వారా, మేధావి యగు పురుషుడు, జల ప్రవాహములకు చెదరని ద్వీపమును నిర్మించుకొనుగాక!

**సావత్థి (జేతవనము)** **బాలనక్ఖత ఘుట్ట (హెూలీ)**

26. **పమాద మనుయుఞ్జన్తి, బాలా దుమ్మేధినో జనా ।**
**అప్పమాదఞ్చ మేధావీ, ధనం సెట్ఠం'వ రక్ఖతి ॥ 6 ॥**

*(ప్రమాద మనుయుఞ్జన్తి, బాలా దుర్మేధసో జనాః ।*
*అప్రమాదఞ్చ మేధావీ, ధనం శ్రేష్ఠ మివ రక్షతి ॥ 6 ॥)*

మూర్ఖులు దుర్బుద్ధులునగు జనులు, ప్రమాదము ననుసరింతురు. బుద్ధిశాలియగువాడు, అప్రమాదమును శ్రేష్ఠమగు సంపదను వలె రక్షించుకొనును.

27. **మా పమాద మనుయుఞ్జేథ, మా కామరతి సన్థవం ।**
**అప్పమత్తో హి ఝాయన్తో, పప్పోతి విపులం సుఖం ॥ 7 ॥**

*(మా ప్రమాద మనుయుఞ్జీత, మా కామరతిసంస్తవమ్ ।*
*అప్రమత్తో హి ధ్యాయన్, ప్రాప్నోతి విపులం సుఖమ్ ॥ 7 ॥)*

ప్రమాదమును, విషయాసక్తిని అనుసరింపగూడదు. అప్రమత్తుడై ధ్యానించువాడు, విపులసుఖమును పొందును.

**సావత్థి (జేతవనము)** **మహాకస్సపథేరుడు**

28. **పమాదం అప్పమాదేన, యదా నుదతి పణ్డితో ।**
**పఞ్ఞాపాసాద[1] మారుయ్హ అసోకో సోకినం పజం ।**
**పబ్బతట్ఠోవ భుమ్మట్ఠే[2] ధీరో బాలే అవెక్ఖతి ॥ 8 ॥**

---

(1) పోల్చు :- **ప్రజ్ఞాప్రాసాద మారుహ్య, అశోచ్యః శోచతో జనాన్ ।**
**భూమిష్ఠానివ శైలస్థః, సర్వాన్ ప్రాజ్ఞోఽను పశ్యతి ।**
(పాతఞ్జల యోగ దర్శనము 1-47. వ్యాసభాష్యము)

(2) భూమట్ఠే - బ్ర.దే. పా.

*(ప్రమాద మప్రమాదేన, యదా నుదతి పణ్డితః ।
ప్రజ్ఞాప్రాసాద మారుహ్య, హ్యశోకః, శోకినీం ప్రజామ్।
పర్వతస్థ ఇవ భూమిస్థాన్, ధీరో బాలా నవేక్షతే । 8 ।)*

అప్రమాదముచే ప్రమాదమును దూరముగ విసర్జించిన పండితుడు, దుఃఖరహితుడై ప్రజ్ఞాప్రాసాదము నారోహించి, దుఃఖితులు మూర్ఖులునగు ప్రజలను శైల శిఖరమున నుండువాడు, క్రింద భూమిపై నుండు వారిని గాంచునట్లు గాంచుచున్నాడు.

**సావత్థి (జేతవనము)** **ఇద్దరు మిత్రభిక్షువులు**

29. **అప్పమత్తో పమత్తేసు, సుత్తేసు[1] బహుజాగరో ।
అబలస్సం వ సీఘస్సో, హిత్వా యాతి సుమేధసో । 9 ।**

*(అప్రమత్తః ప్రమత్తేషు, సుప్తేషు బహుజాగరః ।
అబలాశ్వమివ శీఘ్రాశ్వో, హిత్వా యాతి సుమేధాః । 9 ।)*

ప్రమత్తులయందు అప్రమత్తుడై, నిద్రితులలో వినిద్రుడై, (జాగరితుడై) యుండు సద్బుద్ధిశాలియగు పురుషుడు, దుర్బలాశ్వము నతిక్రమించి వెళ్లు శీఘ్రాశ్వము (పందెపు గుఱ్ఱము) వలె పురోగమించును.

**వేసాలి (కూటాగారసాల)** **మహాలి**

30. **అప్పమాదేన మఘవా, దేవానం సెట్ఠతం గతో ।
అప్పమాదం పసంసన్తి, పమాదో గరహితో సదా । 10 ।**

*(అప్రమాదేన మఘవా, దేవానాం శ్రేష్ఠతాం గతః ।
అప్రమాదం ప్రశంసన్తి, ప్రమాదో గర్హితః సదా । 10 ।)*

---

(1) పోల్చు :- **"యా నిశా సర్వభూతానాం, తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని, సా నిశా పశ్యతో మునేః ।।"** (భ.గీ.II.69)
(జనులకు నేది రాత్రియో, దానియందు స్థితప్రజ్ఞుడు (జ్ఞాని), మేల్కొని యుండును. సర్వప్రాణులు మేల్కొను సమయమే జ్ఞానికి రాత్రిగ దోచును.)

అప్రమాద గుణముచే ఇంద్రుడు, దేవతలలో శ్రేష్ఠత్వము పొందెను. అప్రమాదము నందఱు ప్రశంసింతురు. ప్రమాద మెపుడును నింద్యమే. (బుద్ధుడు దేవతలను దేవలోకములను నిరాకరించెనను దుర్వాదము దీని వలన నిరస్తమైనది.)

**సావత్థి (జేతవనము)** **ఒకానొక భిక్షువు**

31. **అప్పమాదరతో భిక్ఖు, పమాదే భయదస్సి వా ।**
**సంయోజనం[1] అణుం థూలం, డహం[2] అగ్గీ వ గచ్ఛతి ॥ 11 ॥**

*(అప్రమాదరతో భిక్షుః, ప్రమాదే భయదర్శీ వా ।*
*సంయోజన మణుం స్థూలం, దహన్ అగ్ని రివ గచ్ఛతి ॥ 11 ॥)*

అప్రమాదమున ఆనందించు (రతుడగు) భిక్షువు ప్రమాదమున భయము గాంచువాడై, సూక్ష్మములు, స్థూలములునైన బంధము[3]లను అగ్ని వలె దహించి వైచి, పురోగమించును.

---

(1) సఞ్ఞోజనం – సిం.దే. పాఠాంతరము

(2) సహం – పాజ్‌బాల్ మహాశయుని పాఠము.

(3) సంయోజనములు(బంధములు) దశవిధములు. (fetters) అవి :-
(1) సక్కాయదిట్ఠి (ఆత్మను గూర్చిన భ్రాంతి దర్శనము - Self - illusion) – స్కంధజన్యమైన అహమును ఆత్మగా భావించుట) (2) విచికిచ్చా (ధర్మమును గుఱించిన (doubt)సంశయము) (3) సీలబ్బత పరామాస (కర్మకాండను గూర్చిన మూఢవిశ్వాసము – ఆచారము లందాసక్తి - clinging to rites and rituals) (4) కామతణ్హా (విషయరక్తి - Sense desires) (5) పటిఘ (వ్యాపాదము, ద్వేషము - hatred) (6) రూపతణ్హా (రూపసహితఇహలోకజీవనరాగము - Attachment to realms of form) (7) అరూపతణ్హా (Attachment to formless realms –రూపరహిత సూక్ష్మలోక జీవనాసక్తి) (8) మానము (దర్పము- conceit) (9) ఉద్ధచ్చము (దంభము, అశాంతి –Restlessness) (10) అవిజ్జా – (అవిద్య, అజ్ఞానము Ignorance) చూడు :- డా॥ రత్నాకరం బాలరాజు–బౌద్ధయుగము Vol. I - పుట 68.

**సావత్థి (జేతవనము) (నిగమవాసి) తిస్సథేరుడు**

**32. అప్పమాదరతో భిక్ఖు, పమాదే భయదస్సి వా ।**
**అభబ్బో పరిహానాయ, నిబ్బానస్సేవ సన్తికే ॥ 12 ॥**

*(అప్రమాదరతో భిక్షుః, ప్రమాదే భయదర్శీ వా ।*
*అభవ్యః పరిహాణాయ, నిర్వాణస్యైవాన్తికే ॥ 12 ॥)*

అప్రమాదమున నానందించు భిక్షువు ప్రమాదమున భయము గాంచువాడై పతనార్హుడు కాడు; (పతనము అసంభవము) అతడు నిర్వాణమునకు సమీపవర్తి.

***2 అప్పమాదవగ్గో సమత్తో***

**అప్రమాదవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## చిత్తవగ్గో తతీయో

## (చిత్తవర్గ స్తృతీయః)

## 3 చిత్తవర్గము – తృతీయాధ్యాయము

**చాలికాయపర్వతము** [1] **మేఘియథేరుడు**

**33. ఫన్దనం చపలం చిత్తం, దురక్ఖం[2] దున్నివారయం[3] ।**
**ఉజుం[4] కరోతి మేధావీ, ఉసుకారో' వ తేజనం ॥ 1 ॥**

*(స్పన్దనం చపలం చిత్తం, దూర్రక్ష్యం దుర్నివార్యమ్ ।*
*ఋజుం కరోతి మేధావీ, ఇషుకార ఇవతేజనమ్ ॥ 1 ॥)*

శరకారుడు (బాణముల తయారు చేయువాడు) శరమునకు నిశితత్వమును – వాడిని – సమకూర్చునట్లు బుద్ధిశాలియగు మనుజుడు, చంచలమును, చపలమును, రక్షించుటకు కాని, నిగ్రహించుటకు కాని, దుస్సాధమునైన చిత్తమును ఋజువుగ నొనర్చును.

---

(1) వాలిక పబ్బత –సింహళీయ పాఠము. (2) దూరక్ఖం–బ్ర.దే. పాఠము
(3) పోల్చు :- "అసంశయం మహాబాహో, మనోదుర్నిగ్రహంచలమ్ " (గీత VI- 35)
(4) ఉజు : = ఋజు. సంస్కృతమందలి ఋకారమునకు ఉకారము సాధారణముగా ఆదేశమగును. 'ఉదృత్వాదిషు' – (ప్రాకృత ప్రకాశము I. 29) అట్లే, వృష్టి = వుట్ఠి, ఋషభః = ఉసభో, ఇత్యాదులు.

**34. <u>వారిజో వ థలే ఖిత్తో</u>, ఓకమోకత ఉబ్భతో[1] ।**
**పరిఫన్దతిదం[2] చిత్తం, మారధేయ్యం పహాతవే [3] । 2 ।**

*(<u>వారిజ ఇవ స్థలే క్షిప్త</u>, ఉదకస్యాకత ఉద్భృతః ।*
*పరిస్పన్దత ఇదం చిత్తం, మారధేయం ప్రహాతుమ్ । 2 ।)*

జలాశయము నుంచి వేఱు చేసి, నేలపై విసరివేసిన మత్స్యమెట్లు కొట్టుకొనునో, అట్లే మారుని బంధము నుండి విముక్తమగుటకు చిత్తము తల్లడిల్లును. (మిక్కిలి కంపించును).[4]

---

(1) వారిజము = చేప. 'ఓకమోకత' పదమునకు సంస్కృతచ్ఛాయ 'ఉదకౌకతః' లేక, 'ఉదకస్యాకతః' అని రాహులసాంకృత్యాయనాది మహాపండితులు వ్రాసినారు; 'ఓక' శబ్దము ఉదక శబ్దమునకు పాళీరూపమని భావించినారు. మాక్సుముల్లర్, రాధాకృష్ణన్ ఆదిగా గల విద్వాంసులందఱు దీనికి జలమని అర్థము వ్రాసినారు. ఒక అర్వాచీన అభిధానకోశమున 'ఓక' శబ్దమునకు జలమని అర్థమున్నది. 'ఉదక' శబ్దము సంకోచమందుటచే, 'ఓక' శబ్దముగ నిష్పన్నమైనదని భాషా శాస్త్రవేత్త గ్రియర్‌సన్ ప్రతిపాదించినాడు. ఈ భావములన్నియు భదంత బుద్ధఘోషుని భ్రమాత్మక వ్యాఖ్యానముపై ఆధారపడినవి. ఈ గాథను వ్యాఖ్యానించుచు భదంత బుద్ధఘోషుడు, 'ఓక' శబ్దమునకు జలమని అర్థము వ్రాసి, దానికి ప్రమాణము వినయపిటకము నుండి ఉదాహరించినాడు. వినయపిటకము నుండి ఉదాహరించిన పాఠము సందేహాస్పదము; ఇది తప్ప పాళీవాఙ్మయమున జలమను అర్థమున 'ఓక' శబ్ద ప్రయోగము మృగ్యము. (చూడు : ధమ్మపదం - శ్రీ కంఛేదీలాల్ గుప్త -చౌకాం బా, వారణాసి - 1968) ప్రస్తుత గాథ యందు జలమను నర్థమున 'ఓకమ్' అను ద్వితీయావిభక్తి అన్వయము మఱింత దుర్ఘటము. కాన, 'ఓకతః' = జలమయ నివాస స్థానమునుండి, ఓకమ్ ఉబ్భతో = గృహమునకు ఉద్భృతమైన , వారిజో = మత్స్యము అని అర్థమును గ్రహించుట సమంజసమనిపించును "ఓక స్సద్మాఽఽశ్రయశ్చౌకః" - అమరకోశము. ఓకః (గృహము) అని అకారాంత పుంలింగము కలదు.

(2) పరిఫన్దతి + ఇదం = పరిఫన్దతిదం. స్వరవర్ణమునకు స్వరవర్ణము పరమైనచో పూర్వస్వరములోపించును. 'సరా సరే లోపం' - (కచ్చాయనుడు).

(3) పహాతవే = ప్రహాతుమ్. తొలగించుటకు . సంస్కృత తుమన్త స్థానమున - 'తుమ్' ప్రత్యయ స్థానమున పాళీ భాషయందు 'తుం' 'తాయే', 'తవే' - అను ఈ మూడు ప్రత్యయములు వచ్చును. సూత్రము = (తుం, తాయే, తవే, భావే భవిస్సతి క్రియాయం తదత్థాయం - మొగ్గల్లానుడు) -

(4) కామ, రూప, అరూప, లోకములు, మారుని రాజ్యమునకు చెందినవి. చిరకాలమీ లోకవాసనాబద్ధులగువారు, పూర్తిగ ఆలోకరీతులతో తాదాత్మ్యమంది యుండుటచే, లోకోత్తరమార్గప్రాప్తిద్వారా మారబంధముల ఛేదించుటకు పూనుకొన్నపుడు చిత్తము నీట నుండి బయటపడిన చేప వలె, వ్యాకులమై కంపించును; తల్లడిల్లును. - ఆచార్య బుద్ధరక్షితథేరుని వివరణము.

**సావత్థి (జేతవనము)** **ఒకానొక భిక్షువు**

35. **దున్నిగ్గహస్స లహునో, యత్థకామనిపాతినో ।**
**చిత్తస్స దమథో సాధు, చిత్తం దన్తం [1] సుఖావహం ॥ 3 ॥**

*(దుర్నిగ్రహస్య లఘునో, యత్రకామనిపాతినః ।*
*చిత్తస్య దమథః [2] సాధు, చిత్తం దాన్తం సుఖావహమ్ ॥ 3 ॥)*

నిగ్రహించుటకు కష్టసాధ్యము, శీఘ్రగామియు, తలచిన చోటికి పరువెత్తునదియు - ఇష్టానుసారము విషయముల గ్రహించునదియునైన చిత్తము యొక్క నిగ్రహము పరమయోగ్యము. -(ఉత్తమోత్తమము). నిగ్రహింపబడిన చిత్తము సుఖప్రదము.

**సావత్థి (జేతవనము)** **ఉత్కంఠితుడగు ఒకానొక భిక్షువు**

36. **సుదుద్దసం సునిపుణం, యత్థకామనిపాతినం ।**
**చిత్తం రక్ఖేథ మేధావీ, చిత్తం గుత్తం సుఖావహం ॥ 4 ॥**

*(సుదుర్దర్శం సునిపుణం, యత్రకామనిపాతి ।*
*చిత్తం రక్షేన్మేధావీ, చిత్తం గుప్తం సుఖావహమ్ ॥ 4 ॥)*

అవలోకించుటకు (గ్రహించుటకు) మిగుల కష్టమైనదియు, అత్యంత సూక్ష్మము (చతురము) ఇచ్ఛానుసారము పరిభ్రమించునదియునైన చిత్తమును బుద్ధిమంతుడు పరిరక్షించుకొనవలెను. పరిరక్షితమైన (నిగ్రహింపబడిన) చిత్తము, సుఖము గల్గించును.

---

(1) దన్తం = దాన్తమ్. పాళీ భాష యందును, ప్రాకృతభాషయందును సంయుక్తాక్షరమునకు పూర్వమున దీర్ఘాచ్చులేకుండుట సాధారణము. దీర్ఘము హ్రస్వమగును.

(2) పాళీ 'దమథో' పదమునకు సంస్కృతచ్ఛాయ యందు 'దమయతః' అని షష్ఠీవిభక్త్యంతపదము చారుచంద్ర పండితుడును, 'దమనం' అని రాహులసాంకృత్యాయనుడును వ్రాసినారు. కాని ఈ రెండును సరికావు. 'దమథ' శబ్దము సంస్కృత నిఘంటు ప్రసిద్ధము. **'దాన్తిస్తు దమథో దమః'** -(అమర కోశము III. 2-3) **'దమథస్తు పుమాన్దండే దమే చ పరికీర్తితః ।'**(మేదినీకోశము- థాన్త వర్గము - 19)

**సావత్థి (జేతవనము)** **సంఘరక్షితథేరుడు**

**37. దూరఙ్గమం ఏకచరం, అసరీరం గుహాసయం ।**
**యే చిత్తం సఞ్ఞమెస్సన్తి[(1)], మొక్ఖన్తి మారబన్ధనా । 5 ।**

*(దూరఙ్గమ మేకచర మశరీరం గుహాశయమ్ ।*
*యే చిత్తం సంయంస్యన్తి, మోక్ష్యన్తే (ముచ్య్యన్తే) మారబన్ధనాత్ । 5 ।)*

దూరగామియు, ఏకాంతముగ చరించునదియు, రూపము లేనిదియు, హృదయ గుహయందు నివసించునదియునైన చిత్తమును నిగ్రహించువారు, మార (మృత్యు) బంధము నుండి విముక్తులు కాగలరు.

**సావత్థి (జేతవనము)** **చిత్తహత్థథేరుడు**

**38. అనవట్ఠితచిత్తస్స, సద్ధమ్మం అవిజానతో ।**
**పరిప్లవ[(2)]పసాదస్స, పఞ్ఞా న పరిపూరతి । 6 ।**

*(అనవస్థితచిత్తస్య, సద్ధర్మ మవిజానతః ।*
*పరిప్లవప్రసాదస్య, ప్రజ్ఞా న పరిపూర్యతే । 6 ।)*

చల (అస్థిర) చిత్తుడు, సద్ధర్మమెఱుగనివాడు, చిత్తప్రసన్నతా (శాంతి) రహితుడునైన వానికి, ప్రజ్ఞాపరిపూర్ణత సిద్ధింపదు.

**39. అనవస్సుత చిత్తస్స,[(3)] అనన్వాహతచేతసో ।**
**పుఞ్ఞపాపపహీనస్స నత్థి జాగరతో భయం । 7 ।**

---

(1) సంయమేస్సన్తి - పాఠాంతరము

(2) పరిబ్బవ - పాఠాంతరము

(3) 'అనవస్సుత' పదమునకు సంస్కృత రూపము 'అనవస్రుత'ము. మ్యాక్సుముల్లర్ పండితుననుసరించి ఈ శబ్దము 'అనవశ్రుత'ము. అనగా, ఈ శబ్ద మూలము 'శ్రు' (శ్రు) ధాతువు. 'శ్రు' (శ్రు) ధాతువునకు 'గతి' యను నర్థము కూడగలదు. ప్రచలితపాణినీయధాతుపాఠమునననుసరించి శ్రు (శ్రు) ధాత్వర్థము శ్రవణము. (శ్రు (శ్రు) శ్రవణే - ధాతు 942). కాని, 'క్షీరతరంగిణీ' టీక యందు 'శ్రు' గతౌ' అను పాఠము కూడ కలదు.

'స్రు' (సర్) ధాతువునకు కూడ గత్యర్థమున్నది. ('స్రు' గతౌ - ధాతు 940). బౌద్ధ పరిభాషయందలి 'ఆసవ' శబ్దము ఆస్రవ శబ్ద జన్యమనుట యందు విప్రతి పత్తి లేదు.

(అనవస్సుత (స్సుత) చిత్తస్య, అనన్వాహతచేతసః ।
పుణ్యపాపప్రహీణస్య,[1] నాస్తి జాగ్రతో భయమ్ । 7 ।)

ఎవని చిత్తము తృష్ణాదిమలరహితమో, అక్షుభితమో (అకంపితమో) ఎవడు పుణ్యపాపరహితుడో, అప్రమత్తుడో (జాగరూకుడో) అట్టి వానికి భయము లేదు. (అభయత్వసిద్ధి నతడు పొందును).

---

'లలిత విస్తరము'న '**శుష్కా ఆశ్రవా న పునః శ్రవన్తి** (అధ్యాయము 12) అని యున్నది. కాన, గత్యర్థకములైన స్రు (స్రు) శ్రు (శ్రు) ధాతువులు రెండును ఒకే ప్రాచీన ధాతువు యొక్క రూప భేదములుగ గ్రహింపవచ్చును. ('ఆశ్రవ' A stream, River; See 'ఆస్రవ' also Sankrit - English Dictionary' - Vaman Shivaram Apte).

బౌద్ధగ్రంథములందు 'ఆసవ' శబ్ద మధికముగ ప్రయుక్తమైయున్నది. దీని యర్థము 'వాసన'- (విషయసుఖాభిగమము-). తృష్ణాదిజనితచిత్తమలము. పురుషుని బాహ్యార్థములవైపునకు ప్రేరేపించునది 'ఆస్రవము'. ('ఆస్రవయతి పురుషమ్') విషయాళి కగు మనస్సు యొక్క మిథ్యా ప్రవృత్తిని నిరోధింపవలెను. కాన 'అనవస్సుత' (అనవస్రుత, లేక, 'అనవశ్రుత') - శబ్దమునకు తృష్ణాదిచిత్తమలరహితమని అర్థము. 'లలితవిస్తరము'న బుద్ధుడు 'క్షీణాశ్రవుడ'ని వర్ణింపబడినాడు. 'మహాపరినిబ్బాన సుత్తము'న 'కామాసవ' 'భవాసవ' (దిట్ఠాసవ) 'అవిజ్జాసవ'ములని త్రివిధ చిత్తమలములు చెప్పబడినవి. మఱియు పోల్చు :-

**"ఇంద్రియాణాం తు సర్వేషాం యదేకం క్షరతీంద్రియమ్ ।**
**తేనాఽస్య క్షరతి ప్రజ్ఞా, దృతేః పాదాదివోదకమ్ ।"** (మనుస్మృతి 22-99)

క్షరణము (క్షర్-ప్రవహించుట) ఆస్రవము - ఈ రెండు శబ్దములు సమానార్థకములు. ఇంద్రియములను బాహ్యార్థములవైపు ప్రవహింపజేయునది - ప్రవహించునది - ఆస్రవము - క్షరణము. ఇంద్రియములన్నిటియందును, ఒక ఇంద్రియము **విషయ ప్రవణమైనచో**, అట్టి విషయపరునకు, ఇతరేంద్రియముల ద్వారమున సైతము, ప్రజ్ఞ (తత్త్వజ్ఞానము) స్రవించి (చలించి) పోవును. స్థిరతను పొందదు. తోలుతిత్తి (దృతి)కి, చిన్నరంధ్రము పడినచో అందలి జలమంతయు స్రవించి (కాఱి) పోవును కదా! అనవస్రుత చిత్తమే ప్రజ్ఞాపరిపూర్ణతకు లక్షణము.

(1) పరమగతిని పొంది పరిపూర్ణచిత్తపరిణతి పొందిన అర్హంతుని (జీవన్ముక్తుని) ఇది నిర్దేశించుచున్నది. అర్హంతుని మనస్సు, కర్మజనకములైన సంకల్ప ప్రవృత్తుల కతీతము. ఇది కేవల మనాసక్తస్థితి. అర్హంతుని చిత్తము 'కిరియచిత్తమ'ని (functional consciousness) చెప్పబడినది. కుశలాఽకుశల కర్మములు సుఖదుఃఖఫలదాయకములు. అర్హంతుని చిత్తము కర్మఫలవిముక్తము. ఉపదేశార్థమై తన సన్నిధికి వచ్చిన శ్రావస్తీవాసినులగు బ్రాహ్మణమహిళలకు బుద్ధ భగవానుడిట్లుపదేశించెను. "శుభాఽశుభకర్మ ఫలములగు సుఖ దుఃఖములు (స్వర్గ సుఖములు, మర్త్యలోక సుఖములు, దుఃఖములు) రెంటిని పరిహరింపవలెను". (చూడు: గాథ - 39 ఎస్. రాధాకృష్ణన్ - ధమ్మపదము)

**సావత్థి (జేతవనము)** **వివస్స(శ్య)క భిక్షువులు**

**40. కుమ్భూపమం కాయ మిమం విదిత్వా ।**
**నగరూపమం చిత్తమిదం ఠపెత్వా ।**
**యోధేథ మారం పఞ్ఞాయు(వు)ధేన ।**
***జితఞ్చ రక్ఖే అనివేసనో[1] సియా । 8 ।**

*(కుమ్భోపమం కాయమిమం విదిత్వా ।*
*నగరోపమం చిత్తమిదం స్థాపయిత్వా ।*
*యుధ్యేత మారం ప్రజ్ఞాయుధేన ।*
*జితఞ్చ రక్షేదనివేశనః స్యాత్ । 8 ।)*

శరీరము మట్టి కుండవలె క్షణభంగుర మని యెఱిగి చిత్తమును నగరదుర్గము వలె సురక్షిత మొనరించి, ప్రజ్ఞ (పరమజ్ఞానము) అను ఆయుధము దాల్చి, మారునితో పోరవలెను. వాని నుండి జయించుకొన్న వానిని రక్షించుకోవలెను; అనాసక్తుడు కావలెను.

---

(1) 'అనివేసన' (అనివేశన) శబ్దమునకు గృహరహితుడు - అనికేతుడు. అని వాచ్యార్థము.
పోల్చు :- '**అనికేతః స్థిరమతిః**' (భ.గీ. XII-19). గృహ భార్యా పుత్రాదికముపై ఆసక్తిరహితుడు, విరక్తుడునగు సంన్యాసి యని భావము. మ్యాక్సుముల్లర్ పండితుననుసరించి ఈ అర్థమిట పొసగదు. '**అనివేసనోసియా**' - మారునితో యుద్ధమొనరించునపుడు 'ఉపవేశనము' (విశ్రాంతి) పరిత్యజింపవలెను. అనగా, అప్రమత్తుడై మారునితో యుద్ధమొనరింపవలెనని భావము. వ్యామోహము లేపుడైన పైకొనవచ్చును. కాన, ప్రమత్తతకు చోటు నీయకూడదు.

* **జితమ్ - జయింపబడినది - రూప, అరూప, లోకములకు సంబంధించిన ధ్యానములు; ఇవే జితములు. ఈ లోకముల యెడ ఆసక్తి, తృష్ణాప్రవృత్తికి, (సూక్ష్మరూపముననైనను) అనుమతి కాగలదు. (చూడు : ఆచార్యబుద్ధరక్షితథేరుడు -ధమ్మపద. III 40)**

సావత్థి (జేతవనము) పూతిగత్త తిస్సథేరుడు

41. అచిరం వతయం కాయో, పథవిం అధిసెస్సతి।
ఛుడ్డో అపేతవిఞ్ఞాణో, నిరత్థంవ కళిఙ్గరం[1] । 9 ।

(అచిరం బతాఽయం కాయః, పృథివీ మధిశేష్యతే ।
క్షుద్రోఽపేత విజ్ఞానో, నిరర్థమివ కళిఙ్గరమ్ । 9 ।)

అయ్యో! ఈ తుచ్ఛశరీరము స్వల్పకాలముననే చేతనారహితమై నిరర్థక కాష్ఠ ఖండము వలె భూమిపై పడిపోవుచున్నది.

కోసలజనపదము నన్దగోపాలకుడు

42. దిసో దిసం యం తం కయిరా, వేరీ వా పన వేరినం ।
మిచ్ఛాపణిహితం చిత్తం[2], పాపియో నం తతో కరే । 10 ।

---

(1) పాళీ భాషలోని ఈ 'కళిఙ్గర' శబ్దమునకు సంస్కృత రూపము అనిశ్చితము. రైస్‌డేవిడ్సు పండితుడు, 'కడఙ్కర' 'కడఙ్గర' (straw, గడ్డి, పొల్లు, పొట్టు) శబ్దములన్నాడు. బుద్ధఘోషుడు 'కట్ఠఖణ్డ' (కాష్ఠఖండ)మని అర్థమొనరించెను. కాని, సంస్కృత, 'అఙ్గార' శబ్దము ఏదో మఱొక పాళీ శబ్దముతో సమసించి 'కలఙ్గర' రూపము పొంది యుండవచ్చునని కొందఱు పండితుల భావము. ఇది సంస్కృతమందలి 'కలఙ్కర' శబ్దము (Whirl-pool, eddy - ఆవర్తము, నీటి సుడి, జలభ్రమ) కావచ్చును.

(2) దశవిధములైన అకుశలకర్మముల యెడ ప్రసక్తమైన చిత్తము '**మిచ్ఛాపణిహితం చిత్తం**' - అవి (1) హింస, (2) చౌర్యము, (3) వ్యభిచారము (కాయకమ్మము); (4) అసత్యభాషణము, (5) పైశున్యము (6) పరుషవచనము, (7) వ్యర్థప్రలాపము, (వాచికమ్మము) (8) లోభము, (9) మాత్సర్యము, (10) మిథ్యావిశ్వాసము. (మనోకమ్మము).

**సమ్మాపణిహితం చిత్తం** = దశవిధ కుశల కర్మములయెడ ప్రసక్తమైన చిత్తము.

**కాయకమ్మము** :- (1) అహింస, (2) అస్తేయము, (3) బ్రహ్మచర్యము, లేక, (అక్రమస్త్రీ సంబంధరాహిత్యము).

**వాచికమ్మము** :- (4) సత్యభాషణము, (5) అపైశున్యము, (6) మృదుభాషణము (7) వ్యర్థప్రలాపరాహిత్యము.

**మనోకమ్మము** :- (8) లోభరాహిత్యము (9) నిర్మత్సరము (10) సమ్యగ్దృష్టి (చూడు: గాథ 87- పాద టీక)

*(ద్విట్ ద్విషం యత్ కుర్యాద్, వైరీ వా పునర్వైరిణమ్ ।
మిథ్యాప్రణిహితం చిత్తం, పాపీయాంసమేనం తతః కుర్యాత్ ॥ 10 ॥)*

శత్రువు శత్రువునకు, ద్వేషి ద్వేషికి, ఏమేమి చేయగలడో, అంతకంటె నధికముగ, కుమార్గనియుక్తమగు చిత్తము మనకు హాని చేయగలదు.

**సావత్థి (జేతవనము)** **సోరయ్యసెట్ఠిథేరుడు**

**43. న తం మాతా పితా కయిరా, అఞ్ఞే వాపి చ ఞాతకా ।
సమ్మాపణిహితం చిత్తం, సెయ్యసో నం తతో కరే ॥ 11 ॥**

*(న తన్మాతాపితరౌ కుర్యాతా మన్యేచాఽపి చ జ్ఞాతికాః ।
సమ్యక్ ప్రణిహితం చిత్తం శ్రేయాంసమేనం తతః కుర్యాత్ ॥ 11 ॥)*

తల్లిదండ్రులు, ఇతర బంధువులు, చేయలేని మేలును వారికంటె నధికముగ సన్మార్గ నియుక్తమైన చిత్తము మనకు చేయగలదు.

***3 చిత్తవగ్గో నమత్తో ॥***

**చిత్తవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## పుప్ఫవగ్గో చతుత్థో

## (పుష్పవర్గ శ్చతుర్థః)

## 4 పుష్పవర్గము – చతుర్థాధ్యాయము

సావత్థి ( *జేతవనము)* పంచశతభిక్షువులు

**44. కో ఇమం పఠవిం**[1] **విజెస్సతి, యమలోకం**[2] **చ ఇమం సదేవకం**[3] **।**
**కో ధమ్మపదం**[4] **సుదేసితం । కుసలోపుప్ఫమివ పచెస్సతి ॥ 1 ॥**

*(క ఇమాం పృథివీం విజేష్యతి, యమలోకం చేమం సదేవకమ్ ।*
*కో ధర్మపదం సుదేశితం, కుశలః పుష్పమివ ప్రచేష్యతి ॥ 1 ॥)*

ఈ పృథివిని, దేవలోకముతో పాటు యమలోకమును ఎవరు

---

(1) పఠవి(పృథివి) – ఇది ఆత్మ భ్రమను సూచించును. ఆత్మ యొక్క యాథార్థ్యము నెవరు గ్రహింపగలరని భావము. (2) నాల్గు దుఃఖావస్థలుః నరకము, జంతులోకము, ప్రేతలోకము, అసురలోకము. (3) మానవలోకముతో పాటు ఆఱు దివ్యలోకములు. (చూడుః ధమ్మపదము – నారదమహాథేరుడు, మహాబోధి సొసైటి 1962) (4) 'ధమ్మపదము'నకు 'ధర్మమార్గ'మని అర్థము. ముప్పది యేడు (37) బోధిపక్షీయ ధమ్మములు ఈ శబ్దమిచట నిర్దేశించునని భదన్తబుద్ధఘోషుని వ్యాఖ్య తెలుపుచున్నది. (**'యథా సభావతో కథితత్తా సత్తతింస బోధిపక్ఖియ ధమ్మసఙ్ఖాతం ధమ్మపదం'...1)** వివరములకు చూడుః డా॥ రత్నాకరం బాలరాజు–బుద్ధ దర్శనము–1962–, పుట 207.

జయింపగలరు? నిపుణుడగు మాలాకారుడు పుష్పములట్లు విశదమనోజ్ఞముగ నుపదిష్టమైన ధర్మపదము నెవరు చయన మొనరింప (కూడబెట్ట) గలరు?

45. **సేఖో[1] పఠవిం విజెస్సతి, యమలోకం చ ఇమం సదేవకం ।**
**సేఖో ధమ్మపదం సుదేసితం, కుసలో పుప్ఫమివ పచెస్సతి । 2 ।**

*(శైక్షః పృథివీం విజేష్యతి, యమలోకం చేమం సదేవకమ్ ।*
*శైక్షో ధర్మపదం సుదేశితం, కుశలః పుష్పమివ ప్రచేష్యతి । 2 ।)*

శిక్షితుడు (నిర్వాణ పథారోహకుడు) ఈ పృథివిని, దేవలోక సహితముగ యమలోకమును జయింపగలడు. అట్టి శిక్షితుడే నిపుణుడగు మాలాకారుడు పుష్పములట్లు, విశదమనోజ్ఞముగ నుపదిష్టమైన ధమ్మపదమును చయన మొనరింపగలడు.

*సావత్థి (జేతవనము)* మరీచి కమ్మట్ఠానిక థేరుడు

46. **ఫేణూపమం కాయ మిమం విదిత్వా,**
**మరీచి ధమ్మం అభిసమ్బుధానో ।**
**చెత్వాన మారస్స[2] ప(సు) పుప్ఫకాని ।**
**అదస్సనం మచ్చురాజస్స గచ్ఛే । 3 ।**

(1) ఆరోహకునకు నిర్వాణపథము నుండి పతన ముండదు. ఇట్టివాడే 'శైక్షుడు' (సేఖుడు) శిక్షావస్థయందుండు సాధకుడు. శైక్షుడు (సేఖుడు) నిర్వాణపథమున మొదటిదశను (సోతాపత్తిని) పొందినవాడు. ('సోతాపన్నుడు) ప్రవాహమున ప్రవేశించినవాడు). రెండవ దశను ప్రాపించిన సాధకుడు 'సకదాగామి' - (ఒకసారి మాత్రమే మరల జన్మించువాడు.); కామలోకమున ఒక్కసారి మాత్రమే జననమంది, అటు తరువాత వైమల్యమును పొందువాడు. మూడవ దశను పొందిన సాధకుడు 'అనాగామి' - పునర్జన్మహేతువులైన దశసంయోజనముల (శృంఖలల)లో మొదటి ఐదింటి నుండి విముక్తుడు. నాల్గవ దశను పొందినవాడు 'అర్హంతుడు' లేక 'అసేఖుడు'. - శిక్షణమును పూర్తి చేసిన మహాత్ముడు; పరిపూర్ణుడు

(2) మారుడు, ఆర్షములైన పురాణాదులలో వర్ణింపబడిన కామదేవుడగు మదనుడు; కుసుమాయుధుడు; పుష్పబాణములైదగుటచే పంచబాణుడని ప్రతీతుడు. మారుడు బౌద్ధ శాస్త్రములందు ముఖ్యముగ విమోహకుడు. మనోవికారకారి. క్రైస్తవ మతమందలి 'సేటను (satan) తో సమానుడు. బౌద్ధుడని ప్రతీతి గల అమరసింహుడు తన 'అమరకోశము'న '**మదనో మన్మథో మారః**' - ఇత్యాదిగా మదనుని నామముల పేర్కొని యుండుట గమనార్హము.

(ఫేనోపమం కాయమిమం విదిత్వా।
మరీచిధర్మ మభిసమ్బోధమానః।
ఛిత్వా మారస్య ప్ర(సు) పుష్పకాణి[1]।
అదర్శనం మృత్యురాజస్య గచ్ఛేత్ । 3 ।)

ఈ శరీరము నీటి మీది నురుగు వంటిదని, తెలిసికొని, ఎండమావి వంటిదాని స్వభావము నెఱిగి, మారుని పుష్పబాణముల ఛేదించి (త్రుంచి వేసి) మృత్యురాజగు యముని దృష్టికి అదృశ్యుడై (అందకుండ) పోవలెను.

**సావత్థి (జేతవనము)** **విడూడభుడు**

**47. పుప్ఫాని హే[2]వ పచినన్తం, బ్యాసత్తమనసం నరం।**
**సుత్తం గామం మహోఘోవ, మచ్చు ఆదాయ గచ్ఛతి[3] । 4 ।**

(పుష్పాణి హ్యేవ ప్రచిన్వన్తం, వ్యాసక్తమనసం నరమ్।
సుప్తం గ్రామం మహౌఘ ఇవ, మృత్యురాదాయ గచ్ఛతి । 4 ।)

కేవలము కామభోగరూపములగు జీవనపుష్పములను ప్రోగు చేసికొని, వాని యం దధికాసక్తమనస్కుడగు నరుని, మహాజలప్రవాహము, నిద్రించు గ్రామమును గొనిపోవునట్లు, మృత్యువు గొనిపోవును.

---

పోల్చు :- 'మాయామరీచి సదృశా విద్యుతే ఫేనోపమాశ్చపలాః' (లలితవిస్తరము), శరీరము అనిత్యము, క్షణభంగురమగుటచే ఫేనోపమము. అనాత్మకమగుటచే మరీచికాధర్మము కలది.

(1) పపుప్ఫకాని (ప్రపుష్పకాణి) :- రాగాదిజన్యములైన దుఃఖములు. అర్హంతుడు పరమజ్ఞానము వలన నీ రాగాదుల నశింపజేసి మృత్యురహితమైన నిర్వాణము గాంచును.

(2) హి + ఏవ = హేవ. సూ॥ 'సరాసరే లోపం' (కచ్చాయనుడు 1-2-1)

(3) పోల్చు :- 'పుష్పాణీవ విచిన్వన్త మన్యత్రగత మానసమ్।
అనవాప్తేషు కామేషు మృత్యు రభ్యేతి మానవమ్।'
'సుప్తం వ్యాఘ్రం మహౌఘో వా, మృత్యురాదాయ గచ్ఛతి।
సఞ్చిన్వానక మేవైనం, కామానా మవితృప్తికమ్।'

(మ.భా. శాంతిపర్వము 175-1,19)

(అనవాప్తము (అప్రాప్తము) లైన కామము (కోరిక)లను పుష్పములట్లు ప్రోగు చేసికొనుచు, అన్య విషయాసక్తచిత్తుడైన మానవుని, మృత్యువాక్రమించుచున్నది. కామముల ప్రోగు చేసికొనుచు, సంతృప్తి చెందని మనుజుని, నిద్రించు వ్యాఘ్రమును (పులిని) మహా ప్రవాహము వలె, మృత్యువు గొనిపోవుచున్నది.)

**సావత్థి (జేతవనము)** **పతిపూజికా**

**48. పుప్ఫాని హేవ పచినన్తం, వ్యాసత్తమనసం నరం ।**
**అతిత్తం యేవ కామేసు, అన్తకో[1] కురుతే వసం । 5 ।**

*(పుష్పాణి హ్యేవ ప్రచిన్వన్తం, వ్యాసక్తమనసం నరమ్ ।*
*అతృప్త మేవ కామేషు, అన్తకః కురుతే వశమ్ । 5 ।)*

కామభోగరూపములగు జీవనపుష్పములను ప్రోగుచేసికొనుచు, వాని యందధికాసక్తుడగు నరుని, – కామానుభవమున నతడు తృప్తిగాంచక మునుపే, అతృప్తుడుగా నున్నపుడే – మృత్యువు వశము జేసికొనుచున్నది.

**సావత్థి (జేతవనము)** **మచ్ఛరియ కోసియసెట్ఠి**

**49. <u>యథాపి భమరో పుప్ఫం</u>, వణ్ణగన్ధం అహేఠయం* ।**
**పలేతి రస మాదాయ, ఏవం గామే మునీ [2] చరే । 6 ।**

*(<u>యథాఽపి భ్రమరః పుష్పం</u>, వర్ణగన్ధ మహేఠమానః ।*
*పలాయతే రస మాదాయ, ఏవం గ్రామే మునిశ్చరేత్ । 6 ।)*

తుమ్మెద పుష్పముల సౌందర్యసుగంధములకు ఏ హాని లేకుండ, కేవలము

---

(1) 'అన్తక' శబ్దమునకు మారుడని కూడ అర్థము. మారుడనగా మృత్యువని కూడ అర్థమున్నది. పోల్చు :- **'శ్యామాత్మా కుటిలః కరోతు కబరీభారోఽపి మారోద్యమమ్'** ।

(జయదేవకవి – గీత గోవిందము–III-6)

(2) భిక్షువు భిక్షార్థమెవరిని అర్థింపడు; అసౌకర్యము కల్గింపడు. మాట కాని, సంజ్ఞ కాని, ఏదియు లేకుండ, అతడు ఒక యింటి నుండి మఱొక ఇంటికి పోవుచుండును; శ్రద్ధావంతులెవరైన, పుణ్యకర్మముగ భిక్షనొసగినచో, భిక్షాపాత్ర యందు స్వీకరించి, వారిని దీవించును; అభినందింపడు. అతని భిక్షాటన మొక తీర్థయాత్ర. ఇతరుల కది పుణ్యకర్మముల కవకాశమొసగుచు, తనకు ఆధ్యాత్మిక శిక్షణాత్మకమగు జీవనము కాగలదు.

(బుద్ధరక్షితథేరుడు. ధమ్మపదం – IV 6)

* అఫ్హన్ – పా.భే. చూడు: రాహులసాంకృత్యాయనుని ధమ్మపదం –
హేఠ – ధా । హేఠతే – విబాధాయామ్ –
హేఠో బాధా విహేఠయోః । కష్టము; హింస. (మేదినీకోశము)

రసము (మకరందము)ను గ్రహించి పలాయన మొనరించునట్లు, గ్రామమునందు ముని చరింపవలెను.

**సావత్థి (జేతవనము) పాఠిక ఆజీవకుడు**

50. **న పరేసం విలోమాని[1], న పరేసం కతాకతం [2] ।**
**అత్తనో వ అవెక్ఖెయ్య, కతాని అకతాని చ । 7 ।**

*(న పరేషాం విలోమాని, న పరేషాం కృతాఽకృతమ్ ।*
*ఆత్మన ఏవ అవేక్షేత, కృతాన్యకృతాని చ । 7 ।)*

అతడు(ముని) ఇతరుల దోషములను గాని, కృతాకృతములగు పాపకర్మముల గాని, చూడగూడదు. కృతాకృతములైన (చేసినవి, చేయనివి) తన పాపకర్మముల మాత్రమే చూడవలయును.

**సావత్థి ఛత్తపాణి (ఉపాసకుడు)**

51. **యథాపి రుచిరం పుప్ఫం, వణ్ణవన్తం అగన్ధకం, ।**
**ఏవం సుభాసితా వాచా, అఫలా హోతి అకుబ్బతో । 8 ।**

*(యథాఽపి రుచిరం పుష్పం, వర్ణవదగన్ధకమ్ ।*
*ఏవం సుభాషితా వాగ్ [3] అఫలా భవత్యకుర్వతః । 8 ।)*

ఆచరణరహితుని సుభాషితవాణి, సుందరము, వర్ణయుక్తమునైనను, పరిమళరహితమైన పుష్పము వలె నిష్ఫలమగును.

---

(1) విలోమాని :- విపరీతాని = విపరీతాచరణము, లేక, వచనమని అర్థము.
భదన్త బుద్ధఘోషుడు దీనిని 'విపరీతపరుషవచనము'అని వ్యాఖ్యానించును.
"పరేసం అక్ఖోసం విలోమాని పరుసాని మర్మచ్ఛేదక వచనాని".

(2) కతం = కృతమ్. పాళీ వ్యాకరణానుసారము 'కర' ధాతువునకు 'క్త' ప్రత్యయము ద్వారా, 'కత' శబ్దము నిష్పన్నమగుచున్నది; 'ర' కారము లోపించుచున్నది. (కచ్చాయన 4-3.17)

(3) వాక్:- చకారాంత స్త్రీ లింగము. 'వాచా' అని ఆకారాంత స్త్రీ లింగ రూపము కూడ ఈ యర్థమున గలదు. సంస్కృతచ్ఛాయ యందు 'వాచా అఫలా' యని యున్నను దోషము లేదు.
**"వాగ్వాచే భారత్యాం వచనే స్త్రియా" (మేదినీకోశము – చ. ద్వికమ్)**
**"బ్రహ్మణీ, వచనం, వాచా, జల్పితం, గదితం గిరా" (శబ్దార్ణవము)**

52. యథాపి రుచిరం పుప్ఫం వణ్ణవన్తం, సుగన్ధకం ।
ఏవం సుభాసితా వాచా, సఫలా హోతి కుబ్బతో ॥ 9 ॥

(యథాఽపి రుచిరం పుష్పం, వర్ణవత్ సుగన్ధకమ్ ।
ఏవం సుభాషితా వాక్, సఫలా భవతి కుర్వతః ॥ 9 ॥)

సుందరము, వర్ణయుక్తము, సుగంధకమునైన పుష్పము వలె, ఆచరణవంతుని సుభాషితవాణి సఫలము కాగలదు.

సావత్థి (పూర్వారామము) విశాఖ – (ఉపాసిక)

53. యథాపి పుప్ఫరాసిమ్హా, కయిరా మాలాగుణేబహూ ।
ఏవం జాతేన మచ్చేన, కత్తబ్బం కుసలం బహుం ॥ 10 ॥

(యథాఽపి పుష్పరాశేః, కుర్యాన్మాలాగుణాన్ బహూన్ ।
ఏవం జాతేన మర్త్యేన, కర్తవ్యం కుశలం బహు ॥ 10 ॥)

పుష్పరాశి నుండి అనేక పుష్పమాలలు కూర్చబడినట్లు, జన్మమెత్తిన మర్త్యుని (మరణశీలుడగు మానవుని)చే, అనేక పుణ్యకర్మములు కర్తవ్యములు.

సావత్థి ఆనందథేరుడు

54. నపుప్ఫగన్ధో పటివాతమేతి, న చన్దనం తగరమల్లికా వా ।
సతం చ గన్ధో పటివాతమేతి, సబ్బాదిసా సప్పురిసో పవాతి ॥ 11 ॥*

(నపుష్పగన్ధః ప్రతివాత మేతి, నచన్దనం, తగరం, మల్లికా వా ।
సతాం చ గన్ధః ప్రతివాత మేతి, సర్వాదిశః సత్పురుషః ప్రవాతి ॥ 11 ॥)

పుష్ప చందన తగరమల్లికల సుగంధము, ఎదురుగాలికి వ్యాపింపదు. కాని,

---

*పోల్చు :- 'యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గన్ధో వాత్యేవం
పుణ్యస్యకర్మణో దూరాద్గన్ధో వాతి' ।
(నారాయణీయ యాజ్ఞిక్యుపనిషత్తు 11-1)

ప్రశస్తపుణ్యకర్మము యొక్క సుగంధసమానమగు యశము మనుష్యలోకము నుండి స్వర్గ పర్యంతము వ్యాపించునని శ్రుతి చెప్పుచున్నది.

సత్పురుషుల పుణ్యకర్మ పరిమళములు, గాలి కెదురుగా వెళ్లి, సర్వదిశలను వ్యాపించును. - సత్పురుషుడు సర్వ దిశలను వ్యాపించును.

55. **చన్దనం తగరం[1] వాపి, ఉప్పలం అథ వస్సికీ [2] ।**
**ఏతేసం గన్ధజాతానం, సీలగన్ధో అనుత్తరో । 12 ।**

*(చన్దనం తగరం వాఽపి, ఉత్పల మథ వార్షికీ ।*
*ఏతేషాం గన్ధజాతానాం, శీలగన్ధోఽనుత్తరో । 12 ।)*

(చందనము, తగరము, ఉత్పలము (నల్లకలువ), నవమల్లిక - వీని పరిమళములన్నిటిలో, సౌశీల్య పరిమళము అత్యుత్కృష్టమైనది.

**రాజగృహము - వేళు(ణు)వనము మహాకస్సపుడు (పిణ్డపాతదానుడు)**

56. **అప్పమత్తో అయం గన్ధో, యాయం తగరచన్దనీ[3] ।**
**యో చ సీలవతం గన్ధో, వాతి దేవేసు ఉత్తమో । 13 ।**

*(అల్పమాత్రోఽయం గన్ధో, యోఽయం తగర చన్దనీ ।*
*యశ్చ శీలవతాం గన్ధో, వాతి దేవేషు ఉత్తమః । 13 ।)*

తగరచందనముల గంధము, అల్పమాత్రము. శీలవంతుల (సదాచార వంతుల) గంధ ముత్తమము; దేవతల పర్యంతము వ్యాపించును. (వీచును).

---

(1) తగరము :- ఓషధీ విశేషము. సుగంధిచూర్ణ (వాసయోగ)మును దీని నుండి నిష్పాదింతురు - 'తయారు' చేయుదురు.

**"నంద్యావర్తేతు తగరస్తారా వట నఖోఽంగణౌ"** - (వైజయంతి - వనాధ్యాయము - 194 శ్లోకము)

సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, మాక్సిముల్లర్ మహాశయుడు ఇట్లు వివరించిరి. తగరము : - పుష్ప విశేషము - సువాసన గల తెల్లని పూవు (white fragrant flower like Buttercup.) అని ఆచార్య బుద్ధ రక్షిత థేరుడు.

(2) వస్సికీ - వార్షికీ - మల్లికాపుష్ప భేదము (jasmine) **"వార్షికం త్రాయమాణాయాం"** = కలుకానుగు చెట్టు. వర్షభవే = వానలో పుట్టునది (మేదినీకోశము - క - త్రికం)

(3) చన్దనం-బ్ర.దే.పా.

**రాజగృహము (వేళు(ణు)వనము) గోధికథేరుడు**

**57. తేసం సమ్పన్నసీలానం, అప్పమాదవిహారినం ।**
**సమ్మదఞ్ఞావిముత్తానం, మారో మగ్గం న విన్దతి । 14 ।**

*(తేషాం సమ్పన్నశీలానా, మప్రమాదవిహారిణామ్ ।*
*సమ్యగ్జ్ఞావిముక్తానాం, మారో మార్గం నవిన్దతి । 14 ।)*

సంపూర్ణశీలవంతులు, అప్రమాదవిహారులు (చిత్తచాంచల్యరహితులు, నిరాలసులునై చరించువారు) సమ్యగ్ (యథార్థ) జ్ఞానము ద్వారా విముక్తులునైన మహాత్ముల మార్గమును మారుడు పొందజాలడు. (వారి మార్గము, సర్వ వ్యామోహములకు అతీతము. సమ్యగ్జ్ఞాన విముక్తులు మృత్యువును జయింతురని భావము).

**సావత్థి (జేతవనము) గరహదిన్నవిగణ్ఠసావకుడు**

**58. యథాసఙ్కార[1]ఠానస్మిం (ధానస్మిం), ఉజ్ఝితస్మిం మహాపథే ।**
**పదుమం[2] తత్థ జాయేథ, సుచిగన్ధం మనోరమం । 15 ।**

*(యథా సఙ్కార ధానే, ఉజ్ఝితే మహాపథే ।*
*పద్మం తత్ర జాయేత, శుచిగన్ధం మనోరమమ్ । 15 ।)*

**59. ఏవం సఙ్కారభూతేసు, అన్ధభూతే పుథుజ్జనే ।**
**అతిరోచతి పఞ్ఞాయ,[3] సమ్మాసమ్బుద్ధ సావకో । 16 ।**

*(ఏవం సఙ్కారభూతే, అన్ధీభూతే పృథగ్జనే ।*
*అతిరోచతే ప్రజ్ఞయా, సమ్యక్సమ్బుద్ధ శ్రావకః । 16 ।)*

---

(1) సంకారః – సమ్మార్జన్యవపుంజితే = చీపురుచే ప్రోగు చేయబడిన కసవు (మేదినీ కోశము – ర –త్రికం)

(2) పదుమం (పద్మం) 'గులాబిపూ'వని రాహులసాంకృత్యాయనుని వివరణము.

(3) పఞ్ఞాయ = ప్రజ్ఞచే. ప్రజ్ఞ, నిరుపాధికమగు జ్ఞానము. ఇతరజ్ఞానములన్నియు ప్రజ్ఞ యొక్క సోపాధిక రూపములు. శీల సమాధుల నభ్యసించుట వలన గల్గు అధ్యాత్మజ్ఞానమే ప్రజ్ఞ. ప్రజ్ఞా సిద్ధికి, దాన, శీల, క్షాంతి, వీర్య, ధ్యానములు సోపానములని ప్రజ్ఞాపార మిత సిద్ధాంతము. పరిశీలన విశ్లేషణాదులతో కాక, ఆధ్యాత్మికమైన అంతర్ జ్ఞానముతోనే ప్రజ్ఞా ప్రాప్తి. హోమర్ (Homer) మహాకవి 'టెలెమాకస్' (Telemachus) అనునొక యువకునికి నొక దేవత (Grey-eyed

రాజపథము (ప్రక్క)న వేయబడిన పెంటకుప్ప తావున విమలగంధ యుక్తమగు మనోజ్ఞపద్మము (గులాబి) ఉద్భవించునట్లు, పెంటకుప్పను బోలి, అంధీభూతులైన అజ్ఞజనుల యందు సమ్యగ్జ్ఞానసిద్ధి పొందిన బుద్ధ భగవానుని శిష్యుడు, తన ప్రజ్ఞచే మిక్కిలి ప్రకాశించును. (ఠాణము - ధానము = తావు, స్థానము)

## 4. పుప్ఫవగ్గో నమత్తో

## పుష్పవర్గము సమాప్తము



goddess) నోటనిట్లు చెప్పించెను. "ధైర్య మవలంబింపుము. కొన్నిటిని (విషయములను) నీయంతకు నీవే ఆలోచింపగలవు. అన్యములను ఒక దేవత నీ మనస్సున నుంచును". సమస్త సత్యమునకు మూలమైన పరమజ్ఞానముతో సంయోగము వలన - ఐక్యానుసంధానము - వలన ఈ ప్రజ్ఞ సిద్ధించును. ఇది సాక్షాత్కారము; ఉత్పాద్యము కాదు. అనేక శాంతారావనిశీథముల ధ్యానస్థితుడై సత్యమును గాంచి, సిద్ధార్థుడు బుద్ధుడైనాడు. వస్తుతత్త్వజ్ఞులు, రాగ, పాప, జన్మజరాది దుఃఖ దోషముల నుండి విముక్తులగుదురు.

**'యథాభూతం పజానాతి, తే వీతరాగా, తే విదోసా, తే పరిముచ్చన్తి జాతియా, జరయా'** **(మజ్ఝిమనికాయము I -65)** మహాయానబౌద్ధము ననుసరించి, లోకోత్తరుడైన ఆదిబుద్ధుడు, అనేకత్వము బొందుటకు కాంక్షించెను. ఆదిబుద్ధుడు ఉపనిషత్తులందలి ఈశ్వరున కనురూపుడు. ఈ కాంక్షయే 'ప్రజ్ఞ' యని పేర్కొనబడినది. ప్రజ్ఞ, బుద్ధుడు - వీరు విశ్వమునకు మాతాపితరులుగా భావింపబడినారు.

**"ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేష యోనిః**
**సర్వస్య ప్రభవాఽవ్యయౌ హి భూతానామ్"** (మా. ఉ. 6)
(చూడు :- ధమ్మపదం - సర్వేపల్లి రాధాకృష్ణన్).

అష్టాంగమార్గ మందలి 'సమ్యగ్దృష్టి' 'సమ్యక్సంకల్పము' అను రెండంగములు 'ప్రజ్ఞ'కు సంబంధించిన సాధనను వివరించుచున్నవి.

(చూడు :- బుద్ధదర్శనము - డా॥ రత్నాకరం బాలరాజు (1962) పు. 85)

**'నిర్విచారవైశారద్యేఽధ్యాత్మ ప్రసాదః** । యో.ద. I. 47
నిర్విచార సమాధి నభ్యసించిన యోగిచిత్తము అత్యంత పరిపక్వమై నిర్మలము కాగలదు.
**'ఋతంభరా తత్ర ప్రజ్ఞా'** । - యో.ద. I. 48
ఈ భూమిక యందు ప్రజ్ఞ, సత్యపరిపూర్ణమై సంశయమును, భ్రమను అతిక్రమించును.
**'తజ్జయాత్ ప్రజ్ఞాలోకః'**। యో.ద. III. 5
సంయమము సిద్ధించినచో, ప్రజ్ఞ, అతిశయముగ ప్రకాశించును.
**ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘః సమాధిః**। (యో.ద. IV-29)
యోగ సిద్ధుల యందు విరక్తుడగు వివేకవంతునికి 'ధర్మమేఘము' అను సమాధి సిద్ధించి సమస్త క్లేశ కర్మములు నివర్తించును. అని యోగసూత్రములీ ప్రజ్ఞను వర్ణించును.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## బాలవగ్గో పఞ్చమో

## (బాలవర్గః పఞ్చమః)

## 5 బాలవర్గము – పంచమాధ్యాయము

**సావత్థి (జేతవనము)** — **దుగ్గత (దరిద్ర) సేవకుడు**

**60. దీఘా జాగరతో రత్తి, దీఘం సన్తస్స యోజనం ।**
**దీఘో బాలానం సంసారో**[1] **సద్ధమ్మం అవిజానతం ॥ 1 ॥**

---

(1) సంసారము – నిర్విరామ జనన మరణ చక్రము. స్థూలశరీరాశ్రయమున మరల మరల నీలోకమున జన్మ మృత్యువుల పొందుచుండుట.

**'పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం ।**
**ఇహ సంసారే బహుదుస్తారే, కృపయాపారే పాహి మురారే ।**
**'ఇతి సంసారే స్ఫుటతరదోషః, కథమిహ మానవ! తవసన్తోషః'** (ఆదిశంకరులు– మోహముద్గరము)

సంసారహేతువు అవిద్య – అజ్ఞానము. ఈ విషయమున ఉపనిషద్ర్పుషులకు బుద్ధభగవానునికి భేదము లేదు. **'తస్మాదజ్ఞానమూలోఽయం, సంసారః సర్వదేహినామ్ (కూ.పు. ఈశ్వరగీత II–1)** పరమార్థ విషయమున ఉపనిషద్దర్శనమునకు బుద్ధదర్శనము భిన్నము కాదు.
(చూడు. డా॥ రత్నాకరం బాలరాజు 'బుద్ధదర్శనము' -V అధ్యాయము)

**'యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః ।**
**న చ తత్పదమాప్నోతి, సంసార మధిగచ్ఛతి ।'** (కఠ. ఉ. III. 7)

వివేకహీనుడు, అసమాహితచిత్తుడు, సర్వదా అపవిత్రహృదయుడు నగు మనుజుడు గమ్యము–మోక్షము–ను పొందజాలడు; జననమరణాది లక్షణమగు సంసారమునే పొందును.

*(దీర్ఘా జాగ్రతో రాత్రిః, దీర్ఘం శ్రాన్తస్య యోజనమ్ ।*
*దీర్ఘో బాలానాం సంసారః, సద్ధర్మ మవిజానతామ్ ॥ 1 ॥)*

నిద్రరాని వానికి రాత్రి దీర్ఘము. అలసిన వానికి యోజనము దీర్ఘము. సద్ధర్మ మెఱుగని మూర్ఖులకు సంసారము దీర్ఘము.

**సావత్థి (జేతవనము) సద్ధివిహారికుడు (మహాకస్సపుని శిష్యుడు) (రాజగృహము ?)**

61. **చరం చే నాధి గచ్ఛేయ్య, సెయ్యం సదిసమత్తనో ।**
**ఏకచరియం దళ్హం కయిరా, నత్థి బాలే సహాయతా[1] ॥ 2 ॥**

*(చరం శ్చేన్నాధి గచ్ఛేత్, శ్రేయాంసం సదృశ మాత్మనః ।*
*ఏకచర్యాం దృఢాం కుర్యాత్, నాఽస్తి బాలే సహాయతా ॥ 2 ॥)*

ప్రయాణమందు తనతో సమానుడు, లేదా, శ్రేష్ఠుడునైన సహాయుడు (సహచరుడు) లభింపనిచో, (బాటసారి) ఏకచర్య (ఒంటరిగా చరించుట)నే దృఢమొనర్పవలెను. మూర్ఖునితో సహాయత (సాహచర్యము) సిద్ధింపదు.

---

**యా వద్దేతు ఫలావేశః సంసార స్తావదాయతః ।**
**క్షీణే హేతు ఫలావేశే, సంసారం న ప్రపద్యతే॥"** (గౌడపాదీయ మాండూక్య కారిక- IV. 56 )
హేతు ఫలాభినివేశ మెంతవఱకు నశింపదో, అంత వఱకు జననమరణరూపమగు సంసారము సాగుచునే యుండును. హేతుఫలాభినివేశము నశించినపుడు, సంసారమంతరించును. **'యావత్ సమ్యగ్దర్శనేన హేతుఫలావేశో న నివర్తతేఽ క్షీణః సంసారః తావదాయతో దీర్ఘోభవతి'॥** (శం. భా ) సమ్యగ్దర్శనమున హేతుఫలాభినివేశము నివర్తింపనంతకాలము సంసారము నశింపక దీర్ఘమగుచుండును.
పోల్చు :- **'భారోఽవివేకినః శాస్త్రం, భారో జ్ఞానం చ రాగిణః ।**
**అశాంతస్య మనో భారో, భారోఽనాత్మ విదో వపుః'॥** (యోగవాసిష్ఠము)

వివేకహీనునకు శాస్త్రము భారము. రాగము గల వానికి, జ్ఞానము భారము. శాంతి లేనివానికి మనస్సు భారము. ఆత్మజ్ఞాన రహితునికి తన శరీరమే భారము.

ఈ గాథ కోసల రాజైన ప్రసేనజిత్తుకు, మఱొక వ్యక్తికి, బుద్ధుడొనరించిన ఉపదేశమని, ఆచార్య N.K. భగ్వత్, M.A.,గారి ధమ్మపదవివరణము.

(1) పోల్చు :- **'నోచే లభేథ నిపకం సహాయం,**
**సద్ధిం చరం సాధువిహారి ధీరం ।**
**రాజావ రట్ఠం విజితం పహాయ**
**ఏకో చరే ఖగ్గవిసాణ కప్పో ।'** (సుత్తనిపాతము I - 3.12)

అనుకూలుడు, ధీరుడు, బుద్ధిమంతుడునగు సహాయుడు లభింపనిచో, శత్రువిజితమైన రాష్ట్రము త్యజించి ఒంటరిగా చరించు రాజు వలె, ఖడ్గవిషాణ (ఖడ్గమృగ) మట్లు చరింపవలెను.

సావత్థి (జేతవనము) ఆనందసెట్ఠి

62. 'పుత్తా మత్థి, ధనమత్థి'[1] ఇతి బాలో విహఞ్ఞతి ।
అత్తా హి అత్తనో నత్థి, కుతో పుత్తా కుతో ధనం[2] ॥ 3 ॥

('పుత్రా మే సన్తి ధనం మేఽస్తి' ఇతి బాలో విహన్యతే ।
ఆత్మా హ్యాత్మనో నాఽస్తి, కుతః పుత్రాః కుతోధనమ్ ॥ 3 ॥)

'పుత్రులు నాకున్నారు, నాకు ధనమున్నది' - అని మూర్ఖుడు తీవ్రవేదన పొందుచున్నాడు. తన ఆత్మయే (శరీరమే) తనకు లేనపుడు, పుత్రులెక్కడ? ధనమెక్కడ? (పుత్రులు తన వారెట్లగుదురు? ధనము తనదెట్లు కాగలదు?)

సావత్థి (జేతవనము) ఇద్దరు చోరులు (గణ్ఠిభేదకచోరులు)

63. యో బాలో మఞ్ఞతి బాల్యం, పణ్డితో వా పి తేన సో ।
బాలో చ పణ్డితమానీ, స వే బాలో తి వుచ్చతి[3] ॥ 4 ॥

(యో బాలో మన్యతే బాల్యం, పణ్డితో వాపి తేన సః ।
బాలశ్చ పణ్డితమానీ, స వై బాల ఇత్యుచ్యతే ॥ 4 ॥

తన మూర్ఖత్వము నెఱిగిన మూర్ఖుడు, అంతవఱకైనను బుద్ధిమం
కాని, మూర్ఖుడై యుండియు, తాను బుద్ధిమంతుడనని భావి
మూర్ఖుడనబడును.

(1) 'పుత్తా మత్థి - పుత్రా మేఽస్తి' - ఈ పాఠమున కర్తృపదము బహువచనాంతముగ, క్రి
ఏకవచనాంతముగ నున్నది. ఇది వ్యాకరణవిరుద్ధము; అసాధువు. కాని, ఇందు ఛందస్సు స
కాన, సంస్కృతచ్ఛాయలో, 'పుత్రా మేసన్తి' లేదా, 'పుత్రోమేఽస్తి' అని శుద్ధ్యర్థము సవ
'మేసన్తి' అన్న పాఠమునే అనేక సంపాదకవిద్వాంసులు, అనువాదకులు, బహువచనాంత
(పుత్తా) ననుసరించి గ్రహించి, అనువదించినారు.

(2) చూడు: భ.గీ. XIII - 9-11.

(3) ఉపనిషత్తులు పండితమాని యగు మూర్ఖుని నిందించును.
**'అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితమ్మన్యమానాః ।,**
**దంద్రమ్యమాణా పరియన్తి మూఢాః, అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః ।** (కఠ. ఉ. II - 5)
అజ్ఞానావృతులై యుండియు, తాము ప్రజ్ఞావంతులము, పండితులమన్న భావనతో, జరామరణాది దుఃఖపీడితులై, అంధుల నూతకొన్న అంధులవలె, అవివేకులు పరిభ్రమించి, అత్యంతానర్థమును పొందుచున్నారు.

సావత్థి (జేతవనము) ఉదాయిత్థేరుడు

64. యావజీవమ్పి చే బాలో, పణ్డితం పయిరుపాసతి[1] ।
న సో ధమ్మం విజానాతి, దబ్బీ సూపరసం యథా ॥ 5 ।

(యావజ్జీవ మపి చేద్, బాలః పణ్డితం పర్యుపాస్తే ।
న స ధర్మం విజానాతి, దర్వీ సూపరసం యథా[2] । 5 ।)

జీవిత పర్యంతము మూర్ఖుడు పండితుని (జ్ఞానవంతుని) సేవించినను, గరిటె, పప్పు యొక్క రుచి పాకము నెఱుగనట్లు, ధర్మము నెఱుగజాలడు.

సావత్థి (జేతవనము) తింస (30) పావెయ్యక భిక్షువులు
(భద్ర వర్గీయ భిక్షువులు*)

65. ముహుత్తమపి చే విఞ్ఞూ, పణ్డితం పయిరుపాసతి ।
ఖిప్పం ధమ్మం విజానాతి, జివ్హా సూపరసం యథా ॥ 6 ।

(1) పయిరుపాసతి - పరి + ఉపాసతి = పర్య్ ఉపాసతి = పయ్ రుపాసతి (వర్ణ విపర్యయము). పయిరుపాసతి (విప్రకర్షము).

(2) పోల్చు :- 'ఎడ్డె మనుష్యుడే మెఱుగు నెన్ని దినంబులు గూడి యుండినన్
దొడ్డ గుణాఢ్యునందుగల తోరపువర్తన లెల్ల ప్రజ్ఞ పే
ర్వడ్డ వివేకిరీతి రుచిపాకము నాలుక గాకెఱుంగునే,
తెడ్డది కూరలో గలయ ద్రిమ్మరు చుండిననైన భాస్కరా' (భాస్కరశతకము)

ఇట్టి లోకోక్తులు, లౌకికోపమానములు, భారతీయజనత యొక్క సాధారణసంపద. అనేక శతాబ్దముల నుండి ఇవి, భారతజనసామాన్యమునందు ప్రచలితముగనున్నవి. బౌద్ధవాఙ్మయమునందును, కావ్యేతిహాసపురాణాదులయందును కాన్పించు ననేక సూక్తుల భాష, భావము, అక్షరశః సామ్యము బొంది యుండుట కిదియే కారణము.

పోల్చు :- 'చిరం హ్యపి జడః శూరః, పణ్డితం పర్యుపాస్య హి ।
న స ధర్మాన్ విజానాతి, దర్వీ సూపరసానివ'
ముహూర్తమపి తం ప్రాజ్ఞః, పణ్డితం పర్యుపాస్య హి ।
క్షిప్రం ధర్మం విజానాతి, జిహ్వా సూపరసానివ । (మ.భా. సౌప్తిక = V-3-4)

మహాభారతమందలి ఈ శ్లోకములు, ధర్మపదమందలి ప్రస్తుత 64, 65 గాథలతో అక్షర సామ్యము గల్గి యుండుట గమనార్హము. భారతవర్షీయసర్వసాధారణపురాతనజ్ఞానసంప్రదాయ సంపదయే దీనికి మూలమనుట సిద్ధాంత మగుచున్నది.

* రాహులసాంకృత్యాయనుని ధమ్మపదము.

(ముహూర్తమపి చేద్విజ్ఞః, పణ్డితం పర్యుపాస్తే ।
క్షిప్రం ధర్మం విజానాతి, జిహ్వా సూపరసం యథా । 6 ।)

విచారశాలియగు మనుజుడు, పండితునొక క్షణ మాత్రము సేవించినను, నాలుక, పప్పు రుచి పాకము నెఱిగినట్లు, వెంటనే ధర్మము నెఱుగగలడు. (విఞ్ఞూ = విజ్ఞః)

**రాజగృహము వేళు(ణు)వనము** **సుప్పబుద్ధకుట్ఠి**

66. **చరన్తి బాలా దుమ్మేధా, అమిత్తేనేవ అత్తనా ।**
**కరొన్తా పాపకం కమ్మం, యం హోతి కటుకప్ఫలం[1] । 7 ।**

(చరన్తి బాలా దుర్మేధసోఽ మిత్రేణైవాత్మనా ।
కుర్వన్తః పాపకం కర్మ, యద్భవతి కటుకఫలమ్ । 7 ।)

దుర్బుద్ధులగు మూర్ఖులు తమకు తామే శత్రువులై, దుఃఖఫలములనొసగు పాపకార్య మాచరించుచు చరింతురు.

**సావత్థి (జేతవనము)** **ఏక కస్సక (ఒక కర్షకుడు)**

67. **న తం కమ్మం కతం సాధు, యం కత్వా అనుతప్పతి ।**
**యస్స అస్సుముఖో రోదం, విపాకం పటిసేవతి । 8 ।**

(న తత్కర్మ కృతం సాధు, యత్కృత్వాఽనుతప్యతే ।
యస్యాఽశ్రుముఖో రుదన్, విపాకం ప్రతిసేవతే । 8 ।)

మనుజుడు, దేని దుష్ఫలమును అశ్రుముఖము (కన్నీరు నిండిన ముఖము) తో విలపించుచు, అనుభవించునో, దేనినొనరించి, అనుతప్తుడగుచున్నాడో, అట్టి కర్మము సత్కర్మము కాదు.

---

(1) 'ప' కారాగమము ఛందోదృష్టిననుసరించి కల్గినది. లేనిచో, దానికి పూర్వాక్షరము లఘువై ఛందోభంగమగును.

**రాజగృహము (వేళు(ణు)వనము) సుమనుడు (మాలాకారుడు)**

**68. తం చ కమ్మం కతం సాధు, యం కత్వా నానుతప్పతి ।**
**యస్స పతీతో సుమనో, విపాకం పటిసేవతి । 9 ।**

*(తచ్చ కర్మ కృతం సాధు, యత్కృత్వా నాఽను తప్యతే ।*
*యస్య ప్రతీతః సుమనో, విపాకం ప్రతిసేవతే । 9 ।)*

దేని ఫలమును హర్షయుక్తుడై సుప్రసన్న చిత్తముతో మనుజుడు స్వీకరించునో, దేనినొనరించి, యతడు సంతాపము (పశ్చాత్తాపము) బొందడో, అట్టి కర్మమే సత్కర్మము. (ప్రతీతః = హృష్టః - హర్షయుక్తుడు)

**సావత్థి (జేతవనము) ఉప్పలవణ్ణథేరి**

**69. మధూ వ[1] మఞ్ఞతీ బాలో, యావ పాపం న పచ్చతి ।**
**యదా చ పచ్చతి పాపం, అథ[2] (బాలో) దుక్ఖం నిగచ్ఛతి । 10 ।**

*(మధ్వివ మన్యతే బాలో, యావత్పాపం న పచ్యతే ।*
*యదా చ పచ్యతే పాప, మథ (బాలో) దుఃఖం నిగచ్ఛతి । 10 ।)*

పాపము, పరిపక్వము కానంత వఱకు మూర్ఖుడు, దానిని మధుతుల్యముగ భావించును. పాపము పండినపు డతడు దుఃఖము బొందును.

**రాజగృహము (వేళు(ణు)వనము జంబుక ఆజీవకుడు**

**70. మాసే మాసే కుసగ్గేన, బాలో భుఞ్జేథ[3] భోజనం ।**
**న సో సఙ్ఖతధమ్మానం, కలం అగ్ఘతి సోళసిం । 11 ।**

---

(1) సింహళీపరంపర ననుసరించిన పాఠము 'మధు'వా'. పెక్కు ప్రతులలో ఈ పాఠమే కాన్పించుచున్నది. చూడు :- నారదమహాథేర, ఆచార్య బుద్ధరక్షితథేరుల ధమ్మపదపాఠము. 69.
డా॥ సర్వేపల్లి రాధాకృష్ణుడు: మాక్సిముల్లర్ సింహళీయపాఠమునే స్వీకరించిరి.

(2) బ్ర. దే. పాఠమున 'అథ' లేదు

(3) పాళీ వ్యాకరణముననుసరించి 'లిఙ్' ప్రథమపురుషైకవచనరూపమున, భుఞ్జేథ (ఆత్మనేపదము) భుఞ్జెయ్య, భుఞ్జే (పరస్మైపదములు) - ఈ మూడును, సాధురూపములే. పాళీధాతురూపములు, శబ్దరూపములు, ఆంశికముగ సంస్కృత ధాతు, శబ్దరూపముల ప్రాకృత రూపములే. మఱికొన్ని సంస్కృత సాదృశ్యమూలకమైన పరివర్తన ద్వారా సిద్ధించుచున్నవి.
(చూడు : కచ్చాయన 3-4-36 సూత్రములపై వృత్తి. మొగ్గల్లాన సూత్రములు 6 - 75.)

*(మాసే మాసే కుశాగ్రేణ, బాలో భుఞ్జీత భోజనమ్ ।*
*న స సంఖ్యాత ధర్మాణాం, కలామర్హతి షోడశీమ్ ॥ 11 ॥)*

ప్రతి మాసము, మూర్ఖుడు, దర్భ కొనతో అన్నము దినుగాక; కాని, పరిగణితమైన సద్ధర్మమెఱిగిన వారి యొక్క షోడశకలకు (1/16 అంశమునకు) సైతమాతడు అర్హుడు కాడు. (రాగాదులు నశింపని సంన్యాసుల సుదీర్ఘోపవాసము, ఆర్య చతుస్సత్యముల నెఱిగిన మహాత్ముని ఏకదినోపవాసము నందు షోడశకలకు సైతము సమానము కాదు. దైహిక సుఖముల యెడ విరక్తిని గల్గించుటకు, దేహ స్వభావమును గుఱించి విషాదభావము ప్రకటించినను, బుద్ధగౌతముడు, దేహనాశనకరములగు కఠినోపవాసాదులను సమర్థింపడు. సమ్యగ్దృష్టి నవలంబించినచో విషయజాతమును, మనము సంతోషముతో ననుభవింపగలము. సచ్ఛీలాచరణమే, కృచ్ఛ్రోపవాసాది తపోదీక్ష కంటె నుత్కృష్టతరము. కుశాగ్రభోజనము, బ్రాహ్మణుల ఉపవాసవ్రతమును నిర్దేశించుచున్నదని మాక్సిముల్లర్ వివరణ.)

**రాజగృహము (వేళు(ణు)వనము)** **అహిపేతుడు**

71. **న హి పాపం కతం కమ్మం సజ్జు ఖీరం వ ముచ్చతి[(1)] ।**
**డహన్తం బాలం అన్వేతి, భస్మచ్ఛన్నోవపావకో[(2)] ॥ 12 ॥**

---

(1) ముచ్చతి = న పరిణమతి; న పకతిం విజహాతి (భదన్త బుద్ధఘోషుని అట్ఠకథ వివరణ.) 'వికృతిని పొందదు' అనుటకు 'తన స్వభావము వదలదు' అనునది క్లిష్టమైన అర్థము. మూలపాఠము 'పచ్చతి' అని యుండునని, లేఖక ప్రమాదము వలన 'ముచ్చతి'గా మారినదని పండితుల సంశయము. (చూడు :- ధమ్మపదం - శ్రీకన్హేదీలాల్ గుప్త.)

(2) పోల్చు :- **'నాఽధర్మశ్చరితో లోకే, సద్యః ఫలతి గౌరివ ।**
**శనైరావర్తమానస్తు, కర్తుర్మూలాని కృన్తతి ।** (మనుస్మృతి IV- 127)

గౌరివ = క్షీరమివ. సద్యః క్షీరము (అప్పుడే పిండిన పాలు) వెంటనే, దధి (పెరుగు)గా ఫలించని యట్లు, అధర్మాచరణము లోకమున, వెంటనే పండదు. మెల్లి మెల్లిన ఆవర్తమానమగుచు, పాపమొనరించిన వాని యొక్క మూలములను కోసివేయుచున్నది.

బుద్ధఘోషుడు 'డహన్తం' (దహన్తం) పదమును 'బాల' పదమునకు విశేషణముగ భావించును. అట్లైన, సంస్కృతచ్ఛాయయందు, 'దహ్యమానం' అని వ్రాయవలెను. తదనుసారము అనువదింపవలెను. 'డహన్తం' పదమునకు సంస్కృతచ్ఛాయ యందు 'దహన్' అని, అది 'పావక' శబ్దముకు విశేషణముగ భావించి పండితులు అనువదించినారు. ఈ విభక్తివ్యత్యయము బుద్ధఘోషునకు సమ్మతము కాదు.

*(నహి పాపం కృతం కర్మ, సద్యః క్షీర మివ ముఞ్చతి ।*
*దహన్ బాల మన్వేతి, భస్మచ్ఛన్న ఇవ పావకః ॥ 12 ॥)*

అప్పుడే పిండిన పాలు (సద్యః క్షీరము) వెంటనే పేరనియట్లు, చేసిన పాపకర్మము, వెంటనే ఫలింపదు. నివురుగప్పిన నిప్పు వలె నది, కాల్చుచు మూర్ఖుని వెంబడించును.

**రాజగృహము (వేళు(ణు)వనము)** **సట్టికూటము (ప్రేతము)**

**72. యావదేవ అనత్థాయ, ఞత్తం[1] బాలస్స జాయతి ।**
**హన్తి బాలస్స సుక్కంసం, ముద్ధ మస్స విపాతయం ॥ 13 ॥**

*(యావదేవ అనర్థాయ, జ్ఞప్తం బాలస్య జాయతే ।*
*హన్తి బాలస్య శుక్లాంశం, మూర్ధాన మస్య విపాతయన్ ॥ 13 ॥)*

మూర్ఖుని జ్ఞానమంతయు ఆతని అనర్థమునకే. కాని, శ్రేయస్సునకు కాదు. అది యతని శిరమును (ప్రజ్ఞను) భగ్నమొనరించును; ధవళాంశమును (పుణ్యాంశమును) నాశమొనర్చును. (విపరీతార్థ బోధము, మానవుని వివేకశక్తిని సమూలముగ నశింపజేయును).

**సావత్థి (జేతవనము)** **సుధమ్మ థేరుడు**

**73. అసతం భావన[2] మిచ్ఛేయ్య, పురెక్ఖారఞ్చ భిక్ఖుసు ।**
**ఆవాసేసు చ ఇస్సరియం, పూజం పరకులేసు చ ॥ 14 ॥**

---

(1) ఞత్తం = జ్ఞప్తమ్, జ్ఞాత్రమ్. (వైదిక శబ్దము) అని ఛైల్డర్సు (Childers) భావించును. 'జ్ఞప్తంతు జ్ఞపితే' (వైజయన్తి) తెలుపబడినది. 'జ్ఞాతమ్' యొక్క ప్రేరణార్థకరూపము. ఇది 71వ గాథ యందలి 'ఛన్న' శబ్దమునకు వ్యతిరేకరూపమని మాక్సుముల్లర్ భావించును. అతడీ గాథ నిట్లనువదించును.

పాపకర్మము జ్ఞప్తమైనపుడు (తెలుపబడినపుడు) అది మూర్ఖునకు దుఃఖము దెచ్చును. అపుడదియాతని ఉజ్జ్వలభాగధేయమును (bright lot) నాశమొనర్చును; కాదు, అతని తలను ఛిద్రీకరించును. (చూడు : ధమ్మపదం - F. Maxmuller S.B.E. Vol X - p. 22)

(2) అసత్తభావనం - పా.భే. చూడు : ధమ్మపదం - Professor N.K. Bhagwat. - The Buddha Society - Bombay

(అసతాం భావన మిచ్ఛేత్, పురస్కారఞ్చ భిక్షుషు I
ఆవాసేషు చైశ్వర్యం, పూజాం పరకులేషు చ I 14 I)

మూర్ఖుడు, అసద్వస్తువులను (మిథ్యాయశమును), భిక్షువులందగ్రగణ్యతను, విహారములందైశ్వర్యమును, (అధికారమును), ఇతరవర్గములందు పూజను (గౌరవమును), ఆకాంక్షించును.

**74. "మమేవ కతమఞ్ఞన్తు, గిహీ పబ్బజితా ఉభే I**
**మమేవాతివసా అస్సు, కిచ్చాకిచ్చేసు కిస్మిచి I"**
**ఇతి బాలస్స సఙ్కప్పో, ఇచ్ఛా మానో చ వడ్ఢతి I 15 I**

("మమైవ కృతం మన్యేతాం, గృహిప్రవ్రజితావుభౌ I
మమైవాతివశౌ స్యాతాం, కృత్యాఽకృత్యేషు కస్మింశ్చిత్"
ఇతి బాలస్య సఙ్కల్ప, ఇచ్ఛా మానశ్చ వర్ధతే I 15 I)

"గృహస్థులు సంన్యాసులు (శ్రమణులు) ఇరువురును, ఈ పని నేనే చేసితినని తలపవలెను. యోగ్యాఽ యోగ్యములైన కార్యములందు, వారు నా యధీనమున నుండవలెను" - ఇట్లు మూర్ఖుని సంకల్పము, ఇచ్ఛ, గర్వము, విజృంభించును.

**సావత్థి (జేతవనము)** **వనవాసి – తిస్సత్థేరుడు**

**75. అఞ్ఞా హి లాభూపనిసా, అఞ్ఞా నిబ్బానగామినీ I**
**ఏవ మేతం అభిఞ్ఞాయ, భిక్ఖు బుద్ధస్స సావకో I**
**సక్కారం నాభినన్దెయ్య, వివేక మనుబ్రూహయే[1] I 16 I**

(1) వివేకము = బోధము, విచారము, సదసత్తుల భేదమెఱుగు జ్ఞానము; కాని, బౌద్ధపారిభాషికార్థమున 'పృథక్కరణము' వేఱుచేయుట, సాంసారికజగత్తునకు వేఱుగ ఏకాంతవాసముండుట '**కాయవివేకము**'. నిరర్థక భావ విచ్ఛేదము '**చిత్త వివేకము**'. సర్వోత్తమమైన పార్థక్యము – పృథగ్భావము – '**ఉపాధివివేకము**' అనగా నిర్వాణము.

**"తత్థ కాయవివేకో, తి కాయస్స ఏకీభావో; చిత్తవివేకో తి అట్ఠసమాపత్తియో; ఉపాధివివేకోతి నిబ్బాణం"....** (బుద్ధఘోషుని – అట్ఠకథ)

బుద్ధదేవుని శిష్యులు సాంసారిక లాభమున నానందింపక ఏకాంతవాసమున నానందింపవలెను. చిరకాల మేకాంతమున నుండగల వారు నేటి కాలమున దుర్లభులు. సాంసారిక (ప్రవృత్తి) మార్గము

(అన్యా హి లాభోపనిషద్-అన్యా నిర్వాణగామినీ।
ఏవ మేత దభిజ్ఞాయ, భిక్షుర్బుద్ధస్య శ్రావకః।
సత్కారం నాఽభినన్దే ద్వివేక మను బృంహయేత్ । 16 ।)

సాంసారిక లాభమునకగు లాభము వేఱు. నిర్వాణ ప్రాపకమగు మార్గము వేఱు. బుద్ధశిష్యుడగు భిక్షువు దీని నెఱిగి (మానవ) సత్కారమును గౌరవింపక వివేకము పెంపొందించుకొనవలెను.

5 బాలవగ్గో సమత్తో

బాలవర్గము సమాప్తము



---

అభ్యుదయ మార్గము. మోక్ష(నివృత్తి) మార్గము శ్రేయోమార్గము. ఈ రెంటిని పృథక్కరించు శక్తియే, వివేకము. ఈ యర్థమున 'వివేక'శబ్దము ఉపనిషత్తులందు ప్రయుక్తము. ఈ గాథలందలి యర్థమే ఉపనిషత్తు నందును స్థాపింపబడినది.

పోల్చు :- "అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ
స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః,
తయోశ్శ్రేయ ఆదదానస్య సాధు
భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయోవృణీతే ।
శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః,
శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే । (కఠ. ఉ. II. 1,2)

వివినక్తి = పృథక్కరోతి (శంకరభాష్యము)

వివేకమున కర్థము పృథక్కరణమనుట శంకరునకు కూడ సమ్మతమే.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## పణ్డిత వగ్గో ఛట్ఠో

## (పణ్డిత వర్గః షష్ఠః)

## 6 పండితవర్గము – షష్ఠాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **రాధథేరుడు**

**76.** నిధీనం వ పవత్తారం, యం పస్సే వజ్జదస్సినం ।
నిగ్గయ్హవాదిం[1] మేధావిం, తాదిసం పణ్డితం భజే ।
**తాదిసం భజమానస్స, సెయ్యో హోతి న పాపియో ॥ 1 ॥**

*(నిధీనామివ ప్రవక్తారం, యం పశ్యే ద్వర్జ్యదర్శినమ్ ।*
*నిగృహ్యావాదినం మేధావినం, తాదృశం పణ్డితం భజేత్ ।*
*తాదృశం భజమానస్య, శ్రేయో భవతి న పాపీయః ॥ 1 ॥)*

వర్జనీయములైన దోషముల జూపి తన్ను మందలించు సంయమవాది, మేధావియునైన పండితుని చూచినచో, మనుజుడట్టివానిని గుప్తనిధిని

---

(1) పోల్చు :- **"నిగ్గయ్హ నిగ్గయ్హాహం, ఆనంద! వక్ఖామి పవయ్హ పవయ్హ ।**
**యో సారో సో ఠస్సతీతి ।** (మజ్ఝిమనికాయము)

వెల్లడించు వానిని సేవించునట్లు సేవించవలెను. అట్టి పండితుని సేవించు వానికి శ్రేయస్సు సిద్ధించును; అమంగళము కలుగదు. (మిత్రుడొనర్చు నిర్వ్యాజమైన విమర్శకు కోపము తగదు).

**సావత్థి (జేతవనము) అస్సజి, పునబ్బసు (భిక్షువులు)**

**77. ఓవదెయ్యానుసాసెయ్య, అసబ్భా చ నివారయే।**
**సతం హి సోపియో హోతి, అసతం హోతి అప్పియో[1] ॥ 2 ॥**

*(అవవదేత్తనుశిష్యాద్, అసభ్యాచ్చ నివారయేత్।*
*సతాం హి స ప్రియో భవతి, అసతాం భవత్యప్రియః । 2 ।)*

సదుపదేశమొనర్చి, అనుశాసించి, అసభ్యాచరణము నివారించునట్టి వాడు, సత్పురుషులకు ప్రియుడును, అసత్పురుషుల కప్రియుడును కాగలడు.

**సావత్థి (జేతవనము) ఛన్నథేరుడు**

**78. న భజే పాపకే మిత్తే, న భజే పురిసాధమే।**
**భజేథ మిత్తే కల్యాణే[2], భజేథ పురిసుత్తమే । 3 ।**

*(న భజేత్ పాపకాని[3] మిత్రాణి, న భజేత్పురుషాధమాన్।*
*భజేత మిత్రాణి కల్యాణాని, భజేత పురుషోత్తమాన్[4] । 3 ।)*

పాపాత్ములగు మిత్రులను సేవింపకూడదు. పురుషాధముల (నీచుల)

---

(1) పోల్చు :- **'సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః।**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః।**
**"అప్రియాణ్యపి పథ్యాని యే వదన్తి నృణామిహ।**
**త ఏవ సుహృదః ప్రోక్తా, అన్యే స్యుర్నామధారకాః" ।**

(పఞ్చతన్త్రమ్ - II -169, 170)

(2) 'కల్యాణమిత్త' శబ్దమిట్లు నిర్వచింపబడినది.
**"పియో గురు భావనీయో వత్తా చ వచనక్ఖమో।**
**గమ్భీరఞ్చ కథం కత్తా నోచ' ఠానేవ నియోజయే"**

(3) పాపాని – రాహులసాంకృత్యాయనుని పాఠము

(4) పురుషాఽనుత్తమాన్ – రాహులసాంకృత్యాయనుని పాఠము (ధమ్మపదం. 78)

సేవింపరాదు. క్షేమంకరులైన మిత్రులతో చెలిమి చేయవలెను; ఉత్తమ పురుషుల సేవింపవలెను.

**సావత్థి (జేతవనము)** **మహాకప్పినథేరుడు**

79. **ధమ్మపీతి సుఖం సేతి, విప్పసన్నేన చేతసా ।**
**అరియ[1] ప్పవేదితే ధమ్మే, సదా రమతి పణ్డితో ॥ 4 ॥**

*(ధమ్మపీతిః సుఖంశేతే, విప్రసన్నేన చేతసా ।*
*ఆర్యప్రవేదితే ధర్మే, సదా రమతే పణ్డితః ॥ 4 ॥)*

ధర్మమును పానమొనరించు (పాలించు) వాడు ప్రసన్న చిత్తముతో సుఖముగ నిద్రించును. (సంతోషముగ జీవించును). బుద్ధిమంతుడు, ఆర్యులు ప్రతిపాదించిన ధర్మమునం దెల్లపుడానందించును.

---

(5) అరియ = ఆర్య 'ఋ' గతౌ గత్యర్థక 'ఋ' ధాతువునకు 'ణ్య' ప్రత్యయము ద్వారా ఆర్య శబ్దము నిష్పన్నమగును. ఆర్యశబ్దమునకు ప్రాచీనమైన అర్థము పూజ్యుడు; శిష్టుడు.

**"కర్తవ్య మాచరన్కామ మకర్తవ్య మనాచరేత్ ।**
**తిష్ఠతి ప్రకృతాచారో న తు ఆర్య ఇతి స్మృతః ।** (వసిష్ఠః).

విశిష్ట శరీరావయవయుక్తమగు మనుష్య జాతిని (Race) నిర్దేశించుటకు 'ఆర్య' శబ్దము ప్రయోగించుట, ఆర్ష బౌద్ధ శాస్త్రములందు మృగ్యము. ఇట్టి అర్థము పాశ్చాత్యుల స్వకపోలకల్పన మాత్రమని భారతీయ పండితుల నిశ్చయము. స్మృతికారుడగు మనువు ఇట్లు చెప్పును. "**ఆర్యరూప మివాఽనార్యం కర్మభిః స్వైర్విభావయేత్**". ఇది జాతి నామము కాదని మహా యోగి శ్రీఅరవిందులు సశాస్త్రీయముగ వివరించినారు. ఆర్యశబ్దము బుద్ధాదిమహాత్ముల నిర్దేశించునని బుద్ధఘోషుని వ్యాఖ్య. **"అరియ ప్పవేదితేతి బుద్ధాదీ హి అరియే హి పవేదితే సతిపట్ఠానాది భేదే బోధి పక్ఖియ ధమ్మే"....** (బుద్ధఘోషుడు)

ఆర్యప్రతిపాదితకర్మ ననుష్ఠించుటయే పండితలక్షణమని మహాభారతము, ఆర్యశబ్దము జాతి వాచకమనుటను ఖండించుచున్నది.

**"ఆర్యకర్మణి రజ్యన్తే భూతి కర్మాణి కుర్వతే ।**
**హితం చ నాఽభ్యసూయన్తి పణ్డితా భరతర్షభ!॥"** (మ.భా. ఉద్యోగ - 33. 25)

సావత్థి (జేతవనము) పండితసామణేరుడు

80. ఉదకం హి నయన్తి నేత్తికా[1], ఉసుకారా నమయన్తి[2] తేజనం ।
దారుం నమయన్తి[3] తచ్ఛకా, అత్తానం దమయన్తి పణ్డితా ॥ 5 ॥

*(ఉదకం హి నయన్తి నేతృకా, ఇషుకారా నమయన్తి తేజనమ్ ।
దారు నమయన్తి తక్షకా, ఆత్మానం దమయన్తి పణ్డితాః ॥ 5 ॥)*

నీటికాలువలు - జలమార్గములు - నిర్మించువారు జలమును (వారి కిష్టమైన చోటికి) ప్రవహింపజేయుదురు. బాణముల నిర్మించువారు వానికి వాడిని (నిశితత్వము) సమకూర్తురు. వడ్రంగులు కొయ్యను చక్కగ చెక్కుదురు. అట్లే పండితులు తమ ఆత్మను నిగ్రహింతురు. (చూడు : 33, 145 గాథలు. నయన్తి - నడుపుదురు. సహజముగ నీరు ప్రవహింపజాలని చోటికి సైతము వారు నీటిని పాఱజేయగలరు)

సావత్థి (జేతవనము) బద్దియథేరుడు

81. సేలో యథా ఏకఘనో, వాతేన న సమీరతి ।[4]
ఏవం నిందా పసంసాసు[5], న సమిఞ్జన్తి పణ్డితా ॥ 6 ॥

---

(1) చీనాదేశపు ధమ్మపదము నందలి పాఠాంతరము ననుసరించి శామ్యూల్ బీల్ (S. Beal) ఇట్లు అనువదించినాడు."The pilot manages his ship" - ఓడ నడుపువాడు (సరంగు) తన ఓడను నిర్వహింపగలడు.

(2) & (3) ఈ రెండు చోట్లను 'దమయన్తి' అను పాఠమే కొన్ని ప్రతులలో కలదు. చూడు : ప్రొఫెసర్ N.K. భగ్వత్, M.A. గారి ధమ్మపదము. దారు శబ్దమును 'ధనువు' అని భగ్వత్ వివరించిరి. (ధనువును నిర్మింతురు.)

(4) రాహుల్‌సాంకృత్యాయన మహాశయుని ధమ్మపదమున ఈ గాథయందలి 'సమీరతి' అనుటకు సంస్కృతచ్ఛాయ యందు 'సమీర్యతే' అనియు, 'సమిఞ్జతి' అనుటకు కూడ 'సమీర్యన్తే' అనియే కలదు. 'సమీరతి' శబ్దమునకు సంస్కృత మందలి 'ఈర్ (క్షేపే, గతౌ, కంపనేచ) ధాతువుననుసరించి 'సమీర్యతే' అను సంస్కృతచ్ఛాయ సమంజసమే. కాని, గాథ యందలి 'సమిఞ్జతి' శబ్దమునకు మాత్రము, సంస్కృతధాతువు 'ఈజ్' (గతి కుత్సనయోః) ననుసరించి 'సమీజ్యన్తే' అనుట బాధకము కాదని కంఛేదీలాల్ గుప్త తన ధమ్మపద వ్యాఖ్యానమున వివరించినారు. డా॥ రైస్‌డేవిడ్స్ మతానుసారం 'సమిఞ్జన్తి' పదము 'ఋజ్జ' ధాతువు నుండి నిష్పన్నము. కాని, ఇది విశేష క్లిష్టమైన కల్పన కాన, 'సమిఞ్జన్తి'కి సంస్కృతచ్ఛాయ 'సమీజ్యన్తే' అనుటయే సముచితము.

(5) పోల్చు :- **'తుల్యనిన్దాస్తుతిర్మౌనీ'** - (భ. గీ. XII. 19) మరియు
**'తుల్యనిన్దాత్మ సంస్తుతిః'** - (భ.గీ XIV. 24)

(శైలో యథైకఘనో, వాతేన న సమీర్యతే।
ఏవం నిందాప్రశంసాసు న సమీర్యన్తే పణ్డితాః। 6।)

కఠిన పాషాణమయ (ఏకఘన) పర్వతము వాయువు చేత కంపింపని యట్లు పండితులు నిందాప్రశంసల యందు చలింపరు.

**సావత్థి (జేతవనము)** **కాణమాత**

**82. యథా పి రహదో గమ్భీరో, విప్పసన్నో అనావిలో।**
**ఏవం ధమ్మాని సుత్వాన[1], విప్పసీదన్తి పణ్డితా। 7।**

(యథాఽపి హ్రదో, గమ్భీరో, విప్రసన్నోఽనావిలః।
ఏవం ధర్మాన్ శ్రుత్వా, విప్రసీదన్తి పణ్డితాః। 7।)

గంభీరము, నిర్మలము, నిశ్చలమునైన సరోవరము వలె, ధర్మములను విని పండితులు ప్రసన్నులు (సంతుష్టులు) అగుచున్నారు.

**సావత్థి (జేతవనము)** **పంచశత భిక్షువులు**

**83. సబ్బత్థ[2]వే సప్పురిసా వజన్తి[3], న కామకామా లపయన్తి సన్తో।**
**సుఖేన ఫుట్ఠా అథవా దుఃఖేన, న ఉచ్చావచం పణ్డితా దస్సయన్తి[4] ।8।**

---

(1) సుత్వాన = సు + త్వాన సంస్కృత 'క్త్వా' ప్రత్యయ స్థానమున పాళీ ధాతువునకు 'తూన', 'త్వాన' 'త్వా' – ఈ మూడు రూపములు వైకల్పికముగ పరమగునని పాళీవ్యాకరణము. (కచ్చాయన IV-2-15).

(2) సబ్బత్థ = సర్వత్ర, సకలావస్థల యందును. 'పఞ్చ కన్ధాది భేదేసు సబ్బధమ్మేసు' – భదన్త బుద్ధఘోషుడు. (పంచస్కంధాది ధర్మములందు).

(3) 'చజన్తి' – ఈ పాఠము బుద్ధఘోష సమ్మతము. మాక్సిముల్లర్ మొదలగు పండితులు 'వజన్తి' పాఠమునే తమ వివరణమున నంగీకరించినారు. 'చజన్తి' = త్యజన్తి. సత్పురుషులు అర్హత్ ప్రాప్తి వలన కల్గు విజ్ఞానము చేత కామమును త్యజించి, నిందాప్రశంసలు, సుఖదుఃఖములు, లాభాలాభములు, యశోఽయశస్సులు అను లోకధర్మములచే చలింపరు. సర్వావస్థల యందును వారు త్యాగమునే అనుష్ఠింతురు. చూడు : డా॥ యస్. రాధాకృష్ణన్ గారి ధమ్మపదము (1982)

(4) పోల్చు :- **దుఃఖే ష్వనుద్విగ్నమనాః, సుఖేషు విగతస్పృహః।**
**వీతరాగభయక్రోధః, స్థితధీర్మని రుచ్యతే।** (భ.గీ. II 56.)

సత్పురుషులు పంచస్కంధాదికమగు సర్వవిషయరాగమును, అర్హత్స్థితి పొందుట వలన త్యజింతురు. చూడు :- నారదమహాథేరుని దమ్మపదము. (Maha Bodhi Society of India-1962).

(సర్వత్ర వై సత్పురుషా వ్రజన్తి, న కామకామా లపన్తి సన్తః ।
సుఖేన స్పృష్టా అథవా దుఃఖేన, నోచ్చావచం పణ్డితా దర్శయన్తి । 8 ।)

సత్పురుషులు సర్వత్ర సంచరింతురు. కామముల నభిలషించి వ్యర్థ ప్రలాపము లాడరు. సుఖముగాని, దుఃఖముగాని, తమ్ము స్పృశించినపుడు ఆచరణమున ఉచ్చనీచములైన వికారములను ప్రదర్శింపరు.

**సావత్థి (జేతవనము)** **ధమ్మికథేరుడు**

**84. న అత్తహేతు న పరస్స హేతు,**
**న పుత్త మిచ్ఛే న ధనం న రట్ఠం ।**
**న ఇచ్ఛెయ్య అధమ్మేన సమిద్ధిమత్తనో,**
**న సీలవా పఞ్ఞవా ధమ్మికో సియా । 9 ।**

(నాఽఽత్మ హేతో ర్నపరస్య హేతోః,
ర్నపుత్ర మిచ్ఛేన్న ధనం న రాష్ట్రమ్ ।
నేచ్ఛేదధర్మేణ సమృద్ధి మాత్మనః,
సశీలవాన్ ప్రజ్ఞావాన్ ధార్మికః స్యాత్ । 9 ॥)

తన కొఱకు గాని, ఇతరుల కొఱకు గాని, పుత్ర, ధన, రాజ్యములనే మనుజు డభిలషింపడో, అధర్మమార్గమున ఆత్మసమృద్ధి నాకాంక్షింపడో, అట్టివాడే శీలవంతుడు, ప్రజ్ఞావంతుడు, ధార్మికుడును కాగలడు.

**సావత్థి (జేతవనము)** **ధమ్మసమణుడు**

**85. అప్పకా తే మనుస్సేసు, యే జనా పారగామినో(1) ।**
**అథాయం ఇతరా పజా, తీర మేవాను(2) ధావతి । 10 ।**

(అల్పకాస్తే మనుష్యేషు, యే జనాః పారగామినః ।
అథేమా ఇతరాః ప్రజాః తీరమేవాఽనుధావతి । 10 ।)

ఆవలి తీరమును జేరువారు మనుష్యులలో కొందఱు (అల్ప సంఖ్యాకులు) మాత్రమే. ఇతరులు తీరముననే (సంసారముననే) పరుగులెత్తుచున్నారు.

86. యేచ ఖో[1] సమ్మదక్ఖాతే, ధమ్మే ధమ్మానువత్తినో ।
తే జనా పారమేస్సన్తి, మచ్చు[2]ధెయ్యం సుదుత్తరం ॥ 11 ॥

*(యే చ ఖలు సమ్యగాఖ్యాతే, ధర్మే ధర్మానువర్తినః ।*
*తే జనాః పారమేష్యన్తి, మృత్యుధేయం సుదుస్తరమ్ ॥ 11 ॥7)*

ధర్మము చక్కగా బోధింపబడినపుడు, ఎవరా ధర్మము ననుసరించుచున్నారో వారే, సుదుస్తరమగు మృత్యుగృహీత సంసారసాగరముయొక్క పారమును బొందుచున్నారు. (ధేయః = విధేయః; వశ్యః)

**సావత్థి (జేతవనము)** **పంచశత ఆగంతుక భిక్షువులు**

87. కణ్హం[3] ధమ్మం విప్పహాయ, సుక్కం[4] భావేథ పణ్డితో ।
ఓకా అనోకం ఆగమ్మ, వివేకే యత్థ దూరమం ॥ 12 ॥

---

(1) సంస్కృతమందలి 'ఖలు' శబ్దమునకు పాళీ భాష యందు 'ఖలు', 'ఖో' అని రెండు రూపములున్నవి. ప్రాకృతమున 'ఖలు' కు 'క్ఖు' నిపాతము. ఇది వినిశ్చిత, వితర్క, సంభావనములందు వచ్చుచున్నది.

(2) మచ్చు = మృత్యు. సంస్కృత 'ఋ' కారమునకు, పాళీ, ప్రాకృతములందు 'అ' కారమాదేశమగును. 'త్య' స్థానమున 'చ్చ' వచ్చుట కూడ ప్రాకృతభాష యొక్క ఒక విశిష్టత. 'మచ్చుధెయ్యం' - ఈ పదము ద్వితీయావిభక్తి రూపము. దీనిపై 'తరిత్వా' అను త్వార్థకము. (భూతకాల అసమాపకక్రియా పదమును) అధ్యాహార (ఊహ) మొనర్చి, అన్వయమును టీకాకారుడు సాధించెను. మాక్సుముల్లర్ పండితుడు 'పారమేస్సన్తి' అతిక్రమింతురను అర్థమున ఏకపదముగ గ్రహింపవలయునని వ్రాసెను. possibly 'Paramessanti' should be here taken as one word in the sense of overcoming. (See: B.B.E. Vol. X. Page 25)

(3) కణ్హం ధమ్మం = అకుశలకర్మపథము. ఇది దశవిధపాపములతో కూడినది.
**కాయకర్మములు** :- హింస, చౌర్యము, వ్యభిచారము
**వాచిక కర్మములు** :- అసత్యభాషణము, పిశునవచనము (కొండెములు చెప్పుట), పరదూషణము, వ్యర్థప్రలాపము.
**మానసిక కర్మములు** :- లోభము, ద్వేషము, అసత్యవిశ్వాసము.

(4) సుక్కం ధమ్మం - దశవిధకుశలకర్మపథము. పూర్వోక్త దశ విధ అకుశల కర్మముల విసర్జించి, వానికి ప్రతిపక్షభావనములగు అహింసాఽస్తేయాదుల ననుష్ఠించుట.

(కృష్ణం ధర్మం విప్రహాయ, శుక్లం భావయేత్ పణ్డితః ।
ఓకాదనోక మాగమ్య,[1] వివేకే [2]యత్ర దూరమమ్ । 12 ॥)

పండితుడు (వివేకవంతుడు) కృష్ణధర్మము (తమోమయావస్థను) పరిత్యజించి, శుక్లధర్మము (తేజోమయావస్థను) భావింపవలయును. గృహ (సామాన్య) జీవనమునుండి, గృహరహిత (అనికేతభిక్షు) జీవనమును పొంది, అనుభూతికి దుస్సాధమగు వివేకమున (ఏకాంతమున, నిర్వాణమున) నానందింపవలయును.

---

పోల్చు :- 'వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ ' । యోగదర్శనము II. 33

హింసాది విశేష సంకల్పములు యమనియమాదుల బాధింపగా వానికి విరుద్ధమైన భావన మొనర్పవలయును.

**'తదుభయాని విచెయ్య పణ్డరాని,**
**అజ్ఝత్తం బహిద్ధా చ సుద్ధి పఞ్ఞో ।**
**కణ్హం సుక్కం ఉపాతివత్తో పణ్డితో తాది పవుచ్చతే తథత్తా'।**

(సుత్తనిపాతము III. 6-17 (సభియసుత్తము-17)

బాహ్యాభ్యంతర ఉభయ విషయముల పరిశీలించి, శుద్ధ ప్రజ్ఞను పొంది, పాప పుణ్యముల నతిక్రమించి స్థిరచిత్తుడగువాడు, పండితుడని చెప్పబడును. (చూడు : 42 గాథ - పాదటీక)

(1) 'ఓకా అనోకం ఆగమ్మ' - (ఓకాదనోకమాగమ్య) ఈ వాక్యము సంన్యాససూచకము. భారత మందును, గీత యందును, ఈ విషయమున 'అనికేత' శబ్దము ప్రయుక్తము. (భ.గీ. XII.19) 'ముండుండు అనికేతనుండు' - తిక్కన శాంతి పర్వము.

(2) వివేకే = ఏకాంతే. పోల్చు :- ధమ్మపదము VII - 10 (99)
వివేకప్రాప్తి కఠినము దుష్కరమునని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుని అనువాదము. 'That retirement is so hard to love.' — Page 87. వివేకే-నిర్వాణే. చూడు ధమ్మపదము 75 గాథా వివరణము. (దుర్ + రమమ్ = దూరమమ్)
కణ్హ - కృష్ణ= ప్రాకృతమున 'ష్ణ' కు 'ణ్హ' ఆదేశమగును. కాని, పాళీవై యాకరణులు - మొగ్గలావాదులు - 'కణ్హ', 'తణ్హా' మొదలగు శబ్దముల (సంస్కృతభాషాధారము నంగీకరింపక) నిపాతములని భావింతురు. కాని, సామాన్యలక్షణము ద్వారా సిద్ధించు శబ్దములకు నిపాతసిద్ధిని భావించినచో, నిపాతసంజ్ఞ అప్రయోగము కాగలదు. (చూడు : శ్రీ కంఛేదీలాల్ గుప్త ధమ్మపదం -పుట. 46)
ఉ = తృష్ణా = తణ్హా (హ్న - స్న -ష్ణ - క్ష్ణ - శ్నానాం ణ్హః - ప్రాకృత ప్రకాశము III. 33)

**88. తత్రాభిరతి మిచ్ఛేయ్య, హిత్వా కామే అకిఞ్చనో[1] ।**
**పరియోదపెయ్య[2] అత్తానం, చిత్తక్లేసే[3]హి పణ్డితో ॥ 13 ॥**

*(తత్రాఽభిరతి మిచ్ఛేద్, హిత్వా కామాన్ అకిఞ్చనః ।*
*పర్యవదాపయేద్ ఆత్మానం, చిత్తక్లేశైః పణ్డితః ॥ 13 ॥)*

పండితుడు (వివేకవంతుడు) కామముల (విషయభోగముల) పరిత్యజించి, అకించనుడై (సర్వమును త్యజించి) ఏకాంతము (నిర్వాణము)నందు అభిరతి నాకాంక్షింపవలయును. చిత్తక్లేశముల నుండి ఆత్మను (తన్ను) పరిశుద్ధ మొనరించుకోవలయును.

**89. యేసం సమ్బోధియఙ్గేసు[4], సమ్మా చిత్తం సుభావితం ।**
**ఆదానపటినిస్సగ్గే, అనుపాదాయ యే రతా ।**
**ఖీణాసవా జుతీమన్తో, తే లోకే పరినిబ్బుతా[5] ॥ 14 ॥**

---

(1) అకిఞ్చనః - నాస్తి కించన యస్య - అకించనత, ద్రవ్య త్యాగమును నిర్దేశించును
**'అకిఞ్చనః సుఖం శేతే, సముత్తిష్ఠతి చైవ హి ।**
**అకిఞ్చన్యం సుఖం లోకే, పథ్యం శివ మనామయమ్ ॥'** (మ.భా. శాంతి 176-78)

(2) పరియోదపెయ్య = పర్యవదాపయేత్. 'పరి + అవ + దై' ధాతువున కర్థము శుద్ధికరణము 'అవ' ఉపసర్గతో కూడిన 'దై' ధాతువునకర్థము స్వచ్ఛమొనర్చుట, పవిత్రీకరించుట.
**దై-(దాయతి) శోధనే ।**

(3) పోల్చు :- **'అవిద్యాఽస్మితా రాగద్వేషాఽభినివేశాః పఞ్చక్లేశాః ।'** (యోగదర్శనము II - 3)
బౌద్ధ శాస్త్రములందు చిత్తక్లేశముల భదన్త బుద్ధఘోషుడిట్లు వివరించును.
**"చిత్తక్లేసా హి పఞ్చహి నీవరణేహి"** నీవరణములనగా, అంతరాయములు. అవి, కామచ్ఛన్ద (అభిజ్ఝా-Lust) వ్యాపాద (ill will) థీనమిద్ధ (Torpor and sloth) ఉద్ధచ్చకుకుచ్చ (Restlessness and mental worry) విచికిచ్ఛా (Doubt). ఇవి క్రమముగ కామ, క్రోధ, మోహ, మద, దంభములనియు వివరింపబడినది. ఈ క్లేశములు దశవిధములనియు చెప్పబడినది. లోభ, దోస, మోహ, మాన, దిట్ఠి, విచికిచ్ఛా, థిన(స్త్యాన) ఉద్ధచ్చ (ఔద్ధత్య), అహిరిక (అహ్రీకత్వ), అనోత్తప్ప - అనునవి.

(4) బోధి పక్షీయ ధర్మములు 37 (ముప్పదియేడు). అందు సంబోధి అంగములు 7 (ఏడు). అవి సతి, ధమ్మవిచయ, వీరియ, పీతి, పస్సద్ధి, సమాధి, ఉపేక్ఖా, అనునవి. ఇవి సాధనసోపానములు. ఇవి క్రమముగ, ఆత్మసంయమము, ధర్మార్థాన్వేషణ, శక్తి, ఆనంద, శాంతి, సమాధి, తితిక్షలని భావము. (చూడు : డా॥ రత్నాకరం బాలరాజు - 'బుద్ధదర్శనము' - పుటలు 207, 208-1962).

(5) పరినిబ్బుతా - పరినిర్వృతాః = నిర్వాణసిద్ధిని పొందినవారు.

(యేషాం సమ్బోధ్యఙ్గేషు, సమ్యక్చిత్తం సుభావితం ।
ఆదానప్రతినిస్సర్గే, అనుపాదాయ యే రతాః ।
క్షీణాస్రవా జ్యోతిష్మన్త, స్తేలోకే పరినిర్వృతాః ॥ 14 ॥)

ఏడు సంబోధిఅంగములం దెవరి చిత్తము సుప్రతిష్ఠితమో, ఎవరు పరిగ్రహ పరిత్యాగపూర్వకమగు అపరిగ్రహముననానందింతురో (సర్వసంగనిర్ముక్తులై యెవరు అపరిగ్రహమున - నిర్వాణముననానందింతురో) అట్టి మనో మాలిన్యరహితులైన దీప్తిమంతులు. సంసారమున నిర్వాణసిద్ధి పొందుదురు.

*6 పణ్డిత వగ్గో నమత్తో*

పండితవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## అరహన్త* వగ్గో సత్తమో

## (అర్హద్వర్గః, సప్తమః)

## 7 అర్హద్వర్గము – సప్తమాధ్యాయము

రాజగృహము (జీవకుని ఆమ్రవనము) జీవకవైద్యుడు

90. గతద్ధినో విసోకస్స, విప్పముత్తస్స సబ్బధి ।
సబ్బగన్థప్పహీనస్స, పరిళాహో[1]న విజ్జతి ।

---

* అర్హంతుడు :- దశవిధసంయోజనముల (బంధముల) నుండి విముక్తుడై ఆధ్యాత్మికపరిపూర్ణత బొందిన మహాత్ముడు; జీవన్ముక్తుడు. జైనులు సైతము ఈ పదమును పూర్ణస్థితి పొందిన మహాత్ముని కుపయోగింతురు.

....“సర్వజ్ఞో, జితరాగ ద్వేషస్త్రైలోక్య పూజితః ।
యథాస్థితార్థవాదీచ, దేవోఽర్హన్, పరమేశ్వరః ।”
“సర్వజ్ఞో, వీతరాగో, ఽర్హన్, కేవలీ, ధర్మచక్రభృత్ ।
తీర్థంకర, స్తీర్థకర, స్తీర్థకృద్దివ్య వాక్పతిః ।”
అని జైనులు ఆదిజినుని వర్ణించినారు.

(1) పరిళాహో :- పరిదహ్. ‘దహ’ ధాతువు యొక్క ‘ద’ కారమునకు ‘ళ’ కారము వికల్పముగ ఆదేశమగును. పరిదాహము=సంతాపము. శారీరకమానసిక(చైతసిక)ములని సంతాపము ద్వివిధము. ‘ద్వివిధో పరిళాహో కాయికో చేతసికో’ – అని భదన్త బుద్ధఘోషుని అట్ఠకథా వ్యాఖ్య.

(గతాద్ధునో విశోకస్య, విప్రముక్తస్య సర్వథా[1]।
సర్వగ్రంథ[2] ప్రహీణస్య, పరిదాహో న విద్యతే ॥ 1 ॥)

మార్గసమాప్తిని - గమ్యమును - పొందినవాడును, శోకరహితుడు, సర్వ విషయవిముక్తుడు, సర్వబంధవిచ్ఛేదకుడునైన వానికి ఏ సంతాపము (రాగజ్వరము) నుండదు.

---

(1) సబ్బధి :- దీనికి సంస్కృతమూలము అనిశ్చితము. అర్థ సాదృశ్యము ననుసరించి 'సర్వథా' అను నర్థమున నన్వయించుకొనవలెను. 'సర్వధా' అని వ్రాయుట భ్రమాత్మకము సంస్కృతమున 'ధా' ప్రత్యయము లేదు. 'ద్విధా' 'త్రిధా' 'విధా' మొదలగు వాని యందలి 'ధా', ప్రత్యయము కాదు 'సబ్బధి' పాళీ భాషయందొక 'అనియమిత' పదముగా భావించుట సముచితమని పండితుల అభిప్రాయము (చూడు : ధమ్మపదం - కంఛేదీలాల్ గుప్త - పుట. 50)

(2) సబ్బగన్థ(సర్వగన్థ) :- బంధము ఇవి నాల్గు. అభిజ్ఝా(కామము), వ్యాపాదము (ద్రోహచింతనము) సీలబ్బతపరామాస(దోషయుక్తములైన కర్మకలాపములపై ఆసక్తి) ఇదం సచ్చాభినివేస(స్వమతాభినివేశము) అనునవి. నిర్వాణ పథమున సాధక వర్గములో 'స్రోతాపన్న, సకృదాగామి, అనాగామి, అర్హంతుడు అనువారు ఉత్తరోత్తర ఉత్కృష్టులు. (చూడు : ధమ్మపదం - 45 గాథ పాదటీక Foot Note 5)

**దశవిధ సంయోజనములు** :- సంయోజనమనగా భవ-సంసార-చక్రమునకు జీవుల బంధించునది యని అర్థము.

(1) సక్కాయదిట్ఠి :- 'అహము' సత్యమను భ్రాంతి
(2) విచికిచ్ఛా :- సందేహము.
(3) సీలబ్బతపరామాస :- కేవల కర్మకలాపాసక్తి.
(4) కామరాగము :- విషయకామము
(5) వ్యాపాదము :- ద్రోహచింతనము
(6) రూపరాగము :- భౌతికరూపాసక్తి
(7) అరూపరాగము :- అభౌతిక దేవాదిలోకములందాసక్తి
(8) మానము :- దర్పము, స్వాతిశయము
(9) ఉద్ధచ్చ :- ఔద్ధత్యము, అశాంతి
(10) అవిజ్జా :- అవిద్య, అజ్ఞానము.

ఈ బంధముల ననేక విధముల బౌద్ధశాస్త్రములు వర్ణించును (చూడు: 31 గాథపైని పాదటీక)

రాజగృహము (వేళు(ణు)వనము మహాకస్సపథేరుడు

91. ఉయ్యుఞ్జన్తి సతీమన్తో[1], న నికేతే రమన్తి తే ।
హంసా'వ పల్లలం హిత్వా, ఓకమోకం జహన్తి తే । 2 ।

*(ఉద్యుఞ్జతే[2] స్మృతిమన్తో, న నికేతే రమన్తే తే ।*
*హంసా ఇవ పల్వలం హిత్వా, ఓక[3] మోకం జహతి తే । 2 ।)*

స్మృతిమంతులు (వివేకవంతులు) నిర్వాణప్రాప్తికి ప్రయత్నింతురు; గృహానురక్తులు కారు. హంసలు, పల్వలము (క్షుద్ర జలాశయము)ను వదలిపోవునట్లు వారు గృహములను వదలిపోదురు.

---

(1) సతి + మన్తో – 'దీఘం (కచ్చాయన-సూత్రము 1/3/3)' అను సూత్రము ననుసరించి 'ఇ' కారమునకు దీర్ఘము వచ్చును. సతి = స్మృతి (సంస్కృతము) సతి – ప్రాకృత ప్రకాశము (1-27) 'ఋతోఽత్' సూత్రము ననుసరించి 'ఋ'కారమునకు 'అ' కారము ఆదేశమై, 'అధోమనయామ్' (ప్రా ప్ర.3-2) సూత్రానుసారము 'మ' కారము లోపించినది. 'సతి' శబ్ద వ్యుత్పత్తి కచ్చాయన వ్యాకరణ మిట్లు వివరించినది :- 'సర్ ధాతు ('సర్ గతి, చిన్తా, హింసా, సద్దే – ధాతు మఞ్జూష-58) వునకు 'తి' ప్రత్యయము పరమగునపుడు 'ర' కారము లోపించును. ('ర' కారోచ' IV. 3-17) సతీమన్తో = స్మృతిమన్తః. స్మృతి, సంబోధి అంగములలో మొదటిది. (చూడు :- 89 గాథపై గల పాదటిక). 'చిన్తా, స్మృతి రాధ్యానమ్' – అమరకోశము. అష్టాంగ మార్గమున 'సమ్మాసతి' – (సమ్యక్స్మృతి) ఏడవ భూమిక. స్వగత చైతన్యానుభూతి దీని యర్థమని కొందఱి వివరణము.

(2) ఉయ్యుఞ్జన్తి = ఉద్యుఞ్జతే – (ఉత్ + యుఞ్జతే) –సాధారణ సమీకరణ నియమము (Assimilation) ననుసరించి, పాళీ భాష యందు 'ద్య' 'య్య'గా పరిణమించినది. ప్రాకృతమున 'ద్య' స్థానమున 'జ్జ' ఆదేశమగుట నియతము. 'త్య, థ్య, ద్యాం, చ ఛ జాః, శేషాదేశయోర్ద్విత్వ మనాదౌ' – (ప్రా. ప్ర.III.37, III.50) పాళీ భాష యందును ఈ నియమము 'విజ్జా' మొదలగు శబ్దములలో కాన్పించుచున్నది. మాక్సీముల్లర్‌పండితుడు 'ఉయ్యుఞ్జన్తి' అను శబ్దమును గమనార్థమున స్వీకరించి నిర్గమింతురు' (Depart) అని వివరించును. అనగా, వారు స్మృతిమంతులై కుటుంబజీవనమును వదలి సంన్యాసజీవనమును పరిగ్రహింతురని భావము. 235 గాథయందలి 'ఉయ్యోగముఖే' అను శబ్దమీయర్థమునే తెలుపుచున్నదని మాక్సీముల్లర్ భావము. కాని భదన్తబుద్ధఘోషుడు మాత్రము 'ఉయ్యుఞ్జన్తి' శబ్దమునకు 'ఉద్యమింతురు' అనియే వివరించును. (ఘటెన్తి)

(3) ఓకః :- అకారాంత పుంలింగ శబ్దము. ఓకస్ :- సకారాంత నపుంసకలింగము. ఈ రెంటికిని ఆశ్రయము, గృహము, అని అర్థము సమానమే.
**'ఓకో ఆశ్రయమాత్రే చ మందిరే చ నపుంసకమ్'** – (మేదినీకోశము)

**సావత్థి (జేతవనము)** **బేలట్ఠసీసుడు**

**92. యేసం సన్నిచయో నత్థి, యే పరిఞ్ఞాతభోజనా ।**
**సుఞ్ఞతో అనిమిత్తో[1] చ, విమొక్ఖో యేసం,[2] గోచరో ।**
**ఆకాసే' వ సకున్తానం గతి తేసం దురన్నయా[3] ॥ 3 ॥**

(యేషాం సన్నిచయో[4] నాస్తి, యే పరిజ్ఞాతభోజనాః ।
శూన్యతోఽ నిమిత్తశ్చ, విమోక్షో యేషాం గోచరః ।
ఆకాశ ఇవ శకున్తానాం, గతిస్తేషాం దురన్వయా ॥ 3 ॥)

---

(1) 'సుఞ్ఞతో' (శూన్యతః) 'అనిమిత్తో' (అనిమిత్తః) ఈ శబ్దములు రెండును 'విమొక్ఖో' శబ్దమునకు విశేషణములు. ఇవి నిర్వాణమునకు పర్యాయములు. నిమిత్తమనగా కారణము. కారణరహితము అనిమిత్తము. నిర్వాణమున పునర్జన్మాది దుఃఖ కారణము అభావము. భదన్త బుద్ధఘోషు ననుసరించి, రాగాది కారణవిముక్తిని ఈ గాథ ప్రతిపాదించుచున్నది.
**"రాగాది నిమిత్తా భావేన అనిమిత్తం, తేహిచ విముత్తంతి అనిమిత్తో విమొక్ఖో"** (అట్ఠకథ)

(2) 'యస్స' – సింహళీయ పాఠము

(3) దురన్నయా = దురన్వయా = మార్గము అజ్ఞేయము. Difficult to understand. అని మాక్సిముల్లర్ పండితుని అనువాదము. కాని, 'దురన్నయా' = 'దురన్వయా' అనుటకు 'దుః'–దుఃఖేన, అన్వయోఽనుగమనం యస్యాః' – అనుసరణము కఠినము, కష్టమైనది అని భావము.
పోల్చు :- **"శకున్తానా మివాకాశే, మత్స్యానా మివ చోదకే ।**
**యథా పదం నదృశ్యేత, తథా జ్ఞానవతాం గతిః ।** (మ.భా. శాంతి. 182–19)
ఆకాశమున పక్షుల యొక్కయు, నీట చేపల యొక్కయు మార్గమెట్లు గోచరింపదో, అట్లు జ్ఞానవంతుల మార్గము సైతము **దుర్జ్ఞే**యము.
క్రీస్తు నికోడిమస్‌తో నిట్లనును :-
"The wind bloweth where it listeth and thou hearest the sound thereof, but canst not Tell whence it cometh and whither it goeth: So is everyone that is born of the spirit" (Bible - John III - 8.). గాలి రాకపోకలెట్లు తెలియుటకసాధ్యమో, జ్ఞానుల గతి సైతము తెలిసికొనుట కసాధ్యమని భావము.

(4) సన్నిచయ :- వస్తు సంచయము మాత్రమే కాదు; పారమార్థిక వస్తు సంచయమని కూడ దీని భావము. ఈ సన్నిచయము ద్వివిధము; 'కర్మసన్నిచయము', 'ప్రత్యయ సన్నిచయము'.
'ద్వే సన్నిచయా కమ్మసన్నిచయో పచ్చయ సన్నిచయో. చ' (అట్ఠకథ)
**'ద్వేమే భిక్ఖవే సన్నిచయా । ఆమిససన్నిచయో, చ ధమ్మసన్నిచయో చ'** (అఙ్గుత్తర నికాయము.)

ఎవరు ధన సంచయమొనరింపరో, భోజన విషయమున వివేకమును పాటింతురో; శూన్యము, నిరుపాధికము (కారణ రహితము)నైన మోక్షము (నిర్వాణము)ను దర్శింతురో, అట్టి వారి మార్గము, ఆకాశమున పక్షులమార్గము వలె గ్రహింప సాధ్యము కాదు. (అనుగమనము - అనుసరణము దుస్సాధము)

(శూన్యము - రాగ, ద్వేష, అవిద్యారహితము - It is void of lust, hatred and ignorance - Narada Maha Thera)

**రాజగృహము (వేళు(ణు)వనము** **అనురుద్ధథేరుడు**

93. **యస్సాసవా[1] పరిక్ఖీణా, ఆహారే చ అనిస్సితో[2] ।**
**సుఞ్ఞతో అనిమిత్తో చ, విమోక్ఖో యస్స గోచరో ।**
**ఆకాసే'వ సకున్తానం, పదం తస్స దురన్నయం । 4 ।**

(యస్యాస్రవాః పరిక్షీణా, ఆహారే చ అనిస్సృతః ।
శూన్యతోఽ నిమిత్తశ్చ విమోక్షో యస్య గోచరః ।
ఆకాశ ఇవ శకున్తానాం పదం తస్య దురన్వయమ్ । 4 ॥)

ఎవని చిత్త క్లేశములు (రాగాదులు) నశించినవో, ఎవనికి ఆహార మందనాసక్తియో, ఎవనికి శూన్యతా (రాగాదిరహిత) రూపమును, నిమిత్త (కారణ) రహితమగు నిర్వాణము దృగ్గోచరమో, అట్టి వాని మార్గము, ఆకాశమున పక్షుల మార్గము వలె గ్రహింప సాధ్యపడదు.

---

(1) ఆసవములు (ఆస్రవములు) నాల్గు; కామాసవ, భవాసవ, దిట్ఠాసవ, అవిజ్జాసవములు.
దిట్ఠాసవము = మిథ్యాదృష్టి.

(2) పోల్చు :- ఔసధవదశనమాచరేత్ - ఆరుణికోపనిషత్)
**ఔషధవత్ ప్రీతింవినా శరీరస్థిత్యర్థ మశనం భోజన మాచరేత్ ।**
జిహ్వాచాపల్యమునకు కాక, శరీరస్థితి కొఱకు మాత్రమే, ఆహారమును భుజింపవలెను.

సావత్థి (పుప్ఫారామము) మహాకచ్చానత్థేరుడు

94. యస్సిన్ద్రియాని సమథం గతాని ।
అస్సా యథా సారథినా[1] సుదన్తా ।
పహీనమానస్స అనాసవస్స ।
దేవాపి తస్స పిహయన్తి తాదినో ॥ 5 ॥

(యస్యేంద్రియాణి శమథం గతాని ।
అశ్వా యథా సారథినా సుదాన్తాః ॥
ప్రహీణమానస్య అనాస్రవస్య ।
దేవా అపి తస్మై స్పృహయన్తి తాదృశః ॥ 5 ॥)

సారథిచే అశ్వములు సుశిక్షితములైనట్లు, ఎవని ఇంద్రియములు శాంతి వహించినవో, ఎవడు మాన (గర్వ) రహితుడో, ఆస్రవ (రాగది వాసనా) రహితుడో, అట్టివాడు దేవతలకు సైతము స్పృహణీయుడు.

సావత్థి (జేతవనము) సారిపుత్తథేరుడు

95. పథవీ[2] సమో నో విరుజ్ఝతి, ఇన్దఖీలోపమో తాది సుబ్బతో ।
రహదో[3] వ అపేతకద్దమో, సంసారా న భవన్తి తాదినో[4] ॥ 6 ॥

---

(1) నిర్వాణమును పొందిన బుద్ధ భగవానుని శిష్యుడు దేవతలకు సైతము అతీతుడు; కోరదగినవాడు. సారథి ఉపమానము కఠ. ఉ. నందును కలదు.

**"ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవ తు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవ చ ।**
**ఇంద్రియాణి హయానాహు, ర్విషయాంస్తేషు గోచరాన్ ॥** – ఇత్యాది. (కఠ.ఉ. III-3,4) చూడు :- మిళిందపణ్హా 26 –8.

ప్లేటో మహాశయుడును బుద్ధిని సారథిగను, కామము (Sensibility) మనస్సు (Spirit)– వీనిని అశ్వములుగను వర్ణించినాడు. (Laws, 898 c) చూడు :- 39 గాథపైని పాదటీక.

(2) క్షమా ధరిత్రీ – భూమి క్షమాగుణమునకు ప్రతీక. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడిట్లు వివరించును. ఇది (ఇంద్రకీలము) బలమును, స్థిరతను సూచించును. నిస్తరంగజలాశయము ప్రసన్నతను నైర్మల్యమును దెలుపును.

**"యథా నామ పథవియం సుచీని, గన్ధమాలాదీని పి నిక్ఖిపన్తి, అసుచీని ముత్తకరీసాదీని పి నిక్ఖిపన్తి, యథా నామ నగర ద్వారే నిక్ఖిత్తం ఇన్దఖీలం, దారకాదయో ఓ ముత్తెన్తి పి ఊహదన్తి పి,। అపరే వన తం**

(పృథివీ సమో నవిరుధ్యతే, ఇన్ద్ర కీలోపమస్తాదృక్ సువ్రతః।
హ్రద ఇవాऽ పేతకర్దమః, సంసారా నభవన్తి తాదృశః ॥ 6 ॥)

ఏ సువ్రతుడు భూమివలె (క్షమాశాలియై) దేనితోను విరోధింపడో, ఇంద్రకీలము (ఇంద్రస్తంభము) వలె (వ్రతానుష్ఠానమున) అచలుడో, గభీర జలాశయము వలె నిర్మలుడో, అట్టివారు జననమరణరూపమైన సంసారమును పొందరు. (అర్హంతుల క్షోభారాహిత్యమును ఈ ఉపమానములు వ్యంజించుచున్నవి.)

---

గన్ధమాలాదీహి నక్కోరన్తి, తత్థ పఠవియా ఇన్దఖీలస్స చ నేవ అనురోధో ఉప్పజ్జతి న విరోధో."॥ (భదన్తబుద్ధఘోషవ్యాఖ్య)

పృథివియు, ఇంద్రకీలమును మానాపమానముల రెంటియందును, సమానముగ అవిచలముగనుండనట్లు, అర్హంతుడు మానాపమానముల యందు అనురోధ విరోధముల బొందక అక్షుబ్ధుడై యుండునని భావము.

(3) రహదో = హ్రదః - వర్ణవిపర్యయము

(4) పోల్చు :- "తుల్యనిన్దాస్తుతిర్మౌనీ, సన్తుష్టో యేన కేనచిత్" ॥ (భ గీ. XII - 19)

"న హృష్యత్యాత్మ సమ్మానే నాऽవమానేన తప్యతే।
గాంగో హ్రద ఇవాऽ క్షోభ్యో, యః స పణ్డిత ఉచ్యతే ।(మ భా ఉద్యోగ 33-26)

మానస వాచిక కాయిక (కర్మగత)మని శాంతి, త్రివిధము ఈ త్రివిధ శాంతిని గూర్చి, బౌద్ధ గ్రంథములు, తత్పూర్వములగు ఆర్ష గ్రంథములును, విస్తృతముగ వివరించుచున్నవి పాపము, తచ్ఛాంతి, - ఈ రెంటి యొక్క త్రివిధభేదము అతిప్రాచీనకాలము నుండి మానవజాతి యందంతట ప్రచలితమై యున్నది. మనుస్మృతి యందు శుభాऽశుభకర్మ విషయమున త్రివిధభేదము చెప్పబడినది.

"శుభాऽశుభఫలంకర్మ, మనోవాగ్దేహసంభవమ్।
కర్మజా గతయో నౄణా ముత్తమాధమ మధ్యమాః । (మనుస్మృతి XII-3)

"యదా న కురుతే ధీరః, సర్వభూతేషు పాపకమ్।
కర్మణా మనసా వాచా, బ్రహ్మ సమ్పద్యతే తదా ।(మ.భా శాంతి - 174-54,175-27)

"యే వా పాపం న కుర్వన్తి, కర్మణా మనసా గిరా।
నిక్షిప్తదణ్డా భూతేషు, దుర్గాణ్యతి తరన్తి తే ।(మ.భా. శాంతి 110.7)

"యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతమ్"
(తైత్తిరీయాऽరణ్యకము-X.1.12)

చూడు:- మాక్సుముల్లర్ - దమ్మపదము. 96 గాథ పై FootNote పాదటీక S.B.E. Vol. X. Page 29 మఱియు, చూడు : ధమ్మపదము 231, 232 గాథలు. 'తాదీ' శబ్దము యొక్క షష్ఠి ఏకవచనము 'తాదినో' 'స ఇవ దృశ్యతే' అను నర్థమున సంస్కృతమున, తాదృశ్, తాదృశ, తాదృక్ష - అను ప్రాతిపదిక రూపములు మూడు సిద్ధించును. అట్లే పాళీభాషయందును 'తాదీ' 'తాదిక్ఖో' 'తాదిసో' రూపములు కలవు. ప్రాకృతమున, సంస్కృత 'తాదృశ్' పదమందలి అంత్యహల్లు 'శ్' లోపించును. ప్రాతిపదిక సంజ్ఞక శబ్దము యొక్క అంత్యహల్లు లోపించును. 'ఋ' వర్ణమునకు 'ఇ' కార మాదేశమై 'తాదీ' రూపము సిద్ధించుచున్నది.

సావత్థి (జేతవనము) తిస్సథేరసామణేరుడు
(కోసమ్బిభాసిత తిస్సుడు)

96. సన్తం తస్స మనం హోతి, సన్తా వాచా చ కమ్మ చ।
సమ్మదఞ్ఞా విముత్తస్స, ఉపసన్తస్స తాదినో ॥ 7 ॥

శాన్తం తస్య మనో భవతి, శాన్తా వాక్ చ కర్మ చ।
సమ్యగ్ జ్ఞాన విముక్తస్య, ఉపశాన్తస్య తాదృశః ॥ 7 ॥

సమ్యగ్ జ్ఞానప్రాప్తి వలన విముక్తుడును, ఉపశాంతుడునైన వాని మనస్సు, వాక్కు, కర్మము, ప్రశాంతిని పొందును.

సావత్థి (జేతవనము) సారిపుత్తథేరుడు

97. అస్సద్ధో[1] అకతఞ్ఞూ[2] చ, సన్ధిచ్ఛేదో[3] చ యో నరో।
హతావకాసో వన్తాసో, స వై ఉత్తమపోరిసో ॥ 8 ॥

---

(1) అస్సద్ధో = అశ్రద్ధః - శ్రద్ధారహితః - ఈ శబ్దమిచట విశేషార్థమున ప్రయుక్తము. ఇట్టి అర్థమున మఱెచ్చటను ఈ శబ్దము ప్రయుక్తము కాదు.

"శాస్త్రస్య గురువాక్యస్య, సత్యబుద్ధ్యవధారణమ్।
సా శ్రద్ధా కథితా సద్భి, ర్యయా వస్తూపలభ్యతే ॥ (వి. చూ. 25)

శాస్త్ర గురు వాక్యాదుల యందు నిష్ఠాపూర్ణ విశ్వాసము శ్రద్ధయనబడును. ఇట్టి శ్రద్ధ, ఆర్షగంథములందేకాక, బౌద్ధగ్రంథములందును మిక్కిలి ప్రశంసింపబడినది. (చూడు : ధమ్మపదము - 8 గాథ). ఇచ్చట 'శ్రద్ధా' శబ్దము, విచారశూన్యమగు అంధవిశ్వాసమునకు పర్యాయముగ విశేషార్థమున ప్రయుక్తమగుట గమనింపవలయును.

(2) అకతఞ్ఞూ = అకృతజ్ఞః - ఇదియు ప్రచలితార్థమున కంటే భిన్నార్థమున ప్రయుక్తము. 'కృతము' = ఇతరులచేచేయబడినది -కృతకము, కృత్రిమము. 'అకృతము' = చేయబడనిది అకృత్రిమము, అజాతము, అవినాశి. కాన, అకృతజ్ఞుడనగా నిర్వాణము నెఱిగినవాడు. భదన్తబుద్ధఘోషుడిట్లు వివరించును :-

"అకతం నిబ్బానం జానతీతి అకతఞ్ఞూ - సచ్ఛికతనిబ్బానోతి అత్థో"

(3) సన్ధి = సంసారసన్ధి యని భదన్త బుద్ధఘోషుని వివరణము.

ఈ గాథ మనోజ్ఞమగు విరోధాభాసమున పరమార్థమును వివరించును. ఇది శ్లేషాత్మకమగు గాథయని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుని భావము.

హతావకాసో = హతాఽవకాశః, వన్తాసో = వాన్తాశః - ఇందలి 'అవకాశ' 'ఆశ' శబ్దములును ప్రచలితార్థమున కాక, భిన్నార్థమున - విశేషార్థమున - ప్రయుక్తములని గ్రహింపవలయును.

(అశ్రద్ధోఽకృతజ్ఞశ్చ, సన్ధిచ్ఛేదశ్చ యో నరః ।
హతాఽవకాశో, వాన్తాశః, స వై ఉత్తమపూరుషః । 8 ॥)

(అంధ - మూఢమగు) శ్రద్ధను పరిత్యజించి, అకృతము (నిర్వాణము) నెఱిగి (సంసార) సంధిని (బంధమును) ఛేదించి, (పాపపుణ్యకర్మాచరణమునకు) అవకాశరహితుడై, తృష్ణను వాంత మొనరించిన (క్రక్కివేసిన)వాడు, ఉత్తమ పురుషుడు.

**సావత్థి (జేతవనము)** **ఖదిరవినయ రేవతత్థేరుడు**

98. **గామే వా యది వారఞ్ఞే, నిన్నే[1]వా యది వా థలే[2] ।**
**యత్థారహన్తో విహరన్తి, తం భూమిం రామణెయ్యకం ॥ 9 ।**

(గ్రామేవా యది వాఽరణ్యే, నిమ్నే వా యది వా స్థలే ।
యత్రాఽర్హన్తో విహరన్తి, సాభూమీ రమణీయకా । 9 ॥)

గ్రామముగాని, అరణ్యముగాని, నిమ్నస్థలము(లోయ)కాని, ఉచ్చస్థలము (పర్వతము) కాని, ఎందు అర్హంతులు - మహాత్ములు విహరింతురో, ఆ భూమియే రమణీయమైనది.

---

(1) నిన్నే = నిమ్నే - లోతైన జలమునందు (in the deep water)
(2) థలే = స్థలే = మెట్ట భూమి యందు (on the dry land) అని మాక్సిముల్లరు, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడును, వివరించినారు. 'నిన్నే', 'థలే ఈ రెండు శబ్దములు క్రమముగా సాగరము (Sea)ను, మరుభూమిని (Dry Land - నిర్జల ప్రదేశమును) తెలుపునని ప్రొఫెసర్ N.K. భగ్వత్ అను పండితుడు వివరించును.

సావత్థి (జేతవనము) అరఞ్ఞక భిక్ఖుడు (ఆరణ్యక భిక్షువు)

99. రమణీయాని అరఞ్ఞాని, యత్థ న రమతీ జనో ।
వీతారాగా రమిస్సన్తి, న తే కామగవేసినో ॥ 10 ॥

*(రమణీయాన్యరణ్యాని, యత్ర న రమతే జనః ।*
*వీతరాగా రంస్యన్తే, న తే కామగవేషిణః ॥ 10 ॥)*

(లౌకిక) జనము రమణీయారణ్యముల యందు ఆనందింపదు. కామోపభోగముల నన్వేషింపని వీతరాగులు మాత్రమే అందానందింతురు.

7 అరహన్త వగ్గో సమత్తో

అర్హద్వర్గము సమాప్తము





తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## సహస్సవగ్గో అట్ఠమో

## (సహస్రవర్గోఽష్టమః)

## 8 సహస్రవర్గము – అష్టమాధ్యాయము

రాజగృహము (వేళు(ణు)వనము  తమ్బదాఠిక చోరఘాతకుడు

100. <u>సహస్సమపి చే వాచా, అనత్థ పదసంహితా</u> ।
ఏకం అత్థపదం సెయ్యో, యం సుత్వా ఉపసమ్మతి[1] । 1 ।

---

(1) 'మహావస్తువు' నందు ఈ 'సహస్రవర్గము' ఈ పేరుననే ఉదాహరింపబడినది. "తేషాం భగవాన్ జటిలానాం ధర్మపదేషు సహస్రవర్గం. భాషతి.

"సహస్రమపి వాచానా మనర్థపదసంహితానామ్
ఏకార్థవతీ శ్రేయా, యాం శ్రుత్వా ఉపశామ్యతి ।
సహస్రమపి గాథానా, మనర్థపద సంహితానామ్
ఏకార్థవతీ శ్రేయా, యాం శ్రుత్వా ఉపశామ్యతి ।" (MS.R.A.S. London)

ఇచ్చట పాలీ పాఠమే నిశ్చితముగా ఎక్కువ మౌలికము, నిర్దుష్టము (More original and Perfect) గ, నున్నదని మాక్సుముల్లర్ భావము. చూడు : S.B.E. Vol. X. The Dhammapada - F. Max Muller - Page 31 Foot note.

పోల్చు :- సెంటుపాల్ -I కొరింథి (XIV - 19.) = "Yet in the church, I had rather speak five words with my understanding that by my voice I might teach others also, than ten thousand words in an unknown tongue".

"ఏకః శబ్దః సుప్రయుక్తః, సమ్యగ్జ్ఞాతః, స్వర్గలోకే చ కామధుగ్ భవతి " –

*(సహస్రమపి చే ద్వాచోఽనర్థపదసంహితాః ।*
*ఏకమర్థపదం శ్రేయో, యచ్ఛ్రుత్వోపశామ్యతి ॥ 1 ॥)*

వ్యర్థ పదయుక్తములగు సహస్రవాక్యముల కంటె, దేనిని విన్నచో శాంతి గల్గునో, అట్టి అర్థవంతమగు ఒక పదమే శ్రేష్ఠము.

(అర్థ మెఱుగకున్నను వేదసూక్తులు వల్లించినంత మాత్రమున, ధర్మనిష్ఠులమని మనలో చాలమంది అనుకొందురు. కనిపించని భగవచ్ఛక్తి యెదుట, మోకరిల్లు మానవుని ఆత్మసౌందర్యసంత్రాసముల గూర్చి మన మేమియు నెఱుగము. (డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితుడు)

**రాజగృహము (వేళు(ణు)వనము** **దారుచీరియథేరుడు**

**101. సహస్స మపి చే గాథా, అనత్థ పదసంహితా ।**
**ఏకం గాథాపదం సెయ్యో, యం సుత్వా ఉపసమ్మతి ॥ 2 ॥**

*(సహస్రమపి చేద్ గాథా, అనర్థపదసంహితాః ।*
*ఏకం గాథాపదం శ్రేయో, యచ్ఛ్రుత్వోపశామ్యతి ॥ 2 ॥)*

నిరర్థకపదయుక్తమగు సహస్రగాథల కంటె దేని విన్నంతనే శాంతి సిద్ధించునో, అట్టి ఒక్కగాథాపదమే శ్రేష్ఠము.

**సావత్థి (జేతవనము)** **కుణ్డలకేసి.**

**102. యో చ గాథా సతం భాసే, అనత్థపదసంహితా ।**
**ఏకం ధమ్మపదం సెయ్యో, యం సుత్వా ఉపసమ్మతి ॥ 3 ॥**

*(యశ్చ గాథాశతం భాషేతాఽనర్థపద సంహితాః ।*
*ఏకం ధర్మపదం శ్రేయో, యచ్ఛ్రుత్వోపశామ్యతి ॥ 3 ॥)*

దేని విన్నంతనే శాంతి సిద్ధించునో అట్టి ఒక్క ధమ్మపదము - ధర్మమును గూర్చిన ఒక్క పదము - శ్రేష్ఠము.

(చీనా దేశపు పాఠమిట్లున్నది; అర్థమెఱుగక ఒకడు నూఱుగాథలు పలుమాఱు వల్లింపగల్గినను, అది యంతయు, శ్రవణమాత్రముననే,

చిత్తసంయమసమర్థమై చక్కగా గ్రహింపబడిన ఒక్క వాక్యము నావర్తించుటతో సరిగాదు. అర్థమెఱుగక నూఱు పదములు వల్లించుట వలని ప్రయోజనమేమి? ఒక సత్యము గ్రహించి, విని, తదనుగుణముగ ప్రవర్తించుటయే నిర్వాణమును - మోక్షమును - దర్శించుట. (బీల్-Beal - ధమ్మపదము - 1902 - పుట-104) చూడు:- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితుని ధమ్మపదము - 1982 - పుట-94)

**103. యో సహస్సం సహస్సేన[1], సఙ్గామే మానుసే జినే ।**
**ఏకం చ జెయ్యమత్తానం, స వే సఙ్గామజుత్తమో ॥ 4 ॥**

*(య స్సహస్రం సహస్రేణ, సంగ్రామే మానుషాన్ జయేత్ ।*
*ఏకఞ్చ జయేదాత్మానం, స వై సంగ్రామజిత్తమః ॥ 4 ॥)*

వేయిమార్లు వేయి మంది మనుష్యులను, యుద్ధమున జయింపగల్గిన వాని కంటె ఒక్క ఆత్మను జయించినవాడే నిశ్చయముగ మహోత్తమయుద్ధ విజేత.

**సావత్థి (జేతవనము)** **అనత్థపుచ్ఛక బ్రాహ్మణుడు**

**104. అత్తా[2]హ వే జితం సెయ్యో, యా చాయం[3] ఇతరా పజా ।**
**అత్తదన్తస్స పోసస్స[4] నిచ్చం సఞ్ఞతచారినో ॥ 5 ॥**

---

(1) సహస్సేన సహస్సం (సహస్రేణ సహస్రమ్) = సహస్రమును సహస్రముచే గుణింపగా వచ్చిన సంఖ్య. 1000 × 1000 = 1000000 పది లక్షలు Thousand thousand men- A thousand reckoned by a thousand. అని నారద మహాథేరుని వివరణము. చూడు :- నారదమహాథేర ధమ్మపదము - మహాబోధి సొసైటి ఆఫ్ ఇండియా 1962 (Notes p. 332) - పాదటీక 1

(2) అత్త = (ఆత్మ) శబ్దము పుంలింగము. దాని విశేషణము కూడ పుంలింగమై యుండుట నియమము. కాని, ఇచ్చట 'జితం' అని విశేషణము నపుంసకలింగమున నున్నది. ఈ శబ్దము యొక్క స్థానమున జితో (జితః) అని పుంలింగ ప్రయోగముచితము. భదన్త బుద్ధఘోషుడు (భాష్యకారుడు) దీనిని 'లింగవ్యత్యయ'మని చెప్పెను. ("జితం'తి లిఙ్గ విపల్లాసో")

(3) చ + ఇయం = చాయమ్ (పాళీవ్యాకరణమునను సరించి)

(4) పోసస్స = పురుషస్య. పాళీభాష యందు పురుష శబ్దము 'పురిస'గా మారును. 'పురిసస్స' అనుటకు బదులీ గాథయందు 'పోసస్స'యని ప్రయోగించుట, గాథయందు ఛందస్సౌలభ్యమునకని భావింపవలయును. 'పురిస' శబ్దము వర్ణలోపమును పొంది 'పోస' శబ్దముగా మారినది. పాళీగద్యమునందిట్టి ప్రయోగము మృగ్యము.

*(ఆత్మాహ వై జితః శ్రేయాన్, యా చేయమితరా ప్రజా ।*
*ఆత్మదాన్తస్య పురుషస్య, నిత్యం సంయతచారిణః । 5 ।)*

ఆత్మవిజేతయు, నిత్యసంయతచారియునగుపురుషునకు, ఇతర జనమును జయించుట కంటె తన ఆత్మను జయించుటయే శ్రేయస్కరము (శ్రేష్ఠము).

105. **నేవ దేవో న గన్ధబ్బో, న మారో సహబ్రహ్మునా[1] ।**
**జితం అపజితం కరియా, తథా రూపస్స జన్తునో । 6 ।**

*(నైవ దేవో న గన్ధర్వో, న మారో సహ బ్రహ్మణా ।*
*జిత మపజితం కుర్యాత్, తథా రూపస్య జన్తోః । 6 ।)*

ఇట్టి (ఆత్మ విజేతయగు) వ్యక్తి యొక్క విజయమును బ్రహ్మతో పాటు, దేవగంధర్వమారులు సైతము అపజయముగా మార్చజాలరు.

*రాజగృహము (వేళు(ణు)వనము)* *సారిపుత్తథేరుని మాతులుడు*

106. **మాసే మాసే సహస్సేన, యో యజేథ సతం సమం ।**
**ఏకం చ భావితత్తానం, ముహుత్తమపి పూజయే ।**
**సా యేవ పూజనా సెయ్యో, యఞ్చే వస్సనతం హుతం[2] । 7 ।**

---

(1) బౌద్ధశాస్త్రములు ఇంద్రవరుణాది దేవతలను, గంధర్వయక్షాది దేవ యోనులను అంగీకరించును. కాని వీరందఱు బుద్ధునికి భక్తులు; తదధీనులు.

**"ఆదిత్య విశ్వవసవస్తుషితా భాస్వరాఽనిలాః ।**
**మహారాజిక సాధ్యాశ్చ, రుద్రాశ్చ గణదేవతాః ।**
**విద్యాధరోఽప్సరో యక్షరక్షో గన్ధర్వ కిన్నరాః ।**
**పిశాచో గుహ్యకస్సిద్ధో, భూతోఽమీ దేవయోనయః ।** అని
బౌద్ధుడగు అమరసింహుడు తన అమరకోశమున వివరించును.

చూడు :- ధమ్మచక్కప్పవత్తనసుత్తం.

బాహ్యశత్రు లేవియు మానవున కపకారమొనరింపజాలవు. అతడు తనకు తానే శత్రువు.

**"ఆత్మైవ రిపు రాత్మనః ।** – భ.గీ. VI. 5.

(2) పోల్చు :- **"నహ్యమ్మయాని తీర్థాని, న దేవా మృచ్ఛిలామయాః ।**
**తే పునన్త్యురుకాలేన, దర్శనాదేవ సాధవః ।"** (మ.భా.)

పావన నదీజలములు, మృచ్ఛిలామయములైన దేవతామూర్తులు, బహుకాలానంతరముననే మనల పావనాత్ములజేయును. కాని, సాధువులు దర్శన మాత్రముననే పావనత్వమును ప్రసాదింపగలరు.

(మాసే మాసే సహస్రేణ, యో యజేత శతం సమాః।
ఏకం చ భావితాత్మానం, ముహూర్తమపి పూజయేత్।
సైవ పూజనా శ్రేయసీ, యచ్చేద్ వర్షశతం హుతమ్ ।7।)

ప్రతి మాసము, సహస్రదక్షిణలతో శతవత్సరములు చేసిన, యజ్ఞమునకంటె, భావితాత్ముడైన మహాత్మున కొనర్చిన క్షణమాత్ర పూజనము శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**రాజగృహము (వేళువనము) సారిపుత్తుని భాగినేయుడు.**

**107. యో చ వస్స సతం జన్తు, అగ్గిం పరిచరే వనే।**
**ఏకం చ భావితత్తానం, ముహుత్త మపి పూజయే।**
**సా యేవ పూజనా సెయ్యో, యఞ్చే వస్స సతం హుతం।8।**

(యశ్చ వర్షశతం జన్తు, రగ్నిం పరిచరే ద్వనే।
ఏకం చ భావితాత్మానం, ముహూర్త మపి పూజయేత్।
సైవ పూజనా శ్రేయసీ యచ్చేద్వర్షశతం హుతమ్ ।8।)

శతవర్షములొక వ్యక్తి, వనమున నగ్నిహోత్రము నాచరించినను, భావితాత్ముడగు మహాత్మున కొనరించిన క్షణమాత్రపూజనము, అట్టి శతవర్షహోమమున కంటె శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**రాజగృహము (వేళువనము) సారిపుత్త సహాయక బ్రాహ్మణుడు**

**108. యం కిఞ్చి యిట్ఠం చ[1] హుతం చ లోకే।**
**సంవచ్ఛరం యజేథ పుఞ్ఞపెక్ఖో।**
**సబ్బమ్పి తం న చతుభాగమేతి।**
**అభివాదనా ఉజ్జు[2]గతేసు సెయ్యో।9।**

"తీర్థీకుర్వన్తి తీర్థాని, సుకర్మీకుర్వన్తి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి" తీర్థములకు తీర్థత్వమును, కర్మములకు సుకర్మత్వమును శాస్త్రములకు సచ్ఛాస్త్రత్వమును సత్పురుషులు ప్రసాదింతురు (నారదభక్తి సూత్రములు - 69)

(1) యిట్ఠం వ హుతం వ - బ్రహ్మదేశీయపాఠము.
(2) ఉజ్జు = ఋజు (సం)

(యత్కిఞ్చిదిట్ఠఞ్చ, హుతఞ్చ లోకే।
సంవత్సరం యజేత, పుణ్యాఽపేక్షః।
సర్వమపి తన్న చతుర్భాగమేతి।
అభివాదనా ఋజుగతేషు శ్రేయసీ[1]॥ 9॥)

పుణ్యాపేక్ష గల మనుజుడు లోకమున యేకొద్ది దానహోమములతోనైన నొక సంవత్సరము యజ్ఞమొనర్చినను, అదియంతయు ఋజువర్తనులగు మహాత్ములకొనర్చు అభివాదన(పుణ్య)మున చతుర్థాంశముతో సరిపడదు. మహాత్ములకొనర్చు అభివాదనయే శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**అరణ్ణ కుటిక (కుటీరము)** **దీఘాయుకుమారుడు**

109. **అభివాదన సీలస్స, నిచ్చం వద్ధాపచాయినో[2]।**
**చత్తారో ధమ్మా వడ్ఢన్తి, ఆయు వణ్ణో సుఖం బలం॥ 10॥**

---

(1) బుద్ధభగవానుడు యజ్ఞాది కర్మసాఫల్యమును నిరసింపడు. యజ్ఞాదికర్మమునకు స్వర్గాదిపారలౌకిక సాధనత్వము నందు అవిశ్వాసి కాడు ఆకాలమందలి 'అజితకేశకంబ'లాదులగు నాస్తికాచార్యుల మతమును తథాగతుడు తిరస్కరించెను. ఆ నాస్తికాచార్యుల మతమిది :-
**"నత్థి మహారాజ దిన్నం, నత్థి యిట్ఠం, నత్థి హుతం, నత్థి సుకతదుక్కటానం, కమ్మానం ఫలం విపాకో, నత్థి అయంలోకో, నత్థి పరో లోకో.."॥** (దీఘనికాయము). భగవానుని ఆశయము ఉపనిషద్ఋషుల ఆశయముతో నేకీభవించును.

**"ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం,**
**నాఽన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః।**
**నాకస్య పృష్ఠే సుకృతేఽను భూత్వే -**
**మం లోకం హీనతరం వా విశన్తి।** (ముండకోపనిషత్ 1-2-10)

ఇష్టాపూర్తములే(యాగాదులు, వాపీకూపతటాకాది నిర్మాణములే) పురుషార్థసాధన ప్రధానమని భావించు వారు శ్రేయోరూపమగు ఆత్మజ్ఞానము నెఱుగరు. ఆమూఢులు స్వర్గమున కంటెనూర్ధ్వలోకమున సుకృతము ననుభవించి, మరల నీమానుషలోకమునో, లేక, అంతకంటే హీనతరమైన నరకాదిలోకములనో కర్మశేషము ననుసరించి పొందుదురు.

బౌద్ధవ్యాఖ్యాతలు 'ఇట్ఠ' శబ్దమును పర్వదినముల యందిచ్చు దానమనియు, 'హుతం' శబ్దమును కర్మఫలవిశ్వాసమున, సిద్ధపఱచి అతిథుల కొసగు ఆతిథ్యమనియు, లేక హోమమనియు వివరించినారు. (చూడు : నారదమహాథేరుని ధమ్మపదము, పుట 332 పాదటీక 5.)

(2) 'వుడ్ఢాపచాయినో' - బ్రహ్మదేశీయ పాఠము.

సంస్కృత 'వృద్ధ' శబ్దమునకు 'వద్ధ' శబ్దము ప్రాకృత వ్యాకరణ సమ్మతము. కాని, పాళీ వ్యాకరణానుసారము 'వుడ్ఢ' శబ్దమే సాధువని పండితుల అభిప్రాయము.

పోల్చు :- **"అభివాదన శీలస్య, నిత్యం వృద్ధోపసేవినః।**
**చత్వారి తస్య వర్ధన్తే, ఆయుర్విద్యాయశోబలమ్।**
(మనుస్మృతి II -121)

(అభివాదనశీలస్య, నిత్యం వృద్ధాపచాయినః ।
చత్వారో ధర్మా వర్ధన్తే, ఆయుర్వర్ణః సుఖం బలమ్ । 10 ।)

అభివాదనశీలుడు, నిత్యము వృద్ధులను సేవించువాడునునగు మనుజునకు ఆయువు, వర్ణము (సౌందర్యము) సుఖము, బలము, అను నాల్గు ధర్మములు (శుభములు) వృద్ధిబొందును.

**సావత్థి (జేతవనము) సంకిచ్చసామణేరుడు**

110. **యో చ వస్ససతం జీవే, దుస్సీలో అసమాహితో ।**
**ఏకాహం జీవితం సెయ్యో, సీలవన్తస్స ఝాయినో । 11 ।**

(యశ్చ వర్షశతం జీవే ద్దుశ్శీలోఽ సమాహిత ।
ఏకాహం జీవితం శ్రేయః, శీలవతో ధ్యాయినః । 11 ।)

ఎవడు దుశ్శీలుడు, అసమాహితచిత్తుడునై నూరేండ్లు జీవించునో వాని జీవితమున కంటే, శీలవంతుడు సమాహితచిత్తుడు (ధ్యానశీలుడు)నైన వాని జీవిత మొక దినమైనను శ్రేయస్కరము - శ్రేష్ఠము).

**సావత్థి (జేతవనము) (ఖాణు) కొణ్డఞ్ఞథేరుడు**

111. **యో చ వస్ససతం జీవే, దుప్పఞ్ఞో అసమాహితో**
**ఏకాహం జీవితం సెయ్యో, పఞ్ఞావన్తస్స[1] ఝాయినో । 12 ।**

(యశ్చ వర్షశతం జీవేద్, దుష్ప్రజ్ఞోఽసమాహితః ।
ఏకాహం జీవితం శ్రేయః, ప్రజ్ఞావతో ధ్యాయినః । 12 ।)

ఎవడు దుర్బుద్ధి, అసంయతచిత్తుడునై, నూరేండ్లు జీవించునో, వాని జీవితమున కంటె, ప్రజ్ఞావంతుడు, ధ్యానశీలుడునైన వాని జీవితమొక దినమైనను, శ్రేయస్కరము - శ్రేష్ఠము.

(1) పఞ్ఞవన్తస్స - పాఠాంతరము. పఞ్ఞా శబ్దము యొక్క 'ఆ'కారము 'రస్సం' అను కచ్చాయన సూత్రము (1-3.4) సూత్రమునను సరించి హ్రస్వమగుచున్నది.

**సావత్థి (జేతవనము)** **సప్పదాసకథేరుడు**

**112. యో చ వస్స సతం జీవే, కుసీతో హీనవీరియో ।**
**ఏకాహం జీవితం సెయ్యో, విరియ మారభతో దళ్హం । 13 ।**

*(యశ్చ వర్షశతం జీవేత్, కుసీదో హీనవీర్యః ।*
*ఏకాహం జీవితం శ్రేయో, వీర్యమారభతో దృఢమ్ । 13 ।)*

ఎవడు అలసుడు, హీనవీర్యుడు (అనుద్యోగి)నై నూరేండ్లు జీవించునో, వాని జీవితమునకంటే, వీర్యశాలియు దృఢతాపూర్ణుడునైన వాని జీవితమొక దినమైనను, శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**సావత్థి (జేతవనము)** **పటాచారాథేరి**

**113. యో చ వస్ససతం జీవే, అపస్సం ఉదయవ్వయం[1] ।**
**ఏకాహం జీవితం సెయ్యో, పస్సతో ఉదయవ్వయం[2] । 14 ।**

*(యశ్చ వర్షశతం జీవేద్, అపశ్యన్నుదయవ్యయమ్ ।*
*ఏకాహం జీవితం శ్రేయః, పశ్యత ఉదయవ్యయమ్ । 14 ।)*

ఎవడు (పంచస్కంధముల) ఉత్పత్తి వినాశముల గాంచనేరక (సర్వ సంస్కారముల క్షణ భంగురత్వమును గ్రహింపక,) నూరేండ్లు జీవించునో, వాని జీవితమునకంటె, వాని ఉత్పత్తి వినాశముల దర్శించువాని జీవితమొక దినమైనను శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**సావత్థి (జేతవనము)** **కిసగోతమి**

**114. యో చ వస్ససతం జీవే, అపస్సం అమతం పదం ।**
**ఏకాహం జీవితం సెయ్యో, పస్సతో అమతం పదం । 15 ।**

---

(1) ఉదయబ్బయం - పాఠాంతరము

(2) సంస్కారాది పంచస్కంధముల ఉత్పత్తి వినాశముల నెఱుగుట బౌద్ధ సాధనలో నొకయంగము. (చూడు :- డా॥ రత్నాకరం బాలరాజు - బుద్ధ దర్శనము-1962)

*(యశ్చ వర్షశతం జీవే, దపశ్యన్నమృతం పదమ్ ।*
*ఏకాహం జీవితం శ్రేయః పశ్యతోఽమృతం పదమ్ । 15 ।)*

ఎవడు అమృతపదము (నిర్వాణము)ను గాంచకుండ, నూఱేండ్లు జీవించునో, వాని జీవితమునకంటె, అమృతపదదర్శియగు వాని జీవితమొక దినమైనను శ్రేయస్కరము - శ్రేష్ఠము.

**సావత్థి (జేతవనము)** **బహుపుత్తికా థేరి**

**115. యో చ వస్స సతం జీవే, అపస్సం ధమ్మ ముత్తమం ।**
**ఏకాహం జీవితం సెయ్యో, పస్సతో ధమ్మ ముత్తమం । 16 ।**

*(యశ్చ వర్షశతం జీవే, దపశ్యన్ ధర్మ ముత్తమమ్ ।*
*ఏకాహం జీవితం శ్రేయః పశ్యతో ధర్మ ముత్తమమ్ । 16 ।)*

ఎవడు, ఉత్తమ ధర్మమును గాంచనేరక, నూఱేండ్లు జీవించునో, వాని జీవితమునకంటె ఉత్తమ ధర్మమును దర్శించిన వాని జీవితమొక దినమైనను శ్రేయస్కరము - శ్రేష్ఠము.

*8 సహస్సవగ్గో సమత్తో*

సహస్ర వర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## పాపవగ్గో నవమో

## (పాపవర్గో నవమః)

## 9 పాపవర్గము – నవమాధ్యాయము

**సావత్థి (జేతవనము)** ఏకసాటక బ్రాహ్మణుడు

**116. అభిత్థరేథ కల్యాణే, పాపా చిత్తం నివారయే ।**
**దన్ధం హి కరోతో పుఞ్ఞం, పాపస్మిం రమతీ[1] మనో ॥ 1 ॥**

*(అభిత్వరేత కల్యాణే, పాపాచ్చిత్తం నివారయేత్ ।*
*తన్ద్రాం హి కుర్వతః పుణ్యం, పాపే రమతే మనః ॥ 1॥)*

కల్యాణకరమైన కర్మమొనరించుటకు త్వరపడవలయును. పాపము నుండి చిత్తమును నివారింపవలయును. పుణ్య(కర్మా)చరణమున ఆలసించువాని మనస్సు పాపమున రమించును.

---

(1) రమతి+మనో = రమతీ మనో. వ్యంజన వర్ణమునకు పూర్వమందలి హ్రస్వము కొన్ని సందర్భములలో దీర్ఘమగుచున్నది. స్వరవర్ణమునకు హ్రస్వదీర్ఘముల విధించు 'రస్సం' 'దీఘం' ఆది సూత్రములు, పాళీభాష యందు ఆయా నిర్దిష్ట సందర్భములందే ప్రయోజకములు; విశ్వతోముఖములు కావు. వీని ద్వారా కొన్ని కేవల అనియమిత ప్రయోగములు సిద్ధించుచున్నవి. పాళీభాష యందు స్వరవర్ణముల హ్రస్వత్వ దీర్ఘత్వముల పరివర్తన అనియమిత రూపమునన్నది.

**సావత్థి (జేతవనము)** **సెయ్యసకథేరుడు**

**117. పాపం చే పురిసో కయిరా, న తం కయిరా పునప్పునం ।**
**న తమ్హి ఛన్దం[1] కయిరాథ, దుక్ఖో పాపస్స ఉచ్చయో ॥ 2 ॥**

*(పాపం చేత్పురుషః కుర్యా, న్నతత్కుర్యాత్పునః పునః ।*
*న తస్మిన్ ఛన్దం కుర్యా ద్దుఃఖః పాపస్యోచ్చయః ॥ 2 ॥)*

ఒక వ్యక్తి, పాపము చేయుచో, మరల మరల నతడా పాపము చేయకూడదు. పాపాచరణమున స్వచ్ఛందతాపూర్వకమైన రతి(ఆసక్తి) కూడదు. పాపము యొక్క ఉచ్చయము (సంచయము) దుఃఖహేతువు.

**సావత్థి (జేతవనము)** **లాజదేవధీత(లాజదేవకన్య)**

**118. పుఞ్ఞం చే పురిసో కయిరా, కయిరాథే'తం[2] పునప్పునం ।**
**తమ్హి ఛన్దం కయిరాథ, సుఖో పుఞ్ఞస్స ఉచ్చయో ॥**

*(పుణ్యం చేత్పురుషః కుర్యా త్కుర్యాదేతత్పునః పునః ।*
*తస్మిన్ ఛన్దం కుర్యాత్, సుఖః పుణ్యస్యోచ్చయః ॥ 3 ॥)*

ఒక వ్యక్తి, పుణ్యము చేయుచో, మరల మరల నాపుణ్య మాతడు చేయవలయును. పుణ్యమున స్వచ్ఛందతా పూర్వకమైన రతి (ఆసక్తి) యుండవలయును. పుణ్యోచ్చయము(పుణ్యసంచయము) సుఖహేతువు.

**సావత్థి (జేతవనము)** **అనాథపిణ్డికుడు (శ్రేష్ఠి)**

**119 పాపో పి పస్సతి భద్రం, యావ పాపం న పచ్చతి ।**
**యదా చ పచ్చతి పాపం, అథ పాపో పాపాని పస్సతి[3] ॥ 4 ॥**

---

(1) 'ఛన్ద' శబ్దమునకు 'అభిప్రాయము' 'వశము' అని ముఖ్యార్థము.
'అభిప్రాయవశౌ ఛన్దౌ' = (అమరకోశము III కాండము - 245) మరియు;
'అభిప్రాయశ్ఛన్ద ఆశయః' (అమర III.-133)
వాసన, లేక, సంకల్పము యొక్క వశమున పాపాచరణము దుఃఖహేతువు కాగలదని భావము.
(2) కయిరాథే'నం - బ్రహ్మదేశీయపాఠము
(3) పోల్చు :- **"నను సద్యోఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలమ్ ।**
**కాలోఽప్యంగీ భవత్యత్ర, సస్యానామివ పక్తయే ॥"**
(వాల్మీకి రామాయణము-అరణ్య - 49-27)
పాపాత్ముని పాపకర్మఫలము వెంటనే అనుభవమునకు రాదు. సస్యములందువలెనే, పాపకర్మము పరిపక్వమగుటకు కాలము ముఖ్యమని భావము.

*(పాపోఽపి పశ్యతి భద్రం, యావత్పాపం న పచ్యతే ।*
*యదా చ పచ్యతే పాప మథ పాపో పాపాని పశ్యతి ॥ 4 ॥)*

పాప (కర్మము) పరిపక్వము కానంత వఱకు, పాపాత్ముఁడు సైతము శుభముల (సుఖముల)నే కాంచును; పాపము పండినపుడు, పాపములనే (పాపకర్మఫలములగు దుఃఖములనే) కాంచును.

**120. భద్రోపి పస్సతి పాపం, యావ భద్రం న పచ్చతి ।**
**యదా చ పచ్చతి భద్రం, అథ భద్రో భద్రాని పస్సతి ॥ 5 ॥**

*(భద్రోఽపి పశ్యతి పాపం, యావద్భద్రం న పచ్యతే ।*
*యదా చ పచ్యతే భద్రమథ భద్రో భద్రాణి పశ్యతి ॥ 5 ॥)*

శుభ (పుణ్య) కర్మము పరిపక్వము కానంతవఱకు, పుణ్యాత్ముఁడు సైతము పాపముల (దుఃఖముల)నే కాంచును. శుభ (పుణ్య) కర్మము పండినంతనే పుణ్యాత్ముఁడు శుభములనే (పుణ్యకర్మఫలములగు సుఖములనే) కాంచును.

**సావత్థి (జేతవనము)** **అనక్ఖతపరిక్ఖారభిక్ఖువు (అసంయమిభిక్షువు)**

**121. మావమఞ్ఞేథ[(1)] పాపస్స 'న మం తం ఆగమిస్సతి' ।**
**ఉదబిన్దునిపాతేన, ఉదకుమ్భోపి పూరతి ।**
**బాలో పూరతి[(2)] పాపస్స, థోక థోకం[(3)] పి ఆచినం ॥ 6 ॥**

*(మాఽవమన్యేత పాపస్య, 'న మాం తదాగమిష్యతి' ।*
*ఉదబిన్దునిపాతేన, ఉదకుమ్భోఽపి పూర్యతే ।*
*బాలః పూరయతి పాపస్య స్తోకం స్తోక మప్యాచిన్వన్ ॥ 6 ॥)*

---

(1) మాప్పమఞ్ఞేథ - సింహళదేశీయ పాఠము. సంయుక్తవ్యంజనాక్షరమునకు పూర్వమందలి 'ఆ' దీర్ఘాచ్చు పాళీ భాషా ప్రకృతికి విరుద్ధము.
(2) పూరతి బాలో - పాఠభేదము (Prof.N.K. భగ్వత్ - ధమ్మపదం - బుద్ధసొసైటి, బొంబాయి)
(3) థోకం థోకం పి - బ్రహ్మదేశీయ పాఠము.

'పాపము నా సమీపమునకు రాదు' - అని పాపము నుపేక్షింపకూడదు. జలబిందువులొక్కటొక్కటిగపడినను, ఘటము కూడ నిండును. ఇట్లే మూర్ఖుడును కొంచము కొంచము పాపము కూడబెట్టి, తన్ను పాపముచే నింపుకొనుచున్నాడు.

**సావత్థి (జేతవనము)** **బిళాలపాదకసెట్ఠి**

**122. మావమఞ్ఞేథ పుఞ్ఞస్స, 'న మం తం ఆగమిస్సతి' ।**
**ఉదబిన్దునిపాతేన, ఉదకుమ్భో' పి పూరతి ।**
**ధీరో పూరతి[1] పుఞ్ఞస్స, థోక థోకం' పి ఆచినం ।**

*(మాఽవ మన్యేత పుణ్యస్య 'న మాం తదాగమిష్యతి'*
*ఉదబిన్దు నిపాతేన, ఉదకుమ్భోఽపి పూర్యతే ।*
*ధీరః పూరయతి పుణ్యస్య స్తోకం స్తోకమప్యాచిన్వన్ ॥ 7 ॥)*

'పుణ్యము నా సమీపమునకు రాదు' - అని పుణ్యము నుపేక్షింపకూడదు. జలబిందువు లొక్కటొక్కటిగ పడినను, ఘటము కూడ నిండును. ఇట్లే ధీరుడు (ధైర్యశాలియగు వ్యక్తి) కొంచము కొంచము పుణ్యము కూడబెట్టి, తన్ను పుణ్యముచే నింపుకొనుచున్నాడు.

**సావత్థి (జేతవనము)** **మహాధనవాణిజుడు**

**123. వాణిజో'వ భయం మగ్గం, అప్పసత్థో[2] మహద్ధనో ।**
**విసం జీవితుకామో'వ, పాపాని పరివజ్జయే ॥ 8 ॥**

*(వాణిజ ఇవ[3] భయం మార్గ, మల్పసార్థో మహాధనః ।*
*విషం జీవితుకామ ఇవ, పాపాని పరివర్జయేత్ ॥ 8 ॥)*

---

(1) పూరతిధీరో - పాఠభేదము (Prof. N.K. భగ్వత్ - ధమ్మపదం - బుద్ధసొసైటి - బొంబాయి)
(2) 'అప్పసత్థో' = అల్పశస్త్రః (చారుచంద్రవసు)
(3) 'వణిగివ' - అని రాహులసాంకృత్యాయనుని పాఠము. 'వాణిజ' శబ్దమునకు ఛాయ యందు 'వణిక్' అని వ్రాయనవసరము లేదు. చారుచంద్రవసువు సైతమిట్లే 'వణిక్' అని వ్రాసెను. కాని, ఇది భ్రాంతిజన్యము. 'వాణిజ' శబ్దము శుద్ధ సంస్కృత శబ్దము. స్వయముగ పాణిని మహర్షియే ఈ శబ్దమును ప్రయోగించినాడు. (అష్టాధ్యాయి - VI-2-13). అమరకోశాది ప్రాచీన నిఘంటువులందును, ఈ రూపము కలదు. "వైదేహకః సార్థవాహో నైగమో **వాణిజో** వణిక్" (అమరకోశము -II..654) అయినను, సంస్కృతవాఙ్మయమున నీ ప్రయోగ మధికముగ లేదు. సార్థము = వర్తకుల సమూహము.
సార్థో వణిక్సమూహే స్యాత్ (మేదినీకోశము)

స్వల్పవర్తకసమూహము మాత్రమే తోడుగ గల మహాధనసంపన్నుడగు వణిజుడు, భయావహమగు మార్గమును వలె, జీవింపదలచినవాడు విషమును వలె, (బుద్ధిమంతుడు) పాపముల పరివర్జింపవలయును.

**రాజగృహము (వేళువనము)** **కుక్కుటమిత్తనేసాదుడు**

124. **పాణిమ్హి చే వణో నాస్స[1], హరెయ్య పాణినా విసం ।**
**నాబ్బణం విసమన్వేతి, నత్థి పాపం అకుబ్బతో । 9 ।**

(పాణౌ చేద్వ్రణో నాస్య, హరేత్ పాణినా విషమ్ ।
నాఽవ్రణం విషమన్వేతి, నాఽస్తి పాప మకుర్వతః । 9 ।)

చేతియందు వ్రణము (గాయము) లేనిచో, విషమును సైతము తీసికొని పోవచ్చును. వ్రణము లేనందున విషప్రభావముండదు. ఇట్లే, చేయని వానికి పాపము లేదు.

**సావత్థి (జేతవనము)** **కోక–సునఖలుద్దకుడు**

125. **యో అప్పదుట్ఠస్స నరస్స దుస్సతి ।**
**సుద్ధస్స పోసస్స అనఙ్గణస్స ।**
**త మేవ బాలం పచ్చేతి[2] పాపం ।**
**సుఖుమో[3] రజో పటివాతం'వ ఖిత్తో । 10 ।**

---

(1) 'నస్స' పాఠము అధికసంగతము. పాళి,ప్రాకృతభాషలయందు సంయుక్తాక్షరమునకు పూర్వమందలి అచ్చు, ప్రాయికముగ హ్రస్వముగ నుండును.

(2) 'పటియేతి' – పాఠము ఛందోదృష్టిననుసరించి మిక్కిలి సముచితము. 'ప్రత్యేతి' – అను సంస్కృతచ్ఛాయకు 'పటియేతి', 'పచ్చేతి' అని రెండు పాళి రూపములు. 'పతి' ఉపసర్గకు కొన్ని చోట్ల 'పటి' ఆదేశమగును. పటి + ఏతి = 'పటియేతి' అగును. ('య'కారము ఆగమము). పతి + ఏతి = పచ్చేతి. ('తి' కి 'చ' ఆదేశము ద్విత్వము) పాళీవ్యాకరణముననుసరించి రెండు రూపములు సిద్ధించును. 'ప్రత్యేతి' సంస్కృతపదము ప్రాకృత నియమముననుసరించి 'పచ్చేతి' రూపము పొందుచున్నది. 'ర' కారలోపము 'త్య' కు 'చ్చ' ఆదేశము కలుగును.

(3) సూక్ష్మ → సూఖ్మ → సుఖుమ – విప్రకర్షకు ఉదాహరణము.

(యోఽప్రదుష్టాయ నరాయ దుష్యతి ।
శుద్ధాయ పురుషాయాఽనఙ్గనాయ[1] ।
తమేవ బాలం ప్రత్యేతి పాపం, సూక్ష్మం ।
రజః ప్రతివాతమివ క్షిప్తమ్ । 10 ।)

ఎవడు దోషరహితుడు, పరిశుద్ధుడు, నిర్మలుడునైన పురుషుని దూషించునో, అట్టి మూర్ఖునిపైననే, పాపము, ఎదురు గాలికి చిమ్మబడిన సూక్ష్మధూళివలె తిరిగి పడుచున్నది.

**సావత్థి (జేతవనము)** **మణికారకులూపక తిస్సథేరుడు**

126. **గబ్భమేకే ఉప్పజ్జన్తి, నిరయం పాపకమ్మినో ।**
**సగ్గం సుగతినో యన్తి, పరినిబ్బన్తి అనాసవా[2] । 11 ।**

(గర్భమేక ఉత్పద్యన్తే, నిరయం పాపకర్మిణః ।
స్వర్గం సుగతయో యాన్తి, పరినిర్వాన్త్యనాస్రవాః । 11 ।)

కొందఱు గర్భమున ఉత్పన్నులగుదురు. పాపకర్ములు నరకమును, స్వర్గమును పుణ్యాత్ములును పొందుదురు. మనోమాలిన్యరహితులైన మహాత్ములు పరినిర్వాణమును పొందుచున్నారు.

---

(1) అనఙ్గణస్స = అనఙ్గనాయ. భదన్తబుద్ధఘోషుడు 'అనఙ్గణస్స' పదమును 'నిక్కిలేసస్స' (నిష్క్లేశస్య) అని వివరించెను. కాన, ప్రస్తుత 'అఙ్గణ' శబ్దము సంస్కృత 'అఞ్జన' శబ్దము యొక్క ఒక వికృతరూపమగుచున్నది. ఇట్టి వివరణము భాషావైజ్ఞానికనియమముల ననుసరించి దురూహ్యము. అఙ్గణశబ్దమునకు సంస్కృతమున ప్రాంగణము (ముంగిలి) అని అర్థము. రాహులసాంకృత్యాయనుడు 'అనఙ్గణాయ' అను సంస్కృతచ్ఛాయ వ్రాసి 'నిర్మల్‌పురుషకో' - హిందిలోని కనువదించెను. సంస్కృతమున నీ యర్థము పైన పేర్కొన్నట్లు దురూహ్యము. 'నిరఞ్జన' శబ్దమును శంకరుడు 'నిర్లేపో విగతక్లేశః' అని వివరించెను. ('నిరఞ్జనం పరమం సామ్య ముపైతి' - (ముణ్డకోపనిషత్- III. 1.3) ఇది భదన్తబుద్ధఘోషుని అర్థమునకు సరిపడుచున్నది. కాన, సంస్కృత 'అఞ్జన' శబ్దమునకు పాళీ 'అఙ్గణ' శబ్దము, ఒక వికృతరూపమని భావించుట సముచితము.

(2) పోల్చు :- "యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః ।
స్థాణు మన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్" (కఠ. ఉ. V.7)

గబ్భమేకే ఉప్పజ్జన్తి :- కొందఱు గర్భమున నుత్పన్నులగుదురు. అనగా, గర్భమున ప్రవేశించి పునర్జన్మము పొందుచున్నారని భావము.

**సావత్థి (జేతవనము)** **ముగ్గురు భిక్షువులు**

127. **న అన్తలిక్ఖే న సముద్దమజ్ఝే ।**
**న పబ్బతానం వివరం పవిస్స ।**
**న విజ్జతీ సో జగతిప్పదేసో ।**
**యత్థట్ఠితో ముచ్చేయ్య పాపకమ్మా । 12 ।**

*(నాఽన్తరిక్షే, న సముద్రమధ్యే ।*
*న పర్వతానాం వివరం ప్రవిశ్య ।*
*న విద్యతే స జగతి ప్రదేశో ।*
*యత్రస్థితో ముచ్యేత పాపకర్మణః । 12 ।)*

ఎందుండి పాపకర్మముల నుండి మనుష్యుడు విముక్తుడగునో, అట్టి స్థానము అంతరిక్షమున గాని, సముద్రమధ్యమునగాని, పర్వతగహ్వరమున ప్రవేశించుట యందు గాని, జగమున నెందైనను గాని లేదు.

**కపిలవత్థు (నిగ్రోధారామము)** **సుప్పబుద్ధసక్కుడు (శాక్యుడు)**

128. **న అన్తలిక్ఖే, న సముద్దమజ్ఝే ।**
**న పబ్బతానం, వివరం పవిస్స ।**
**న విజ్జతీ సో జగతిప్పదేసో ।**
**యత్థట్ఠితం నప్పసహేయ్య**[(1)] **మచ్చు । 13 ।**

*(నాఽన్తరిక్షే న సముద్రమధ్యే ।*
*న పర్వతానాం వివరం ప్రవిశ్య ।*
*న విద్యతే స జగతి ప్రదేశో ।*
*యత్ర స్థితం న ప్రసహేత మృత్యుః । 13 ।)*

(1) న ప్పసహేథ – పాఠాంతరము

ఎందు నిలిచిన, మానవుని మృత్యువు జయింపజాలదో, అట్టి స్థానము, అంతరిక్షమున గాని, సముద్రమధ్యమునగాని, పర్వతగహ్వరము ప్రవేశించుట యందు గాని, ఈ జగమున నెందైనను గాని లేదు. (జ్ఞానము వలనే మృత్యువు నుండి విముక్తి. ధర్మనియతిని భంగపఱచు వారికి తప్పక శిక్ష గల్గును. ఆ నియతియే తన్ను భంజించు వారిని భంజించునను బుద్ధభగవానుని సిద్ధాంతము నీగాథ లుద్ఘోషించుచున్నవి. ధర్మనియతి సత్యస్వభావ విశిష్టమనుట ఇందు నిరూపితము)

**9 పాపవగ్గో నమత్తో**

**పాపవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## దణ్డవగ్గో దసమో

## (దణ్డవర్గో దశమః)

## 10 దండవర్గము – దశమాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **ఛబ్బగ్గియ భిక్షువులు**

129\. సబ్బే తసన్తి దణ్డస్స, సబ్బే భాయన్తి మచ్చునో ।
**అత్తానం ఉపమం కత్వా, న హనెయ్య న ఘాతయే ॥ 1 ॥**

*(సర్వే త్రస్యన్తి దణ్డస్య, సర్వే బిభ్యతి మృత్యోః ।*
*ఆత్మాన ముపమాం కృత్వా, న హన్యా న్న ఘాతయేత్ ॥ 1 ॥)*

మనుష్యులందఱు దండమునకు కంపింతురు; మృత్యువునకు భీతిల్లుదురు. ఇతరుల తనతో పోల్చుకొని, – ఆత్మోపమ్యభావమున – చంపకూడదు; చంపుటకు ప్రేరకుడును కారాదు.

సావత్థి (జేతవనము) ఛబ్బగ్గియ భిక్షువు

130. సబ్బే తసన్తి దణ్డస్స, సబ్బేసం జీవితం పియం ।
అత్తానం ఉపమం కత్వా, నహనెయ్య న ఘాతయే[1] । 2 ।

(సర్వే త్రస్యన్తి దణ్డస్య, సర్వేషాం జీవితం ప్రియమ్ ।
ఆత్మాన ముపమాం కృత్వా, న హన్యాన్న ఘాతయేత్ । 2 ।)

మనుష్యులందఱు దండమునకు కంపింతురు; అందఱకు జీవితము ప్రియము. ఇతరుల తనతో పోల్చుకొని - ఆత్మౌపమ్యభావమున - చంపకూడదు; చంపుటకు ప్రేరకుడును కారాదు.

---

(1) పోల్చు :- "ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా
భూతానా మపి తే తథా ।
ఆత్మౌపమ్యేన భూతేషు,
దయాం కుర్వన్తి సాధవః । (హితోపదేశము)

ప్రాణములు, సర్వప్రాణులకు అభీష్టములని ఆత్మౌపమ్యమున నెఱిగి, సత్పురుషులు సర్వప్రాణుల యందును, దయతో వర్తింతురు.

అందఱు తనతో సమానమని తెలిసికొనుటయే ఆత్మౌపమ్యము.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర, సమం పశ్యతి యోఽర్జున !।
సుఖం వా యది వా దుఃఖం, స యోగీ పరమో మతః । (భ.గీ. VI - 32)

ఆత్మౌపమ్యభావమున సర్వత్ర ప్రాణులకు ప్రతికూలమాచరింపక, అనుకూలుడై, అహింసా పరాయణుడగుయోగి, యోగులందఱి యందును ఉత్కృష్టుడు.

"యథా తవ తథాఽన్యేషాం, దారా రక్ష్యా నిశాచర ! ।
ఆత్మాన ముపమాం కృత్వా, స్వేషు దారేషు రమ్యతామ్ ।
(వాల్మీకి రామాయణము-1 సుందర.21.7)

రాక్షసా! తన భార్యవలెనే పరుల భార్యలు సైతము రక్షింపదగినవారని, ఆత్మౌపమ్యమున నెఱిగి, స్వభార్యారతుడవు కమ్ము.

"ఆత్మోపమస్తు భూతేషు, యో వై భవతి పూరుషః ।
న్యస్తదణ్డో జితక్రోధః, స ప్రేత్య సుఖమేధతే ।"
'న తత్ పరస్య సందధ్యాత్, ప్రతికూలం యథాఽఽత్మనః ।
ఏష సంక్షేపతో ధర్మః, కామా దన్యః ప్రవర్తతే" (మ.భా. అనుశాసన-113-6,8)

తనకు ప్రతికూలమైన (అప్రియమైన) కార్యమును ఇతరుల యెడనాచరింపకూడదు. సంక్షేపముగనిదియే ధర్మము. ఇతరమైన దంతయు కామప్రవర్తితమే.

పాశ్చాత్య పండితులలో డా॥ఫౌజ్‌బాల్ (Dr. Fousboll) మహాభారతాది ఆర్షగ్రంథములందలి మహార్థవంతములైన శ్లోకముల నిర్దేశించినాడు. ప్రశంసనీయమైన వైదుష్యము నీపరిశ్రమ చాటుచున్నది. ఇతరుల భావముల నాదరించుట, తనకు ప్రతికూలమైన దానిని వారి యెడల నాచరింపకుండుట సమాజశ్రేయస్సుకు మూలాధారమని చైనాదేశపు తత్త్వవేత్త కంఫ్యూషియస్ (Confucius) బోధించును. (చూడు : డా॥ సర్వేపల్లి రాధాకృష్ణని ధమ్మపదం X. 1)

**సావత్థి (జేతవనము)** **సంబహులకుమారులు**

131. **సుఖకామాని భూతాని, యో దణ్డేన విహింసతి ।**
**అత్తనో సుఖమేసానో, పెచ్చ సో న లభతే సుఖం[1] । 3 ।**

*(సుఖకామాని భూతాని, యో దణ్డేన విహినస్తి ।*
*ఆత్మనః సుఖ మిచ్ఛన్, ప్రేత్య స న లభతే సుఖమ్ । 3 ।)*

తన సుఖమును కోరుచు, (తన వలెనే) సుఖ మాకాంక్షించు ప్రాణులను దండముతో హింసించువాడు, జన్మాంతరమున సుఖము పొందడు.

132. **సుఖకామాని భూతాని, యో దణ్డేన న హింసతి ।**
**అత్తనో సుఖమేసానో, పెచ్చ సో లభతే[2] సుఖం । 4 ।**

*(సుఖకామాని భూతాని, యో దణ్డేన న హినస్తి ।*
*ఆత్మనః సుఖమిచ్ఛన్, ప్రేత్య స లభతే సుఖమ్ । 4 ।)*

తన సుఖము కోరుచు, (తనవలెనే) సుఖ మాకాంక్షించు ప్రాణులను దండముతో హింసింపనివాడు జన్మాంతరమున సుఖము పొందును.

**సావత్థి (జేతవనము)** **కుణ్డధానథేరుడు**

133. **మా వోచ ఫరుసం కిఞ్చి, వుత్తా పటివదెయ్యు తం ।**
**దుక్ఖా హి సారమ్భకథా, పటిదణ్డా ఫుసెయ్యు తం ।**

*(మా వోచః పరుషం కిఞ్చిత్, ఉక్తాః ప్రతివదేయుస్త్వామ్ ।*
*దుఃఖా హి సంరమ్భకథాః, ప్రతిదణ్డాః స్పృశేయుస్త్వామ్ ।)*

---

(1) ఈ గాథతో అక్షరసామ్యము గల శ్లోకము మహాభారతమున నున్నది.
**"అహింసా కాని భూతాని, దణ్డేన వినిహన్తి యః ।**
**ఆత్మనః సుఖమిచ్ఛన్ స, ప్రేత్య నైవ సుఖీ భవేత్.** (మ.భా. అనుశాసన - 113 - 5)
**"యోఽహింసకాని భూతాని, హినస్త్యాత్మ సుఖేచ్ఛయా ।**
**సజీవం శ్చ మృతశ్చైవ, న క్వచిత్సుఖ మేధతే ।** (మనుస్మృతి V.45)

(2) పాళీవ్యాకరణమున ఆత్మనేపదప్రయోగము విరళము.
**'లభతే'** - ఇదొక విరళమైన ఉదాహరణము.

ఇంచుకంతయు పరుషవచనము పలుకకుము. అట్లు పరుషోక్తులకు గుఱియైన వ్యక్తులు, నీతో సైతము, పరుషముగా బదులుపలుకుదురు. దురుద్వేగ(కఠోర) వాక్కులు దుఃఖదాయకము కాన, ప్రతిక్రియారూపమైన హింస నిన్ను స్పృశించును.

134. **న చే నేరేసి అత్తానం, కంసో ఉపహతో యథా ।**
**ఏస పత్తో౽సి నిబ్బానం, సారమ్భో తే న విజ్జతి ॥ 6 ॥**

*(స చే న్నేరయసి ఆత్మానం, కాంస్య ముపహతం యథా ।*
*ఏష ప్రాప్తో౽సి నిర్వాణం, సంరమ్భ స్తే న విద్యతే ॥ 6 ॥)*

పగిలిపోయిన కంచుతాళము వలె మౌనము వహించినచో నీవు నిర్వాణము పొందినవాడవే. కాన, నీ కేమాత్రము సంరంభ (ఉద్వేగ) ముండదు.
(న + ఈరయసి = నేరయసి)

**సావత్థి (పుబ్బారామము)** **విశాఖాది ఉపాసికలు**

135. **యథా దణ్డేన గోపాలో, గావో పాచేతి[1] గోచరం ।**
**ఏవం జరా చ మచ్చూ చ, ఆయుం పాచెన్తి పాణినం ॥ 7 ॥**

*(యథా దణ్డేన గోపాలో, గాః ప్రాజయతి గోచరమ్ ।*
*ఏవం జరా చ మృత్యుశ్చా౽౽ యుః ప్రాజయతః ప్రాణినామ్ ॥ 7 ॥)*

గొల్లవాడు తన దండము (దుడ్డుకఱ్ఱ)తో గోవులను పచ్చిక బయళ్లకు తోలుకొని పోవునట్లు, జరామరణములు ప్రాణుల ఆయువును (పునర్జన్మమునకు) తోల్కొనిపోవును.

---

(1) పాచేతి :- బ్ర.దే. పాఠము. అజ్ - (ధాతువు) గతిభక్షణయోః గతి, భక్షణము. (అజతి) - నడుపుట, తోలుట. ఉపసర్గ సహిత ప్రయోగము వైదికవాఙ్మయమున మాత్రమే కలదు. చూడు : ఆప్టే సంస్కృత నిఘంటువు.

ప్ర + అజ్ = ప్రాజ్.

ప్ర + అజ్ + అయ + తి = ప్రాజయతి (ప్రేరణార్థకము)

**రాజగృహము (వేళువనము)** **అజగరుడు (ప్రేతము)**

**136. అథ పాపాని కమ్మాని, కరం బాలో న బుజ్ఝతి ।**
**సేహి కమ్మేహి దుమ్మేధో, అగ్గిదడ్డో(1) వ తప్పతి । 8 ।**

*(అథ పాపాని కర్మాణి కుర్వన్ బాలో న బుధ్యతే ।*
*స్వైః కర్మభిః దుర్మేధా, అగ్నిదగ్ధ ఇవ తప్యతే ॥ 8 ॥)*

మూర్ఖుడు పాపకర్మములాచరించుచు, (వాని దుష్ఫలముల) నెఱుగడు. స్వకర్మములచేతనే దుర్బుద్ధి, అగ్నిదగ్ధుని వలె తపించును.

**రాజగృహము (వేళువనము)** **మహామొగ్గల్లానథేరుడు**

**137. యో దణ్డేన అదణ్డేసు, అప్పదుట్ఠేసు దుస్సతి ।**
**దసన్నమఞ్ఞతరం, ఠానం, ఖిప్పమేవ నిగచ్ఛతి । 9 ।**

*(యో దణ్డేనాఽ దణ్డ్యేషు, అప్రదుష్టేషు దుష్యతి ।*
*దశానా మన్యతరం స్థానం, క్షిప్రమేవ నిగచ్ఛతి । 9 ।)*

దండింపదగని వారిని దండించి, నిర్దోషులను పీడించువాడు. శీఘ్రముగ నీ(హీన) దశావస్థలలో నొక అవస్థను పొందును.

**138. వేదనం ఫరుసం జానిం, సరీరస్స చ భేదనం ।**
**గరుకం వా'పి ఆబాధం, చిత్త క్ఖేపం'వ పాపుణే । 10 ।**

*(వేదనాం పరుషాం జ్యానిం, శరీరస్య చ భేదనమ్ ।*
*గురుకం వాఽప్యాబాధం, చిత్తక్షేపం వా ప్రాప్నుయాత్ । 10 ।)*

తీవ్రవేదన, వయోహాని, (ఉపద్రవము) అంగభంగము, దారుణరోగము మతిభ్రమణము (అతడు) పొందును.

---

(1) దగ్ధ (దహ్ + క్త) శబ్దమునకు ప్రాకృతరూపము 'దడ్ఢ'. కాని, పాళీ వాఙ్మయమున 'దడ్డ' రూపము పలుచోట్ల ఉపలబ్ధమగుచున్నది.

139. రాజతో వా ఉపసగ్గం[1], అబ్భక్ఖానం'వ దారుణం।
పరిక్ఖయం'వ ఞాతీనం, భోగానం'వ పభఙ్గుణం[2] ॥ 11 ॥

(రాజతో వోపసర్గమ్, అభ్యాఖ్యానం వా దారుణమ్ ।
పరిక్షయం వా జ్ఞాతీనాం, భోగానాం వా ప్రభఞ్జనమ్ ॥ 11 ॥)

లేదా, రాజదండమో, దారుణ నిందయో, బంధునాశమో, భోగ్య వస్తుక్షయమో పొందును

140. అథవ'స్స[3] అగారాని, అగ్గి డహతి[4] పావకో।
కాయస్స భేదా దుప్పఞ్ఞో, నిరయం సోపపజ్జతి ॥ 12 ॥

(అథవాఽ స్యాఽగారాణి, అగ్నిర్దహతి పావకః ।
కాయస్య భేదాద్ దుష్ప్రజ్ఞో, నిరయం స ఉపపద్యతే ॥ 12 ॥)

లేదా, అతని గృహముల వైద్యుతాగ్ని దహించును. శరీరపతనానంతర మా మూర్ఖుడు నరకమును బొందును.

---

(1) ఉపస్సగ్గం - సింహళదేశీయపాఠము

(2) పభఙ్గుణం - పభఙ్గురం - పాఠాంతరము. కాని దీనికి సంస్కృతరూపము 'ప్రభఞ్జనమ్' అని విద్వాంసు లందఱు - రాహులసాంకృత్యాయన, చారుచంద్రవసు ఆదులు - వ్రాసిరి. దీనికి అత్యంత సమీప సంస్కృతరూపము 'ప్రభఙ్గురమ్' అనుటయే సముచితము. 'ప్రభఞ్జన' శబ్దము విశేషణముగ ప్రయుక్తమగుట కూడ సరికాదు. కేవలము అర్థసాదృశ్యము కొఱకే 'ప్రభఞ్జన' శబ్దము స్వీకరింపబడినదని భావింపవచ్చును. కాని ప్రకృతచ్ఛాయగ మాత్రము కాదు. 148 గాథ యందలి పభఙ్గురమ్' నకు 'పభఙ్గుణమ్' అని పాఠాంతరముండుట గమనార్హము.

ఉపసగ్గం = ఉపసర్గః **"అజన్యం క్లీబ ముత్పాత ఉపసర్గః సమం త్రయమ్"** (అమరకోశము II - 109) **"ఉపసర్గః పుమాన్ రోగభేదోపప్లవయోరపి"**। ఉపద్రవము; ఉత్పాతము = తెలియకుండ వచ్చెడి కీడు. (మేదినీకోశము) (Accident, misfortune).

(3) అథవా + అస్స = అథవ'స్స. స్వరవర్ణము పరమైనపుడు పూర్వస్వరములు లోపించును. (సరాసరే లోపం - కచ్చాయనసూత్రము 1-2-1.)

(4) డహతి = దహతి (సంస్కృతము). పాళీ వ్యాకరణమున 'దహ్' ధాతువు కలదు. 'దహతి'కి 'డహతి' వైకల్పికముగ భావింపవచ్చును. ('దహ్' భస్మీకరణే - కచ్చాయన ధాతు మంజూష. 82)

సావత్థి (జేతవనము) బహుభణ్డిక భిక్షువు

141. న నగ్గచరియా న జటా, న పఙ్కా ।
నానాసకా థణ్డిలసాయికా వా ।
రజో చ జల్లం[1] ఉక్కుటికప్పధానం* ।
సోధేన్తి మచ్చం అవితిణ్ణకఙ్ఖం[2] । 13 ।

*(న నగ్న చర్యా న జటా న పఙ్కాః ।*
*నాఽనశనం స్థణ్డిలశాయికా వా ।*
*రజోజలీయ ముత్కుటిక ప్రధానం ।*
*శోధయన్తి మర్త్య మవితీర్ణకాంక్షమ్ ॥ 13 ॥)*

---

(1) రజోజల్లం – బ్రహ్మదేశీయ పాఠాంతరము.
(2) పోల్చు :- "న నగ్న చర్యా న జటా న పఙ్కో
నాఽనశనం స్థణ్డిలశాయికా వా
న రజోమలం నోత్కుటక ప్రహాణం
విశోధయే న్మోహవితీర్ణ కాంక్షమ్ ॥ (దివ్యావదానము 23-2.)
"న మచ్ఛమంసం, నానాసకత్తం, న నగ్గియం (ముణ్డియంజటా) జల్లం ఖరాజినాని వా ।
నాగ్గిహుత్తస్సుపసేవనా వా, యేవాపి లోకే అమరా బహూతపా ।
మన్తా హుతీ యఞ్ఞముతూపసేవనా, సోధేన్తి మచ్చం అవితిణ్ణకఙ్ఖం ॥
(సుత్తనిపాతము - II.2 - 11 ఆమగంధసుత్తం)

* ఉక్కుటికప్పధానం = ఉత్కుటిక ప్రధానమ్ = గుదికాలు, లేక మడమలపై కూర్చుండి తపమొనరించుట 'Sitting on the heels in penance'. అని బుద్ధరక్షితథేరుని వివరణము చూడు : ధమ్మపద (Buddha-Vachana Trust - Mahabodhi Society, Bangalore 1966)

అవితిణ్ణకఙ్ఖం = విచికిత్స – సంశయము-ను జయింపని వానిని. అని కొందఱు వ్యాఖ్యాతలు. చూడు : డా॥ సర్వేపల్లి రాధాకృష్ణుని ధమ్మపదము.

"జటిలో ముణ్డీ లుఞ్ఛితకేశః, కాషాయాంబర బహుకృతవేశః ।
పశ్యన్నపి న చ పశ్యతి మూఢః, ఉదరనిమిత్తం బహుకృతవేషః ।
(ఆదిశంకరుడు – భజగోవిన్దస్తోత్రము)

**సుమాగధా అవదానమున నీ క్రింది కథ కలదు.**

అనాథపిండికుని కూతురు సుభద్రయింట నగ్నసంన్యాసులు చాల మంది చేరి యుండిరి. ఆమె తన కోడలు సుమాగధను పిలిచి, పూజ్యులైన ఆ శ్రమణులను దర్శించి రమ్మని కోరినది. ఆ శ్రమణులందు, సారిపుత్ర మౌద్గల్యా యనాదుల వంటి మహాత్ములుందురని భావించిన సుమాగధ ఆశాభంగమందినది. ఆశ్రమణుల కేశములు పావురపు రెక్కలను బోలి ధూళిధూసరితమై, జుగుప్సావహమై యుండెను. వారు పిశాచముల వలె నుండిరి. సుమాగధ వారిని గాంచి ఖిన్నురాలైనది. కారణమడుగగా, సుమాగధ తన అత్తగారితో నిట్లనినది "అమ్మా! వీరు పుణ్యాత్ములగు ఋషులైనచో, మఱి పాపాత్ములెట్లుందురు?"

కోరికల జయింపని మనుజుని నగ్నచర్యయు, జటాధారణము, పంకలేపనము, ఉపవాసము, భూశయనము, రజోమల లేపనము, నిశ్చలాసనము, - ఇవేవియు పరిశుద్ధుని చేయజాలవు.

**సావత్థి (జేతవనము)** **సన్తతి (మహామాత్యుడు)**

**142. అలఙ్కతో చేపి సమం చరెయ్య,**
**సన్తో దన్తో నియతో బ్రహ్మచారీ ।**
**సబ్బేసు భూతేసు నిధాయ[1] దణ్డం,**
**సో బ్రాహ్మణో సో సమణో స భిక్ఖు[2] । 14 ।**

*(అలఙ్కృతశ్చేదపి శమం చరేత్,*
*శాన్తో దాన్తో నియతో బ్రహ్మచారీ ।*

---

(1) సబ్బేసు భూతేషు నిధాయ దణ్డం - ఇందు సప్తమీ విభక్తికి 'నిధాయ' పద ప్రయోగము విచిత్రార్థమును కల్పించుచున్నది. 'సర్వభూతములందు దండము నుంచి' - ప్రాణులన్నిటిపైన దండము విధింపవలెనను అర్థము ప్రతీతమగుచున్నది. కాని, ఇచ్చట 'సబ్బేసు భూతేసు' పదమునకు విషయాధికరణమున 'నిధాన' పదమునకు 'పరిహారము', లేక, 'పరిత్యాగము' అను నర్థమును మనము గ్రహింపవలయును. బౌద్ధ గ్రంథములం దిట్టి ప్రయోగము బహుళము. 'సబ్బేసు భూతేసు నిధాయ దణ్డం' - ఖగ్గవిసాణసుత్తం - (సుత్తనిపాతం) 'గాథ యందును ఇట్టి ప్రయోగమే కలదు. సర్వప్రాణుల యెడల దండమును త్యజించి - అను నర్థమే ఇందును గ్రాహ్యము. సుత్తనిపాతము నాంగ్లీకరించిన ఫౌజ్‌బాల్ పండితుడు (V. Fousboll) "Having laid aside the rod against all beings" - అని అనువదించినాడు. (See: Vol X. S.B.E. page 6
పరిత్యాగార్థమున 'నిధాన' (నిక్షేప) శబ్ద ప్రయోగము సంస్కృత వాఙ్మయమున ప్రాయికముగ విరళమని పండితుల అభిప్రాయము. కాని మహా భారతమున ఇట్టి ప్రయోగము గాన్పించుచున్నది. "శీలం స్థితిర్దణ్డ నిధాన మార్జవమ్। (శాంతి - 175-37). "నిక్షిప్తదణ్డా భూతేషు" -(శాంతి-110-7).

(2) **పోల్చు :-** **"అలఙ్కృతశ్చాపి చరేత ధర్మం**
**దాన్తేన్ద్రియః శాన్తః సమ్యతో బ్రహ్మచారీ ।**
**సర్వేషు భూతేషు నిధాయ దణ్డం**
**స బ్రాహ్మణః స శ్రమణః స భిక్షుః ।** (దివ్యావదానము - 23-2)

**బ్రాహ్మణః** = బాహితపాపత్తా బ్రాహ్మణ । పాపార్థముల విసర్జించినవాడు; చాతుర్వర్ణ్యమునందలి జాతిమాత్రోపజీవి కాడు.

**సమణో :-** శ్రమణః - పాప సంస్కారములుపశమించినవాడు; బుద్ధశిష్యుడు.

**భిక్ఖు** = బౌద్ధ సంన్యాసి. - భిన్నకిలేసత్తా భిక్ఖూతి - క్లేశ రహితుడు.

సర్వేషు భూతేషు నిధాయ దణ్డం ।
స బ్రాహ్మణః స శ్రమణః స భిక్షుః ॥ 14 ॥)

అలంకృతుడైనను (విశిష్ట వస్త్రముల దాల్చినను) యెవడు, సమచిత్తుడు, శాంతుడు, దాంతుడు, నియమతత్పరుడు, బ్రహ్మచారియునై సర్వ ప్రాణులయందును దండత్యాగియై మెలగునో వాడే బ్రాహ్మణుడు, శ్రమణుడు, భిక్షువు.

**సావత్థి (జేతవనము)** **పిలోతికథేరుడు**

**143. హిరీనిసేధో[1], పురిసో, కోచి లోకస్మిం విజ్జతి ।**
**యో నిద్దం అప్పబోధతి[2], అస్సో భద్రో[3] కసామివ ॥ 15 ॥**

(హ్రీనిషేధః పురుషః కశ్చిత్ లోకే విద్యతే ।
యో నిద్రాం నప్రబోధతి[4], అశ్వో భద్రః కశామివ ॥ 15 ॥)

---

(1) హిరీ = హ్రీ (సం) వర్ణ విప్రకర్షమునకు ఉదాహరణము.
'హిరీ నిసేధో యస్స సో' – (బహువ్రీహి సమాసము) ఈ విగ్రహవాక్యమిచ్చుట సుసంగతము. కాని ధమ్మపదటీకాకారు డిట్లు వివరించును: "ఉప్పన్నం అకుసలవితత హిరియా నిసేధోతి హిరినిసేధో"
(2) అపబోధతి – సింహళదేశీయపాఠము.
(3) భద్దో – రాహుల సాంకృత్యాయనుని పాఠము.
(4) నప్రబుధ్యతి – రాహులసాంకృత్యాయనుని పాఠము.
**'అప్పబోధతి'** పదమునకు సంస్కృతచ్ఛాయ యందలి 'నప్రబోధతి' అనునది అర్థపరమైన వాక్యమే కాని, ఛాయ కాదని కొందఱు విద్వాంసుల మతము. దీనికి సంస్కృతచ్ఛాయ 'అల్పబోధతి' అని పాశ్చాత్య పండితులు. ఇది చింత్యము. తిఙన్త పదమగు 'పబోధతి' (ప్రబోధతి) తో నఞ్ సమాస రూపముగ నిష్పన్నమైన 'అప్పబోధతి' సంస్కృత భాష యందు అప్రయుక్తము.
'అపబోధతి' – పాఠము కూడ చింత్యమే.
**హిరీనిసేధో** :- Restrained by modesty లజ్జానియతుడై – 'అప్పబోధతి' Never provokes ఉద్బోధింపడు. మేల్కొల్పడు – అని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణుడనువదించినాడు.
హ్రీగుణము (modesty) దైవీ సంపదకు చెందినది. (భ.గీ. XVI - 2)
హ్రీ = అవిద్వద్గోచరార్థప్రవృత్తౌ లజ్జా = పామరవిషయప్రవృత్తి యందు లజ్జ – సిగ్గుపడుట. (ఉపనిషద్బ్రహ్మయోగి).
ఈ గాథార్థము సందేహాస్పదమని మాక్సుముల్లర్ అభిప్రాయము.
చూడు : ధమ్మపదం S.B.E. Vol. X.P. 39 (foot note)

ఉత్తమాశ్వము కశాఘాతము(కొరడా దెబ్బను) పరిహరించునట్లు, హ్రీగుణము (ఉచితలజ్జ)చే, అకుశల కర్మముల నిషేధించి, నిందను పరిహరించు పురుషుడీ లోకమున అరుదుగా నుండును. (ఉత్తమాశ్వము కశాఘాతమును వలె లజ్జానియతుడై నిందను పరిహరించు పురుషుడెవడైన ఈ లోకమున నున్నాడా? అని కూడ, 'కశ్చిత్' కు బదులు 'కచ్చిత్' శబ్దపాఠమును స్వీకరించి అనువదింపవచ్చును.)

144. అస్సో యథా భద్రో కసానివిట్ఠో ।
ఆతాపినో సంవేగినో భవాథ ।
సద్ధాయ సీలేన చ వీరియేన చ ।
సమాధినా ధమ్మవినిచ్ఛయేన చ।
సమ్పన్నవిజ్జా[1]చరణా పటిస్సతా ।
పహస్సథ దుక్ఖమిదం అనప్పకం[2] । 16 ।

*(అశ్వో యథా భద్రః కశానివిష్టః,*
*ఆతాపినః సంవేగినో భవత ।*

---

(1) విజ్జా :- మూడు జ్ఞానప్రకారములు.
(1) పుబ్బే నివాసానుస్సతిఞాణ = పూర్వజన్మస్మృతి - జ్ఞానము.
(2) చుతూప పాతఞాణ = ప్రాణుల జన్మమృత్యుజ్ఞానము.
(3) ఆసవానం ఖయఞాణ = ఆస్రవక్షయ జ్ఞానము.

(2) పోల్చు :- "శ్రద్ధా వీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్"
"తీవ్రసంవేగానామాసన్నః"। (పాతఞ్జల యోగదర్శనము-I. 20, 21 సూత్రములు)
సంస్కార సాక్షాత్ కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్" (పా.యో. ద. III. 18)

కర్మములు, ఇంద్రియమనోబుద్ధుల ద్వారా కల్గిన అనుభవములు, అన్నియు, (Thought waves) మణగిపోయి, అంతఃకరణమున సూక్ష్మసంస్కారముల రూపమున నిలచి యుండును. కాన, ఆ యనుభవములను మరల ప్రయత్నించి మనస్మృతికి తెచ్చుకొనవచ్చును. ఈ స్మృతిని అట్లే వెనుకకు పూర్వ జన్మములలోనికి సైతము వ్యాపింపజేయుట, ధ్యానసిద్ధులకు - అనగా ధారణా, ధ్యాన, సమాధుల మూడింటిని ఒకే ధ్యేయ విషయమున ఏకీభావమున నిలుపు 'సంయమము' సాధించిన యోగులకు సాధ్యము. ఇట్లు వారు పూర్వజన్మజ్ఞానమును పొందగలరు. సంయమము సాధించిన యోగులకు ప్రజ్ఞాలోకము (బుద్ధి ప్రకాశము) కల్గును.

'తజ్జయాత్ ప్రజ్ఞాలోకః" (పా.యో.ద. IV - 5)

శ్రద్ధయా శీలేన చ వీర్యేణచ,
సమాధినా ధర్మవినిశ్చయేన చ।
సమ్పన్న విద్యాచరణాః ప్రతిస్మృతాః
ప్రహాస్యథ దుఃఖ మిద మనల్పమ్ ॥ 16 ॥)

కొరడా దెబ్బతిన్న భద్రాశ్వము వలె, (గమ్యమగు నిర్వాణపదమును చేరుటకు) ప్రయత్నశాలులు, సంవేగవంతులు (క్రియాహేతువగు దృఢతర సంస్కారవంతులు) కండు. శ్రద్ధా, శీల, వీర్య (ఉత్సాహ), ఏకాగ్రతల చేతను, ధర్మమును గూర్చిన వినిశ్చయము చేతను, విద్యాచరణ (జ్ఞానాఽనుష్ఠాన) సంపన్నులై, సంపూర్ణస్మృతిమంతులై, ఈ మహాదుఃఖము (భవము)ను నశింపజేయుడి.

**సావత్థి (జేతవనము)** **సుఖసామణేరుడు**

145. **ఉదకం హి నయన్తి నేత్తికా, ఉసుకారా నమయన్తి తేజనం।**
**దారుం నమయన్తి తచ్ఛకా, అత్తానం దమయన్తి సుబ్బతా ॥ 17 ॥**

(ఉదకం హి నయన్తి నేతృకా, ఇషుకారా నమయన్తి తేజనమ్।
దారుం నమయన్తి తక్షకా, ఆత్మానం దమయన్తి సువ్రతాః ॥ 17 ॥)

నీటి కాలువలు (జలమార్గములు) నిర్మించువారు జలమును (వారి కిష్టమైన చోటికి) ప్రవహింపజేయుదురు. శరకారులు (బాణములు నిర్మించువారు) వానికి వాడిని (నిశితత్వము) ఋజుత్వమును సమకూర్తురు. వడ్రంగులు కొయ్యను చక్కగ చెక్కుదురు. అట్లే సువ్రతులు (పండితులు) తమ ఆత్మను నిగ్రహింతురు. (చూడు : ధమ్మపదం - 33, 80 గాథలు)

**10 దణ్డవగ్గో నమత్తో**

**దణ్డవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## జరావగ్గో ఏకాదసమో

## (జరావర్గః – ఏకాదశః)

## 11 జరావర్గము – ఏకాదశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **విసాఖావసహాయిక**

146. **కోను (కిన్ను) హాసో? కిమానన్దో?, నిచ్చం పజ్జలితే సతి ।**
**అన్ధకారేన ఓనద్ధా, పదీపం న గవేసథ[1] ॥ 1 ॥**

*(కోను హాసః క ఆనన్దో, నిత్యం ప్రజ్వాలితే సతి ।*
*అన్ధకారేణాఽవనద్ధాః, ప్రదీపం న గవేషయథ ॥ 1 ॥)*

నిరంతరమీ ప్రపంచము (భవాగ్నిచే) ప్రజ్వలించుచుండగా, ఎందుకీ నవ్వు? ఎందుకీ ఆనందము? అంధకారనిమగ్నులై యుండి, ప్రదీపము (సద్ధర్మము) కొఱకేల వెదుకరు? (దుఃఖభరితమైన సాంసారిక ప్రవృత్తికి అగ్ని, ప్రతిరూపము. ఇది ప్రజ్వలించుచు నిత్యము మారుచుండును. దీని నుంచి విముక్తికై పాటుపడవలెను.)

---

(1) గవేస్సథ – పాఠాంతరము.

రాజగృహము (వేళువనము) సిరిమా

147. పస్స చిత్తకతం బిమ్బం, అరుకాయం సముస్సితం ।
ఆతురం బహుసంకప్పం, యస్స నత్థి ధువం ఠితి[(1)] । 2 ।)

(పశ్య చిత్రీకృతం[(2)] బిమ్బమ్, అరుష్కాయం[(3)] సముచ్ఛ్రితమ్ ।
ఆతురం బహుసంకల్పం, యస్యనాఽస్తి ధ్రువం స్థితిః । 2 ।)

వ్రణయుక్తము, సంఘాతము; (రోగ) పీడితము, అనేక సంకల్ప వికల్పయుక్తము, అస్థిరమునైన ఈ విచిత్రబింబము (శరీరము)ను చూడుము. (సముచ్ఛ్రితము = నశ్వర భూత సముదాయము యొక్క రాశి = Mass of corruptible Elements.)

సావత్థి (జేతవనము) ఉత్తర(థేరి)

148. పరిజిణ్ణ మిదం రూపం, రోగనిడ్డం[(4)] పభఙ్గురం[(5)] ।
భిజ్జతి పూతిసన్దేహా, మరణన్తం[(6)] హి జీవితం । 3 ।

(1) ఠితి = స్థితి.
(2) అరు = అరుస్ = వ్రణే, క్షతే = పుండు, గాయము.
రాహుల సాంకృత్యాయనుడు సంస్కృతచ్ఛాయ యందు 'అరుకాయ'మనియే వ్రాసినాడు.
కాని, అరుస్ + కాయమ్ = 'అరుష్కాయమ్'.
అరుర్భి వ్రణైః పరిపూరితః కాయో యస్య తమ్ = అనగా వ్రణ పరిపూరిత కాయమని అర్థము. 'అరుః' - అను ఉకారాంత శబ్దమునకును, అర్థమిదియే కాన, 'అరుకాయమ్' అని కూడ సంస్కృతచ్ఛాయ యుండవచ్చును. ఉ = అరుంతుదః.
(3) చిత్రీకృతం (సం) చిత్తకతం = చర్మగతము, లేక, బాహిరసౌందర్యమునీశబ్దము సూచించును. (decorated form).
(4) రోగనిళం - పాఠాంతరము (ధమ్మపదం - Prof. N.K. Bhagwat)
(5) పభఙ్గుణం - స్యామదేశీయ పాఠాంతరము.
(6) ఫౌజ్‌బాల్ పండితుడు (Fousboll) 'మరణం తమ్హి' అనుపాఠము గ్రహించెను. కాని, సుప్రసిద్ధ పాశ్చాత్య విద్వాంసుడు చైల్డర్సు (Childers) అది సరికాదని 'మరణన్తం హి' అనుపాఠమే సరియైనదని ఫౌజ్‌బాల్ పండితునకు వ్రాసెను. (Maxmuller - S.B.E. Vol. X. p. 41)
మరణన్తం = "మరణపరియోసానం" - అని భదన్త బుద్ధఘోషుని వివరణ.
పోల్చు :- "సర్వే క్షయాన్తా నిచయాః, పతనాన్తాః సముచ్ఛ్రయాః ।
సంయోగ విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్ ।" (మ.భా. స్త్రీ. II -3)

(పరిజీర్ణ మిధం రూపం, రోగనీడం ప్రభఙ్గురమ్ ।
భిద్యతే పూతి స్సన్దేహో, మరణాన్తం(6)హి జీవితమ్ ॥ 3 ॥)

ఈ రూపము (శరీరము) జరాజీర్ణము, రోగములకు గూడు, క్షణభంగురము. దుర్గంధబంధురమగు నీ దేహము బ్రద్దలై నశించును. జీవితము మరణ పర్యవసానము. (మరణమే అంతముగా గలది).

**సావత్థి (జేతవనము) అధిమానుడు (భిక్షువు)**

**149. యాని' మాని అపత్థాని(1), అలాబూనేవ(2) సారదే ।**
**కాపోతకాని అట్ఠీని, తాని దిస్వాన కారతి? ॥ 4 ॥**

(యానీమాన్యపాస్తాని, అలబూనీవ శారది ।
కాపోతకాన్యస్థీని, తాని దృష్ట్వా కా రతిః? ॥ 4 ॥)

శరత్కాలమున పారవేయబడిన సొరకాయల వలెనున్నవీ కపోతవర్ణయుక్తములైన (తెల్లనైన) యెముకలు. వీని చూచుట యందు, ఏయానందమున్నది?

**సావత్థి (జేతవనము) రూపనంద (థేరి)**

**150. అట్ఠీనం(3) నగరం కతం, మంసలోహిత లేపనం(4) ।**
**యత్థ జరా చ మచ్చూ చ, మానో మక్ఖో చ ఓహితో ॥ 5 ॥**

---

(1) 'అపత్థాని' పదమునకు సంస్కృతచ్ఛాయ, 'అపథ్యాని' అని రాహులసాంకృత్యాయనుడు వ్రాసెను. కాని 'అపాస్తాని' అనుపదమే ఇందు సముచితము. "తత్థ అపత్థానీతి ఛడ్డితాని" – అని భదన్త బుద్ధఘోషుని వివరణ. 'అపత్థాని' పదమునకు 'అపాస్తాని' అను సంస్కృతరూపము బుద్ధఘోషునికి సమ్మతమని దీని వలన తెలియుచున్నది.
పోల్చు :- **"యానీమా న్యపవిద్ధాని, విక్షిప్తాని దశో దిశ ।**
**కపోతవర్ణాన్యస్థీని, తాని దృష్ట్వేహ కా రతిః? ।"** (దివ్యావదానము–37–33)
(2) 'అలాపూనేవ' – సింహళదేశీయ పాఠాంతరము.
(3) అట్ఠీనం = అస్థ్నామ్ (సం.) అస్థుల యొక్క. పాళీభాష యందు 'అట్ఠి' శబ్దము సంస్కృతమున 'అస్థి' శబ్దము వలెనే నపుంసకలింగము. ప్రాకృతమున 'అట్ఠీ' – స్త్రీ లింగము. ప్రాకృత పాళీ భాషల యందీ శబ్దమునకు అర్థభేదము లేదు.
(4) పోల్చు :- **"అస్థిపూర్ణం స్నాయుయుతం, మాంసశోణితలేపనమ్ ।**
**చర్మావనద్ధం, దుర్గంధి, పూర్ణం మూత్రపురీషయోః ।**

(అస్థీనం నగరం కృతం, మాంసలోహితలేపనమ్ /
యత్ర జరా చ మృత్యుశ్చ, మానో మ్రక్షాశ్చావహితః / 5 /)

ఎముకలచే నొక నగరము (దేహము) నిర్మింపబడి, మాంస రక్తములచే లేపన మొనరింపబడియున్నది. ఇందు జరామరణములు, మానము (గర్వము) దంభము నివసించుచున్నవి. (నగర శబ్దము దేహము యొక్క సంఘాతస్వరూపమును (compounded nature) తెలుపుచున్నది. నగరము నందు వలెనే, ఇందును వివిధ భాగములు – అవయవములు – నిర్మింపబడినవి. క్షయ విధ్వంసములు దీని పరిణామములు)

---

జరాశోకసమావిష్టం, రోగాయతన మాతురమ్ ।
రజస్వల మనిత్యం చ, భూతావాస మిదం త్యజేత్ ॥
(మనుస్మృతి - VI-76, 77)

"జరయాఽభి పరితప్య, మృత్యునా చ వినాశినా ।
దుర్బలం దుర్బలం పూర్వం, గృహస్యేవ వినశ్యతి ।
ఇంద్రియాణి మనో వాయు, శోణితం మాంస మస్థి చ ।
ఆనుపూర్వ్యా వినశ్యన్తి, స్వం ధాతు మనుయాన్తి చ ।
(మ. భా. శాంతి 218-41, 42)

"గాత్రం సంకుచితం, గతిర్విగళితా భ్రష్టాచ దన్తావళిః,
దృష్టిర్నశ్యతి వర్ధతే బధిరతా, వక్త్రం చ లాలాయతే ।
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా న శుశ్రూషతే ।
హా! కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రాయతే"

అని మహాయోగి భర్తృహరి జరాక్రాంత శరీరమును నిందించును. (వైరాగ్య - 73)
అస్థి నిర్మిత నగరమగు దేహమును గూర్చి "విసుద్ధిమగ్గము"న నొక కథా వివరణము కలదు. మహాతిస్సుడను థేరుడు జీవితక్షణభంగురతను ధ్యానించుచు, అనురాధపురము చెంత సంచరించుచుండెను. భర్తతో కలహించి వెళ్లిపోవుచున్న ఒక యువతి అతనిని దాటిపోయెను. విలాసవస్త్రధారిణి యగు నాకాంత, ఆ థేరుని గాంచి పండ్లిగిలించి నవ్వినది. ఆమెను వెతకుచున్న ఆమె భర్త కూడ అదే మార్గమున వచ్చి, "ఒక స్త్రీ ఆ మార్గమున పోవుట చూచియున్న తెల్పు"మని ఆ థేరు నడిగినాడు. "నేనొక అస్థిపంజరమును మాత్రము చూచితిని. అది పురుషుడో, స్త్రీయో నాకు తెలియదు" అని ఆ ఋషియన్నాడు.

**సావత్థి (జేతవనము)** **మల్లికాదేవి**

151. **జీర్ణ్ణి వే రాజరథా సుచిత్తా,**
**అథో సరీరం పి జరం ఉపేతి ।**
**సతఞ్చ ధమ్మో న జరముపేతి,**
**సన్తో హవే సబ్భి పవేదయన్తి ॥ 6 ॥**

*(జీర్యన్తి వై రాజరథా సుచిత్రా,*
*అథ శరీర మపి జరా ముపైతి ।*
*సతా ఞ్చ ధర్మో నజరా ముపైతి,*[1]
*సన్తో హవై సద్భ్యః ప్రవేదయన్తి ॥ 6 ॥)*

సుచిత్రితములైన రాజరథములు శిథిలమగుచున్నవి. శరీరము సైతము వార్ధక్యమును బొందుచున్నది. కాని, సత్పురుషుల ధర్మము వార్ధక్యము పొందదు. మహాత్ములిట్లు పరస్పరము ప్రబోధించుకొందురు.

**సావత్థి (జేతవనము) (కాల) ఉదాయి) లాలుదాయి (థేరుడు)**

152. **అప్పస్సుతా' యం పురిసో, బలివద్దో వ జీరతి ।**
**మంసాని తస్స వడ్ఢన్తి, పఞ్ఞా తస్స న వడ్ఢతి ॥ 7 ॥**

*(అల్పశ్రుతోఽయం పురుషో, బలీవర్ద ఇవ జీర్యతి ।*
*మాంసాని తస్య వర్ధన్తే, ప్రజ్ఞా తస్య న వర్ధతే ॥ 7 ॥)*

అల్ప జ్ఞానము గల వ్యక్తి (అజ్ఞాని) ఎద్దు వలె వార్ధక్యమును బొంది నశించును. వాని మాంసము మాత్రము వృద్ధి పొందును; ప్రజ్ఞ వర్ధిల్లదు.

---

(1) పోల్చు :- **"ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యను యాతి యః ।**
**శరీరేణ సమం నాశం సర్వ మన్యత్తు గచ్ఛతి"** (హితోపదేశము-మిత్ర-65)

**"రథానృపాణాం మణిహేమ భూషణా,**
**వ్రజన్తి దేహాశ్చ జరావిరూపతామ్ ।**
**సతాంతు ధర్మం నజరాభివర్తతే,**
**స్థిరానురాగా ఇవ గుణేషు సాధవః ॥"**
(ఆర్యసూరుని జాతకమాల-సుతసోమజాతకము - 74)

బోధివృక్షమూలము — బుద్ధత్వప్రాప్తి సందర్భమున ఉచ్ఛరించిన గాథలు

153. అనేక జాతి సంసారం, సన్ధావిస్సం అనిబ్బిసం ।
గహకారం[1] గవేసన్తో, దుక్ఖా జాతి పునప్పునం ॥ 8 ॥

*(అనేక జాతి సంసారం, సమధావిషమ్ అనిర్విశమానః ।*
*గృహకారం గవేషయన్, దుఃఖా జాతిః పునః పునః ॥ 8 ॥)*

శరీరరూపమగు గృహమును నిర్మించినవానిని (గృహకారుని) అన్వేషించుచు, అనేక జన్మముల యందీ సంసారమున నిరర్థకముగ పరుగులిడితిని. (కాని, అతనిని చూడలేదు) మరల మరల జన్మించుట దుఃఖము.

154. గహకారక! దిట్ఠోసి, పునగేహం నకాహసి[2] ।
సబ్బా తే ఫాసుకా భగ్గా, గహకూటం విసఙ్ఖితం ।
విసఙ్ఖారగతం చిత్తం, తణ్హానం ఖయమజ్ఝగా ॥ 9 ॥

---

(1) గహకారకం = పాఠాంతరము. తణ్హా = తృష్ణా. 'హ్న, స్న, ష్ణ, క్ష్ణ, శ్నాం ణ్హ' (ప్రాకృతప్రకాశము 3-33)

(2) కాహసి = కరిస్ససి (కరిష్యసి(సం) - వికల్పపదము. పాళీభాషయందు 'కర్' ధాతువునకు భవిష్యత్ స్వాభావిక స్థానమున వైకల్పికముగ 'కహాతి' 'కాహన్తి' ఆది పదములు వచ్చును. ప్రాకృతమునను 'కృ' ధాతు భవిష్య ద్రూపమునకు ఉత్తమ పురుషమున 'కాహం' ఆదేశమగుచున్నది. కృ, దా, శ్రు, వచి, గమి, రుది, దృశి, విది, రూపాణాం, కాహం, దాహం, సోచ్ఛం, వోచ్ఛం, గచ్ఛం, రోచ్ఛం, దచ్ఛం, వోచ్ఛం (ప్రాకృతప్రకాశము VII -16) 153, 154 గాథలు బుద్ధత్వప్రాప్తి సందర్భమున శ్రమణగౌతముడుచ్ఛరించిన ప్రథమ వాక్కులుగా ప్రసిద్ధి గాంచినవి. 'లలిత విస్తరము'న గౌతముడీ పవిత్ర సమయమున "శుష్కాస్రవా నపునః స్రవన్తి" - అను వాక్యముచ్ఛరించినట్లు చెప్పబడినది.

**'భిన్నవర్త్మోపశాన్తరజా, శుష్కా ఆస్రవా న పునః స్రవన్తి ।**
**భిన్నే వర్త్మని వర్తత ! దుఃఖస్యైషోఽన్త ఉచ్యతే ।'**

'వేరుపడిన మార్గము (మోక్షపథము) వలన, రజస్సు లుపశమించినవి. **శుష్కించిన (ఎండిపోయిన) తృష్ణావాహినులు మరల ప్రవహింపజాలవు. ఈ** భిన్నమార్గము (నిర్వాణపథము)న నడువుడు! అదియే దుఃఖమున కంతము'. (లలితవిస్తరము. 22. సంబోధన పరివర్తనము).

గృహకారకుడు - తృష్ణ కామము.
గేహము - శరీరము
పార్శుకములు - (పాసములు) = రాగములు
గృహకూటము = (గృహశిఖరము) = అవిద్య: అజ్ఞానము.

*(గృహకారక ! దృష్టోఽసి, పునర్గేహం న కరిష్యసి ।*
*సర్వాస్తే పార్శుకా భగ్నా, గృహకూటం విసంస్కృతమ్ ।*
*విసంస్కారగతం చిత్తం, తృష్ణానాం క్షయ మధ్యగాత్ ॥ 9 ॥)*

ఓ గృహ నిర్మాతా! నిన్ను కనుగొన్నాను. ఇక నీవీ గృహమును మరల నిర్మింపజాలవు. నీ వాసములు (rafters) అన్నియు భగ్నములైనవి. గృహ శిఖరము శైతము శిథిలమైనది. చిత్తము సంస్కారరహితమైనది. తృష్ణలు వినాశమందినవి.

**ఇసిపతనము (వారాణసి)** **మహాధనిసెట్ఠిపుత్తుడు**

**155. అచరిత్వా బ్రహ్మచరియం, అలద్ధా యొబ్బనే ధనం ।**
**జిణ్ణకోఞ్చా'వ ఝాయన్తి[1], ఖీణమచ్ఛే'వ పల్లలే ॥ 10 ॥**

*(అచరిత్వా బ్రహ్మ చర్యమ్, అలబ్ధ్వా యౌవనే ధనమ్ ।*
*జీర్ణక్రౌఞ్చా ఇవ ధ్యాయన్తి, క్షీణమత్స్య ఇవ పల్వలే ॥ 10 ॥)*

---

పోల్చు :- **"కామ! జానామితే మూలం, సఙ్కల్పాత్ కిల జాయసే ।"**

"ఓ కామమా! నీ మూలము నేనెఱిగితిని. సంకల్పము నుండి నీవు జనించుచున్నావు. నిన్ను నేను సంకల్పింపను; అందు వలన నీవు నాకు సంభవింపవు."

**న త్వాం సఙ్కల్పయిష్యామి, తతో మే న భవిష్యసి ।** (మ. భా. - శాంతి -177-25)

"రాగద్వేష మోహములు సంకల్ప ప్రభవములని చెప్పబడినది."

**"సఙ్కల్ప ప్రభవో రాగో ద్వేషో మోహశ్చ కథ్యతే ।"** (మాధ్యమికకారిక XXII - 1)

మహాపరినిర్వాణ (మహాపరినిబ్బానసుత్త) సూత్రము ననుసరించి బుద్ధుని చివరి వాక్కులు **: " హన్ద దాని భిక్ఖవే ఆమన్తయామి వో వయ ధమ్మా సఙ్ఖారా, అప్పమాదేన సమ్పాదేథ ।"** సంఘాతవస్తు జాత మంతయు నశించునదే. శ్రద్ధావంతులై నిర్వాణసిద్ధికి ప్రయత్నింపుడు.

(1) ఖాయన్తి - రాహులసాంకృత్యాయనుని పాఠము.

'ఝాయన్తి' కి సంస్కృతరూపము 'క్షాయన్తి' అని డా॥ బొల్లెన్‌సెన్ (Dr. Bollensen) మహాశయుననుసరించి మాక్సిముల్లర్ పండితుడు చెప్పును. కాని ఈ సిద్ధాంతము సముచితము కాదు. మత్స్యశూన్య జలాశయమున చింతాయుక్తజీర్ణక్రౌంచవిషయమున, ధ్యానరూపకము సమీచీనము. భాషావిజ్ఞానము ననుసరించి, 'ఝాయన్తి'కి సంస్కృత రూపము 'ధ్యాయన్తి' కాగలదు. 'క్షాయన్తి' - (క్షీణించును)కాదు. పాళీ 'ఝా' ధాతువునకీ యర్థము లేదు. ఝా = చిన్తాయం. ఝా = విచిన్తనే. (ధాతుమంజూష 105) చూడు :- మొగ్గలానధాతు పాఠము 320 'ధ్యై' (ధ్యాయ్) (సం..ధా) చిన్తాయామ్. (పాణిని ధాతుపాఠము 908).

బ్రహ్మచర్యమాచరింపక, యౌవనకాలమున ధనమార్జింపక యుండువారు, మత్స్యరహిత జలాశయమున వృద్ధ బకములవలె చింత నొందుదురు. (బ్రహ్మచర్యమనగా, సకలేంద్రియ సంయమమని భావము).

**156. అచరిత్వా బ్రమ్హచరియం, అలద్ధా యొబ్బనే ధనం।**
**సేన్తి చాపాతిఖీణా'వ, పురాణాని అనుత్థునం[1] ।11।**

(అచరిత్వా బ్రహ్మచర్యమ్, అలబ్ధ్వా యౌవనే ధనమ్।
*శేరతే, చాపోఅతిక్షీణా, ఇవ పురాణాన్యనుష్టున్వన్।11।*)

బ్రహ్మచర్యమనుష్ఠింపక, యౌవన కాలమున ధనమార్జింప యుండువారు, శిథిల ధనువుల వలె గత కాలమును గూర్చి దుఃఖించుచు పడియుందురు. (గత కాలపు ప్రతిజ్ఞల గూర్చి ప్రశంసించుకొనుచు పడియుందురని అక్షరార్థము)

*11 జరావగ్గో నమత్తో*

**జరావర్గము సమాప్తము**



(1) అనుష్టున్వన్తః – ఈ బహువచనాంత పదము వాక్యార్థమునకు సరిపడుచున్నది. భాష్యకారుడు భదన్త బుద్ధఘోషునికీ యర్థము సమ్మతము. "అనుత్థునన్తా అనుసోచెన్తా"
అనుతన్వన్తః – రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## అత్తవగ్గో ద్వాదసమో

## (ఆత్మవర్గో ద్వాదశః)

## 12 ఆత్మవర్గము – ద్వాదశాధ్యాయము

**భేసకళావనము** **బోధిరాజకుమారుడు**

**157. అత్తానం చే పియం జఞ్ఞా రక్ఖెయ్య నం సురక్ఖితం ।**
**తిణ్ణం అఞ్ఞతరం యామం(1), పటిజగ్గెయ్య పణ్డితో ॥ 1 ॥**

*(ఆత్మానం చేత్ ప్రియం జానీయాద్, రక్షేదేనం సురక్షితమ్ ।*
*త్రయాణా మన్యతమం యామం, ప్రతిజాగృయాత్ పణ్డితః ॥ 1 ॥)*

ఆత్మను (తన్ను) ఆత్మకు (తనకు) ప్రియమని యెఱిగిన వ్యక్తి, ఆత్మను చక్కగ రక్షించుకొనవలెను. వివేకశాలి, రాత్రి మూడు జాములలో నేదో యొకజామున, అవశ్యముగ జాగరూకుడై యుండవలెను.

---

(1) భాష్యకారుడు భదన్తబుద్ధఘోషుననుసరించి, ఈ త్రియామముల అర్థము : ప్రథమము, యౌవనావస్థ. ద్వితీయము (మధ్యమము) ప్రౌఢవయోఽవస్థ. తృతీయము (చరమము) వృద్ధావస్థ.

**సావత్థి (జేతవనము)** **(ఉపనన్ద-సక్యపుత్తథేరుడు)**

**158. అత్తాన మేవ పఠమం, పతిరూపే[1] నివేసయే।**
**అథఞ్ఞమను సాసెయ్య, న కిలిస్సెయ్య పణ్డితో[2] ॥ 2 ॥**

*(ఆత్మానమేవ ప్రథమం, ప్రతిరూపే నివేశయేత్।*
*అథాఽన్యమనుశిష్యాత్, న్నక్లిశ్యేత్ పణ్డితః ॥ 2 ॥)*

బుద్ధిమంతుడు, మొదట ఆత్మను (తన్ను) కుశలభూమిక యందు ప్రతిష్ఠించుకొనవలెను. తరువాత అన్యున కుపదేశింపవలెను. అట్టి పండితుడు క్లేశవశుడు కాడు.

**సావత్థి (జేతవనము)** **పధానిక తిస్సథేరుడు**

**159. అత్తానం చే తథా కయిరా,[3] యథఞ్ఞ మనుసాసతి।**
**సుదన్తో వత ధమేథ; అత్తా హికిర దుద్దమో ॥ 3 ॥**

*(ఆత్మానం చేత్తథా కుర్యాద్యథాఽన్య మనుశాస్తి।*
*సుదాన్తో బత దమయేద్, ఆత్మా హి కిల దుర్దమః ॥ 3 ॥)*

ఇతరుల ననుశాసించునట్లు, మనుజుడు ఆత్మను (తన్ను) దిద్దుకొనవలయును. తానుస్వయముగ జితేంద్రియుడై, ఇతరులను నిగ్రహింపవలయును. ఏలయన, ఆత్మ దుర్దమము కదా! (ఇతరుల కుపదేశించుటకు ముందు మనలను మనము చక్కబఱచుకొనవలెను).

---

(1) పటిరూపే - పాఠాంతరము.

(2) శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు సైతము "ధర్మమును తాననుష్ఠించి పరులకుపదేశింపవలెనని బోధించెను.

"ఆపని ఆచరి ధర్మ పరేరే శిఖాఓ" ।

(3) కరియా - బ్రహ్మదేశీయ పాఠాంతరము.

'కయిరా' పదము :- 'కర్' ధాతు స్థానమున 'కయిర' ఆదేశము. (కచ్చాయన 3-2-20). విభక్తి స్థానమున 'ఆ' ఆదేశమై 'కయిరా' సిద్ధించుచున్నది. (మొగ్గల్లాన-6-30). 'కుర్యాత్' పదమునకు 'కరియా' అను పాఠమే సహజమైనది. ఇది వర్ణ విపర్యయము (Meta thesis)నకు, అపినిహితము (epenthesis) నకు నిదర్శనము

**సావత్థి (జేతవనము) కుమారకస్సపుని మాత (థేరి)**

**160. అత్తా హి అత్తనో నాథో, కో హి నాథో పరో సియా? ।**
**అత్తనా హి సుదన్తేన, నాథం లభతి దుల్లభం[1] ॥ 4 ॥**

*(ఆత్మా హి ఆత్మనో నాథః, కో హి నాథః పరః స్యాత్ ।*
*ఆత్మనా హి సుదాన్తేన, నాథం లభతే దుర్లభమ్ ॥ 4 ॥)*

ఆత్మకు (తనకు) ఆత్మయే (తానే) స్వామి - ప్రభువు. అన్యుడెవ్వడు (తనకు) ప్రభువు కాగలడు? సుసంయతమగు ఆత్మచే, వ్యక్తి, దుర్లభుడైన ప్రభువును పొందుచున్నాడు.

**సావత్థి (జేతవనము) మహాకాలుడు (ఉపాసకుడు)**

**161. అత్తనా'వ[2] కతం పాపం, అత్తజం అత్తసమ్భవం ।**
**అభిమన్థతి[3] దుమ్మేధం, వజిరం[4]' వ'స్మమయం[5] మణిం ॥ 5 ॥**

*(ఆత్మనైవ కృతం పాపం, ఆత్మజ మాత్మ సంభవమ్ ।*
*అభిమథ్నాతి దుర్మేధసం, వజ్రమివాశ్మమయం మణిమ్ ॥ 5 ॥)*

తనచే స్వయముగ నాచరింపబడినది, తననుండి పుట్టినది, తనచే

---

(1) పోల్చు :- **"ఉద్ధరే దాత్మనాత్మానం, నాత్మాన మవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధు, రాత్మైవరిపు రాత్మనః ।**
**బంధురాత్మాత్మన స్తస్య, యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే, వర్తే తాత్మైవ శత్రువత్ ।"** (భ. గీ. VI - 5,6)

(2) హి - బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(3) అభిమత్థతి - పాఠాంతరము.

(4) వజిరం (వజ్రం) = హీరమణి. 'వజ్రోఽ స్త్రీ హీరకే పవౌ ।' (అమరకోశము-III-339) ఇది అత్యంత కఠినమైనది కాన, ఇతరమణులకు రంధ్రము చేయుటకుపయోగపడును. 'వజిర' శబ్దమునకు steel drill అని చైనీయుల అనువాదము. (Maximuller - Dhammapada - S.B.E. Vol. X)

(5) అస్మమయం - పాఠాంతరము. (సర్వేపల్లి రాధాకృష్ణుని ధమ్మపదము "మణౌ వజ్ర సముత్కీర్ణే సూత్రస్యేవాఽస్తు మేగతిః" (కాళిదాసు -రఘువంశము I.4) మణులను తొలుచుట యందుపయోగించు లోహ (శలాకా) యంత్రమును వజ్రమందురని చైనీయానువాదము వలన దెలియుచున్నది. ('శామ్యూల్ బీల్ - ధమ్మపదము).

నుత్పన్నమైనది -పోషింపబడినది - యగు పాపము ఆ దుర్బుద్ధిని పాషాణమయమగు మణిని వజ్రము వలె ఛేదించు (పీడించు)ను.

**రాజగృహము (వేళువనము) దేవదత్తుడు**

**162. యస్స అచ్చన్త దుస్సీల్యం, మాలువా[1]సాలమివో'త్థతం ।**
**కరోతి సో తథ'త్తానం యథా'నం ఇచ్ఛతీ దిసో[2] । 6 ।**

*(యస్యాఽత్యన్త దౌశ్శీల్యం, మాలువా శాల మివా తతమ్ ।*
*కరోతి స తథాత్మానం, యథైన మిచ్ఛతి ద్విట్ । 6 ।)*

మాలువాలత, సాలవృక్షమును పరివేష్టించి, ఆక్రమించునట్లు, అత్యంతము దుశ్శీలముచే నాక్రమింపబడిన మనుజుడు, తన శత్రువు, తనకు కాంక్షించునట్టి దురవస్థను తనకు కల్పించుకొనును.

---

(1) మాలువా - లతావిశేషము, సంస్కృతవాఙ్మయమున అరుదు. కాని, పాళీ భాషయందీశబ్దము తఱచుగా కాన్పించును. (ధమ్మపదము 334 గాథ)
**"అథ ఖో తం భిక్ఖవే మాలువా బీజం మోరో గిలెయ్య"** (మజ్ఝిమనికాయము). పాళీభాషా ప్రయోగానుసారము, బౌద్ధ సంస్కృతమునను, ఈ శబ్ద ప్రయోగమున్నది. మేదినీకోశమందు లతా (పత్రలతా)ర్థమున **"మాలు" శబ్దము ప్రయుక్తము. "మాలుః పత్రలతా నార్యాం స్త్రియామ్".** (మేదినీ - ల.ద్వికం)
(2) మూలమందలి 'దిసో' శబ్దమునకు సంస్కృతచ్ఛాయ యందు రాహులసాంకృత్యాయన, చారుచంద్రవసు ప్రముఖులు "ద్విషః" అని బహువచనాంత శబ్దము నొసగిరి. అట్లైన 'ఇచ్ఛతి' అను క్రియాపదము సైతము. 'ఇచ్ఛంతి' అని బహువచనాంతము కావలెను. ఇది భ్రమాత్మకము. సంస్కృతహలంత శబ్దమగు 'ద్విష్' (ద్విట్) శబ్దమునకు పాళీరూపము 'దిస' అని అజంతమగును. దీనికి ప్రథమా ఏకవచనమున 'దిసో' అని సిద్ధించును. దీనికి బహువచన రూపము 'దిసా' - చూడు : ధమ్మపదం 42 గాథ "దిసో దిసం యం తం కయిరా" -
మాలువాలత చుట్టుకొన్న సాలవృక్షము వర్షాకాలమున ఉదకభారముచే నశించునని రాహులసాంకృత్యాయనుని వ్యాఖ్య. **'క్రోష్ట్ర్యాం మాలువా స్త్రియామ్'** - (వైజయన్తీ) 'మాలువ' అనునది క్రోష్టి-క్రోష్టికా- ఒక తీగ అని యాదవ ప్రకాశకృత వైజయన్తీ నిఘంటువున కలదు.

**రాజగృహము (వేళువనము)** **బుద్ధసంఘమున కలత జనించిన సమయమున**

**163. సుకరాని[1] అసాధూని, అత్తనో అహితాని చ ।**
**యం వే హితఞ్చ సాధుఞ్చ, తం వే పరమ దుక్కరం ॥ 7 ॥**

(సుకరాణ్యసాధూన్యాత్మనోఽహితాని చ ।
యద్వై హితంచ సాధు చ తద్వై పరమదుష్కరమ్ ॥ 7 ॥)

ఆత్మకు అయోగ్యము, అహితమునైన కార్యములు సుకరములు. కాని, హితము, యోగ్యమునైన కార్యమాచరించుట పరమదుష్కరము.

**సావత్థి (జేతవనము)** **కాలథేరుడు**

**164. యో సాసనం అరహతం[2], అరియానం[3] ధమ్మజీవినం ।**
**పటిక్కోసతి దుమ్మేధో, దిట్ఠిం[4] నిస్సాయ పాపికం ।**
**ఫలాని కట్ఠకస్సేవ, అత్తఘఞ్ఞాయ[5] ఫలతి[6] ॥ 8 ॥**

---

(1) ఈ గాథను వ్యాఖ్యానించుచు భదన్త బుద్ధఘోషుడు 'ఉదాన' గ్రంథ మందలి ఈ క్రింది గాథనుదాహరించును.

**"సుకరం సాధునా సాధుం, సాధుం పాపేన దుక్కరం ।**
**పాపం పాపేన సుకరం, పాప మరియేహి దుక్కరం"**

యోగ్యునకు యోగ్యకార్యము సుకరము. పాపాత్మునకది దుష్కరము. పాపకార్యము పాపాత్మునకు సుకరము; ఆర్యున కది దుష్కరము. దేవదత్తుడు శ్రమణ సంఘమున భేదము కల్పించుటకు ప్రయత్నించినపుడు భగవంతుడీ గాథ నుచ్చరించెను. కాని ఇది ధమ్మపదమున కూర్పబడలేదు. ధమ్మపద అట్ఠకథ (వ్యాఖ్య) యందలి ఈ గాథ ధమ్మపదబ్రహ్మదేశీయపాఠమున మూలగాథగ చేర్పబడినది.

(2) బౌద్ధ సాహిత్యమున అరహన్త (అర్హత్) శబ్దము విశేషార్థయుక్తము. ఈ శబ్దము పూజార్థమగు 'అరహ' ధాతువు నుండి నిష్పన్నము. వ్యుత్పత్త్యర్థమున దీనికి, దీని మూలమగు అర్హత్ సంస్కృత శబ్దమునకు భేదము లేదు. 'అర్హ్ - పూజాయామ్ (పా. ధా. 740) 'అర్హః' పూజాయామ్ - (పా. III.2.133) సూత్రానుసారము శతృప్రత్యయము ద్వారా 'అర్హత్' (అర్హన్) సిద్ధించును. పూజ్యుడని దీని యర్థము. వైదిక సాహిత్యమునను 'అర్హత్' శబ్దము. బహుళ ప్రయుక్తమే **"ఇమం స్తోమ మర్హతే జాత వేదసే"** - (ఋ.సం. 1-14-1) "అర్హతే పూజ్యాయ - సాయణాచార్యుడు. (స్తోమము = స్తుతి.) అర్హన్తశ్చిద్యమిందతే సంజనయన్తి (ఋ.సం. 5-7-2) 'అర్హన్తః' = 'పూజ్యాః' - సాయణాచార్యుడు. ఇట్లు పూజ్యార్థమున

(యః శాసన మర్హతామ్, ఆర్యాణాం ధర్మజీవినామ్ ।
ప్రతిక్రోశతి దుర్మేధా, దృష్టిం నిశ్రిత్య పాపికామ్ ।
ఫలాని కాష్టకస్యైవ, ఆత్మహత్యాయై ఫలతి । 8 ।)

---

ఈ 'అర్హత్' శబ్దము వేదశాస్త్రములందే కాక, లౌకిక సంస్కృత సాహిత్యమందును ప్రయుక్తమైనది.
**"అర్హత్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్"** (మనుస్మృతి III. 128)

మఱియు, **"త్వ మర్హతాం ప్రాగ్రసరః స్మృతోఽపి నః"** - (అభిజ్ఞాన శాకుంతలము V. 15) కాని బౌద్ధ సంప్రదాయమున నీ శబ్దమొక విశిష్టార్థమున ప్రయుక్తము. బౌద్ధధర్మసాధన యందు చరమావస్థను ప్రాపించిన శ్రమణుని యందీ 'అరహన్త' శబ్దము రూఢమైనది. సాధనావస్థ యందలి నాల్గు భూమికల నారోహించిన వారు క్రమముగ 'సోతాపన్న' 'సకదాగామి', 'అనాగామి', 'అరహన్త' శబ్దములచే వ్యవహరింపబడుదురు. వీరు ఉత్తరోత్తరోత్కృష్టులు. (చూడు : గాథ 45 పాదటీక) 'అరహన్త' (అర్హత్) లక్షణముల నీ గ్రంథమందలి 'అరహన్తవగ్గము' విపులముగ వర్ణించును ఈ అరహన్తుడు నిర్వాణమును ప్రాపించినవాడు; జీవన్ముక్తుడు అతనికి పునరావృత్తి లేదు. పునర్జన్మహేతువులగు 'ఆస్రవము'లన్నియు, సంపూర్ణముగ నశించినవి. ఈ పరమావస్థను బౌద్ధశాస్త్రములిట్లు వర్ణించును :- ఇది జీవన్ముక్తి అవస్థ.

**"ఖీణా జాతి, వుసితం బ్రహ్మచరియం, కతం కరణీయం, నాపరం ఇత్థత్తాయాతి"**

(మజ్ఝిమనికాయము)

**"ఇమేసం హి వాసెట్ఠ చతున్నం వణ్ణానం యోహోతి భిక్ఖు అరహం**
**ఖీణాసవో, వుసితవా, కతకరణీయో, ఓహితభారో, అనుప్పత్త**
**సదత్థో, పరిక్ఖీణభవసంయోజనో సమ్మదఞ్ఞా విముత్తో"** ..........

(దీఘనికాయము)

పోల్చు :- **తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా ।** (యో.ద. II. 27) ఇట్లు ఈ 'అర్హత్' శబ్దము (ప్రాకృతమున 'అరహన్త' లేక, 'అరిహన్త') పారిభాషికార్థమున రూఢమైనది. జైన ధర్మమున 'అర్హత్' శబ్దమున కర్థము. 'జినుడు', ధర్మప్రవర్తకుడగు జైనతీర్థంకరుడు. ఇది గౌణార్థము. పూజ్యుడనియే ముఖ్యార్థము. కాని, క్రమముగ గౌణార్థము ముఖ్యార్థస్థానము నాక్రమించినది.
**"అశోకాద్యష్టమహాప్రతిహార్యాదిరూపాం పూజా మర్హతీ త్యర్హన్"** అని జైనుల నిర్వచనము. హేమచంద్ర కృతమగు అభిధానచింతామణి, జైనధర్మానుసారము 'అర్హత్' (అరహన్త) లక్షణమును వివరించును. ప్రాకృతరూపభేదమగు 'అరిహన్త' శబ్దమును సైతము జైన శాస్త్రములిట్లు కాల్పనికముగ నిర్వచించును :-

**"ఇందియవిసయకసాఏ పరిసహవేయణాఏ ఉవసగ్గే ।**
**ఏఏ అరిణో హంతా అరిహంతా తేన వుచ్చన్తి ।"**

నిర్దగ్ధ భవాంకురుడు, పునరావృత్తి రహితుడగు ముని 'అరహన్తు'డని జైనుల నిర్వచనము.

అర్హంతులు, ఆర్యులు, ధర్మజీవనులునగు మహాత్ముల శాసనము(ధర్మము)నే దుర్బుద్ధి, పాపదృష్టి నాశ్రయించి నిందించునో, వాడు, వెదురు వలె, నాత్మ వినాశమునకై ఫలముల నుత్పాదించును.

**సావత్థి (జేతవనము)** **చూలకాలుడు (ఉపాసకుడు)**

**165. అత్తనా హి[1] కతం పాపం, అత్తనా సంకిలిస్సతి ।**
**అత్తనా అకతం పాపం, అత్తనా'వ విసుజ్ఝతి ।**
**సుద్ధి అసుద్ధి పచ్చత్తం, నాఞ్ఞో అఞ్ఞం విసోధయే ॥ 9 ॥**

---

(3) పాళీవాఙ్మయమున ఆర్యశబ్దమునకు శిష్టుడు, సద్వంశ జాతుడునని అర్థము. కాని క్రమముగ 'ఆర్య' 'అర్హత్' శబ్దములు వ్యాఖ్యల యందు సమానార్థకములుగా పరిణమించినవి.

(4) దిట్ఠి :- పాపికదిట్ఠి, మిచ్ఛాదిట్ఠి (మిథ్యాదృష్టి) చూడు :- ధమ్మపదము - గాథ 318.

**"అవజ్జే వజ్జమతినో, వజ్జే చావజ్జదస్సినో ।**
**మిచ్ఛాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛన్తి దుగ్గతిం ।"**

అని మిథ్యాదృష్టి నిర్వచనము. ఇది సమ్యగ్దృష్టికి వ్యతిరేకము. 'అసత్య సిద్ధాంతము', 'సత్య సిద్ధాంతము', అని వీని భావము.

(5) 'అత్తఘఞ్ఞాయ' - దీనికి సంస్కృతచ్ఛాయ యందు 'ఆత్మహత్యాయై' అని వ్రాయబడినది. ఈ రూపము కేవల మర్థపరము. సరియైన రూపము 'ఆత్మఘాన్యాయై' అని యుండవలయును. కాని, 'ఘాన్యా' ప్రయోగము సంస్కృతమున మృగ్యము. పాళీభాష యందును 'ఘఞ్ఞా' శబ్దమరుదు. బ్రహ్మదేశీయ పాఠమున 'ఆత్మఘాతాయ' అనియున్నది. ఈ పాఠమధిక సమీచీనమని పండితుల అభిప్రాయము.

(6) 'ఫల్లతి' - రాహులసాంకృత్యాయనుని పాఠాంతరము. బ్రహ్మదేశీయపాఠమగు 'ఫలతి' అనునదే సాధువు. కాని, ఇందు ఛందోభంగదోషమున్నది. రాహులసాంకృత్యాయన పండితుడు ఈ దోషమును పరిహరించుటకు, 'ఫల్లతి' అని కల్పించి ఛాయయందును 'ఫల్లతి' అని వ్రాసి, అనువదించెను. ఇది భ్రాంతి మూలకము; నిరాధారము. 'ఫలతి' (సింహళీయపాఠమున 'ఫల్లతి') పాఠమే భాష్యకారుడు, భదన్తబుద్ధఘోషునకు సమ్మతము. 'ఫలతి'ని వ్యాఖ్యానించుచు ఈ క్రింది గాథను నాతడుదాహరించెను.

**"ఫలం వే కదలిం హన్తి, ఫలం వేళుం ఫలం నళం ।**
**సక్కారో కాపురిసం హన్తి, గబ్భో అస్సతరిం యథా ।"**

(1) అత్తనా'వ - సింహళీయ పాఠాంతరము.

పోల్చు :- భ. గీ. VI. 5, 6. మఱియు,

**"ఉద్ధరే దాత్మనాత్మానం సమ్యగ్దర్శననిష్ఠయా"** (ఆదిశంకరుడు - వివేకచూడామణి-9)

*(ఆత్మ నా హి కృతం పాప మాత్మనా సంక్లిశ్యతి ।*
*ఆత్మనాఽ కృతం పాప, మాత్మనైవ విశుద్ధ్యతి*
*శుద్ధి రశుద్ధిః ప్రత్యాత్మం, నాఽన్యోఽన్యం విశోధయేత్ । 9 ।)*

తాను చేసిన పాపము తన్ను క్లేశపఱచును. తాను పాపము చేయనిచో, తానే శుద్ధుడుగ నుండును. శుద్ధి, అశుద్ధి, అనునవి తనకు సంబంధించినవే. ఒకరు మఱొకరిని శుద్ధి పఱుపజాలరు. (తన్ను తానే యుద్ధరించుకొనవలెనని భావము).

**సావత్థి (జేతవనము)** **అత్తదత్థథేరుడు**

**166. అత్తదత్థం[1] పరత్థేన బహునాపి న హాపయే ।**
**అత్తదత్థం అభిఞ్ఞాయ సదత్థపసుతో సియా[2] । 10 ।**

*(ఆత్మనోఽర్థం పరార్థేన, బహునాఽపి న హాపయేత్ ।*
*ఆత్మనోఽర్థ మభిజ్ఞాయ, సదర్థ ప్రసిత స్యాత్ । 10 ।)*

పరార్థము (పరహితము) ఎంత గొప్పదైనను దానికై ఆత్మహితము నుపేక్షింపకూడదు. ఆత్మహితమును చక్కగ నెఱిగి, దానియందే (ఆసందర్భమునందే) తత్పరుడు కావలయును.

***12 అత్త వగ్గో నమత్తో***

**ఆత్మవర్గము సమాప్తము**



---

(1) 'అత్తదత్థ' శబ్దమున 'ద' కారాగమము వియతము కాదు. 'య, వ, మ, ద, న, త, ర, ళా చాగమా' (కచ్చాయన 1-4-6) అను సూత్రము ద్వారా.ఇది సిద్ధించుచున్నది. చూడు : 125 గాథ – పాదటీక.
(2) పరహితమునకై స్వహితమును త్యజింపకూడదు. ఇది స్వార్థ చింతనతోడి ఉపదేశము కాదు. స్వార్థమగు ధ్యానాది కుశల కర్మలను చక్కగ ననుష్ఠింపవలయును.
పోల్చు :- "శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః । (భ. గీ. III. 35)
అత్థ = అర్థము (Object) ప్రయోజనము. దీనిని నైతికార్థమున ధర్మము (duty) అని స్వీకరింపవలయును. కాని, లాభము (advantage) అను నర్థమున గ్రహింపకూడదు. 'అత్థ' పదమును ఆధ్యాత్మిక శ్రేయస్సు (Spiritual good) అని 'చిల్డర్సు' మహాశయుడు (Childers) అనువదించెను.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## లోకవగ్గో తేరసమో

## (లోకవర్గస్త్రయోదశః)

## 13 లోకవర్గము - త్రయోదశాధ్యాయము

సావత్థి (జేతవనము) — దహరభిక్ఖు (అల్పవయస్కుడగునొక భిక్షువు)

**167. హీనం ధమ్మం[1] న సేవెయ్య, పమాదేన న సంవసే ।**
**మిచ్ఛాదిట్ఠిం[2] న సేవెయ్య, న సియా లోకవడ్ఢనో [3] ॥ 1 ॥**

(హీనం ధర్మం న సేవేత, ప్రమాదేన న సంవసేత్ ।
మిథ్యాదృష్టిం న సేవేత, న స్యాల్లోకవర్ధనః ॥ 1 ॥)

---

(1) భాష్యకారుడు భదన్త బుద్ధఘోషుడు 'హీన ధమ్మ' పదమును పంచకామగుణములు - పంచేంద్రియ విషయములగు శబ్దాదుల ననుసరించుటయని వివరించును.

(2) మిచ్ఛాదిట్ఠి - (మిథ్యాదృష్టి) సమ్మాదిట్ఠి ( సమ్యగ్దృష్టి) కి వ్యతిరేకమైనది; అవిద్యాహేతుకమైన భ్రమాత్మకదర్శనము. దీని విశిష్ట లక్షణము ధమ్మపదము (నిరయవగ్గము) 316, 319 గాథలు నిర్వచించును. అక్రియావాదము, అహేతుకవాదము, ఉచ్ఛేదవాదము, అను దార్శనిక సిద్ధాంతములు మిథ్యాదృష్టి యొక్క విశేషరూపములని బౌద్ధ శాస్త్రములు తెల్పును.

**"మిథ్యాదృష్టిర్నాస్తికతా"** । (అమరకోశము I. (ధీ వర్గము) -143)

(3) లోకబడ్ఢనో - సింహళీయ పాఠాంతరము.

హీన (నీచ) ధర్మము ననుష్ఠింపకూడదు. ప్రమత్తుడుగా జీవింపకూడదు. మిథ్యాదృష్టి (అసత్యసిద్ధాంతము) నవలంబింపకూడదు. (జనన మరణ రూపమగు) సంసారవృద్ధి వలదు. (భౌతిక బుద్ధితో జన్మమృత్యు పునరావృత్తి రూపమగు భవమును విస్తరింప జేసికొనకూడదు.)

**కపిలవత్థు (నిగ్రోధారామము) శుద్ధోదనుడు (బుద్ధుని తండ్రి)**

**168. ఉత్తిట్ఠే న ప్పమజ్జెయ్య, ధమ్మం సుచరితం చరే ।**
**ధమ్మచారీ సుఖం సేతి, అస్మిం లోకే పరమ్హి చ ॥ 2 ॥**

*(ఉత్తిష్ఠే[1]న్న ప్రమాద్యేత, ధర్మం సుచరితం చరేత్ ।*
*ధర్మచారీ సుఖం శేతే, అస్మిన్ లోకే పరస్మింశ్చ[2] ॥ 2 ॥)*

ఉత్థానశీలుడు కావలెను. అలసుడు - ప్రమత్తుడు - కాకూడదు. సద్ధర్మము ననుష్ఠింపవలెను. ధర్మానుష్ఠాన పరుడీలోకమునను, పరలోకమునను సుఖముగ నివసించు (విశ్రమించు)ను.

---

(1) పోల్చు :- "ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్ని బోధత! ॥ (కఠ. ఉ. III.14)
(2) 'పరత్రచ' :- రాహులసాంకృత్యాయన పాఠాంతరము.

భాష్యకారుడు భదన్తబుద్ధఘోషుడీ గాథను భిన్నరీతి వివరించును.

**"..........ఉత్తిట్ఠేతి ఉత్తిట్ఠ పరేసం ఘరద్వారే ఠత్వా గహేతబ్బ పిణ్డే"........।**

రాహులసాంకృత్యాయనుడు, ఉత్తిట్ఠే = 'ఉత్సాహి బనే' అని వివరించును. కాని భదన్త బుద్ధఘోషననుసరించి, 'ఉత్తిట్ఠే' అనునది క్రియాపదము కాదు. అది నామపదము; సప్తమ్యంతము. దీని పారిభాషికార్థము 'మాధుకరీభిక్ష', పరులగృహద్వారముల నిలబడి గ్రహింపవలసిన భిక్ష. మాధుకర భిక్షను పరిత్యజించి ఒకే ఇంట మృష్టాన్నభోజన స్వీకారము బౌద్ధ భిక్షువుల కనుచితమని భాష్యకారుని వ్యాఖ్యాసారము. థేరీ గాథల యందీ యర్థమున ప్రయోగములు గలవు.

"ఉతిట్ఠ పిణ్డో ఆహారో" - థేరీగాథ 1060

"ఉతిట్ఠపిణ్డో ఉఞ్ఛో చ పంసుకూలఞ్చ చీవరం। (థే.గా. 351)

**ఉత్తిట్ఠపిణ్డో = "వివట ద్వారే ఘరే ఘరే పతిట్ఠిత్వా లభనకపిణ్డో" ।** (థేరీగాథా టీకా - పరమత్థదీపనీ)

కపిలవాస్తుపురమున భగవంతుడు భిక్షాటనము చేయునపుడు తండ్రి శుద్ధోదనుడు, "అది రాజధర్మము కాద"ని ఆక్షేపింపగా, భగవంతుడీ గాథల (168, 169) నుచ్చరించి, తాను రాజసంబంధి కానని, ఆర్యఅష్టాంగ పథమున చరించు ఆదిబుద్ధుల సంప్రదాయమునకు సంబంధినని చెప్పును. బుద్ధుల భిక్షాటనము, గృహస్థులకు పుణ్యఫలమొసగుటకు మాత్రమేనని భావము.

169. ధమ్మం చరే సుచరితం, న నం దుచ్చరితం చరే ।
ధమ్మచారీ సుఖం సేతే, అస్మిం లోకే పరమ్హి[1] చ । 3 ।

*(ధర్మం చరేత్ సుచరితం, నైన ద్దుశ్చరితం చరేత్ ।*
*ధర్మచారీ సుఖం శేతే, అస్మిన్ లోకే పరస్మింశ్చ । 3 ।)*

సుచరితమైన - సదాచారయుక్తమైన - ధర్మము ననుష్ఠింపవలెను. దుశ్చరితము ననుష్ఠింపకూడదు. ధర్మానుష్ఠానపరు డీలోకమునను పరలోకమునను సుఖముగ నివసించు (విశ్రమించు)ను.

**సావత్థి (జేతవనము)** **పంచశత భిక్షువులు (జ్ఞానులు)**

170. యథా బుబ్బుళకం[2] పస్సే, యథా పస్సే మరీచికం ।
ఏవం లోకం అవెక్ఖన్తం, మచ్చు[3]రాజా న పస్సతి । 4 ।

---

(1) పోల్చు :- "Enter ye in at the strait gate; for wide is the gate and broad is the way that leadeth to destruction, and many there be which go in there at. Because strait is the gate and narrow is the way which leadeth un to life and few there be that find it." (Bible. St. Mathew. VII. 13,14)మఱియు చూడు :- రాధాకృష్ణపండితుని ధమ్మపదము.

(2) పుబ్బుళకం - బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(3) మచ్చు మృత్యు (సం). మృత్యు శబ్దమందలి 'ఋ' కారమునకు 'అ' కారమాదేశమై, 'త్యు' కు 'చ్చు' ఆదేశమై 'మచ్చు' శబ్దము సిద్ధించినది. (ప్రాకృతప్రకాశము - I-27; III-27; III-50).

పోల్చు :- **"సుఞ్ఞతో లోకం అవెక్ఖస్సు, మోఘరాజ! సదా సతో ।**
**అత్తాను దిట్ఠిం ఊహచ్చ, ఏవం మచ్చుతరో సియా ।**
**ఏవం లోకం అవెక్ఖన్తం, మచ్చురాజా న పస్సతీతి ।"** (సుత్తనిపాతము-V-16-4)

ఓ మోఘరాజా! ఈ లోకమును సదా స్మృతిమంతుడవై, శూన్యప్రాయముగ చూడుము. ఇట్లు అహంధృష్టిని నాశమొనర్చి మృత్యువు నతిక్రమించవలెను. లోకము నిట్లు చూచువానిని మృత్యురాజు (యముడు) కనుగొనలేడు.

**"ఫేనపిణ్డూపమం రూపం, వేదనా బుబ్బుళూపమా ।**
**మరీచికూపమా సఞ్ఞా, సంఖారా కదళూపమా ।**
**మాయూపమఞ్చ విఞ్ఞాణం, దీపితాదిచ్చబన్ధునా ।"** (సంయుత్త నికాయము III. 142)

ఇచ్చట, రూపవేదనాదులగు పంచస్కంధములు బుద్బుదములుగా నుపమింపబడినవి.

"దీపిక యొక్క కాంతి, నూనె, వత్తి - వీనిపై నాధారపడియున్నది. కాంతి, వీనిలో నేదో యొక దానిలో కాని, దీపిక యందుకాని, లేదు. దృశ్యములిట్టివే, స్వయంసత్తాశూన్యములు.

(యథా బుద్బుదకం పశ్యేద్, యథా పశ్యే న్మరీచికమ్ ।
ఏవం లోక మవేక్షమాణం, మృత్యురాజో న పశ్యతి । 4 ।)

నీటి బుడగను, ఎండమావిని, చూచునట్లు, (క్షణభంగురముగ, మిథ్యారూపముగ) - ఈలోకమును చూచు వానిని, మృత్యురాజగు యముడు కనుగొనజాలడు. (మృత్యురూపమగు సంసారమున నతడు పడడని భావము).

**రాజగృహము (వేళువనము)** **అభయరాజకుమారుడు**

171 **ఏథ పస్సథి' మం లోకం, చిత్తం రాజరథూపమం**[1] **।**
**యత్థ బాలా విసీదన్తి, నత్థి సఙ్గో విజానతం । 5 ।**

(ఏత పశ్యతేమం లోకం, చిత్రం రాజరథోపమమ్ ।
యత్ర బాలా విషీదన్తి, నాఽస్తి సఙ్గో విజానతామ్ । 5 ।)

రండు! చిత్రవర్ణ యుక్తమగు రాజరథమును పోలిన ఈ లోకము (భౌతిక శరీరము)ను చూడుడు. దీని యందు మూర్ఖులు నిమగ్నులై - ఆసక్తులై - యున్నారు. జ్ఞానులిందు సంసక్తిని పొందరు.

**సావత్థి (జేతవనము)** **సమ్మజ్జని థేరుడు**[2]

172. **యోచ**[3] **పుబ్బే పమజ్జిత్వా, పచ్ఛా సో నప్పమజ్జతి ।**
**సో' మం లోకం పభాసేతి, అబ్భా ముత్తో' వ చన్దిమా । 6 ।**

---

గోచరవస్తు జాతమంతయు, అసత్యము; మాయామయము. నిర్వాణమే పరమార్థము. (మజ్ఝిమనికాయము III. 140)

బుద్ధభగవాను ననుసరించి, వ్యష్టివ్యక్తిత్వము (Individual Personality) నిత్యమను విశ్వాసమే పాపమూలము. "సత్కాయదృష్టి ప్రభవాః సర్వ క్లేశాః" । దేనినైనను నిత్యమని మనము భావించినచో దానియందే మనము సంసక్తులమగుదుము.

(చూడు : రాధాకృష్ణ పండితుని ధమ్మపదము, పుట 116-1982)

(1) "రాజపథూపమం" - రాహులసాంకృత్యాయనుని పాఠాంతరము. విచిత్ర రాజమార్గ సమమని భావము. (2) ధమ్మపదట్ఠ కథ యొక్క బ్రహ్మదేశీయ సంస్కరణము ననుసరించి ఈతని పేరు 'సమ్మజ్జనథేరు'డని యున్నది.

(3) బ్రహ్మదేశీయ పాఠమున 'చ' కారము లేదు. "యో పుబ్బే వ పమజ్జిత్వా" - పాఠాంతరము.

(యశ్చ పూర్వం ప్రమాద్య, పశ్చాత్ స న ప్రమాద్యతి ।
స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చన్ద్రమాః । 6 ।)

ఎవడు మొదట (విచారరహితుడై) ప్రమాదపడి, తరువాత అప్రమత్తు (సువిచారశీలు) డగునో, అతడు మేఘమును భాసిన చంద్రుని వలె నీలోకమును ప్రకాశింపజేయును.

**సావత్థి (జేతవనము)** **అఙ్గులిమాలుడు (థేరుడు)**

**173. యస్స పాపం కతం కమ్మం, కుసలేన పిథీయతి[1]**
**సోమం లోకం ప్రభాసేతి, అబ్భాముత్తోవ చన్దిమా । 7 ।**

(యస్య పాపం కృతం కర్మ, కుశలేన పిధీయతే ।
స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చన్ద్రమాః । 7 ।)

ఎవని పాపకర్మము, కుశల (పుణ్య) కర్మముచే కప్పివేయబడునో, అతడు, మేఘమును బాసిన చంద్రుని వలె నీలోకమును ప్రకాశింపజేయును.

**ఆలవి (అగ్గాళవ చేతియము)** **పేసకారధీత (కన్య)**

**174. అన్ధభూతో[2] అయం లోకో, తనుకేత్థ విపస్సతి ।**
**సకుణో[3] జాలముత్తోవ, అప్పో సగ్గాయ గచ్ఛతి[4] । 8 ।**

(అన్ధభూతోఽయం లోకః, తనుకోఽత్ర విపశ్యతి ।
శకునో జాలముక్త ఇవ, అల్పః స్వర్గాయ గచ్ఛతి । 8 ।)

---

(1) 'సో ఇమం లోకం' – సిం. దే. పా. పిదియ్యతి, పహియ్యతి – పాఠాంతరములు.

(2) అన్ధీభూతో – బ్రహ్మదేశీయపాఠాంతరము.

(3) 'సకున్తో' – పాఠాంతరము

(4) పోల్చు : – "మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం, కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" । (భ. గీ. VII- 31)

"Our soul is escaped as a bird out of the snare of the fowlers." (spsalms)
వేటకాని వల నుండి విముక్తమైన పక్షివలె మన ఆత్మ విముక్తమైనది. (బైబులు –(కీర్తనలు –124-7)

ఈ లోక మంధకారావృతము. ఇందు చూడగలవారు - సత్యదృష్టిగలవారు - అరుదు. వల నుండి విడివడిన పక్షి వలె, స్వర్గమున కేగువారు స్వల్పమే.

**సావత్థి (జేతవనము)** **తింస భిక్ఖూ**
**(30 మంది భిక్షువులు)**

175. **హంసాదిచ్చపథే[1] యన్తి, ఆకాసే యన్తి ఇద్ధియా।**
**నీయన్తి ధీరా లోకమ్హా, జెత్వా మారం సవాహినిం[2] । 9 ।**

*(హంసా ఆదిత్యపథే యన్తి, ఆకాశే యన్తి ఋద్ధికాః[3] ।*
*నీయన్తే ధీరా లోకాత్, జిత్వా మారం సవాహినీకమ్ । 9 ।)*

హంసలు సూర్యపథమున పోవును. యోగులు, యోగసిద్ధి బలమున ఆకాశమున పయనింతురు. సేనాసహితముగ మారుని జయించిన ధీరులీ, లోకము-సంసారము-నుండి-నిర్వాణమునకు-కొనిపోబడుదురు.

**సావత్థి (జేతవనము)** **చిఞ్చా మాణవిక**

176. **ఏకం ధమ్మం[4] అతీతస్స, ముసావాదిస్స జన్తునో ।**
**వితిణ్ణపరలోకస్స, నత్థి పాపం అకారియం । 10 ।**

---

(1) హంసా ఆదిచ్చపథే - బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(2) సవాహనం; సవాహిణిం, - పాఠాంతరములు.

(3) ఋద్ధియా - పాఠాంతరము (రాహులసాంకృత్యాయనుడు) ఇద్ధి (ఋద్ధి) = యోగసిద్ధి. 'హంస' శబ్దము నిత్యానిత్యవస్తుతత్త్వజ్ఞులగు జ్ఞానులకును నన్వయించును.

(4) భాష్యకారుడు భదన్త బుద్ధఘోషుననుసరించి **"ఏకం ధమ్మం"** అనుటకు **'సత్యము'** అని అర్థము. **"ఏకం ధమ్మన్తి సచ్చం" ।** పాశ్చాత్య పండితుడు **'పౌజ్‌బాల్'** దీనిని ఏదేనొక 'ధర్మవిధి' యని వివరించెను. మాక్సుముల్లర్ **'One Law'** అనియు, రాధాకృష్ణ పండితుడు **బుద్ధ ప్రవర్తిత ధర్మ**మనియు వివరించిరి. ఈ వివరణములు సరికావు. భదన్త బుద్ధఘోషుని వివరణమే అత్యంతము సుసంగతము. ప్రాచీనభారతవర్షమున సత్యమే మహోన్నత ధర్మమని ప్రశంసింపబడినది. **"యోవై స ధర్మః, సత్యం వైతత్, తస్మాత్ సత్యం వదన్త మాహుర్ధర్మం వదతీతి"** - (బృ. ఉ. 1-4-14).

**"సత్యమేవ జయతే నానృతం, సత్యేన పంథా వితతో దేవయానః ।**
**యేనా క్రమన్త్యృషయో హ్యాప్తకామా, యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్" ।**
(ముం. ఉ. I-6 )

(ఏకం ధర్మమతీతస్య, మృషావాదినో జన్తోః ।
వితీర్ణపరలోకస్య, నాస్తి పాప మకార్యమ్ । 10 ।)

ఏకమగు ధర్మము (సత్యము) నుల్లంఘించినవాడు, అసత్యవాది, పరలోక విషయమున నుదాసీనుడు నగు వానికి -జంతువునకు - చేయదగని పాప మేదియును లేదు.

**సావత్థి (జేతవనము)** **అనదినదానము (అయుక్తదానము)**

**177. న వే కదరియా దేవలోకం వజన్తి,**
**బాలా హవే న ప్పసంసన్తి దానం ।**
**ధీరో చ (వ) దానం అనుమోదమానో,**
**తేనేవ సో హోతి సుఖీ పరత్థ । 11 ।**

(న వై కదర్యా దేవలోకం వ్రజన్తి,
బాలా హ్యవై న ప్రశంసన్తి దానమ్ ।
ధీరశ్చ దాన మనుమోదమానః,
తేనైవ స భవతి సుఖీ పరత్ర । 11 ।)

కృపణులు (లోభులు) దేవలోకమునకు పోలేరు. మూర్ఖులు, దానమును ప్రశంసింపరు. ధీరుడు (ధైర్యశాలి) మాత్రమే, దానము ననుమోదించువాడై, పరమున సుఖమందును.

**సావత్థి (జేతవనము)** **అనాథపిణ్డికుని పుత్రుడు**

**178. పథవ్యా[1] ఏకరజ్జేన, సగ్గస్స గమనేన వా ।[2]**
**సబ్బలోకాధిపచ్చేన, సోతాపత్తిఫలం వరం । 12 ।**

(1) 'పథవ్యా' - బ్రహ్మదేశీయ పాఠాంతరము.
'పఠవ్యా' - స్యామదేశీయ పాఠాంతరము.
సంస్కృత పృథివీ శబ్దమునకు పాళీరూపములు 'పుథువీ', 'పఠవీ', 'పుథవీ', 'పథవీ' - అనునవి. 'పుథువీ', 'పఠవీ' - ఈ రెండు రూపములు కచ్చాయన వ్యాకరణమున సిద్ధించును. 'పుథవీ' శబ్దము సైతము కచ్చాయనునకు సమ్మతమే. ప్రస్తుతగాథ యందలి 'పథవీ' ప్రయోగము కాచ్చాయనునికి సమ్మతమా, కాదా, యనునది సందేహాస్పదము. కాని ఈ ప్రయోగము వైయాకరణ మొగ్గలానునికి సమ్మతము. ప్రాకృతభాష యందు పృథివీ శబ్దమునకు వివిధ రూపములున్నవి. పుథువీ, పుథవీ, పుఠవీ, పుహవీ, పుహాఈ, వుహాఈ, - ఇత్యాదులు.

(పృథివ్యా ఏకరాజ్యాత్, స్వర్గస్య గమనా ద్వా ।
సర్వలోకాధిపత్యాత్, స్రోత ఆపత్తి ఫలం [3] వరమ్ । 12 ।)

పృథివీసార్వభౌమరాజ్యలాభమున కంటె, స్వర్గలోకగమనమున కంటె, సర్వలోకాధిపత్యమున కంటెను 'స్రోత ఆపత్తి' ఫలమే శ్రేష్ఠమైనది.

**13 లోకవగ్గో నమత్తో**

**లోకవర్గము సమాప్తము**



---

(2) 'ఏకరజ్జేన', 'గమనేన', 'సబ్బలోకాధిపచ్చేన', – ఈ పదములందలి తృతీయా విభక్త్యర్థము దుర్ఘటము. సంస్కృత వ్యాకరణానుసారము, ఇందు పంచమీవిభక్తి సముచితము. పాళీభాషయందు పంచమీ విభక్త్యర్థమున తృతీయావిభక్తి యుక్తపదములు కూడ ప్రయుక్తములని భావింపవలయును. దీనిననుసరించియే సంస్కృతచ్ఛాయయందు పంచమీ విభక్తి ప్రయుక్తమైనది.

(3) సోతాపత్తి = స్రోతఆపత్తి (సం) :– నిర్వాణ పదమునకు కొనిపోవు ప్రవాహమును పొందుట. "స్రోతోఽంబువేగే" – "ఆపత్తిః – ప్రాపణే". (మేదినీకోశము) నిర్వాణపరగామినియైన స్రోతస్సున ప్రవేశించుట 'సోతాపత్తి'. ఇది సిద్ధియొక్క ప్రథమావస్థ. భౌతికసంపదల కంటె, దేవలోకసుఖముల కంటె దీనివల ముత్కృష్టము. స్వర్గమర్త్యలోకసుఖములన్నియు నశ్వరములు; జన్మజరాదిదుఃఖరూపసంసారమునకు పునరావృత్తి కరములు.

పోల్చు :- "**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మా ముపేత్య తు కౌంతేయ ! పునర్జన్మనవిద్యతే**" । (భ.గీ. VIII–16)

నిర్వాణప్రాప్తికి నాల్గు భూమికలున్నవి. నిర్వాణ ప్రాప్తికి ముందు (1) **సోతాపన్నుడు**, ఏడు జన్మముల నెత్తవలసియుండును.

(2) **నకదాగామి** (సకృదాగామి) – ఒకసారి మాత్రమే పునరావృత్తి గలవాడు. ఈ భూమికను పొందిన సాధకుడు, తరువాత మర్త్యలోకమున గాని, దేవలోకమున గాని ఒకసారి మాత్రమే జన్మించును.

(3) **అనాగామి** :- పునరావృత్తి రహితుడు. ఈ భూమికను ప్రాపించిన సాధకునకు క్రింది లోకములందు మఱి జన్మముండదు. ఇతడు బ్రహ్మలోకమున నిర్వాణప్రాప్తికి ముందు జన్మింపవచ్చును.

(4) **అరహన్తుడు** :- (అర్హన్తుడు) పరమభూమికను ప్రాపించినవాడు. ఈ భూమిక నుండి నిర్వాణానంద మనుభవింపవచ్చును. ఇది జీవన్ముక్తుని భూమికను పోలును. చూడు : గాథ 45. మఱియు గాథ 164. పాదటీకలు.



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## బుద్ధవగ్గో చుద్దసమో

(బుద్ధవర్గశ్చతుర్దశః)

## 14 బుద్ధవర్గము – చతుర్దశాధ్యాయము

ఉరువేల (బోధిమణ్డము)

మారధీత (మారకన్య)
(మాగందియ బ్రాహ్మణుడు అని వేఱొక సంస్కరణము)

**179. యస్స జితం నావజీయతి జిత మస్స నో యాతి కోచి లోకే।**
**తం బుద్ధ 'మనన్త గోచరం' అపదం కేన పదేన నెస్సథ ? ।1।**

*(యస్య జితం నావజీయతే, జిత మస్య నయాతి కశ్చిల్లోకే।*
*తం బుద్ధ 'మనన్త గోచరమ్' అపదం కేన పదేన నేష్యథ ।1।)*

ఎవని రాగాది విజయము, అపజయముగ మారదో, ఎవని నేలోకమునకు చెందినవైనను విజితములైన రాగాదులనుసరింపజాలవో, అట్టి బుద్ధుని, అనంతజ్ఞాన సంపన్నుని, (సర్వజ్ఞుని) మార్గరహితునే మార్గమున గొనిపోగలరు? (ఏయుపాయమున బుద్ధుని అస్థిరునిగా చేయగలరు?)

**180. యస్స జాలినీ విసత్తికా, తణ్హా నత్థి కుహిఞ్చి నేతవే ।**
**తం బుద్ధ మనన్త గోచరం, అపదం కేనపదేన నెస్సథ ॥ 2 ॥**
*(యస్య జాలినీ విషాత్మికా, తృష్ణానాఽస్తి కుత్రచిన్నేతుమ్ ।*
*తం బుద్ధ మనన్తగోచరం, అపదం కేన పదేన నేష్యథ? ॥ 2 ॥)*

జాలము (వల) నావరింపజేయు విషాత్మికమగు తృష్ణ, ఎటకేని అపమార్గమున కాకర్షించుటకు, ఎవనికి లేదో, అట్టి బుద్ధుని, అనంతజ్ఞానసంపన్నుని (సర్వజ్ఞుని) అపదుని స్థాన, లక్షణ, మార్గ రహితుని నే మార్గమున గొనిపోగలరు? (ఏయుపాయమున బుద్ధుని అస్థిరుని చేయగలరు?)*

---

* పోల్చు :- **"సఞ్ఞావిరత్తస్స న సన్తి గన్థా, పఞ్ఞావిముత్తస్స న సన్తి మోహా ।**
**సఞ్ఞఞ్చ, దిట్ఠిఞ్చ, యే అగ్గహేసుం, తే ఘట్టయన్తా విచరన్తి లోకే " ।**

విషయ విముక్తునకు గ్రంథులు (బంధములు) లేవు ప్రజ్ఞచే అవిద్యా విముక్తనకు మోహముండదు. కాని, విషయలిప్తులు, దృష్టి లిప్తులు నగువారు జనుల బెదరించుచు నీలోకమున తిరుగుచుందురు. బుద్ధుడు, అపదుడు – లక్షణరహితుడు; కాన వర్ణనాతీతుడు. నిరుపాధికుని నేమార్గమునకు ఆకర్షింపగలరు?

(సుత్తనిపాతము IV - 9-13)

*కుహిఞ్చి = కుత్రచిత్ (సం) 'కిమ్' శబ్దమునకు సప్తమ్యర్థమున పాళీభాష యందు 'హిం' ప్రత్యయము వచ్చును. 'హిం', 'హం', 'హిఞ్చన', ప్రత్యయములు సైతము వచ్చును.
'హిం' మొదలగు ప్రత్యయములు పరమగునపుడు 'కిమ్' శబ్దమునకు 'కు' ఆదేశమగును. కాన 'కుహిం' 'కుహం' లేదా 'కుహిఞ్చన' పదము సిద్ధించును. కాని, 'కుహిఞ్చి' పదమును కుత్రచిత్ అని సంస్కృతమున అనువదించుట కంటె, 'కస్మింశ్చిత్' అని అనువదించిన, అధికముగ మూలానుసారిగ నుండునని కొందఱు పండితుల అభిప్రాయము.

'బుద్ధ' శబ్దమునకు 'జ్ఞాని' యని వ్యుత్పత్త్యర్థము. (బుధ అవగమనే) ఇది పేరు (అభిధానము) కాదు; బిరుదము. 'బుధ' ధాతువునకు 'క్త' ప్రత్యయము చేరగా 'బుద్ధ' శబ్దము నిష్పన్నమగును. ఈ శబ్దమునకు మేల్కొన్నవాడు, జాగరితుడు (Awakend) అని విశేషార్థము. జాగరణార్థమున కాళిదాస మహాకవి, రఘు వంశమున నీ 'బుధ' ధాతువును ప్రయోగించెను. "తే చ ప్రాపు రుదన్వన్తం బుబుధే చాదిపూరుషః" (రఘు. వం. X - 6) "ఆది పూరుషః విష్ణుశ్చ బుబుధే యోగనిద్రాం జహావిత్యర్థః" – (మల్లినాథుడు). మఱియు చూడు : బృ. ఉ. "తద్యథా ప్వప్నాంతం చ బుద్ధాంతంచ" (IV-3-18) భదన్తబుద్ధఘోషుడిట్లు వ్యాఖ్యానించును. 'బుజ్ఝతి' – "కిలేససన్తాన నిద్దాయ ఉట్ఠహతి, చత్తారి వా అరియసచ్చాని పటివిజ్ఝతి, నిబ్బానం ఏవ వా సచ్ఛికరోతి...." ।
బుద్ధశబ్దము జ్ఞానుల కందఱకు ననువర్తించును.

**"జ్ఞానేనాకాశకల్పేన, ధర్మాన్ యోగగనోపమాన్**
**జ్ఞేయాఽభిన్నేన సంబుద్ధ స్తం వందే ద్విపదాంవరమ్"** (మాం.ఉ.గౌడపాదకారిక – IV.1)

ఇందలి 'సంబుద్ధ' శబ్దమును 'సంబుద్ధవాన్' అని వివరించి భగవంతుడగు నారాయణున

సంకస్స (సంకాశ్య) నగరద్వారము — దేవ,మానవులు

181. యే ఝానపసుతా ధీరా, నెక్ఖమ్మూపసమే రతా ।
దేవా పి తేసం పిహయన్తి, సమ్బుద్ధానం సతీమతం ॥ 3 ॥

(యే ధ్యాన ప్రసృతా ధీరాః, నైష్క్రామ్యోపశమే రతాః ।
దేవా అపి తేభ్యః స్పృహయన్తి, సంబుద్ధేభ్యః స్మృతిమద్భ్యః[1] ॥ 3 ॥)

---

కీశబ్దమును శంకరు డన్వయించెను. ఉపనిషద్బ్రహ్మయోగి తన మాండూక్యకారికా భాష్యమున, గౌడపాదాచార్యుల గురువగు శుకదేవున కన్వయించి వివరించును. కాన, 'బుద్ధ' శబ్దము శ్రమణ గౌతమునకు మాత్రమే పరిమితముకాక, పరమార్థతత్త్వము సాక్షాత్కరించుకొన్న జ్ఞానుల కందఱకు నన్వయించునని భావము.

రాగద్వేషమోహాదులలో నేయొక్క వృత్తియున్నను, అట్టి వానిని ప్రలోభపెట్టి అపమార్గమును బట్టింపవచ్చును. కాని బుద్ధుని యందు పునర్భవహేతువైన యే వృత్తియు లేదు. అట్టి నిరుపాధికుని ఏ మార్గమున మీ·రాకర్షింపగలరు? ఆకర్షించుట అసంభవమని భావము.

(1) "యే ధ్యానప్రసృతా ధీరా నైష్కర్మ్యోపశమే రతాః ।
దేవా అపి తేషాం స్పృహయన్తి, సంబుద్ధానాం స్మృతిమతామ్" ॥

(రాహులసాంకృత్యాయనుని సంస్కృతపాఠము)

పిహయన్తి (స్పృహయన్తి) = స్పర్ధవహింతురు; మించవలెనని కోరుదురు (Emulate - రాధాకృష్ణపండితుడు) *envy* - ఈర్ష్య వహింతురు -(మాక్సిముల్లరు). Aspire-ఆకాంక్షింతురు. (Prof. N.K. Bhagwat)

సంసారపరిత్యాగము వలన గల్గిన క్లేశోపశాంతి రూపమగు నిర్వాణమున రమించువారు అని 'నైష్కర్మ్యోపశమే రతాః' అను పాదమును వివరించవచ్చును. బుద్ధోపదిష్ట సంన్యాసపథమున నైష్కర్మ్యము (కర్మశూన్యత)నకు స్థానము లేదనియు, నిష్కామకర్మమే బుద్ధోపదిష్టమని కొందఱు వ్యాఖ్యానించిరి. మఱియు 'నెక్ఖమ్మ' శబ్దము సంస్కృత 'నైష్క్రమ్య' శబ్దమునకు పాళీరూపమని శ్రీ కంఛేదీలాల్ గుప్త అను పండితుడు వ్రాసెను. పాళీ భాష యందలి 'నిక్ఖమతి' = 'నిష్క్రామతి' అను క్రియాపదము యొక్క అర్థమిందు గ్రహించుట సముచితము. కాన, 'నెక్ఖమ్మ' (నైష్క్రమ్య) శబ్దమున కర్థము సంసారమును పరిత్యజించి 'ప్రవ్రజ్య' - సంన్యాసాశ్రమము స్వీకరించుట యని భావింపవలయును. అట్టివారు ఉపశమరూపమగు నిర్వాణరతి పొందుదురు. భాష్యకారుడు భదన్తబుద్ధఘోషుడును అట్ఠకథ యందిట్లే వివరించెను. "నెక్ఖమ్మూపసమే రతా'తి ఎత్థ పబ్బజ్జా నెక్ఖమ్మన్తి న గహేతబ్బా కిలేసవుపసమనిబ్బానరతిం పన సన్ధాయేతం వుత్తం" । 'నెక్ఖమ్మూపసమే రతా' - అను పాదమును 'నైష్కర్మ్యోపశమేరతాః' - అని సంస్కృతము ననువదించి నైష్కర్మ్య - నిర్వాణ - ఉపశమమున - అనగా నిర్వాణ ప్రాప్తి వలన సిద్ధించిన పరమశాంతి - Supreme Tranquility యందు రమించు వారనియు వివరింపవచ్చును.

'నెక్ఖమ్మూపసమే' — In the calm — peace of renunciation - (Nibbana) అని బుద్ధరక్షితథేరుడును నారదథేరుడును వివరించినారు.

ధ్యాననిష్ఠులు, ధీరులు, నిష్కామకర్మము ద్వారా సిద్ధించు శాంతి యందానందించువారు, స్మృతిమంతులునైన బుద్ధులు (జ్ఞానులు), దేవతలకు సైతము స్పృహణీయులు. (ఆకాంక్షింపదగినవారు).

వారాణసి ఏరకపత్తుడు (నాగరాజు)

182. కిచ్ఛో మనుస్స పటిలాభో,(1) కిచ్ఛం మచ్చాన జీవితం ।
కిచ్ఛం సద్ధమ్మ సవణం, కిచ్ఛో బుద్ధాన ముప్పాదో(2) । 4 ।

(కృచ్ఛ్రో మనుష్య ప్రతిలాభో, కృచ్ఛ్రం మర్త్యానాం జీవితమ్ ।
కృచ్ఛ్రం సద్ధర్మ శ్రవణం, కృచ్ఛ్రో బుద్ధానా ముత్పాదః ।.4 ॥)

---

(1) పోల్చు :- **దుర్లభం త్రయమేవైత ద్దేవానుగ్రహహేతుకమ్ ।**
**మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయః ।**
(ఆదిశంకరుడు - వివేకచూడామణి)

(2) బుద్ధశబ్దము యొక్క బహువచన ప్రయోగము ధ్యానార్హమైనది. బుద్ధశబ్దమున కర్థము జాగరితుడని, జ్ఞాననిద్ర నుండి మేల్కొన్నవాడని, జ్ఞానియని తెలిసికొన్నాము. ఇది వ్యక్తి నామము కాదు; విశేషగుణావస్థను ప్రకాశింపజేయు సామాన్యశబ్దము. గౌతమబుద్ధునికి పూర్వమే అనేక బుద్ధులున్నట్లు బౌద్ధశాస్త్రములు తెలుపును. దీపంకరుడు, కౌండిన్యుడు, రేవతుడు, నారదుడు, సుమేధుడు, ప్రియదర్శి మొదలుగా గల అనేక బుద్ధులను బౌద్ధ గ్రంథములు - లలితవిస్తరాదులు - పేర్కొనును.

ప్రత్యేక బుద్ధులు, సమ్యక్సంబుద్ధులు, అని ద్వివిధ బుద్ధుల గూర్చి పాళీ శాస్త్రములు తెల్పును. ప్రత్యేక బుద్ధులు, బోధిని - జ్ఞానమును పొందియున్నను లోకోద్ధరణమునకై సద్ధర్మమును బోధింపరు. సమ్యక్సంబుద్ధులు జీవలోకోద్ధరణమునకై సద్ధర్మ ప్రచారమొనరింతురు. సమ్యక్సంబుద్ధుడు, శాస్త, (సత్థా) అని, భగవంతుడు (భగవా) అని అభివర్ణితుడు. అతీతులు, అనాగతులు అయిన బుద్ధులున్నారు. వారి కల్ప, జాతి, గోత్ర, యానాదుల బౌద్ధ గ్రంథములు వివరించును. బుద్ధ నామావళిని అమరకోశమిట్లు తెల్పును. (I-13,14)

**"సర్వజ్ఞః సుగతో, బుద్ధో, ధర్మరాజ, స్తథాగతః ।**
**సమన్తభద్రో, భగవాన్, మారజి, ల్లోకజి, జ్జినః ।**
**షడభిజ్ఞో, దశబలో, ఽద్వయవాదీ, వినాయకః ।**
**మునీంద్రః, శ్రీఘనః, శాస్తా.గా** .....ఇత్యాది.

ఈ శబ్దములన్నియు విశేషగుణావస్థలను నిర్దేశించుచున్నవనుట గమనార్హము. ఈ విశేషణములన్నియు అతీత, వర్తమాన, భావిబుద్ధులందఱకు అన్వయించును.

**షడభిజ్ఞ** - దాన, శీల, క్షాంతి, వీర్య, ధ్యాన, ప్రజ్ఞల గూర్చిన అభిజ్ఞ (పరమజ్ఞానము) కలవాడు.

**దశబలః :**- "దానం, శీలం, క్షమా, వీర్యం, ధ్యాన, ప్రజ్ఞా, బలాని, చ
ఉపాయః, ప్రణిధిః, (అవధానం), జ్ఞానం, దశ బుద్ధబలానివై" ।

సిద్ధి (ఇద్ధి), దివ్యశ్రోత్రము పరచిత్తజ్ఞానము, పూర్వనివాస (జన్మ) స్మృతి, దివ్యచక్షువు, ఆసవక్షయము (Cessation of Passions)- ఇవి (6) షడభిజ్ఞలు-అనియు ఇవి లోకోత్తర శక్తులనియు, చెప్పబడినది.

మానవజన్మప్రాప్తి, కఠినము (దుర్లభము). మానవజీవితము కఠినము. సద్ధర్మ శ్రవణము కఠినము. బుద్ధుల (జ్ఞానుల) ఉద్భవము కఠినము. ఇవియన్నియు దుర్లభములని భావము.

**సావత్థి (జేతవనము)** **ఆనందథేరుడు**

**183. సబ్బపాపస్స అకరణం, కుసలస్స ఉపసమ్పదా(1) ।**
**సచిత్తపరియోదపనం,(2) ఏతం బుద్ధాన సాసనం ॥ 5 ॥**

---

(1) 'కుసలస్సుపసమ్పదా' - ఈ పాఠము ఛందోదృష్టి ననుసరించి మిక్కిలి సమీచీనమైనది. కాని, ప్రాచీన సింహళ బ్రహ్మదేశీయ పరంపరకు అనుకూల పాఠము కాదని పండితుల మతము. పాళీ శాస్త్రములలో ననేక స్థలములయందిట్టి ఛందోభంగదోషము కనిపించును. పుణ్యకర్మాచరణమని సమాసార్థము.

(2) 'సచిత్త పరిదమనం' - ఈ పాఠము బర్నోవ్ (Burnouf) డా॥ మిల్ (Dr. Mill) అను పాశ్చాత్య పండితుల కల్పన. 'పరియోదపనం' - 'పర్యవదాపనమ్'. (సం.) (పరి + అవ + దాపనమ్) - అనునదియే సరియైన పాఠము. ప్రాకృతభాష యందు 'అవ' ఉపసర్గకు 'ఓ' ఆదేశమగుట సాధారణ నియమము. (ఓదవాపయోః - ప్రాకృత ప్రకాశము 4-21) ఈ పరివర్తనము పాళీవ్యాకరణ సమ్మతమే. (ఓ అవస్స - కచ్చాయన సూత్రము 1-5-9). 'పరియోదపెయ్య' - 'పర్యవదాపయేత్' (సం) - 88వ గాథ యందును గాంచనగును. 'అవ(ప)దాన' శబ్దము సైతము (పరి + అవ + దై) ఈ విధముగ నిష్పన్నమైనదని మాక్సిముల్లర్ పండితుని మతము. 'అవదానమ'నగా (అవదానం - ప్రశస్త-కర్మవృత్తమ్) పరిశుద్ధము, గుణబంధురమునైన ఐతిహాసిక కథ (A legend, originally a pure and virtuous act ; a sacred story and possibly a story the hearing of which purifies the mind).

భాష్యకారుడు భదన్తబుద్ధఘోషననుసరించి 'పరియోదపనం' పదమున కర్థము పంచనీవారణల (five hindrances) నుండి చిత్తమును పరిశుద్ధ మొనరించుకొనుట. "పరియోదపనం తి పఞ్చహి నీవారణేహి అత్తనో వోదపనం" (అట్ఠకథ 88 గాథా వివరణము).
పంచనీవారణలు : (1) కామచ్ఛందము (Lust) (2) వ్యాపాదము (ద్రోహచింతనము) (3) థీన-మిద్ధా (Torpor or Sloth - ఆలస్యము, కార్యవిముఖత) (4) ఉద్ధచ్చ-కుకుచ్చ- (restlessness and mental worry - అశాంతి, మనోవ్యథ) (5) విచికిచ్ఛా (సంశయము) చూడు: The word of Buddha by Nyanatiloka (1959) page 70.

క్రింద నుదాహరింపబడిన సుప్రసిద్ధఆర్యావృత్తమునకు ఈ గాథ భావపరిపూరకమని అందురు

**"యేధమ్మా హేతుప్పభవా, తేసం హేతుం తథాగతో ఆహ ।**
**యేసం చ యో నిరోధో, ఏవంవాదీ మహాసమనో" ।**

కారణజన్యములైన సమస్తకార్యజాతమునకు (జన్మజరావ్యాధి మృత్యురూప-దుఃఖమునకు (సంసారగతికి) కారణమును (అవిద్యాదులను), తథాగతుడు ప్రకటపఱచెను. ఈ కార్య కారణ సంతతి యొక్క నిరోధమును-(తృష్ణాక్షయమును-నిర్వాణమును), ఉపాయమగు అష్టాంగమార్గమును, సైతము, మహాశ్రమణుడు బోధించెను.

మఱియు నీగాథ, బౌద్ధుల కత్యంతము ధర్మసంస్కారయుక్తమగు ఉదాత్తగంభీరగీతముగ పరిగణింపబడుచున్నది.

కుసలస్స (కుశలస్య) ఉపసమ్పదా = పుణ్యవ్రతగ్రహణము-పూర్ణ దీక్ష-వ్రతగ్రహణార్థమున 'ఉపసమ్పదా' శబ్ద ప్రయోగము బౌద్ధ శాస్త్రముల యందు బహుళముగ గన్పించును.
ఉపసంపత్తి :- నూతనసత్వప్రాప్తి, అనురూపాత్మభావము.Entering into any condition, arriving at. అని అర్థములున్నవి. 'ఉపసంపదా' అను శబ్దము ఆర్షగ్రంథముల యందు గాన్పించదు. భిక్షు జీవనమున రెండు భూమికలు (1) శ్రమణ భూమిక (2) ఉపసంపన్న భూమికలనునవి కలవు. చూడు : సుత్తనిపాతము 'కసి భారద్వాజ సుత్తం' మఱియు 'సభియసుత్తం'.

(సర్వపాపస్యాఽ కరణం, కుశలస్యోపసమ్పదా ।
స్వచిత్తపర్యవదాపనమ్, ఏతద్బుద్ధానాం శాసనమ్ ॥ 5 ॥)

సర్వవిధపాపములు చేయకుండుట, కుశల(పుణ్య) కర్మముల నాచరించుట, చిత్తమును పరిశుద్ధముగ నుంచుకొనుట - ఇదియే బుద్ధుల యొక్క శాసనము - (ఉపదేశము).

**సావత్థి (జేతవనము)** **ఆనందథేరుడు**

**184 ఖన్తీ పరమం తపో తితిక్ఖా, [1]**
**నిబ్బానం[2] పరమం వదన్తి బుద్ధా ।**
**న హి పబ్బజితో పరూపఘాతీ**
**న సమణో[3] హోతి పరం విహేఠయన్తో ॥ 6 ॥**

---

(1) ఖన్తీ (క్షాంతిః), తితిక్ఖా (తితిక్షా) - ఇవి సమానార్థకములు. "క్షాన్తి స్తితిక్షా" - (అమరకోశము I. 206)
క్షాంతి :- పరుల దోషముల మన్నించు క్షమాశీలము.
'క్షాన్తిశ్చేత్కవచేనకమ్" -(భర్తృహరి - నీతి - 17). ఇతరులు తన్ను పీడించినను కోపింపక సహించు గుణము క్షాన్తి. (చూడు బుద్ధ దర్శనము - డా॥ రత్నాకరం బాలరాజు -1962- పుటలు 162-166) మఱియు, చూడు : క్షాన్తివాది జాతక కథ (ఖన్తివాది) ఆర్యసూరుని జాతకమాల 28; పాళీ జాతక కథ 313 (Fousb III - 39 -43) అవదానకల్పలత 38 పల్లవము. "యః క్షాన్తి శీలః శాన్త్యాభూచ్ఛిన్నాంగోప్యవికారవాన్" క్షమాగుణము, తితిక్షయొక్క యొక రూపముగ భావింపవచ్చును. 'తితిక్ష విస్తృతార్థము గల శబ్దము.

**"సహనం సర్వ దుఃఖానా మప్రతీకారపూర్వకమ్**
**చిన్తా విలాపరహితం, సాతితిక్షా నిగద్యతే ।"** (వివేకచూడామణి)
**'ఖన్తీతి యా ఏకా తితిక్ఖా నంఖాతా ఖన్తి నామ ఇదం**
**ఇమస్మిం సాసనే పరమం ఉత్తమం తపో"** - దీని ననుసరించి 'Patience which is long suffering is the highest austerity' - "దీర్ఘ దుఃఖరూపమగు క్షాంతి పరమ తపస్సు" అని రాధాకృష్ణ పండితుడు అనువదించెను. బుద్ధ రక్షిత, నారదథేరులును ఇట్లే అనువదించిరి.

"హేడ్ = (హేడతే) = అవమానించు - (To disregard)
"హేఠ్ - బాధాయాం - హేఠతే. హేఠః - బాధ.
విహేఠః - హింస. "హేఠో బాధా విహేఠయోః (మేదినీకోశము)

(2) నిబ్బానం (నిర్వాణమ్ - సం.) పాళీ బౌద్ధ శాస్త్రములందు 'నిబ్బాన' ('నిర్వాణ') శబ్దము యొక్క వ్యుత్పత్తి, తద్గతమైన అర్థము విశేష సందేహాస్పదముగు నున్నది. సంస్కృత శబ్దమగు 'నిర్వాణము' నుండి - నిర్ + వా (వా గతి గంధనయోః - పా.ధా. 1075) - నిష్పన్నమా? లేక, 'నిర్ పూర్వక 'వృ' ధాతు నిష్పన్నమా? అను విషయమున మతభేదమున్నది. ఆరిపోవుట -నశించుట : (Be-extinguished, extinct) అను అర్థ (నిర్+వా) మొకటి, పరమశాంతి, పరమానందము, (లబ్ధం

(క్షాన్తిః పరమం తపః తితిక్షా,
నిర్వాణం పరమం వదన్తి బుద్ధాః ।
న హి ప్రవ్రజితః పరోపఘాతీ,
శ్రమణో భవతి పరం విహేడమానః ।161।)

---

నేత్ర నిర్వాణం - శాకుంతలము - కాళిదాసు) supreme bliss అని మఱొక అర్థము. (నిర్ + వృ). 'నిర్వాణ ప్రాప్తః' - అను నర్థమున పాళీ శాస్త్రముల యందు 'నిబ్బుత' (నిర్వృత) శబ్దము ప్రయుక్తమని కొందఱి వాదము. 'శాంతికి పర్యాయ శబ్దమే 'నిర్వృతి'. దీని నంగీకరించిన, బౌద్ధుల నిర్వాణము పరమశాంతిమయమగు అవస్థా విశేషము కాగలదు. సీతి భావ. నిబ్బుతి ఉపసమశబ్దములతో (Cool Calm and Content) నిర్వాణము వర్ణింపబడినది. ఇది భావరూపము; అభావరూప శూన్యస్థితి కాదు. కాని, శూన్యవాదులగు కొందఱు బౌద్ధులు దీని నంగీకరించుటలేదు. శూన్యవాదము, ఆది బుద్ధుల మతమునకు విరుద్ధమని శ్రీమత్ స్వామి వివేకానందులు వచించిరి. ".... But our views about Buddha are that he was not understood properly by his disciples...... On the philosophic side the disciples of the Great Master dashed themselves against the eternal rocks of the Vedas and could not crush them." — (See Vol. I. Complete works of Swami Vivekananda - pages 21, 22) బుద్ధభగవానుని శిష్యులామహాత్ముని సద్ధర్మము నపార్థమొనరించుకొన్నారని శ్రీ స్వామి వారి దర్శనము, నిశ్చయము. శ్రీ అరవిందులు, శ్రీమాత సైతమిట్టి దర్శనమునే తెలియజేసినారు.

భదన్తఅశ్వఘోషమహాకవి తన సౌందరనందకావ్యమున నిర్వాణస్థితి నిట్లు మనోజ్ఞముగ వర్ణించును.

**"దీపో యథా నిర్వృతి మభ్యుపేతో ।**
**నైవాఽవనిం గచ్ఛతి నాఽన్తరిక్షమ్ ।**
**దిశం న కాఞ్చి ద్విదిశం నకాఞ్చిత్,**
**స్నేహక్షయాత్ కేవల మేతి శాన్తిమ్ ।**
**తథాకృతీ నిర్వృతి మభ్యుపేతో,**
**నైవాఽవనిం గచ్ఛతి నాఽన్తరిక్షమ్ ।**
**దిశం న కాఞ్చి ద్విదిశం న కాఞ్చిత్**
**క్లేశక్షయాత్ కేవల మేతి శాన్తిమ్ ।"** (సౌం. నం. XVI. 28, 29 )

నిర్వృతిని పొందిన దీపము, భూమినిగాని, ఆకాశమునుగాని పొందదు. దిక్కులకు గాని, విదిక్కులకు (దిక్కులమూలలకు) గాని వెళ్లదు. స్నేహము (నూనె) క్షయించుట వలన, కేవల ముపశమించుచున్నది. అట్లే, నిర్వాణప్రాప్తుడైన ధన్యాత్ముడు (జ్ఞాని), పృథివినిగాని, అంతరిక్షమునుగాని, పొందడు; దిక్కునకు, విదిక్కునకు పోడు; సర్వక్లేశములు క్షయించుట వలన కేవలము శాంతినే పొందుచున్నాడు.

వేద శాస్త్రముల ననుసరించి 'మోక్ష, అపవర్గ, నిఃశ్రేయస, నిర్వాణ శబ్దములు సమానార్థకములు. అమరసింహుడు తన అమరకోశమున నిట్లు చెప్పును.

**"ముక్తిః కైవల్య నిర్వాణ, శ్రేయో నిఃశ్రేయ సాఽమృతమ్ ।**
**మోక్షోఽపవర్గః ।** ... ఈతడు బౌద్ధుడని కొందఱి మతము. శ్రీమద్భాగవతమున మోక్షార్థమున నిర్వాణ శబ్దము ప్రయుక్తము.

**"ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం,**

**నిర్వాణ మృచ్ఛతి మనః సహసా యథార్చిః"** । (భాగ. III- 28, 35)

"సర్వ దుఃఖోపశమలక్షణం పరమానందరూపం నిర్వాణమ్ " అని శంకరుడు, విష్ణు సహస్ర నామ భాష్యమున నిర్వాణ శబ్దమును వివరించెను. అర్వాచీన బౌద్ధులు శూన్యవాదులైనను (Nihilists) ఆది బుద్ధులు శూన్యవాదులు కారు. శూన్యవాద బౌద్ధమును శంకరుడు బ్ర.సూ. భాష్యమున ఖండించెను. **"జగతి క్షయ ధర్మకే ముముక్షుర్మృగయేఽహం శివమక్షయం పరం తత్"** అనిత్యమును త్యజించి నిత్యమును గ్రహించుట బుద్ధ సిద్ధాంతము, 'శివ' అక్షయ పదములు నిర్వాణమునకు విశేషణములు (బుద్ధచరితము V -18) ఉపనిషత్తులందు పరమాత్మకు విశేషణములైన శబ్దములన్నియు బుద్ధోపదేశమున నిర్వాణమునకు విశేషణములుగ నున్నవి.

**"నిబ్బానం పరమం సుఖం"** – అని ధమ్మపదమున సైతము (గాథ 204) నిర్వాణము పరమ సుఖరూపమని నిర్వచించినది.

**మజ్ఝే సరస్మిం తిట్ఠతం (కప్పాతి భగవా) ఓఘే జాతే మహబ్భయే ।**

**జరామచ్చు పరేతానం, దీపం పబ్రూమి కప్ప! తే ।**

"కప్పా! అత్యంత భయావహమైన జలప్రవాహ మధ్యమున జిక్కియున్న జరామృత్యువశీభూతులైన ప్రాణుల కొఱకొక ద్వీపమును గూర్చి నీ కెఱిగింతును. అకించనము, అనాసక్తము, అద్వితీయము జన్మమృత్యు జరాపరిక్షయమునైన ఈ ద్వీపమే నిర్వాణమని నే వచింతును." అని బుద్ధుడే...

**"అకించనం, అనాదానం, ఏతం, దీపం, అనాపరం ।**

**'నిబ్బాన' మితి 'నం బ్రూమి జరామచ్చుపరిక్ఖయం"** (సుత్తనిపాతము V-11-2,3)

అని బుద్ధుడే నిర్వాణమును వివరించినాడు. ఆధునిక తత్త్వజ్ఞులు, సర్వేపల్లి రాధాకృష్ణుడు, ఆనందకుమారస్వామి ప్రభృతులు శూన్యక్షణిక–వాదములు ఆది బుద్ధోపదిష్టములు కావని ఖండించినారు. (3) 'సమణ' శబ్దము సంస్కృత 'శ్రమణ' శబ్ద భవము. బృ.ఉ. :(IV-3-22) నందే శ్రమణ శబ్దము ప్రయుక్తము– **'అత్ర–పితాఽపితా–శ్రమణోఽ శ్రమణః–భవతి'**

'శ్రమణః పరివ్రాట్' (శంకరభాష్యము). వాల్మీకి రామాయణమున శబరి శ్రమణి అని పేర్కొనబడినది. 'శ్రామ్యతి తపస్యతీతి శ్రమణః ।' అశోకుని శాసనములు సమణులు 'బ్రాహ్మణులు' అని బ్రాహ్మణుల కంటె వేఱుగా సమణులను పేర్కొనును. ఇచ్చట సమణశబ్దము సంన్యాసులను, బ్రాహ్మణ శబ్దము, గృహస్థులు వేదధర్మనిష్ఠులైన బ్రాహ్మణులను దెలుపునని భావింపవలెను. శ్రమణ శబ్దమునకు గల మౌలికార్థము విస్మరింపబడినది. (శ్రామ్యతి తపస్యతీతి శ్రమణః) – శ్రమణ శబ్దము పాళీభాషయందు 'సమణ' శబ్దముగా మారినది. సంస్కృతమున 'శమ్' ధాతువు (ఉపశమే)నకు శాంతించు అని అర్థము. పాళీ భాష యందును 'సం' ధాతువున కదే యర్థము. ఈ ధాతువునుండియే 'సమణ' శబ్దము నిష్పన్నమైనది కాని, 'శ్రమ్' ధాతువు నుండి కాదని బౌద్ధుల మతము. దీనికనుగుణముగనే ధమ్మపదమందలి 265 గాథ 'సమణ' లక్షణములను వివరించినది. (చూడు 265 గాథ.) ఉపశమార్థమగు 'సం' (శమ్–సం.) ధాతువు నుండి 'సమణ' శబ్దము నిష్పన్నమైనదను వాదము కేవలము స్వకపోలకల్పన. బౌద్ధ ధర్మమున గోచరించు ఇట్టి శబ్దములన్నియు బౌద్ధుల సృష్టి కాదు. అనాదిగనున్న వేదధర్మము నందలివే, పూర్వమహర్షి ప్రయుక్తములే. బుద్ధుడు, వానిని స్వీకరించి స్వానుభూతి ప్రకాశమున వాని

క్షాంతి (క్షమ) పరమతపస్సు. తితిక్ష పరమ నిర్వాణమని బుద్ధులు (జ్ఞానులు) వచింతురు. ఇతరులకు హాని చేయువాడు ప్రవ్రజితుడు కాజాలడు. అట్లే పరపీడా పరాయణుడు శ్రమణుడు కాజాలడు. (లేక పరపీడా పరాయణుడు ప్రవ్రజితుడు (గృహత్యాగి) అయినను శ్రమణుడు (సంన్యాసి) కాజాలడని భావము) నిర్వాణము (సాధ్యము)నకు సాధనమగు తితిక్ష, నిర్వాణ సాధనత్వము వలన, నిర్వాణ శబ్ద వాచ్యముగ ఇందు వర్ణింపబడినది.

**185. అనూపవాదో అనూపఘాతో, పాతిమొక్ఖే[1] చ సంవరో ।
మత్తఞ్ఞుతా చ భత్తస్మిం, పన్తం చ సయనాసనం[2] ।
అధిచిత్తే చ ఆయోగో, ఏతం బుద్ధాన సాసనం [3] ॥ 7 ॥**

---

యర్థమునకు మఱింత విశద ప్రకాశము నొసగినాడు. "...... He (Buddha) was regarded by the Hindus of that time as a Hindu. We hear no persecution during his life and of no persecution of his followers till many centuries after wards..... But this is one proof out of many of the fact, we should never forget, that Gotama was born and brought up and lived and died a **Hindu**..... He was the greatest and wisest and best of the Hindus..... Buddhism is the one essentially Aryan faith." (The History and Literature of Buddhism – T.W. Rhys Davids P. 78-79 & 128)

గౌతమ బుద్ధుడు హిందువే. హిందువుగా పుట్టి, హిందువుగా పెరిగి, హిందువుగా జీవించి, హిందువుగా మరణించినాడని పాళీ వాఙ్మయమును పరిశోధించి నికాయ గ్రంథములను ఆంగ్లమున కనువదించిన T.W. రైస్ డేవిడ్సు మహాశయుడు సిద్ధాంత మొనరించియుండుట గమనార్హము. డా. సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడును దీనిని స్థాపించినాడు.

(1) 'పాతిమొక్ఖ' (ప్రాతిమోక్ష) నియమావళి, మోక్షప్రదనియమావళి యని అర్థము. బౌద్ధభిక్షువులు అవశ్యము అనుష్ఠింపవలసిన శీలసంబంధి నియమావళి యొక్క పురాతన సంకలనము. ఇందలి సూత్ర సంఖ్య 220 అని నారద మహాథేరుని వివరణము. పాతిమొక్ఖ సూత్రములపై భదన్తబుద్ధఘోషుని 'కఙ్ఖావితరణీ' నామకమగు టీక ప్రసిద్ధము. ఈ టీక యొక్క ప్రారంభమున భదన్త బుద్ధఘోషుడీ శబ్దము యొక్క వ్యుత్పత్తినిట్లు వివరించును. **"తత్థ పాతిమొక్ఖన్తి ప + అతి ఉత్తమం తి అత్థో......తత్థ సీలం యో నం పాతి రక్ఖతి తం పాతిమొక్ఖేతి మోచయతి అపాయికాదిహి దుక్ఖేహి అత్తానువాదాదిహి వా భయేహి....।"**
**"తం ప్రాతిమోక్షం భవదుఃఖ మోక్షం శ్రుత్వాను ధీరా సుగతస్య భాషితమ్"** – అని మహాసాంఘికుల నిర్వచనము.

పాతిమొక్ఖసూత్రములను ప్రతి 'ఉపోసథ' (ఉపోషణ) దినముల (పూర్ణిమ, అమావాస్యలయందు) బౌద్ధభిక్షువులు ఒక చోట సమావేశమై శ్రవణమొనరింతురు. సూత్రసంపూర్ణపఠనము, ఇందు

(అనపవాదో౽ నపఘాతః ప్రాతిమోక్షే చ సంవరః ।
మాత్రజ్ఞతా చ భుక్తే, ప్రాన్తే చ శయనాసనమ్ ।
అధిచిత్తే చా యోగః, ఏతద్బుద్ధానాంశాసనమ్। 7 ।)

ఎవరిని నిందింపకుండుట, ఎవరికిని అపకారము చేయకుండుట, ప్రాతిమోక్ష నియమము (భిక్షువుల కుద్దేశించిన శీలము)ల యందు సంయమము, భోజనమున మితజ్ఞత, ఏకాంతప్రదేశమున శయనాసనముల నాచరించుట, చిత్తమును యోగయుక్తముగ నుంచుకొనుట – ఇదియే బుద్ధుల శాసనము (ఉపదేశము). (పన్తంచ = సన్తఞ్చ (పాఠాంతరము). ఏతం = ఏనం. (పాఠాంతరం)

---

పాల్గొన్న భిక్షువులందఱు, అందు నిర్దేశింపబడిన దోషముల విషయమున తాము పవిత్రులుగా నున్నారనుటకు నిదర్శనము. లేనిచో, తమ దోషములనంగీకరించి భిక్షుసంఘము నెదుట నివేదించుకొనవలయును. పాతి మొక్ఖము (ప్రాతిమోక్షము) భిక్ఖుపాతిమొక్ఖమని, భిక్షుణీ పాతిమొక్ఖమని ద్వివిధము. మొదటి దాని యందు 227 నియమములు, రెండవదాని యందు 311, నియమములున్నవని సుత్తనిపాత టీక తెలుపుచున్నది. పాతిమొక్ఖమున కర్థము. మోచనము ముక్తి. (Acquittal, or Deliverance, or discharge అని టి.డబ్ల్యు. రైస్ డేవిడ్సు (T.W. Rhys Davids) వ్రాసిరి. మోక్షదాయక నియమావళి The Law leading to freedom - అని రాధాకృష్ణ పండితుని వివరణము. నైతిక నియామావళి యొక్క పురాతనసంకలనమని – The oldest collection of Moral Laws - అని మాక్స్ ముల్లరు పండితుడు వివరించును.

(2) సంన్యాసులకు ఏకాంతప్రదేశమున శయనాసనములు శాస్త్రములు విధించును.

'పన్తం' శబ్దమున కర్థము 'వివిత్తం' (వివిక్తమ్) అని భదన్త బుద్ధఘోషుడు వివరించును. సంన్యాసుల ఏకాంత దేశ శయనాసనాదుల విధిని మహాభారతము తెలుపుచున్నది.

**"న చా౽న్న దోషాన్నిన్దేత, న గుణానభి పూజయేత్ ।**
**శయ్యాసనే వివిక్తే చ, నిత్యమేవా౽భి పూజయేత్"** (మ.భా. శాంతి-278-12)

పన్తం (ప్రాంతమ్) - గ్రామమునకు దూరముగ నున్న ప్రదేశమని కూడ అర్థము.

(3) బుద్ధాన సాసనం = బుద్ధానం + సాసనం. వ్యంజన వర్ణము (హల్లు) పరమైన, పూర్వమందలి అనుస్వారము (బిందువు) అపుడపుడు లోపించుట ప్రాచీన గాథలలో కన్పించుచున్నది. ఇది ప్రాయికముగ ఛందోభంగము నివారించుట యందు కల్గుచున్నది. ఇది వైయాకరణ సమ్మతమే. (వ్యఞ్జనేచ - కచ్చాయన, 1.4.10)

సావత్థి (జేతవనము) అనభిరతి భిక్షువు

186. న కహాపణవస్సేన[1], తిత్తి కామేసు విజ్జతి [2]
అప్పస్సాదా దుఖా* కామా[3], ఇతి విఞ్ఞాయ పణ్డితో । 8 ।

(న కార్షాపణవర్షేణ, తృప్తిః కామేషు విద్యతే ।
అల్పస్వాదాః దుఃఖాః కామాః, ఇతి విజ్ఞాయ పణ్డితః । 8 । )

బంగారు నాణెములు వర్షించినను, కామము (విషయసుఖము)ల యందు తృప్తి లేదు. కామములల్ప సుఖదములు; దుఃఖ రూపములని యెఱిగి పండితుడు –

187. అపి దిబ్బేసు కామేసు, రతిం సో నాధిగచ్ఛతి ।
తణ్హా క్ఖయ[4] రతో హోతి, సమ్మాసమ్బుద్ధ సావకో[5] । 9 ।

---

(1) కహాపణము (కార్షాపణము) బంగారు నాణెము (a gold coin)

(2) పోల్చు :- "నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి "। (మనుస్మృతి)

"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ, భూయ ఏవాఽభివర్ధతే" (భాగవతం IX - 19. 14)

హవిస్సు (నెయ్యి)చే అగ్ని, ఉపశమింపక, మఱింత ప్రజ్వరిలించునట్లు, కామోపభోగముల వలన, కామ మెప్పుడును ఉపశమింపదు; మఱింత విజృంభించును.

(3) "యో వై భూమా, తత్సుఖం, నాఽల్పే సుఖమస్తి
భూమైవ సుఖం భూమా త్వేవ విజిజ్ఞాసి తవ్య ఇతి" । (ఛాం. ఉ. VII - 23.1)

"నిరతిశయమైనదే సుఖదాయకము. అల్పమున సుఖముండదు. అల్పమైనది అధిక తృష్ణా హేతువు కాగలదు. తృష్ణ, దుఃఖబీజము. దుఃఖ హేతువైనది సుఖము కాజాలదు. నిరతిశయమైన – భూమతత్త్వము తెలియదగిన'దని సనత్కుమారుడు దేవర్షి నారదున కుపదేశించినాడు.

* 'దుఖా' :- సంస్కృత దుఃఖ శబ్దమునకు పాళీ రూపమగు 'దుక్ఖ' శబ్దమందలి 'క్' కార లోపము ఛందస్సు ననుసరించి కల్గినది.

(4) 'తణ్హక్ఖయ' – ('తృష్ణాక్షయ') సంయుక్తాక్షరము పరమైనపుడు 'తణ్హా' శబ్దమందలి 'ఆ'కారము హ్రస్వమైనది. ప్రాకృతభాషానియమము ననుసరించి, సంయుక్తాక్షరము పరమైనపుడు పూర్వమందలి దీర్ఘస్వరమునకు హ్రస్వమాదేశమగును. ("హ్రస్వః – సంయోగే – (హేమచంద్ర -I-84)

నిఃశ్రేయసమగు సుఖము స్వర్గ దివ్యసుఖముల కంటె అత్యంతము శ్రేష్ఠమని ఉపనిషత్తుల యందభి వర్ణితము.

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।

(అపి దివ్యేషు కామేషు, రతిం స నాఽధి గచ్ఛతి ।
తృష్ణా క్షయరతో భవతి, సమ్యక్సం బుద్ధశ్రావకః । 9 ।)

దివ్యభోగములందు సైతము, ఆసక్తిని బొందడు. తృష్ణా నాశము నందే సమ్యక్సం బుద్ధుని(పూర్ణ జ్ఞానియగు బుద్ధ భగవానుని) శిష్యుడానందించును.

**సావత్థి (జేతవనము) అగ్గిదత్తుడు (పురోహితుడు)**

**188. బహుం వే సరణం యన్తి, పబ్బతాని[1] వనాని చ ।**
**ఆరామరుక్ఖచెత్యాని, మనుస్సా భయతజ్జి తా । 10 ।**

(బహు వై శరణం యన్తి, పర్వతాంశ్చ, వనాని చ ।
ఆరామవృక్ష చైత్యాని, మనుష్యా భయతర్జితాః । 10 ।)

భయపీడితులై జనులు, పర్వతముల, వనముల, ఆరామముల, వృక్షముల, చైత్యము (దేవాయతనము)లను శరణు బొందుచున్నారు.

---

**శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే,**
**ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే ॥** (కఠ. ఉ. II -2)
శ్రేయఃప్రేయస్సులు (The good and the pleasant) రెండును, మనుష్యుని పొందుచున్నవి (స్వాధీనమైయున్నవి). వానిని చక్కగా విచారించి, ధీరుడు శ్రేయస్సు (The good) నే వరించును. మందుడు (అల్పబుద్ధి) దేహాది సంరక్షణ నిమిత్తమున, పశుపుత్రాది లక్షణమగు ప్రేయస్సు (The pleasant) నే వరించుచున్నాడు.
పోల్చు :- **"యచ్చ కామ సుఖం లోకే, యచ్చదివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయ సుఖస్యైతే, నార్హతః షోడశీం కలామ్ ॥"** (మ.భా. శాంతి 177-51)
(5) సమ్మాసమ్బుద్ధసావకో :- పూర్ణజ్ఞానియగు తథాగతుని అనుయాయి భిక్షువు.
"సమ్మాసమ్బుద్ధేన దేసితస్స ధమ్మస్స సవనేన జాతో యోగావచర భిక్ఖు" అని భదన్తబుద్ధఘోషుని వివరణము. కాని మాక్స్ముల్లర్ పండితుడు 'సమ్మాసమ్బుద్ధ' శబ్దమును 'సావక' శబ్దమునకు విశేషణముగ భావించి, 'The disciple who is fully awakened' అని అనువదించినాడు. 'సమ్మాసమ్బుద్ధ' శబ్దము సామాన్య సావకునికి (శ్రావకునికి) విశేషణము కాదు. ఇట్టి వివరణము కేవలము భ్రమాత్మకము.
**186, 187** ఈ రెండు గాథలు మరణించుటకు ముందు మాంధాతృచక్రవర్తి ఉచ్చరించెనని జాతక గాథల వలన తెలియుచున్నది.
(1) పర్వతశబ్దము సంస్కృతమున కేవల పుంలింగరూపము. పాళీ భాష యందిది నపుంసక లింగ రూపమున ప్రయుక్తము. ('పబ్బతాని') పాళీ భాషయందీ శబ్దము పుంలింగ రూపమున సైతము ప్రయోగింపబడినది.
"యథా పి సేలా విపులా నభం ఆహచ్చ పబ్బతా" । (సంయుక్తనికాయము)

**189. నేతం ఖో సరణం[1] ఖేమం, నేతం సరణ ముత్తమం।**
**నేతం సరణ మాగమ్మ, సబ్బదుక్ఖా పముచ్చతి । 11 ।**

*(నైతత్ ఖలు శరణం క్షేమం, నైతత్ శరణ ముత్తమమ్ ।*
*నైతత్ శరణ మాగమ్య, సర్వదుఃఖాత్ప్రముచ్యతే । 11 ।)*

ఈ శరణము క్షేమము, ఉత్తమమును కాదు. వీనిని శరణుబొంది, మానవుడు సర్వదుఃఖముల నుండి విముక్తి బొందజాలడు.

**190. యో చ బుద్ధఞ్చ ధమ్మఞ్చ, సఙ్ఘఞ్చ[2] సరణం గతో।**
**చత్తారి అరియసచ్చాని, సమ్మప్పఞ్ఞాయ పస్సతి । 12 ।**

*(యశ్చ బుద్ధఞ్చ ధర్మఞ్చ, సఙ్ఘఞ్చ శరణం గతః ।*
*చత్వారి ఆర్యసత్యాని, సమ్యక్ప్రజ్ఞయా పశ్యతి । 12 ।)*

బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణు బొందినవాడు సమ్యక్ప్రజ్ఞ (విశద జ్ఞానము)తో నాల్గు ఆర్యసత్యములను దర్శింపగలడు.

---

(2) సరణ (శరణ) శబ్దమునకు, గృహము, నివాస స్థానము అని ముఖ్యార్థము. ఈ యర్థమున శరణ శబ్దమునకు ప్రాచీన ప్రయోగమున్నది.

**"తతోఽంబికాయాం ప్రథమం, నియుక్తః సత్యవాగృషిః ।**
**దీప్యమానేషు దీపేషు, శరణం, ప్రవివేశ హ ।** (మ.భా. ఆది. 105.4)
**"శరణం గృహరక్షిత్రోః"** – (అమరకోశము III. 208)

ఇంటికి, రక్షించువానికి పేరు. ఈ శబ్దమునకు ఆశ్రయము, ఆశ్రయయోగ్యుడైన వ్యక్తి లేక తత్త్వము అను నర్థమున కూడ ప్రాచీన ప్రయోగములున్నవి. పాళీ భాష యందును గృహమను నర్థమున సరణ (శరణ) శబ్ద ప్రయోగము కలదు.

"యథా సరణ మాదిత్తం వారినా పరినిబ్బయే।"
(అగ్ని రగులుకొన్న ఇంటిని (సరణమును) నీటితో ఆర్పివేయునట్లు)
(సుత్తనిపాతము III - 8 -18)

(2) బుద్ధుడు (పరమజ్ఞాని) ధర్మము (సత్యజ్ఞానము) సంఘము (పరమ జ్ఞానియగు బుద్ధభగవానుని అనుయాయిసముదయము) – ఇవి త్రిశరణములు, త్రిరత్నములు.

191\. దుక్ఖం దుక్ఖసముప్పాదం, దుక్ఖస్స చ అతిక్కమం ।
అరియం చట్ఠఙ్గికం[1] మగ్గం, దుక్ఖూపసమగామినం । 13 ।

*(దుఃఖం దుఃఖసముత్పాదం, దుఃఖస్య చాఽతిక్రమమ్ ।
ఆర్యాష్టాంగికం మార్గం, దుఃఖోపశమగామినమ్ । 13 ।)*

---

(1) (1) సమ్మాదిట్ఠి (సమ్యగ్దృష్టి — Right views)
(2) సమ్మాసంకప్పొ (సమ్యక్సంకల్పము – Right aspirations)
(3) సమ్మావాచా (సమ్యగ్వచనము – Right speech )
(4) సమ్మాకమ్మంతో (సమ్యక్కర్మము - Right actions)
(5) సమ్మాజీవో (సమ్యగాజీవము - Right living)
(6) సమ్మావాయామో (సమ్యగ్వ్యాయామము – Right exertions)
(7) సమ్మాసతి (సమ్యక్స్మృతి – Right recollection)
(శారీరక మానసిక కర్మముల గూర్చి జాగరూకత)
(8) సమ్మాసమాధి (సమ్యక్సమాధి – Right meditation)
(ధ్యానము; మానసిక ఏకాగ్రత)

ఇవి అష్టాంగములు ఈ అష్టాంగమార్గమునకు 'మధ్యేమార్గ' మని మఱొక పేరు. (మజ్ఝిమాపటిపదా); అత్యంత విషయ సుఖాసక్తి, శరీరనాశకమగు అత్యంత కఠోర తపస్సు - ఈ రెండు అత్యంతముల విడిచి మధ్యమార్గమునచరించుట.

అతిసంశయము, అతివిశ్వాసము కూడ పరిత్యాజ్యములే.

చతురార్యసత్యములను అశ్వఘోష మహాకవి తన సౌందరనందకావ్యమున నిట్లు వివరించెను.

"ఇతి **దుఃఖమేత** దియ మస్య **సముదయలతా** ప్రవర్తికా ।
**శాంతిరియ** మయ **ముపాయమితి** భాగశః పరమమిదం **చతుష్టయమ్** ।
(సౌందరనందమ్ III-12)

పైన పేర్కొన్న అష్టాంగములలో సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పములు రెండును **ప్రజ్ఞకు** (జ్ఞానమునకు) సంబంధించిన శిక్షణము. సమ్యగ్వచనము, సమ్యక్కర్మము, సమ్యగాజీవము ననునవి **శీలము** (నైతిక జీవనము)నకు, సంబంధించిన శిక్షణము. సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి అనునవి **చిత్తమునకు** సంబంధించిన శిక్షణము. ఈ అష్టాంగములు ప్రజ్ఞా, శీల సమాధు (చిత్తము)లని విభజింపబడినవి.

1\. **దుఃఖము** - ప్రథమార్యసత్యము. జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖ దూషితమైన ప్రపంచము వాస్తవముగ దుఃఖరూపమే.

2\. **దుఃఖ సముదయలతా ప్రవర్తిక** - (దుఃఖసముప్పాద) - దుఃఖ కారణము రెండవ ఆర్యసత్యము. ఇది పునర్భవ కారిణియగు తృష్ణ మోహరాగాదులతో నిహపరవిషయానందకాంక్షకామము.

3\. **దుఃఖనిరోధము** (దుక్ఖస్స అతిక్కమం) ప్రశాంతి. ఇది తృష్ణను నిశ్శేషముగ నశింపజేయును. ఇది మూడవ ఆర్యసత్యము.

దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖ నిరోధము, దుఃఖనాశకమగు ఆర్యాష్టాంగమార్గము - ఈ నాలుగు (Four Noble Truths) ఆర్య సత్యములు.

192. **ఏతం ఖో సరణం ఖేమం, ఏతం సరణ ముత్తమం '**
**ఏతం సరణ మాగమ్మ, సబ్బ దుక్ఖా పముచ్చతి । 14 ।**

*(ఏతత్ ఖలు శరణం క్షేమం, ఏతచ్ఛరణ ముత్తమమ్ ।*
*ఏతచ్ఛరణ మాగమ్య, సర్వదుఃఖాత్ప్రముచ్యతే । 14 ॥)*

ఇదియే వాస్తవముగ క్షేమకరమైన శరణము; ఉత్తమమైన శరణము. ఈ శరణమును బొంది మనుజుడు సర్వ దుఃఖముల నుండి విముక్తుడగును. (త్రిరత్నములను చతురార్యసత్యములను శరణు బొందుటయే క్షేమకరము, ఉత్తమముననిి భావము).

**సావత్థి (జేతవనము)** **ఆనందుడు (థేరుడు)**

193. **దుల్లభో పురిసా జఞ్ఞో, న సో సబ్బత్థ జాయతి ।**
**యత్థ సో జాయతీ ధీరో, తం కులం సుఖమేధతి । 15 ।**

---

4. **దుఃఖనిరోధగామినియైన (దుక్ఖూపసమగామి) ఉపాయము,** అష్టాంగమార్గము. నాల్గవ ఆర్యసత్యము. **ఇవియే చతురార్యసత్యములు.**

**"బాధాత్మకం దుఃఖమిదం ప్రసక్తం, దుఃఖస్యహేతుః ప్రభవాత్మకోఽయం**
**దుఃఖక్షయో నిస్సరణాత్మకోఽయం, త్రాణాత్మకోఽయం ప్రశమాయమార్గః ।"**
(సౌ. నం.XVI .4)

**సమ్మాసమాధి** (సమ్యక్సమాధి) - ఇంద్రియ మనస్సుల యొక్క ఏకాగ్రత.
**'పరోహియోగః మనసః సమాధి'** (భాగవతము XI - 23-46)
ఇది పరమతపస్సు అనియు ఆర్ష గ్రంథములు వర్ణించును.
**"మనసశ్చేంద్రియాణాంచ హ్యైకాగ్ర్యం పరమంతపః ।**
**తజ్జాయః సర్వధర్మేభ్యః, సధర్మః పర ఉచ్యతే ।"**
ధ్యానరూపమైన ఈ ఏకాగ్రత పరమధర్మమని చెప్పబడినది.
(యాజ్ఞవల్క్యస్మృతి)

**శీలము** సుసంపన్నమైనచో, క్లేశములు (కామ, లోభ, మోహాది దోషములు) హృదయమున నంకురింపవు. **సమాధి** (ధ్యానము, ఏకాగ్రత) క్లేశముల నిరోధించును. **ప్రజ్ఞ,** దోషముల నిశ్శేషముగ నశింపజేయును.

(దుర్లభః పురుషా జానేయో[1] న స సర్వత్ర జాయతే ।
యత్ర స జాయతే ధీర స్తత్కులం సుఖమేధతే[2] ॥15॥)

ఉత్తమ జ్ఞానియగు పురుషుడు (బుద్ధుడు) దుర్లభుడు. అతడు సర్వత్ర జన్మింపడు. ఆ ధీరుడెందు జన్మించునో, ఆ కులము సుఖసంపన్నమగును.

**సావత్థి (జేతవనము)** **అనేక భిక్షువులు (సంబహుల భిక్ఖూ)**

**194. సుఖో బుద్ధాన ముప్పాదో, సుఖా సద్ధమ్మ దేసనా ।**
**సుఖా సఙ్ఘస్స సామగ్గీ[3] సమ్మగ్గానం తపో సుఖో ॥16॥**

---

(1) ఆజానేయః - (ఆజానేయాః కులీనాః స్యుః) ఉత్తమజాతి అశ్వము, నిర్భయుడు.
పురుషాజానేయుడు :- సువినీతుడు సదాచారుడగు పురుషుడు (The thorough bred Man)
**'శక్తి భిర్భిన్నహృదయాః స్ఖలంతోపి పదే పదే ।**
**ఆజానంతి యతః సంజ్ఞా మాజానేయాస్తతః స్మృతాః ।'** (శబ్ద కల్పద్రుమము)

(2) పోల్చు :- **"కులం పవిత్రం జననీ కృతార్థా,**
**వసుంధరా పుణ్యవతీ చ తేన ।**
**అపారసంవిత్సుఖ సాగరేఽస్మిన్**
**లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ।"**

(3) సామగ్గీ (సామగ్రీ) = సంఘ భిక్షువుల సమచిత్తత. ధర్మవృద్ధికై భిక్షు సంఘమునకు సైన్యోచితమైన వినయ శిక్షణము - అనుశాసనము (discipline) అవసరమని బుద్ధుని అభిమతము. ధర్మానుయాయులకు సమానభావన, సమధర్మాచరణము, అత్యవసరము. వేదానుశాసనము సైతమిట్టిదే.

పోల్చు:- **"సంగచ్ఛధ్వం సంవదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథా పూర్వే, సంజానానా ఉపాసతే ।**
**సమానో మంత్రః సమితిః సమానీ,**
**సమానం మనః సహ చిత్త మేషామ్ ।**
**సమానం మంత్రమభి మంత్రయే వః,**
**సమానేన వో హవిషా జుహోమి ।**
**సమానీ వ ఆకూతిః, సమానా హృదయాని వః ।**
**సమాన మస్తు వో మనో, యథా వః సుసహాసతి ।"** (ఋగ్వేదసంహిత)

"Behold, how good and how pleasant it is for brethren to dwell together in unity." (Bible - psalm 133.1)

ఐకమత్యమున వసించుట శుభకరము; మనోహరమని భావము. సమానమైన అభిప్రాయము (ఆకూతి) సమానమైన అంతఃకరణము, సమానమైన మనస్సు కలిగి ఐక్యభావమున నుండుటయే సంఘశక్తి. దీని వలననే కార్యమంతయు సాఫల్యమును గాంచగలదని వేదమంత్రార్థము.

(సుఖో బుద్ధానా ముత్పాదః, సుఖా సద్ధమ్మ దేశనా।
సుఖా సఙ్ఘస్య సామగ్గీ, సమగ్గాణాం తపః సుఖమ్ । 16 ।)

బుద్ధుల (పరమజ్ఞానుల) జన్మము సుఖదాయకము. వారి సద్ధర్మోపదేశము సుఖదము. సంఘ సమగ్రత (ఏకత్వము - ఏకచిత్తత), సుఖదము. సమగ్రతా (ఏకచిత్తతా) యుక్తులగు వారి తపమును సుఖదము.

**చారికం చరమానే** **కస్సపబుద్ధస్స సువణ్ణ చేతియం**
**(సంచారసమయమున)** **(కశ్యపబుద్ధుని సువర్ణ చైత్యము)**

**195. పూజారహే పూజయతో, బుద్ధే యది వ సావకే।**
**పపఞ్చ సమతిక్కన్తే, తిణ్ణసోక పరిద్దవే । 17 ।**

(పూజార్హాన్ పూజయతో, బుద్ధాన్ యది వా శ్రావకాన్।
ప్రపఞ్చ సమతిక్రాన్తాన్, తీర్ణశోక పరిద్రవాన్ । 17 ।)

సంసారము (ప్రపంచము) నతిక్రమించినవారు, శోక సాగరమును తరించినవారు. పూజార్హులునైన బుద్ధుల (జ్ఞానుల)ను గాని, శ్రావకుల (బుద్ధానుయాయుల)నుగాని, ఎవడు పూజించునో.....

**196. తే తాదిసే పూజయతో, నిబ్బుతే అకుతో భయే।**
**న సక్కా పుఞ్ఞం సఙ్ఖాతుం, ఇమేత్తమపి కేనచి । 17 ।**

(తాన్ తాదృశాన్ పూజయతో, నిర్వృతాన్ అకుతోభయాన్।
న శక్యం పుణ్యం సఙ్ఖ్యాతు మియన్మాత్రమపి కేనచిత్ । 17 ।)

నిర్వాణప్రాప్తులు, భయరహితులునైన అట్టి వారినెవడు పూజించునో, వాని పుణ్యమింత మాత్రమని పరిగణించుట కెవనికిని శక్యము కాదు. (బుద్ధోపదేశము, స్త్రీ పుం వివక్షా రహితముగ, బుద్ధత్వప్రాప్తి ప్రతి వ్యక్తికిని సంభవమని సూచించుట వలన, మనకొక ప్రతీక్షను (hope) ఆశ్వాసనమును ప్రసాదించుచున్నదని రాధాకృష్ణ పండితుడీ సందర్భమున వివరించును.

***14 బుద్ధ వగ్గో సమత్తో***

**బుద్ధవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## సుఖవగ్గో పన్నరసమో

## (సుఖవర్గః పంచదశః)

## 15 సుఖవర్గము – పంచదశాధ్యాయము

సక్క (శాక్య) నగరము — ఞాతకకలహవుపసమనత్థం (జ్ఞాతికలహోపశమనార్థము)

197. **సు సుఖం వత! జీవామ, వేరినేసు అవేరినో ।**
**వేరినేసు మనుస్సేసు, విహరామ అవేరినో ॥ 1 ॥**

*(సుసుఖం బత! జీవామో, వైరిష్వ వైరిణః ।*
*వైరిషు మనుష్యేషు, విహరామోఽ వైరిణః ॥ 1 ॥)*

అహో! వైరుల నడుమ అవైర భావముతో అత్యంత సుఖముగ జీవింతుము గాక! వైరులైన మనుష్యుల నడుమ అవైరులమై (ఉదారులమై) విహరింతుము గాక!

**198. సుసుఖం వత! జీవామ ఆతురేసు[1] అనాతురా ।**
**ఆతురేసు మనుస్సేసు, విహరామ అనాతురా ॥ 2 ॥**

*(సుసుఖం బత! జీవామ, ఆతురేష్వనాతురాః ।*
*ఆతురేషు మనుష్యేషు, విహరామోఽ నాతురాః ॥ 2 ॥)*

వ్యాధిపీడితుల నడుమ వ్యాధిరహితులమై అహో ! మేమత్యంత సుఖముగ జీవింతుము గాక! వ్యాధిపీడితులగు మనుష్యుల నడుమ వ్యాధిరహితులమై విహరింతుము గాక!

**199 సుసుఖం వత! జీవామ, ఉస్సుకేసు అనుస్సుకా ।**
**ఉస్సుకేసు మనుస్సేసు, విహరామ అనుస్సుకా ॥ 3 ॥**

*(సుసుఖం బత! జీవామ, ఉత్సుకేష్వనుత్సుకాః ।*
*ఉత్సుకేషు మనుష్యేషు, విహరామోఽనుత్సుకాః ॥ 3 ॥)*

విషయసుఖముల కొఱకు ఔత్సుక్యము - తహ తహ - గల వారి నడుమ ఔత్సుక్యరహితులమై అహో! మే మత్యంత సుఖముగ జీవింతుము గాక! ఉత్సుకులగు మనుష్యుల నడుమ అనుత్సుకులమై విహరింతము గాక.

---

(1) 'ఆతుర' శబ్దమునకు లోభ, దోష, మోహ, మానాది క్లేశ పీడితుడని యర్థము; సాధారణ వ్యాధి పీడితుడని కాదు. '**కిలేసాతురేసు మనుస్సేసు**' - అని భదన్తబుద్ధఘోషుని వివరణము. ఇచ్చట వ్యాధి శారీరకము కాదు; నైతికము. అనాతురావస్థను, మహాభారత మిట్లు వర్ణించును. ద్వంద్వాతీతమైన ప్రశాంతనిరామయస్థితి ఇది.

**"ఉభే సత్యాఽనృతే త్యక్త్వా, శోకానందౌ ప్రియాప్రియౌ ।**
**భయాఽభయంచ సంత్యజ్య, సంప్రశాంతో నిరామయః ॥** (మ.భా. శాంతి 276-11)

సత్యాసత్యములు, శోకానందములు, ప్రియాప్రియములు, భయాభయము, లను ఈ ద్వంద్వము లను పరిత్యజించి, పరిపూర్ణప్రశాంతుడు, నిరామయుడును (సర్వోపద్రవరహితుడు) కావలయును.

ఈ జగమున తృష్ణయే మహావ్యాధియని మహాభారతసిద్ధాంతము.

**"యా దుస్త్యజా దుర్మతిభిర్యా, న జీర్యతి జీర్యతః ।**
**యోఽసౌ ప్రాణాన్తికో రోగ, స్తాం తృష్ణాం త్యజతః సుఖమ్ ॥** (మ.భా. శాంతి. 276-12)

దుర్మతులకేది త్యజింపనలవికానిదో, ముదిసిన వానియందు సైతమేది ముదియదో, యేది ప్రాణాంతకమగు రోగమో, అట్టి తృష్ణను త్యజించినవాడే సుఖవంతుడు.

"గ్లాన, గ్లాస్నూ, ఆమయావీ, వికృతో, వ్యాధితో, ఽపటు, ఆతురో, ఽభ్యమితో, ఽభ్యాన్తః ॥ ... రోగపీడితుని పేర్లని అమరకోశము II-318)

యోగ దర్శనము, క్లేశముల నైదింటిని వివరించును :-

"అవిద్యా, ఽస్మితా, రాగ, ద్వేషా, ఽభినివేశాః, పంచక్లేశాః" (II-సాధనపాదము-3)

పఞ్చసాల (బ్రాహ్మణగ్రామము) మారుడు

200. సుసుఖం వత! జీవామ, యేసం నో నత్థి కిఞ్చనం(1) ।
పీతిభక్ఖా భవిస్సామ, <u>దేవా ఆభస్సరా</u> యథా ॥ 4 ॥

*(సుసుఖం బత! జీవామ, యేషాం నో నాస్తి కించన ।*
*ప్రీతిభక్ష్యా భవిష్యామ, <u>దేవా ఆభాస్వరా(2)</u> యథా ॥ 4 ॥)*

---

(1) పోల్చు :- "సుసుఖం బత జీవామి యస్య మేనాఽస్తి కిఞ్చన ।
మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కిఞ్చన ॥"

నా కేదియు లేనందుననే, నేనత్యంత సుఖముగ జీవించుచున్నాను. మిథిల దగ్ధమగునపుడును నాది ఈషన్మాత్రమును దగ్ధము కాలేదు. అని మిథిలానగరము కాలిపోవునపుడు విదేహనృపతి జనకుడిట్లు వాకొన్నాడు. (మ. భా శాంతి -276-4 )

(2) ఆభస్సరా దేవా (ఆభాస్వరాదేవాః)

"ఆదిత్య విశ్వ వస వస్తుషితా ఽఽ భాస్వరాఽ నిలాః ।
మహారాజిక సాధ్యాశ్చ, రుద్రాశ్చ గణదేవతాః ॥ (అమరకోశము I-10)

ఆభాస్వర దేవతలు గణదేవతా వర్గము నందలి ఒక తెగవారు. ఈ దేవతల శరీరములు దీప్తుల విరజిమ్ముచుండును. వీరు స్థూలభుక్కులు కారు; కేవలమానందము (ప్రీతి) చేతనే వీరు జీవింతురు. పుణ్యకర్మఫలముగ మనుష్యులు, ఆభాస్వరదేవలోకమున జన్మింతురు. వారు రెండు కల్పముల కాల మట్టి దేవతాశరీరముల దాల్చి యుందురని చెప్పబడినది. ఆకించనుడు - మమత్వశూన్యుడగు మనుష్యుడు - ఆభాస్వరదేవతల ఆనందమున పాల్గొనునని భావము. ఆనందమనగా, పరమసత్యమున జీవించుట. ".... When you no longer posses anything you can become as vast as the universe." అకించను లాకాశము వలె అపరిమితులు. (Mother - Aurobindo Ashram). నిష్కించనునిదే ఆనందము. అతడే ఆభాస్వరదేవతల ఆనందమున పాల్గొనును. ఆనందమనగా విముక్తి. పరమేశ్వరుని పరమసంకల్పముతో నిరంతరము, సుస్థిరమునైన ఏకత్వసిద్ధినందుటే విముక్తికి అర్థము.

దేవతలు అమర్త్యులు; సంకుచితము, క్షుద్రము, నిస్సారము, మృషారూపమునైన భౌతికజీవన పరివర్తనములకు వారు బద్ధులు - వశులు - కారు. దేవతలు తేజస్సునకు అభిముఖులు. ప్రభావమున (బలమున) జ్ఞానమున వారు జీవింతురు. బుద్ధుని అభిప్రాయమున దేవతలనగా వీరే; కాని, మతదేవతలు కారు. దైవీ ప్రకృతితో అవిద్యా, అసత్యముల నుండి విముక్తులీ దేవతలు. వారుమానవ శరీరములందు వసింపవచ్చును.

నీవు అకించనుడవైనపుడు - మమతారహితుడవైనపుడు, విశ్వము వలె నిరుపాధికుడవు, అపరిమితుడవు కాగలవు.

(The Mother - శ్రీమాత (అరవిందాశ్రమము). ధమ్మపదవ్యాఖ్యలు -23/మే/1958.)

అహో! మాది అనునదేదియులేని అకించనులమైన మేమత్యంత సుఖముగ జీవింతుము గాక! ఆభాస్వర దేవతల వలె ప్రీతి (ఆనందము)నే భుజించువార మగుదుము గాక !

**సావత్థి (జేతవనము)** **కోసలరాజు ప్రసేనజిత్తు**

201. **జయం వేరం పసవతి, దుక్ఖం సేతి పరాజితో ।**
**ఉపసన్తో సుఖంసేతి, హిత్వా జయపరాజయం**[1] **। 5 ।**

*(జయో వైరం ప్రసూతే, దుఃఖం శేతే పరాజితః ।*
*ఉపశాన్తః సుఖం శేతే, హిత్వా జయపరాజయౌ ॥ 5 ॥)*

జయము వైరము నుత్పాదించును. పరాజితుడు దుఃఖముతో శయనించును. (రాగాది దోషముల నుండి) ఉపశాంతుడుగు వాడు జయాపజయముల రెంటిని విసర్జించి సుఖముగ శయనించును. (సుఖముగ జీవించును).

**సావత్థి (జేతవనము)** **అఞ్ఞతర కులదారిక**
**(ఒకానొక కులకన్య)**

202. **నత్థి రాగసమో అగ్గి, నత్థి దోససమో కలి**[2] **।**
**నత్థి ఖన్ధ సమా దుక్ఖా, నత్థి సన్తి పరం సుఖం । 6 ।**

---

(1) ప్రసేనజిత్తు, అజాతశత్రుని ఓడించిన వార్తను విని బుద్ధుడీ గాథ నుచ్చరించినట్లు చెప్పబడినది. అవదానశతకమున ఈ గాథకు సరియైన సంస్కృత శ్లోకమున్నది.

**"జయో వైరం ప్రసవతి, దుఃఖం శేతే పరాజితః ।**
**ఉపశాన్తః సుఖం శేతే, హిత్వా జయపరాజయమ్ ।"**

ఈ గాథ సంయుక్త నికాయము నందును ఉన్నది. ధమ్మపదమునందలి గాథలు త్రిపిటకములలో విభిన్న స్థలముల కాన్పించుచున్నవి. త్రిపిటకములందలి నీతిధర్మ విషయకములగు సుభాషితముల సంకలనగ్రంథమే ధమ్మపదమని పండితుల అభిప్రాయము. విభిన్న సందర్భములలో బుద్ధుడు వివిధ వ్యక్తుల కొసగిన ధర్మసంబంధిసుభాషితములే ఈ గాథలు. సద్ధర్మ తత్త్వజ్ఞుడగు శాస్త, శుభప్రదమైన ధమ్మపదముపదేశించినాడని భదన్తబుద్ధఘోషుడు వివరించును.

(2) కలి శబ్దమునకు కలహము, పాపము, అపరాధము, మలము అమంగళము, పరాజయహేతుకమగు పాచిక, దుర్గతి, అని అనేకార్థములున్నవి. మాక్సుముల్లరు పండితుడీ శబ్దమున కర్థము అక్షము, పాచిక అని వ్రాసెను. అరిష్టమగు పాచిక (unlucky die) అని ఆతడు వివరించును. ఇది మాక్సుముల్లర్

(నాఽస్తి రాగసమోఽగ్ని ర్నాఽస్తి ద్వేషసమః కలిః ।
నసన్తి స్కన్ధసదృశాని దుఃఖాని[1] నాఽస్తి శాన్తిపరం సుఖమ్ । 6 ।)

రాగముతో సమానమగు అగ్ని లేదు. ద్వేషముతో సమమగు కలహము

యొక్క స్వకపోలకల్పనము కాదు. కలిశబ్దమునకు (ఏకాంకయుక్త పార్శ్వకే పాశకే) ఒక అంకె గల పాచిక యొక్క పార్శ్వము అని యర్థమున్నది. The side of a die which is marked by one point — (Apte– Sanskrit - English Dictionary). చూడు : గాథ 252. (పరాజయహేతుః, పంచసంఖ్యాయుక్తేఽక్ష విషయో యః కలి రిత్యుచ్యతే ।)

(1) "నాఽస్తి స్కన్ధ సమాదుఃఖాః" – అని రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము. బహువచన కర్తృ పదమునకు ఏకవచన క్రియా పదము సముచితము కాదు.

**ఖన్ధ** – Physical existance - Individuality - (భౌతిక అస్తిత్వము–వ్యష్టిభావము) అని రాధాకృష్ణ పండితుని వివరణము. 'Body' (శరీరము) అని మాక్సిముల్లర్.

**పంచస్కంధములు** – రూప, వేదనా, సంజ్ఞా (సఞ్ఞా) సంస్కార (సంఖార) విజ్ఞాన (విఞ్ఞాన)ములు. పృథివి, జలము, అగ్ని, వాయువులు కలిసి **రూపస్కంధమే**ర్పడినది (Matter – Body) మిగిలిన వేదనాదులగు నాల్గు స్కంధములు మానసిక తత్త్వమును వివరించును. ఈ సముదయమును బౌద్ధులు **'నామ'** మని పేర్కొందురు. వేదన – ఇంద్రియానుభవము సంజ్ఞ, మానసికానుభవము. సంస్కారము, విషయసంబంధమగు బోధము విజ్ఞానము, చైతన్యము. వేదనా సంజ్ఞాసంస్కారములు మూడును విజ్ఞానస్కంధమున నంతర్గతములు. నామరూపములు (Mental and Physical – existance) క్రమముగ మానసికభౌతిక అస్తిత్వమును తెలుపును. ఈ పంచస్కంధములు అనాత్మకములు, అనిత్యములు. ఇందు నిత్యమగు ఆత్మ లేదు. దుఃఖము, అనిత్యత, స్థిరమైన అవిచ్ఛిన్నమైన అహము లేకుండుట –ఈ మూడును భవము యొక్క లక్షణములు. స్థిరము, అపరిణామి అనపాయియైన ఆత్మ, ఈ భౌతిక మానసిక సంఘాతమునందు (పంచస్కంధముల యందు) లేదు. కాన సామాన్యజీవన భూమిక యందు, మనుష్యుడు, తన ప్రాక్తనజన్మపరంపర యొక్క స్మృతిని పొందజాలడు. సామాన్య జీవితము దుఃఖ సంయుక్తమని, సర్వపదార్థ జాతము నశ్వరమని, అవిచ్ఛిన్నవ్యష్టి చైతన్యమిందు లేదని, చూడగల్గుటయే సమ్యగ్దృష్టి. వ్యష్టిఅహంభావ రహితము, వస్తుజాతము యొక్క సారతత్త్వము అనగా పరమసత్యము – జీవిత లక్ష్య ప్రాప్తి – గూర్చిన ధ్యానమే సమ్యక్సమాధి. అష్టాంగమార్గము యొక్క ఫలమే నిర్వాణ ప్రాప్తి. అకించనత్వము, ఆభాస్వరదేవతల ఆనందమున పాల్గొనుట – ఇదియే పరమసుఖము. అకించనత్వమున కర్థము తనకు లభించిన సమస్తవస్తుజాతమును పరిత్యజించుట కాదు. సమస్తవస్తుజాతము పరమేశ్వరునికి చెందినది. 'ఈశావాస్య మిదం సర్వమ్'. ఈ కారణమునే వస్తు సంపద వదలి పోయినపుడు జ్ఞాని దుఃఖింపడు. సంపద ననుగ్రహించిన ఈశ్వరుడే దాని నుపసంహరించినాడని యెఱిగిన మనుష్యుడు కలిమి లేముల యందు సమముగ ఆనందమునే పొందును. దైవీ ప్రకృతికి చెందిన మనుష్యులు, మానవ శరీరధారులై యున్నప్పటికి, అవిద్యాఽసత్యముల నుండి విముక్తులు. నీదన్నది ఏది లేని నీవు, విశ్వము వలె అపారస్థితిని పొందగలవు.

(చూడు : ధర్మపదవ్యాఖ్యలు – 23/May/1958. The Commentaries - The Mother - Aurobindo Ashram P 71-72) శ్రీమాత – అరవిందాశ్రమము.

**పోల్చు** :- **'నాఽస్తి విద్యా సమం చక్షు, ర్నాఽస్తి సత్యసమం తపః ।**
**నాఽస్తి రాగసమం దుఃఖం, నాఽస్తి త్యాగ సమం సుఖమ్ ।** (మ.భా. శాంతి–175.35)

(పాపము) లేదు. శరీరధారణతో సమమగు దుఃఖము లేదు. (నిర్వాణ) శాంతికి మించిన సుఖము లేదు. (*ఖన్ధాదిసా - పాఠభేదము)

**ఆళవి** **ఒక ఉపాసకుడు**

**203. జిఘచ్ఛా పరమా[1] రోగా, సంఖారా పరమా[2]దుఖా।**
**ఏతం ఞత్వా యథా భూతం, నిబ్బానం పరమం సుఖం ॥ 7 ॥**

*(జిఘృక్షా[3] పరమోరోగః, సంస్కారః పరమం దుఃఖమ్ ।*
*ఏతద్ జ్ఞాత్వా యథా భూతం, నిర్వాణం పరమం సుఖమ్ ॥ 7 ॥)*

లోభము పరమరోగము, సంస్కారము (పంచస్కంధ సంఘాతము - శరీరధారణ) పరమ దుఃఖము. ఈ యథార్థమెఱిగిన వానికి నిర్వాణమే పరమసుఖము. (నిర్వాణము, ఆత్మనాశమను దుర్వాదమిందు నిరస్తము.)

**సావత్థి (జేతవనము)** **కోసలరాజు పసేనది**

**204. ఆరోగ్యపరమా లాభా, సన్తుట్ఠీ పరమం ధనం।**
**విస్సాస[4]పరమా ఞాతి, నిబ్బానం పరమం సుఖం ॥ 8 ॥**

---

(1) జిఘచ్ఛాపరమా - పాఠాంతరము.

(2) సంఖారపరమా - పాఠాంతరము.

సంస్కారము (సంఖార) పంచ స్కంధములలో నొకటైనను, ఇచ్చట స్కంధవిశేషముగకాక, పంచ స్కంధములకును ఉపలక్షణముగ పేర్కొనబడినది. ('సఙ్ఖారాతి పఞ్చ ఖన్ధా' - భదన్తబుద్ధఘోషుని వివరణము).

(3) 'జిఘృక్షా' శబ్దమునకు బదులు 'జిఘత్సా' శబ్దమును రాహులసాంకృత్యాయనుడు స్వీకరించెను. పౌజ్‌బాల్, మాక్సిముల్లర్ పండితులు 'జిఘచ్ఛా' శబ్దమునకు అర్థము భోజనేచ్ఛ, ఆకలి (hunger)అని వ్రాసిరి. భోజనార్థమగు 'ఘస్' ధాతువుపైన ఇచ్ఛార్థ ప్రత్యయము (సన్ (సం).) చేరి 'జిఘచ్ఛా' రూపము నిష్పన్నమైనదని వైయాకరణుడగు కచ్చాయనుని మతము. తదనుసారము 'జిఘత్సా' అను సంస్కృత శబ్దమును రాహులసాంకృత్యాయనుడు స్వీకరించెను. కాని రాధాకృష్ణపండితుడు 'జిఘచ్ఛా' శబ్దార్థము 'జిఘృక్ష'గా స్వీకరించి లోభము (greediness) అని అనువదించెను. (జిఘృక్షా - గ్రహీతుమిచ్ఛాయామ్ - తీసికొనవలయునను కోరిక).

(4) విస్సాస (విశ్వాసః) విశ్వాసపాత్రుడు - విశ్వాసమునకు పాత్రుడను లాక్షణికార్థము గ్రహింపవలెను. Trust or One who can be trusted - He is the best of Kinsmen. అని రాధాకృష్ణ పండితుడు వివరించెను.

*(ఆరోగ్యం పరమో లాభః, సన్తుష్టిః పరమం ధనమ్ ।*
*విశ్వాసః పరమో జ్ఞాతిః, నిర్వాణం పరమం సుఖమ్ ॥ 8 ॥)*

ఆరోగ్యము పరమలాభము. సంతుష్టి పరమధనము. విశ్వాసము పరమ బంధువు. నిర్వాణము పరమసుఖము. (నిర్వాణము పరమసుఖరూపమని ధమ్మపదమున పలుగాథలు స్పష్టమొనర్చుచున్నవి. నిర్వాణము ఆత్మనాశము కాదని బుద్ధుడే అసందిగ్ధముగ వచించెను. - "అత్థి భిక్ఖవే అజాతం, అభూతం, అసఙ్ఖతం. - (ఉదానము))

**వేసాలి (వైశాలి)** **ఒకానొక భిక్షువు (తిస్సథేరుడు)**

**205. పవివేకరసం పీత్వా,[1] రసం ఉపసమస్స చ ।**
**నిద్దరో హోతి నిప్పాపో, ధమ్మపీతిరసం పివం ॥ 9 ॥**

*(ప్రవివేకరసం పీత్వా, రసముపశమస్య చ ।*
*నిర్దరో భవతి నిష్పాపో, ధర్మప్రీతి రసం పిబన్ ॥ 9 ॥)*

ఏకాంత (వివేక) రసమును, ఉపశమ (నిర్వాణశాంతి) రసమును, పానము చేసి, మనుష్యుడు భయవిముక్తుడగును. ధర్మప్రేమ రసపాన మొనర్చుచు నతడు పాపరహితుడగును.

---

(1) 'పీత్వా' - బ్రహ్మదేశీయ పాఠాంతరము సాధువు. సంయుక్తాక్షరమునకు పూర్వమందలి స్వరము హ్రస్వమగునను ప్రాకృత భాషా సాధారణ నియమమునకు 'పీత్వా' పాఠము విరుద్ధము. (హ్రస్వః సంయోగే హేమచంద్రుడు) ఈ గాథ, సుత్తనిపాతము II - 3-5. (చూలవగ్గము -హిరిసుత్తము-6) నను కలదు.

దరము = భయము. "దరస్త్రాసో భీతిర్భీ సాధ్వసంభయమ్" (అమరకోశము I - 203)

నిర్దరః - భయరహితుడు.

వేలుగామము (వైశాలి నమీపమందలి వేణు గ్రామము) — సక్కుడు (దేవరాజగు శక్రుడు)

206. సాధు[1]దస్సనమరియానం, సన్నివాసో సదా సుఖో ।
అదస్సనేన బాలానం, నిచ్చమేవ సుఖీ సియా । 10 ।

*(సాధు, ధర్శన మార్యాణాం, సన్నివాసః సదా సుఖమ్ ।*
*అదర్శనేన బాలానాం, నిత్యమేవ సుఖీ స్యాత్ । 10 ।)*

ఆర్యుల (సత్పురుషుల) దర్శనము రమ్యము. వారి సాన్నిధ్యమున వసించుట సదా సుఖకరము. మూర్ఖులను దర్శింపకుండుట చేత, మనుష్యుడు సుఖవంతుడు కాగలడు.

207. బాలసఙ్గతచారీ హి, దీఘ మద్ధాన సోచతి ।
దుక్ఖో బాలేహి సంవాసో, అమిత్తేనేవ సబ్బదా ।
ధీరో చ సుఖసంవాసో[2] ఞాతీనం వ సమాగమో । 11 ।

*(బాలసఙ్గతచారీ హి, దీర్ఘ మధ్వానం శోచతి ।*
*దుఃఖో బాలైః సంవాసోఽమిత్రేణేవ సర్వదా ।*
*ధీరశ్చ సుఖసంవాసో, జ్ఞాతీనా మివ, సమాగమః । 11 ।)*

మూర్ఖసాంగత్యమున చరించువాడు మార్గమున, నధిక దుఃఖమనుభవించును. - దీర్ఘకాలము దుఃఖించును. మూర్ఖులతో సంవాసము, శత్రు సంవాసము వలె సర్వదా దుఃఖదాయకము. ధీరులతో సంవాసము బంధు సమాగమము వలె సుఖప్రదము.

---

(1) సాహు - పాఠాంతరము.
(2) సుఖో చ ధీరసంవాసో - మాక్సుముల్లర్ అంగీకరించిన పాఠము.

**తస్మాహి –**

**208. ధీరఞ్చ పఞ్ఞ ఞ్చ, బహుస్సుతఞ్చ ।**
**ధోరయ్హ సీలం, వతవన్తమరియం ।**
**తం తాదిసం సప్పురిసం, సుమేధం ।**
**భజేథ <u>నక్ఖత్త పథం వ చన్దిమా</u> ॥ 12 ॥**

*తస్మాత్ –*
*ధీరఞ్చ ప్రజ్ఞఞ్చ బహుశ్రుతఞ్చ,*
*ధౌరేయ శీలం, వ్రతవన్త మార్యమ్ ।*
*తం తాదృశం, సత్పురుషం సుమేధసం ,*
*భజేత <u>నక్షత్రపథ మివ చన్ద్రమాః</u> ॥ 12 ॥)*

కావున, ధీరుని, ప్రాజ్ఞుని, బహుశ్రుతుని (విద్వాంసుని) సహనశీలుని, వ్రతనిష్ఠుని, ఆర్యుని,– అట్టి సత్పురుషుని సుబుద్ధిని, తారాపథమును చంద్రునివలె, మనుష్యుడు, సదా సేవింపవలయును.

*15 సుఖవగ్గో సమత్తో*

**సుఖవర్గము సమాప్తము**



'ధౌరేయశీలం': ఉత్కృష్ట శీలవంతుని – (అర్థంతుని) ఎస్. కె. భగత్ వివరణము. కర్మఠుని – కంచేదీలాల్ గుప్త (కార్యధూరమ్య కర్మఠః)

ధీరః : ధైర్యశాలి, స్థైరుడు, బుధుడు. ('ధీరో ధైర్యాన్వితే స్థైరే, బుధే – మేదినీకోశము)



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## పియవగ్గో సోలసమో

## (ప్రియవర్గః షోడశః)

## 16 ప్రియవర్గము – షోడశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **తయో పబ్బజితా**
**(ముగ్గురు పరివ్రాజకులు)**

**209. అయోగే యుఞ్జమత్తానం, యోగస్మిం చ అయోజయం।**
**అత్థం హిత్వా పియగ్గాహీ, పిహేతత్తాను యోగినం[1] ॥1॥**

(అయోగే యుఞ్జన్నాత్మానం, యోగే చాఽయోజయన్।
అర్థం హిత్వా ప్రియగ్రాహీ, స్పృహయే దాత్మానుయోగినమ్ ॥1॥)

అయోగ్యమందు (పరివర్జింపదగిన ప్రపంచవ్యామోహమునందు) ఆసక్తుడై, యోగ్యము నందు (జీవితలక్ష్యమగు ధ్యానమునందు) నిరాసక్తుడై, శ్రేయస్సును విడనాడి ప్రేయస్సును (విషయసుఖమును) గ్రహించువాడు, ధ్యానరతుని యెడ నీర్ష్య వహించును.

---

(1) పిహే తత్థానుయోగినం (పాఠాంతరము)

**210. మా పియేహి సమాగఞ్ఛి, అప్పియేహి కుదాచినం।**
**పియానం అదస్సనం దుక్ఖం అప్పియానం చ దస్సనం । 2 ।**

*(మా ప్రియైః సమాగచ్ఛ (సమాగమత్) అప్రియైః కదాచన ।*
*ప్రియాణామదర్శనం దుఃఖమ్, అప్రియాణాం చ దర్శనమ్ । 2 ।)*

ప్రియ సమాగమము వలదు; అప్రియ సమాగమమెపుడును కూడదు. ప్రియమైన వారిని కాంచకుండుటయు అప్రియులనుగాంచుటయు రెండును – దుఃఖప్రదములే.

**211. తస్మా పియం న కయిరాథ, పియాపాయో హి పాపకో।**
**గన్థా తేసం న విజ్జన్తి, యేసం నత్థి పియాప్పియం । 3 ।**

*(తస్మాత్ప్రియం నకుర్యాత్, ప్రియాఽపాయో హి పాపకః ।*
*గ్రన్థా స్తేషాం(1) న విద్యన్తే, యేషాం నాస్తి ప్రియాప్రియమ్ । 3 ।)*

కావున, దేని యెడల ప్రీతి వహింపకుము. ఏలయన, ప్రియవియోగము దుఃఖకరము. ప్రియాప్రియములు లేనివారికి – రాగద్వేషరహితులకు – బంధములుండవు.(*) (గ్రంథులుండవు)

---

(1) గ్రన్థయస్తేషామ్ – పాఠాంతరము.
గ్రన్థిః = అన్యోన్యాధ్యాసము, కౌటిల్యము, మాయాపాశము. బంధనము.

(*) సృష్టియందలి సమస్త వస్తు జాతమునెడ కేవలమగు ఉదాసీనతను, హృదయమున స్థాపించుకొని, ఐహిక సంపదలు, అనుబంధములు, అనురాగముల నుండి హృదయమును విరక్తమొనరించుకొనవలెను. (రాధాకృష్ణ పండితుడు)

**పోల్చు – 'యదా సర్వే ప్రభిద్యన్తే, హృదయస్యేహ గ్రన్థయః।**
**అథమర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ।** (కఠ. ఉ. II-3.15)

ఎప్పుడిచ్చట, జీవించియుండగనే, అహంతా, మమతా, అభిమానాదులగు అవిద్యాగ్రంథులు (బంధములు) అన్నియు నశించిపోవునో, అప్పుడు మర్త్యుడు (మరణశీలుడగు మనుష్యుడు), అమృతుడ (మరణరహితుడ)గుచున్నాడు. ఇదియే సర్వవేదసారము.

**సావత్థి (జేతవనము)** **అఞ్ఞతర కుటుంబికుడు (ఒకానొక కుటుంబి)**

212. **పియతో జాయతీ సోకో, పియతో జాయతీ భయం।**
**పియతో విప్పముత్తస్స, నత్థి సోకో కుతో భయం? । 4 ।**

*(ప్రియతో జాయతే శోకః, ప్రియతో జాయతే భయమ్ ।*
*ప్రియతో విప్రముక్తస్య, నాఽస్తి శోకః కుతో భయమ్ । 4 ।)*

మనస్సునకు ప్రియమైన వస్తువును భావించుట వలన శోకము కల్గుచున్నది. భయము కల్గుచున్నది. ప్రియవస్తుభావనావిముక్తునకు శోకము లేదు. భయమెక్కడిది?

**సావత్థి (జేతవనము)** **విశాఖ (ఉపాసిక)**

213. **పేమతో జాయతీ సోకో, పేమతో జాయతీ భయం।**
**పేమతో విప్పముత్తస్స, నత్థి సోకో కుతో భయం? । 5 ।**

*(ప్రేమతో జాయతే శోకః, ప్రేమతో జాయతే భయమ్ ।*
*ప్రేమతో విప్రముక్తస్య, నాఽస్తి శోకః కుతో భయమ్ । 5 ।)*

ప్రేమ వలన శోకము కల్గుచున్నది, భయము కల్గుచున్నది. ప్రేమ విముక్తునకు శోకము లేదు; భయమెక్కడిది?

**వేసాలి (కూటాగారసాల)** **లిచ్ఛవులు**

214. **రతియా జాయతీ సోకో, రతియా జాయతీ భయం।**
**రతియా విప్పముత్తస్స, నత్థి సోకో కుతో భయం? । 6 ।**
*(రత్యా జాయతే శోకః, రత్యా జాయతే భయమ్ ।*
*రత్యా విప్రముక్తస్య, నాఽస్తి శోకః కుతో భయమ్? । 6 ।)*

విషయరతి (రాగము) వలన శోకము కల్గుచున్నది; భయము కల్గుచున్నది. విషయరాగ విముక్తునకు శోకము లేదు. భయమెక్కడిది?

**సావత్థి (జేతవనము)** **అనిత్థిగన్ధకుమారుడు**

**215. కామతో జాయతీ సోకో, కామతో జాయతీ భయం ।**
**కామతో విప్పముత్తస్స, నత్థి సోకో, కుతో భయం? । 7 ।**

*(కామతో జాయతే శోకః, కామతో జాయతే భయమ్ ।*
*కామతో విప్రముక్తస్య, నాఽస్తి శోకః కుతో భయమ్ ? । 7 ।)*

కామము వలన శోకము కల్గుచున్నది; భయము కల్గుచున్నది. కామ విముక్తునకు శోకము లేదు. భయమెక్కడిది?

**సావత్థి (జేతవనము)** **ఒకానొక బ్రాహ్మణుడు**

**216. తణ్హాయ జాయతీ సోకో, తణ్హాయ జాయతీ భయం ।**
**తణ్హాయ విప్పముత్తస్స, నత్థి సోకో కుతో భయం? । 8 ।**

*(తృష్ణాయా జాయతే శోకః, తృష్ణాయా జాయతే భయమ్ ।*
*తృష్ణాయా విప్రముక్తస్య, నాఽస్తి శోకః, కుతో భయమ్? । 8 ।)*

తృష్ణ వలన శోకము కల్గుచున్నది; భయము కల్గుచున్నది. తృష్ణా విముక్తునకు శోకము లేదు. భయమెక్కడిది?

**రాజగృహము (వేళువనము)** **ఐదువందలమంది బాలకులు**

**217. సీలదస్సనసమ్పన్నం, ధమ్మట్ఠం సచ్చవాదినం ।**
**అత్తనో కమ్మ కుబ్బానం, తం జనో కురుతే పియం । 9 ।**

*(శీలదర్శనసంపన్నం, ధర్మిష్ఠం, సత్యవాదినమ్ ।*
*ఆత్మనః కర్మ కుర్వాణం. తం జనః కురుతే ప్రియమ్ । 9 ।)*

శీల (ఆచార) విద్యాసంపన్నుడు, ధర్మనిష్ఠుడు, సత్యవాది, స్వకర్మనిరతుడు, నైన వానికి జనము (లోకము) ప్రియమొనర్చును.

**సావత్థి (జేతవనము)** **అనాగామి (థేరుడు)**

**218. ఛన్దజాతో అనక్ఖాతే, మనసా చ ఫుటో సియా।**
**కామేసు చ అప్పటిబద్ధచిత్తో, ఉద్ధంసోతో* తి వుచ్చతి । 10 ।**

*(ఛన్దజాతోఽనాఖ్యాతే, మనసా చ స్ఫుటః స్యాత్।*
*కామేషు చాఽప్రతిబద్ధచిత్తో, ఊర్ధ్వస్రోతా ఇత్యుచ్యతే । 10 ।)*

అనిర్వాచ్యమున (నిర్వాణమున) నాకాంక్ష జనించినవాడు, ప్రబుద్ధ మానసుడు, విషయసుఖవిముక్తచిత్తుడునైన వాడు, 'ఊర్ధ్వ స్రోతు' డనబడును.

**ఇసిపతనము (మృగదావము)** **నన్దియుడు (నన్దిపుత్తుడు)**

**219. చిరప్పవాసిం పురిసం, దూరతో సోత్థిమాగతం।**
**ఞాతిమిత్తా సుహజ్జా చ అభినన్దన్తి ఆగతం । 11 ।**

*(చిరప్రవాసినం పురుషం, దూరతః స్వస్థమాగతమ్ ।*
*జ్ఞాతిమిత్రాణి సుహృదశ్చాఽభినన్దన్త్యాగతమ్ । 11 ।)*

చిరకాలము పరదేశమున నుండి, ఆ దూర దేశమున నుండి క్షేమముగ తిరిగి వచ్చిన పురుషుని, బంధువులు, మిత్రులు, సుహృద్వర్గము, అభినందించును.

**220. తథేవ కతపుఞ్ఞం పి, అస్మాలోకా పరం గతం।**
**పుఞ్ఞాని పటిగణ్హన్తి, పియం ఞాతీ వ ఆగతం । 12 ।**

---

* ఉద్ధంసోతో (ఊర్ధ్వస్రోతాః) – ప్రవాహమున కెదురీదువాడు. గ్రామ్యములగు చిత్తవికారములకు చలింపని భిక్షువు; మానసికావేగముల కతీతుడు. మఱియు నీశబ్దము బౌద్ధశాస్త్రములందొక పారిభాషికనామము. 'అవిహ' నామకలోకమున జనించి 'అకనిట్ఠ' దేవలోకమునకు పోవు వారిలో ఊర్ధ్వస్రోతుడు, అగ్రసరుడని బౌద్ధశాస్త్రములు చెప్పును. ఈ సాధకులు నిర్వాణపథమున 'అనాగామి' వర్గమునకు చెందినవారు. అనాగామికి పునరావృత్తి లేదు. చూడు :- పాదటీక – 178 గాథ.

*(తథైవ కృతపుణ్యమపి, అస్మాల్లోకాత్పరం గతమ్ ।*
*పుణ్యాని ప్రతిగృహ్ణన్తి, ప్రియం జ్ఞాతిరివాగతమ్ ॥ 12 ॥)*

అట్లే, పుణ్యకర్మ మొనర్చిన మనుజుని, ఈ లోకము నుండి పరలోకమునకు పోయిన వానిని ఆ పుణ్యకర్మములు పునరాగతుడైన ప్రియస్వజనుని స్వీకరించునట్లు స్వీకరించును (స్వాగతమొసగును).

*16 పియవగ్గో సమత్తో ।*

ప్రియవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## కోధవగ్గో సత్తరసమో

## (క్రోధవర్గః సప్తదశః)

## 17 క్రోధవర్గము – సప్తదశాధ్యాయము

**కపిలవత్థు (న్యగ్రోధారామము)** **రోహిణి (క్షత్రియకన్య)**

**221. కోధం జహే విప్పజహెయ్య మానం,**
**సంయోజనం సబ్బమతిక్కమెయ్య ।**
**తం నామరూపస్మిం అసజ్జమానం,**
**అకిఞ్చనం నానుపతన్తి దుక్ఖా ॥ 1 ॥**

(క్రోధం జహ్యాద్* విప్రజహ్యాత్ మానం,
సంయోజనం సర్వ మతిక్రమేత ।
తం నామరూపయో రసజ్యమానం,
అకించనం నాఽనుపతన్తి దుఃఖాని ॥ 1 ॥)

(* జహీత – పాఠభేదము)

క్రోధమును విడువవలయును. గర్వమును పరిత్యజింపవలయును. సమస్త సాంసారికబంధముల నతిక్రమింపవలయును. నామరూపములందు

(మనశ్శరీరములందు) సంసక్తిరహితుడగు అకించనుని దుఃఖములు సమీపింపజాలవు; వెంబడింపవు.

**ఆళవి (అగ్గాళవచైత్యము)** **ఒకానొకభిక్షువు**

222. **యో వే ఉప్పతితం కోధం, <u>రథం భన్తం వ ధారయే</u>[(1)] ।**
**తమహం సారథిం బ్రూమి, రస్మిగ్గాహో ఇతరో జనో । 2 ।**

*(యో వై ఉత్పతితం క్రోధం, <u>రథం భ్రాన్తమివ ధారయేత్</u> ।*
*తమహం సారథిం బ్రవీమి, రశ్మిగ్రాహ ఇతరో జనః । 2 ।)*

మార్గము తప్పి వేగముగ పరిభ్రమించు రథమును వలె, ఉద్ధతమైన క్రోధమును నిగ్రహించు వానిని నేను సారథియని యందును. ఇతరులు పగ్గముల మాత్రము తాల్తురు. (వారు సారథినామార్హులు కారు).

**రాజగృహము (వేళువనము)** **ఉత్తర (ఉపాసిక)**

223. **అక్కోధేన జినే కోధం, అసాధుం సాధునా జినే ।**
**జినే కదరియం దానేన, సచ్చేనాలీకవాదినం ।3 ।**[(2)]

*(అక్రోధేన జయేత్ క్రోధమ్, అసాధుం సాధునా జయేత్ ।*
*జయేత్ కదర్యం దానేన, సత్యేనాऽలీకవాదినమ్ ।। 3 ।)*

అక్రోధముచే(శాంతముచే) క్రోధమును, సాధుత్వము(మంచితనము)చే అసాధుత్వమును (చెడ్డతనమును) దానముచే లోభిని, సత్యముచే

---

(1) పోల్చు : కఠ. ఉ. (III-3,4) చూడు : 94 గాథ పైని పాదటీక. వారయే – బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(2) ఈ గాథాసదృశమగు శ్లోకము మహాభారతమున కలదు.

**"అక్రోధేన జయేత్ క్రోధ మసాధుం సాధునాజయేత్ ।**
**జయేత్ కదర్యం దానేన, జయేత్సత్యేన చాऽనృతమ్ ।**
(మ.భా. (ఉద్యోగ)–38.73–74–విదురనీతి)

**"కర్మ చైత ద సాధూనామ్, అసాధుం సాధునా జయేత్ ।**
**ధర్మేణ నిధనం శ్రేయో, న జయః పాపకర్మణా ।** (మ.భా. శాంతి. 95–18)

అసత్యవాదిని జయింపవలెను. (కదరియం (కదర్యం) - "కదర్యే కృపణ క్షుద్ర కింపచాన మితంపచాః" అమరకోశము III-49)

**సావత్థి (జేతవనము)** **మహామొగ్గల్లానథేరుడు**

**224. సచ్చం భణే న కుజ్ఝేయ్య, దజ్జా అప్పస్మి[1] యాచితో ।**
**ఏతేహి తీహి ఠానేహి, గచ్ఛే దేవాన సన్తికే । 4 ।**

*(సత్యం భణేత్, న క్రుధ్యేత్, దద్యా దల్పమపి యాచితః ।*
*ఏతై స్త్రిభిః స్థానైః, గచ్ఛే ద్దేవానా మన్తికే । 4 ।)*

సత్యము పలుకవలెను. కోపింపకూడదు. ఇతరులు యాచించినపుడు, వారికి స్వల్పమైనను నీవలెను. ఈ మూడు కారణముల (మార్గముల)చేత, మానవుడు దేవతల సాన్నిధ్యము పొందవలెను. (బుద్ధుడు దేవతల నిరాకరించెనను దుర్వాదము, దీని వలన నిరస్తము.)

**సాకేతము (అయోధ్య)** **అఞ్జనవనభిక్షువులు**

**225. అహింసకా యే మునయో, నిచ్చం కాయేన సంవుతా ।**
**తే యన్తి అచ్చుతం ఠానం, యత్థ గన్త్వా న సోచరే । 5 ।**

*(అహింసకా యే మునయో, నిత్యం కాయేన సంవృతాః ।*
*తే యన్త్యచ్యుతం స్థానం, యత్ర గత్వాన శోచన్తి । 5 ।)*

అహింసావ్రతులు, నిత్యము శరీరము నిగ్రహించుకొను వారునునైన మునులు, అవినాశి యగు స్థానము (నిర్వాణము)ను పొంది శోకవిముక్తులగుదురు.

**రాజగృహము (గృధ్రకూటము)** **పుణ్ణ (రాజగృహశ్రేష్ఠి దాసి)**

**226. సదా జాగరమానానం, అహోరత్తానుసిక్ఖినం ।**
**నిబ్బానం అధిముత్తానం, అత్థం గచ్ఛన్తి ఆసవా । 6 ।**

---

(1) దజ్జాప్పస్మింపి - సింహళీయపాఠాంతరము. అప్పస్మిం = నీకున్న స్వల్పమైన దానిలో.

(సదా జాగ్రతాం అహోరాత్ర మనుశిక్షమాణానామ్[1]।
నిర్వాణ మధిముక్తానాం, అస్తం గచ్ఛన్తి ఆస్రవాః । 6 ।)

నిరంతరజాగరూకులు, అహోరాత్రము (రేపగలు) సుశిక్షితులు, నిర్వాణ ప్రాప్తిచే ముక్తులునైన వారికి, ఆస్రవములు (చిత్తమలములగు రాగద్వేషాది రూపక్లేశములు) అదృశ్యమగును.

**సావత్థి (జేతవనము)** **అతులుడు (ఉపాసకుడు)**

**227. పోరాణ మేతం అతుల ! నేతం అజ్జతనామివ ।**
**నిన్దన్తి తుణ్హి మాసీనం, నిన్దన్తి బహుభాణినం ।**
**మితభాణినమ్పి నిన్దన్తి, నత్థిలోకే అనిన్దితో ॥ 7 ।**

(పురాణ మేతద్ అతుల ! నైతదద్యతనమివ,
నిన్దన్తి తూష్ణీమాసీనం, నిన్దన్తి బహుభాణినమ్ ।
మితభాణినమపి నిన్దన్తి, నాఽస్తి లోకేఽ నిన్దితః ॥ 7 ।)

అతులా! ఇది చాల పురాతనోక్తి; నేటి మాటకాదు. ఊరకున్న వానిని, అమితభాషిని, మితభాషిని సైతము లోకము నిందించును. లోకమున నిందనొందని వాడెవడును లేడు.

**228. న చాహు నచ భవిస్సతి[2], న చేతరహి విజ్జతి ।**
**ఏకన్తం నిన్దితో పోసో, ఏకన్తం వా పసంసితో । 8 ।**

(నచాఽభూత్ నచ భవిష్యతి, నచైతర్హి[3] విద్యతే ।
ఏకాన్తం నిన్దితః పురుషః, ఏకాన్తంవా ప్రశంసితః । 8 ।)

కేవలము నిందితుడు, కేవలము ప్రశంసితుడైన పురుషు డెవడును గతమున లేడు, భవిష్యమున నుండబోడు; ఇపుడును లేడు.

---

(1) శిక్షిణామ్ - పాఠాంతరము
(2) హెస్సతి -పాఠాంతరము.
(3) నచైవాత్ర - సంస్కృత పాఠాంతరము.

229. యం చే విఞ్ఞూ పసంసన్తి, అనువిచ్చ సువే సువే ।
అచ్ఛిన్నవుత్తిం[1] మేధావిం, పఞ్ఞాసీలసమాహితం । 9 ।

*(యం చేద్ విజ్ఞాః ప్రశంసన్తి, అనువిచ్య శ్వః శ్వః ।
అచ్ఛిన్నవృత్తిం మేధావినం, ప్రజ్ఞాశీలసమాహితమ్ । 9 ।)*

ప్రాజ్ఞులు, అనుదినము విచారించి అచంచలచరిత్రుడు, మేధావి, ప్రజ్ఞాశీల ధ్యానవంతుడునైన వానిని ప్రశంసింతురన్నచో....

230. నెక్ఖం[2] జమ్బోనదస్సేవ, కో తం నిన్దితు మరహతి ? ।
దేవాపి నం[3] పసంసన్తి, బ్రహ్మునా పి పసంసితో । 10 ।

*(నిష్కం జమ్బూనదస్యేవ, కస్తం నిన్దితు మర్హతి ।
దేవా అపి తం ప్రశంసన్తి, బ్రహ్మణాఽపి ప్రశంసితః । 10 ।)*

సువర్ణనిష్కమును (బంగారుమాడను) బోలునతని నెవడు నిందింపగలడు? దేవతలు సైత మతని ప్రశంసింతురు. బ్రహ్మ చేతను అతడు ప్రశంసితుడే.

**రాజగృహము (వేళువనము)** **భిక్షువులు**

231. కాయప్పకోపం రక్ఖెయ్య, కాయేన సంవుతో సియా ।
కాయదుచ్చరితం హిత్వా, కాయేన సుచరితం చరే । 11 ।

*(కాయప్రకోపం రక్షేత్, కాయేన సంవృతః స్యాత్ ।
కాయదుశ్చరితం హిత్వా, కాయేన సుచరితం చరేత్ । 11 ।)*

శారీరకోద్రేకముల నుండి తన్ను తాను రక్షించుకొనవలెను. శరీరమును వశమునందుంచుకొనవలెను. దైహికదుశ్చరితము విడనాడి, దైహికమైన సుచరితము నాచరింపవలెను.

---

(1) అచ్ఛిద్దవుత్తిం - అచ్ఛిద్రవృత్తిం - (పాఠాంతరము) నిర్దోషస్వభావుని
(2) నిక్ఖం- పాఠాంతరము.
(3) తం - పాఠాంతరము.

**232. వచీపకోపం రక్ఖెయ్య, వాచాయ సంవుతో సియా ।**
**వచీదుచ్చరితం హిత్వా, వాచాయ సుచరితం చరే । 12 ।**

*(వచః ప్రకోపం రక్షేద్, వాచా సంవృతః స్యాత్ ।*
*వచో దుశ్చరితం హిత్వా, వాచా సుచరితం చరేత్ । 12 ।)*

వాక్పారుష్యమునకు లోను కాకుండ, తన్ను తాను రక్షించుకొనవలెను. వాక్సంయమము కల్గియుండవలెను. వాగ్దుశ్చరితము విడనాడి వాక్సుచరితము నాచరింపవలెను. (వాక్సంబంధమైన క్రోధమును - పరుష భాషణమును - నిగ్రహించుకొని, ప్రియభాషణము నభ్యసింపవలెను).

**233. మనోపకోపం రక్ఖెయ్య, మనసా సంవుతో సియా ।**
**మనోదుచ్చరితం హిత్వా, మనసా సుచరితం చరే । 13 ।**

*(మనః ప్రకోపం రక్షేత్, మనసా సంవృత స్యాత్ ।*
*మనో దుశ్చరితం హిత్వా మనసా సుచరితం చరేత్ । 13 ।)*

మానసికోద్రేకముల నుండి తన్ను తాను రక్షించుకొనవలెను. మనః సంయమము కల్గియుండవలెను. మానసికదుశ్చరితము విడనాడి, మానసికసుచరితము నాచరింపవలెను. (క్రోధభావముల నిగ్రహించుకొని, సద్భావముల ననుష్ఠింపవలెను.)

**234. కాయేన సంవుతా ధీరా, అథో వాచాయ సంవుతా ।**
**మనసా సంవుతా ధీరా, తే వే సుపరిసంవుతా । 14 ।***

---

* పోల్చు - భగవద్గీత యందలి త్రివిధ శారీరకమానసికవాచిక తపస్సులు. (భ.గీ. XVII. 14, 15, 16)
**'శ్రద్ధయా పరయా తప్తం, తపస్తత్త్రివిధంనరైః ।**
**అఫలాకాంక్షిభిర్యుక్తైః, సాత్త్వికం పరిచక్షతే ।** (భ.గీ. XVII. 17)
ఉత్తమ శ్రద్ధతో ఫలకాంక్షారహితులైన నరులచే నాచరింపబడిన త్రివిధ(శారీరక మానసికవాచిక) తపశ్చరణము, సాత్త్వికమనబడును.

(కాయేన సంవృతా ధీరాః, అథ వాచా సంవృతాః ।
మనసా సంవృతా ధీరాః, తే వై సుపరిసంవృతాః ॥ 14 ॥)

శరీరసంయమము, వాక్సంయమము, మనఃసంయమము గల ధీరులే ఉత్తమ సంయమవంతులు.

**17 కోధవగ్గో నమత్తో**

క్రోధవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## మలవగ్గో అట్ఠారసమో

## (మలవర్గోఽష్టాదశః)

## 18 మలవర్గము – అష్టాదశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **గోఘాతకపుత్తుడు**

**235. పణ్డుపలాసోవ దానిసి, యమపురిసా పి చ తం ఉపట్ఠితా ।**
**ఉయ్యోగముఖే చ తిట్ఠసి, పాథెయ్యం పి చ తే న విజ్జతి ॥ 1 ॥**

*(పాణ్డుపలాశ ఇవే దానీ మసి, యమపురుషా అపి త్వాముపస్థితాః ।*
*ఉద్యోగముఖే చ తిష్ఠసి, పాథేయ మపి చ తే న విద్యతే ॥ 1 ॥)*

నీవిపుడు పండుటాకువలె నున్నావు. యమదూతలు సైతము నిన్ను సమీపించియున్నారు. వియోగద్వారమున (ప్రయాణమునకు సిద్ధముగ) నున్నావు. నీ ప్రయాణమునకు పాథేయము (దారిబత్తెము) సైతము లేదు.

(ఉయ్యోగ (ఉద్యోగ) = Departure, నిర్గమము, దేహత్యాగము)

**236. సో కరోహి దీప[1]మత్తనో, ఖిప్పం వాయమ పణ్డితో భవ ।**
**నిద్ధన్తమలో అనఙ్గణో, దిబ్బం అరియ భూమి[2] మేహిసి । 2 ।**

(స కురు ద్వీపమాత్మనః, క్షిప్రం వ్యాయచ్ఛస్వ పణ్డితో భవ ।
నిర్ధూతమలోఽ నఙ్గణో[3], దివ్యమార్య భూమిమేష్యసి । 2 ।)

నీకొఱకొక ద్వీపమును (రక్షాస్థానమును) నిర్మించుకొనుము. శీఘ్రముగ ప్రయత్నింపుము; వివేకవంతుడవుకమ్ము. మనోమాలిన్యముల క్షాళనమొనర్చి, పాపరహితుడవైనచో, దివ్యమగు ఆర్యభూమిని పొందగలవు.

**237. ఉపనీతవయో చ దాని' సి, సమ్పయాతోసి యమస్స సన్తికే ।**
**వాసో పి చ తే నత్థి అన్తరా, పాథెయ్యం పి చ తే న విజ్జతి । 3 ।**

(ఉపనీతవయాశ్చేదానీమసి, సంప్రయాతోఽసి యమస్యాన్తికమ్ ।
వాసోఽపి తే నాస్త్యన్తరా, పాథేయమపి తే న విద్యతే । 3 ।)

నీ ఆయు విపుడు పరిసమాప్తమైనది. యముని సన్నిధి చేరి యున్నావు. మార్గమధ్యమున నీకు విశ్రాంతి స్థానమును లేదు; పాథేయము (దారిబత్తెము) కూడ లేదు.

**238. సో కరోహి దీపమత్తనో, ఖిప్పం వాయమ పణ్డితో భవ ।**
**నిద్ధన్తమలో అనఙ్గణో, న పున జాతిజరం ఉపేహిసి । 4 ।**

(స కురు ద్వీపమాత్మనః, క్షిప్రం వ్యాయచ్ఛస్వ పణ్డితో భవ ।
నిర్ధూతమలోఽ నఙ్గణో, న పునర్జాతిజరే ఉపైష్యసి । 4 ।)

---

(1) ప్రవాహమున మునిగిపోవుచున్న వ్యక్తి, ఒక ద్వీపమును (దీవిని) చేరి తన్ను తాను రక్షించుకొనును. దీపము దివ్వె; బుద్ధుడు దీపంకరుడని ప్రసిద్ధుడు. ఈ గాథ యొక్క ప్రథమపాదము నీవిధమునను వివరింపవచ్చును. "ఆత్మ దీపుడవుకమ్ము". ('అత్తదీపా అత్తసరణా అనఞ్ఞసరణా') – (మహాపరినిబ్బానసుత్తము)

(2) అరియభూమి (ఆర్యభూమి) = శుద్ధావాసము; అనాగాములు నివసించు దివ్యలోకము.
'అరియభూమిం ఉపేహిసి' – బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(3) 'అనఞ్జనో' – పాఠాంతరము.

కావున నీకొఱకొక ద్వీపమును (రక్షాస్థానమును) నిర్మించుకొనుము. శీఘ్రముగ ప్రయత్నింపుము; వివేకవంతుడవుకమ్ము. మనోమాలిన్యముల క్షాళనమొనర్చి, పాపరహితుడవైనచో, జన్మజరాదుఃఖములను పొందవు.

**సావత్థి (జేతవనము)** **ఒకానొక బ్రాహ్మణుడు**

239. **అనుపుబ్బేన మేధావీ, థోకం థోకం, ఖణే ఖణే ।**
**కమ్మారో రజతస్సేవ, నిద్ధమే[1] మలమత్తనో । 5 । (*)**

*(అనుపూర్వేణ మేధావీ, స్తోకం స్తోకం క్షణే క్షణే ।*
*కర్మారో రజతస్యేవ, నిర్ధమే న్మల మాత్మనః । 5 ।)*

లోహకారుడు రజతము (వెండి) యొక్క మాలిన్యమును వలె, వివేకవంతుడు మనోమాలిన్యమును క్రమక్రమముగ కొంచము కొంచము క్షణ క్షణము ఊదివేయవలయును (మాలిన్యమును తొలగించి పరిశుద్ధ మొనరించు కొనవలెను.)

**సావత్థి (జేతవనము)** **తిస్సథేరుడు**

240. **అయసావ మలం సముట్ఠితం,**
**తదుట్ఠాయ[2] తమేవ ఖాదతి ।**
**ఏవం అతిధోనచారినం,**
**సాని[3]కమ్మాని నయన్తి దుగ్గతిం । 6 ।**

---

(*) పోల్చు :- "**కం సో సిక్ఖం సమాధాయ, ఏకోది నిపకో సతో ।**
**కమ్మారో రజతస్సేవ నిద్ధమే మలమత్తనో ।**" (సుత్తనిపాతము IV-16-8)
సమాధిస్థుడు, జ్ఞాని, స్మృతిమంతుడునైన మనుజుడు, ఏ శిక్షణమును గ్రహించి ఆత్మమాలిన్యమును, స్వర్ణకారుడు రజతమందలి మాలిన్యమును వలె ఊదివేయగలడు? (తొలగించుకొనగలడు?) అని సారిపుత్తుని ప్రశ్న.

(1) నిద్ధమే (నిర్ధమేత్. సం.) నిర్ + ధమ = నిర్ధమతి. ధమ ధ్మానే. మిగులకుండ సంపూర్ణముగ ఊదివేయుట (Blows away the impurities)

(2) తతుట్ఠాయ (తత ఉత్థాయ) పాఠాంతరము.

(3) సక కమ్మాని – సింహళదేశీయ పాఠాంతరము.

(అయస ఇవ మలం సముత్థితం త(స్మా)ద్
ఉత్థాయ తదేవ ఖాదతి ।
ఏవ మతిధావనచారిణం,
స్వాని కర్మాణి నయన్తి దుర్గతిమ్ ॥ 6 ॥)

ఇనుము నుండి యుత్పన్నమైన మాలిన్యము (త్రుప్పు) ఆ యినుమునే తినివేయుచున్నది. అట్లే అతిచంచలుడగు (సదాచారమునతిక్రమించు) మనుష్యుని, స్వకీయములగు కర్మములే దుర్గతిని పొందించుచున్నవి.

**సావత్థి (జేతవనము)　　లాళుదాయి (థేరుడు)**

**241. అసజ్ఝాయమలా మన్తా, అనుట్ఠానమలా ఘరా ।**
**మలం వణ్ణస్స కోసజ్జం, పమాదో రక్ఖతో మలం[1] ॥ 7 ॥**

(అస్వాధ్యాయమలా మన్త్రా, అనుత్థానమలా గృహాః ।
మలం వర్ణస్య కౌసీద్యం, ప్రమాదో రక్షతో మలమ్ ॥ 7 ॥)

స్వాధ్యాయము (స్వరపూర్వకపాఠావృత్తి) లేకుండుటే వేదమంత్రముల మాలిన్యము. ప్రయత్నము లేకుండుటే గృహ (జీవన) మాలిన్యము. ఆలస్యమే (సోమరితనమే) రూపమునకు మాలిన్యము. ప్రమాదమే (అజాగ్రత్తయే) రక్షకుని మాలిన్యము. (రక్షణ చేయువారు నిద్రాళువులు, విస్మరణశీలురుగా నుండరాదు).

**రాజగృహము (వేళువనము)　　ఒకానొక కులపుత్రుడు**

**242. మలిత్థియా దుచ్చరితం, మచ్ఛేరం దదతో మలం ।**
**మలా వే పాపకా ధమ్మా, అస్మిం లోకే పరమ్హి చ ॥ 8 ॥**

---

(1) పోల్చు :- **అనామ్నాయమలా వేదా, బ్రాహ్మణస్యాఽవ్రతం మలమ్ ।**
**మలం పృథివ్యా బాహ్లీకా, పురుషస్యాఽనృతం మలమ్ ।**
**కౌతూహలమలా సాధ్వీ, విప్రవాసమలాస్త్రియః ।** (మ.భా. ఉద్యోగ-39-78,79)

*(మలం స్త్రియా దుశ్చరితం, మత్సరం దదతో మలం |*
*మలం వై పాపకా ధర్మా, అస్మిన్ లోకే పరస్మిన్ చ | 8 |)*

దురాచారము స్త్రీకి కళంకము. కృపణత్వము (లోభము) దాతకు కళంకము. పాపకర్మములు (అయోగ్య ప్రవృత్తులు) ఇహపరలోకములు రెంటికి కళంకము.

**243. తతోమలా మలతరం, అవిజ్జా పరమం మలం |**
**ఏతం మలం పహత్వాన, నిమ్మలా హోథ భిక్ఖవో | 9 |**

*(తతో మలాన్మలతరం, అవిద్యా పరమం మలమ్ |*
*ఏతన్మలం ప్రహాయ, నిర్మలా భవత భిక్షవః | 9 |)*

ఈ అన్ని మాలిన్యముల కంటే, అవిద్య మహామాలిన్యము. భిక్షువులారా! ఈ మలమును తొలగించుకొని నిర్మలులుకండి!

**సావత్థి (జేతవనము)** **చూళసారి (సద్ధి విహారికుడు)**

**244. సుజీవం అహిరీకేన, కాకసూరేన ధంసినా |**
**పక్ఖన్దినా పగబ్భేన, సంకిలిట్ఠేన జీవితం | 10 |**

*(సుజీవితం అహ్రీకేణ, కాకశూరేణ ధ్వంసినా |*
*ప్రస్కన్దినా ప్రగల్భేన, సఙ్క్లిష్టేన జీవితమ్ | 10 |)*

పాపాచరణమున లజ్జారహితుడు (సిగ్గులేనివాడు), కాకశూరుడు (కాకితో సమానమైన ధైర్యముగలవాడు) పరహితమును నాశమొనరించువాడు, పతితుడు, ప్రగల్భుడు (విశృంఖలుడు) పాపాత్ముడునైన మనుష్యునికి జీవితము సుకరము (గ కన్పించును).

**245. హిరీమతా చ దుజ్జీవం, నిచ్చం సుచిగవేసినా |**
**అలీనేన' ప్పగబ్భేన, సుద్ధాజీవేన పస్సతా | 11 |**

*(హ్రీమతా చ దుర్జీవితం, నిత్యం శుచిగవేషిణా |*
*అలీనేనాఽప్రగల్భేన, శుద్ధాజీవేన పశ్యతా | 11 |)*

పాపాచరణమునకు లజ్జించువాడు, నిత్యము పవిత్రతన్వేషించువాడు, నిరాలసుడు (సోమరితనము లేనివాడు) మితభాషి, శుద్ధ జీవనుడు, జ్ఞానియునైన మనుష్యునికి జీవితము దుష్కరము (గ కన్పించును). (అలీనః —Disinterested — నిస్సంగుడు, నిష్కాముడు, అని రాధాకృష్ణ పండితుడు).

**సావత్థి (జేతవనము)　　పంచశత (ఐదువందల మంది) ఉపాసకులు**

**246. యో పాణ మతిపాతేతి, ముసావాదఞ్చ భాసతి।**
**లోకే అదిన్నమాదియతి, పరదారఞ్చ గచ్ఛతి ॥ 12 ॥**

*(యో ప్రాణ మతిపాతయతి, మృషావాదం ఞ్చ భాషతే।*
*లోకేఽదత్త మాదత్తే, పరదారాంశ్చ గచ్ఛతి ॥ 12 ॥)*

ఎవడు ప్రాణి హింస చేయునో, అసత్యమాడునో, తనకీయని వస్తువును తీసికొనునో (దొంగిలించునో) పరస్త్రీ గమన మొనర్చునో -

**247. సురామేరయపానఞ్చ, యోనరో అనుయుఞ్జతి।**
**ఇధేవ మేసో లోకస్మిం, మూలం ఖనతి అత్తనో ॥ 13 ॥**

*(సురామైరేయపానఞ్చ, యోనరోఽనుయునక్తి।*
*ఇహైవమేష లోకే, మూలం ఖనత్యాత్మనః ॥ 13 ॥)*

---

246, 247 గాథలు బౌద్ధుల పంచశీలముల పేర్కొనుచున్నవి. (Five principal commandments) (1) పాణాతిపాతము (ప్రాణిహింస) (2) అదిన్నాదానము (దొంగతనము) (3) కామేసు మిచ్ఛాచారము (వ్యభిచారము) (4) ముసావాదము (అసత్యభాషణము) (5) సురామేరయమజ్జ -పమాదట్ఠానము (మత్తునిచ్చు మద్యసేవనము) -ఈ ఐదు పాపముల నాచరింపకుండుట పంచశీలములు (శిక్షా పదములు) అనబడును. ఈ శిక్షా పదముల -పంచశీలముల - నుల్లంఘించువారు తమ శ్రేయో మూలములను తామే ఛేదించుకొని, ఆత్మ వినాశముకు బీజముల నీలోకమందే సిద్ధపఱుచు కొనుచున్నారు. (1)పాణాతిపాతా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి. (అహింసా శిక్షాపదమును స్వీకరించుచున్నాను.)(2) అదిన్నాదానా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి (అస్తేయ శిక్షాపదమును స్వీకరించుచున్నాను.)(3) కామేసు మిచ్ఛా చారా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి (వ్యభిచారనివృత్తి శిక్షాపదమును స్వీకరించుచున్నాను. (4) ముసావాద వేరమణీ సిక్ఖాపదం సమాదియామి (అసత్యభాషణ పరిత్యాగ శిక్షాపదమును స్వీకరించుచున్నాను.) (5) సురామేరయమజ్జ పమాదట్ఠానా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి (మద్యపాన పరిత్యాగ శిక్షాపదమును స్వీకరించుచున్నాను.)

సురామైరేయ (మద్య) పానలగ్నుడై యుండునో అట్టి మనుజుడు ఈ లోకమందే, తన మూలమును తానే ఛేదించుకొనుచున్నాడు.

**248. ఏవం భో పురిస! జానాహి, పాపధమ్మా అసఞ్ఞతా ।**
**మా తం లోభో, అధమ్మో చ చిరం దుక్ఖాయ రన్ధయుం । 14 ।**

*(ఏవం భో పురుష! జానీహి, పాపధర్మాణోఽసంయతాన్ ।*
*మా త్వం లోభోఽధర్మశ్చ, చిరం దుఃఖాయ రన్ధేరన్* । 14 ।)*

మానవుడా! పాపపరాయణులిట్లు సంయమరహితులని తెలిసికొనుము. లోభము, అధర్మము నిన్ను చిరదుఃఖభాజనుని చేయకుండుగాక! (చిరదుఃఖమును నీకొఱకు వండకుండుగాక!) (*) రన్ధతు. పాఠాంతరము)

**సావత్థి (జేతవనము)** **తిస్సదహరుడు**

249. దదాతి వేయథాసద్ధం, యథా పసాదనం జనో ।
తత్థ యో మఙ్కు భవతి[1], పరేసం పానభోజనే ।
**నసో దివా వా రత్తిం వా, సమాధిమధిగచ్ఛతి । 15 ।**

*(దదాతి వై యథాశ్రద్ధం, యథాప్రసాదనం జనః ।*
*తత్ర యో మూకో భవతి, పరేషాం పానభోజనే ।*
*న స దివా వా రాత్రౌ వా సమాధి మధి గచ్ఛతి । 15 ।)*

లోకము(జనులు) తన శ్రద్ధా ప్రసన్నతల ననుసరించి దాన మొనరించును. ఇతరుల కొసగు పానభోజనముల విషయమున సంతాపకారణమగు మూగతనము వహించువాడు –(మత్సరపడువాడు) పగలు గాని రాత్రి గాని మనఃశాంతిని పొందజాలడు. (సమాధి – మనస్సమాధానము).

---

(1) మఙ్కుహోతి – బ్రహ్మదేశీయ పాఠాంతరము.
మఙ్కుభావం వా – సింహళ దేశీయ పాఠాంతరము.
తత్థ వే మఙ్కు యో హోతి – నాలందా పాఠాంతరము.
తత్థ యో మఙ్కుతో హోతి – స్యామదేశీయ పాఠాంతరము.

250. యస్స చేతం సముచ్ఛిన్నం, మూలఘచ్చం సమూహతం।
స వే దివా వా రత్తిం వా। సమాధి మధిగచ్ఛతి ॥ 16 ॥

(యస్య చైతత్ సముచ్ఛిన్నం, మూలఘాత్యం[1] సముద్ధతమ్
స వై దివా వా రాత్రౌవా, సమాధి మధిగచ్ఛతి ॥ 16 ॥)

కాని, ఎవని యందీ మాత్సర్యము సమూలముగ నశించినదో వాడే, పగలు గాని, రాత్రిగాని చిత్తప్రశాంతిని పొందుచున్నాడు.

సావత్థి (జేతవనము)　　ఐదుగురు ఉపాసకులు

251. నత్థి రాగసమో అగ్గి, నత్థి దోససమో గహో।
నత్థి మోహసమం జాలం, నత్థి తణ్హాసమా నదీ ॥ 17 ॥

(నాఽస్తి రాగసమోఽగ్నిః, నాఽస్తి ద్వేషసమో గ్రహః।
నాఽస్తి మోహసమంజాలం, నాఽస్తి తృష్ణాసమా నదీ ॥ 17 ॥)

రాగముతో సమానమైన అగ్నిలేదు. ద్వేషముతో సమానమైన గ్రహము (పిశాచము, మొసలి) లేదు. మోహముతో సమానమైన జాలము (వల; మాయ) లేదు. తృష్ణతో సమానమైన నది లేదు. * తృష్ణ నదితో పోల్చబడినది.

---

(1) మూలఘాతం - రాహులసాంకృత్యాయనుని పాఠము.

*పోల్చు :- "ఆశా నామ-నదీ మనోరథజలా, తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్క-విహగా, ధైర్యద్రుమధ్వంసినీ।
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుంగచింతాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః ॥" (భర్తృహరి వైరాగ్య-10)

చ. కలితమనోరథంబు లుదకంబులు, తృష్ణలు భూరివీచికా వ
ళు, లనురాగముల్ మకరివర్గము, మోహవితర్క-ముల్ మదుల్
పులుగులుగాగ, ధైర్యఫలభూజముగూల్చు దురాశాపేరి వు
ష్కలనది దాటి, నిత్యసుఖసంపద గాంతురు యోగిపుంగవుల్। (భర్తృహరి)

"తృష్ణానదీ తి వేగా ప్రశోషితా మే జ్ఞానసూర్యేణ" (లలిత విస్తరము)

**బద్దియనగరము (జాతియావనము)** **మెణ్డకసెట్ఠి**

252. **సుదస్సం వజ్జ మఞ్ఞేసం, అత్తనో పన దుద్దసం ।**
**పరేసం హి సో వజ్జాని, ఓపుణాతి యథా భుసం ।**
**అత్తనో పన ఛాదేతి, కలింవ కితవా సఠో । 18 ।**[1]

(సుదర్శనం వద్య మన్యేషాం, ఆత్మనః పునర్దుర్దశమ్ ।
పరేషాం హి స వద్యాని, అవపుణాతి యథా బుసమ్ ।
ఆత్మనః పునః ఛాదయతి, కలి మివ కితవాత్ శఠః । 18 ।)

పరుల దోషముల గాంచుట సులభము; కాని, తన దోషముల గాంచుట కష్టము. మానవుడితరుల దోషములను పొట్టువలె తూర్పార బట్టును; కాని, - శఠుడు (ధూర్తుడు) జూదరి నుండి తనకు ఓటమి గలిగించు పాచికను కప్పిపుచ్చునట్లు, తన దోషములను కప్పిపుచ్చును (1).

**సావత్థి (జేతవనము)** **ఉజ్ఝానసఞ్ఞిథేరుడు**

253. **పరవజ్జానుపస్సిస్స, నిచ్చం ఉజ్ఝానసఞ్ఞినో ।**
**ఆసవా తస్స, వడ్ఢన్తి, ఆరా సో ఆసవక్ఖయా । 19 ।**

(పరవద్యాఽను పశ్యతో నిత్య ముద్ధ్యానసజ్ఞినః ।
ఆసవాస్తస్య వర్ధన్తే, ఆరాత్ స ఆస్రవక్షయాత్[2] । 19 ।)

---

(1) పోల్చు :- "**నరః సర్షపమాత్రాణి, పరచ్ఛిద్రాణి పశ్యతి ।**
**ఆత్మనో బిల్వమాత్రాణి, పశ్యన్నపి నపశ్యతి** " ।

సర్షపమాత్రములైన (సాసువగింజల వలె అత్యల్పములైన) ఇతరుల దోషములు మనుష్యుడు గాంచును; కాని, బిల్వఫలమాత్రములైన (మారేడు పండ్లవలె అతిస్థూలములైన) తన దోషములు మాత్రము చూచుచున్నను చూడడు. (రాధాకృష్ణ పండితుడు).

**కలి** :- ఒక్క అంకె మాత్రము గల పాచిక యొక్క పార్శ్వము; దోషము- చూడు: 202 గాథ పాదటీక.

**కితవ** :- జూదరి, వంచకుడు, ఉమ్మెత్త చెట్టు.

వంచకుడగు వ్యాధుడు, ఉమ్మెత్తచెట్ల కొమ్మల వలన తన్నాచ్ఛాదించుకొన్నట్లు, మనుజుడు, తన దోషమునాచ్ఛాదించుకొనును. (బుద్ధరక్షితథేరుడు)

(2) ఆస్రవక్షయము, అర్హత్సిద్ధిఫలము. (అరహంతుల సిద్ధిఫలము)

పరుల దోషములను గాంచువానికి, నిత్యము వాని ధ్యానించుచు క్రోధ శీలుడగువానికి, ఆస్రవములు (చిత్తమాలిన్యములు) వృద్ధిపొందును. ఆస్రవక్షయమునకు అతడు దవ్వున నుండును. (అతనికి ఆస్రవక్షయము అసాధ్యము).

**కుసినారము (సాలవనమున మల్లుల ఉపవత్తనము)** **సుభద్ద పరిబ్బాజకుడు**

254. **ఆకాసే వా పదం నత్థి, సమణో నత్థి బాహిరే ।**
**పపఞ్చాభిరతా[1] పజా, నిప్పపఞ్చా తథాగతా ॥ 20 ॥**

*(ఆకాశే వా పదం నాఽస్తి, శ్రమణో నాఽస్తి బాహ్యతః ।*
*ప్రపఞ్చాభిరతాః ప్రజాః, నిష్ప్రపఞ్చాస్తథాగతాః ॥ 20 ।)*

ఆకాశమున మార్గము లేదు. బుద్ధశాసనమునకు బాహ్యమున శ్రమణుడు లేడు.జనులు ప్రాపంచిక జీవనమున నానందింతురు. తథాగతులు(బుద్ధులు) ప్రపంచాతీతులు. (బాహ్యకర్మములచే కాక, ఆధ్యాత్మికముగ మాత్రమే శ్రమణత్వసిద్ధి. చతుస్సత్యముల నెఱిగి దశసంయోజనముల(శృంఖలల) త్రుంచివేసి, లోకోత్తర మార్గమును ఫలమును పొందుటే శ్రమణత్వము.)

---

(1) పపఞ్చాభిరతా (ప్రపఞ్చాభిరతాః) – తృష్ణ, మానము (గర్వము) మిథ్యాదృష్టి – వీని యందురతులు. 'తణ్హా, దిట్ఠి, మాన, పపఞ్చ = తణ్హా దిను పపఞ్చేసు'. ప్రపంచమనగా మానవ బలహీనతలైన తృష్ణా మిథ్యాదృష్టిమానాదులని భావము.

తథాగతుడు – బుద్ధుడు 'తథా సత్యం గతం జ్ఞానం యస్య' – సత్యమును పొందిన జ్ఞానము గలవాడు 'తథాగతుడు'. 'అట్లు వచ్చినవాడు', 'అట్లు పోయినవాడు' అని శబ్దార్థము.

'ఆకాసే పదం నత్థి' – 'ఆకాసేచ పదం నత్థి' – 'ఆకాసే' వ పదం నత్థి' – పాఠాంతరములు.

పోల్చు :- **'అవాలయం నిష్ప్రపంచమ్ అనుత్పాదమ్ అసంభవమ్'** । (లలితవిస్తరము)

255. **ఆకాసే వా పదం నత్థి, సమణో నత్థి బాహిరే ।**
**సంఖారా సస్సతా నత్థి, నత్థి బుద్ధాన మిఞ్జితం । 21 ।**

*(ఆకాశే వా పదం నాఽస్తి, శ్రమణో నాఽస్తి బాహ్యతః ।*
*సంస్కారాః శాశ్వతా న సన్తి, నాఽస్తి బుద్ధానా మిజ్గీతమ్ । 21 ।)*

ఆకాశమున మార్గము లేదు. బుద్ధ శాసనమునకు బాహ్యమున శ్రమణుడు లేడు. సంస్కారములు శాశ్వతములు కావు. బుద్ధులకు (తథాగతులకు) అస్థిరత (చాంచల్యము) ఉండదు.

*18* మలవగ్గో సమత్తో

మలవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## ధమ్మట్ఠవగ్గో, ఏకూనవీసతిమో

## (ధర్మిష్ఠవర్గః, ఏకోనవింశః)

## 19 ధర్మిష్ఠవర్గము – ఏకోనవింశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **వినిచ్ఛయ మహామత్తుడు (న్యాయాధీశుడు)**

**256. న తేన హోతి ధమ్మట్ఠో, యేనత్థం సహసా[1] నయే।**
**యో చ అత్థం అనత్థ ఞ్చ, ఉభో విచ్ఛేయ్య పణ్డితో ।1।**

(న తేన భవతి ధర్మిష్ఠో, యేనాఽర్థం సహసా నయేత్।
యశ్చార్థ మనర్థంచ, ఉభౌ నిశ్చినుయాత్ పణ్డితః ।11।)

హితా హిత విచార రహితముగ (అతర్కితముగ) కార్యమొనర్చువాడు (తీర్పులు చెప్పువాడు) ధర్మిష్ఠుడు కాడు. సత్యాసత్యములు రెంటిని

(1) 'సాహసా' – బ్రహ్మదేశీయ పాఠాంతరము. ఇది భాష్యకారుడు భదన్త బుద్ధఘోషునికి సమ్మతము. "ఛన్దా దిసు పతిట్ఠితో సాహసేన ముసావాదేన వినిచ్ఛేయ్య" – అని అతని వ్యాఖ్య.
**సాహసా** – కామద్వేష భయాజ్ఞానాదులచే ప్రభావితుడై మృషావాదముతో
**సాహసం తు దమో దణ్డః – దమే దుష్కరకర్మణి, అవిమృశ్యకృతౌ ధార్ష్ట్యే।** (అమరకోశము II.478)
**అతర్కితే తు సహసా** (అమరకోశము III-418)

పరిశీలించి నిశ్చయించువాడు పండితుడు (సదసద్వివేకశాలియే పండితుడు).

**257. అసాహసేన ధమ్మేన, సమేన నయతీ పరే ।**
**ధమ్మస్స గుత్తో మేధావీ, ధమ్మట్ఠోతి పవుచ్చతి ॥ 2 ॥**

*(అసాహసేన ధర్మేణ, సమేన నయతే పరాన్ ।*
*ధర్మస్య గుప్తో మేధావీ, ధర్మిష్ఠ ఇతి ప్రోచ్యతే ॥ 2 ॥)*

సదసద్వివేక సహితము (అహింసాయుతము) సమమునైన ధర్మముచే, నితరులకు మార్గదర్శకుడగువాడు ధర్మరక్షితుడు, మేధావి, ధర్మిష్ఠుడని అనబడును.

**సావత్థి (జేతవనము)** **ఛబ్బగ్గియ భిక్షు (వజ్జియ భిక్షు)**

**258. న తేన పణ్డితో హోతి, యావతా బహు భాసతి ।**
**ఖేమీ అవేరీ అభయో, పణ్డితోతి పవుచ్చతి ॥ 3 ॥**

*(న తేన పణ్డితో భవతి, యావతా బహు భాషతే ।*
*క్షేమీ అవైరీ అభయః పణ్డిత ఇతి ప్రోచ్యతే ॥ 3 ॥)*

బహుభాషిత్వము (అధికభాషణము) వలన నెవడును పండితుడుకాడు. క్షేమి, (శాంతాత్ముడు) అవైరి, (శత్రుభావరహితుడు) అభయుడు (భయరహితుడు)నైన మనుజుడు, 'పండితుడ'నబడును.

**సావత్థి (జేతవనము)** **ఏకుదాన థేరుడు**

**259. న తావతా ధమ్మధరో, యావతా బహు భాసతి ।**
**యో చ అప్పమ్పి సుత్వాన, ధమ్మం కాయేన[1] పస్సతి ।**
**స వై ధర్మధరో హోతి, యో ధమ్మం నప్పమజ్జతి ॥ 4 ॥**

---

(1) కాయేన – నామకాయేన = మానసిక కాయము చేత. సత్యము యొక్క అపరోక్షానుభవము చేత. ధర్మమున కర్థముసత్యము. (Truth). చతురార్య సత్యములే ధర్మస్వరూపమని భదన్త బుద్ధఘోషుని వ్యాఖ్య. 'ధర్మం కాయేన పస్సతి' –ధర్మమును స్వకర్మములందుకాంచును. అనునర్థమును మాక్సుముల్లర్ భావించును.

(న తావతా ధర్మధరో, యావతా బహు భాషతే ।
యశ్చాఽల్పమపి శ్రుత్వా, ధర్మం కాయేన పశ్యతి ।
స వై ధర్మధరో భవతి, యో ధర్మం (ధర్మాత్) నప్రమాద్యతి ॥ 4 ॥)

అధిక భాషణము వలన నెవడును ధర్మధరుడు (ధర్మకుశలుడు) కాడు. ధర్మము నల్పముగనైనను విని, తన(నామ) కాయమున దర్శించువాడు, ధర్మమున నప్రమత్తుడునైన వాడే, ధర్మధరుడు - ధర్మ కుశలుడు - విశారదుడు - కాగలడు.

**సావత్థి (జేతవనము)** **లకుణ్డకభద్దియథేరుడు**

**260. న తేన థేరో సో హోతి, యేనస్స పలితం సిరో ।**
**పరిపక్కో వయో తస్స, మోఘజిణ్ణోతి వుచ్చతి[1] । 5 ॥**

(న తేన స్థవిరః సభవతి, యేనాఽస్య పలితం శిరః ।
పరిపక్వం వయస్తస్య, మోఘజీర్ణ ఇత్యుచ్యతే । 5 ॥)

తల నెరసినందున, మనుజుడు, థేరుడు (వృద్ధుడు) కాడు. అతనికి వయస్సు మాత్రము పండినది. అతడు 'మోఘజీర్ణుడు' అనబడును. (వ్యర్థముగ వార్ధక్యమును పొందినవాడనబడును).

**261. యమ్హి సచ్చఞ్చ ధమ్మో చ, అహింసా సంయమో[2] దమో ।**
**స వే వన్తమలో ధీరో, థేరోతి[3] పవుచ్చతి । 6 ।**

---

(1) పోల్చు :- "న తేన వృద్ధోభవతి, యేనాఽస్య పలితం శిరః ।
**యో వై యువాప్యధీయాన స్తం దేవా స్థవిరం విదుః ।**
(మనుస్మృతి II-136)

బౌద్ధ సంప్రదాయమున భిక్షువుగా కనీసము పది సంవత్సరములు వర్తించిన వాడు 'థేరుడు' అనుటకు అర్హుడు. కాని, ఆధ్యాత్మిక పరిపక్వతయే థేరునికి ప్రధానమైనది; భిక్షు సంఘమున వయోజ్యేష్ఠత ముఖ్యము కాదు.

(2) సఞ్ఞమో - పాఠాంతరము.

(3) సో థేరోతి పాఠము సరియైనదిగా ప్రతీతి.

(యస్మిన్ సత్యఞ్చ ధర్మశ్చాఽహింసా సంయమో దమః ।
స వై వాన్తమలో ధీరః, స్థవిర ఇతి ప్రోచ్యతే । 6 ॥)

ఎవనియందు సత్యము, ధర్మము, అహింస, సంయమము, దమము, నివసించునో, ఎవడు నిర్మలుడో, ధీశాలియో (ధైర్యశాలియో) అట్టివాడే థేరుడు (వృద్ధుడు) అని అనబడును.

**సావత్థి (జేతవనము) సంబహుల భిక్ఖూ (అనేక భిక్షువులు)**

**262. న వాక్కరణమత్తేన, వణ్ణపోక్ఖరతయా వా ।**
**సాధురూపో నరో హోతి, ఇస్సుకీ మచ్ఛరీ సఠో । 7 ॥**

(న వాక్కరణ మాత్రేణ, వర్ణపుష్కరతయా[1] వా ।
సాధురూపో నరో భవతి, ఈర్షుకో మత్సరీ శఠః । 7 ॥)

కేవలము వాగ్వైఖరి కారణమున గాని, తామరపూవు వంటి వర్ణసౌందర్యమున గాని, ఈర్ష్యాళువు, మత్సరుడు, శఠుడు (ధూర్తుడు) నైన మనుజుడు, సాధుస్వభావుడు కాజాలడు.

**263. యస్స చేతం సముచ్ఛిన్నం మూలఘచ్చం సమూహతం ।**
**స వన్తదోసో మేధావీ, సాధురూపోతి వుచ్చతి । 8 ॥**

(యస్య చైతత్ సముచ్ఛిన్నం, మూలఘాత్యం సమూహితమ్[2] ।
స వాన్తదోషో మేధావీ, సాధురూప ఇత్యుచ్యతే । 8 ।)

ఎవనియందివి (ఈర్ష్యామాత్సర్యశాఠ్యములు) సమూహితముగ ఉచ్ఛిన్నమై సమూలముగ నశించినవో, ఎవడు దోష (ద్వేష) రహితుడో, ధీశాలియో, అతడు సాధుస్వభావుడు (సుందరుడు) అని యనబడును.

---

(1) వణ్ణపుష్కలతయా – రాహులసాంకృత్యాయనుని పాఠము
(2) మూలఘాతం సముద్ధతమ్ – రాహులసాంకృత్యాయనుని పాఠము

సావత్థి (జేతవనము) హత్థకుడు (భిక్షువు)

264. న ముణ్డకేన సమణో, అబ్బతో అలికం భణం।
ఇచ్ఛాలోభసమాపన్నో, సమణో కిం భవిస్సతి ॥ 9 ॥

(న ముణ్డకేన శ్రమణో, అవ్రతో, ఉలీకం భణన్।
ఇచ్ఛాలోభసమాపన్నః, శ్రమణః కిం భవిష్యతి ॥ 9 ॥)

వ్రతహీనుడు, అసత్యవాది యగు మనుష్యుడు, కేవలము ముండనము (తలగొఱిగించుకొనుట) వలన శ్రమణుడు కాజాలడు. కామలోభములకు వశుడైనవాడు శ్రమణు డెట్లగును?

265. యో చ సమేతి పాపాని, అణుం థూలాని సబ్బసో।
సమితత్తా హి పాపానం, సమణో[(1)]తి పవుచ్చతి ॥ 10 ॥

(యశ్చ శమయతి పాపాని, అణూని స్థూలాని సర్వశః।
శమితత్వాద్ధి పాపానాం, శ్రమణ ఇతి ప్రోచ్యతే ॥ 10 ॥)

ఎవడు సూక్ష్మములు స్థూలములునైన పాపముల సంపూర్ణముగ శమింప (నశింప)జేయునో, అట్టివాడు పాపముల శమింపజేయుట వలననే 'శ్రమణుడ'నబడును.

(1) శ్రమణశబ్దము 'శ్రమ్' ధాతునిష్పన్నము. కఠోర తపస్సుల నాచరించువాడు శ్రమణుడు. 'సమ్' (శమ్) -శమింపజేయు - అనుపాళీ ధాతువు నుండి 'సమణ' శబ్దమునిష్పన్నము. (చూడు : 184 గాథ - పాదటీక.) ఇంద్రియోపశమము గలవాడు 'సమణుడ'ని భావము.

పోల్చు :- "The habit and the Shaven crown do little profit; but change of manners and perfect mortification of passions make a true religious man."

(Imitation of Christ Bk.I- Chapter XVII)

వస్త్రధారణ, శిరోముండనము, నిష్ప్రయోజనము స్వభావపరివర్తన, మనోవికారముల సంపూర్ణ సంయమము, ఇవియే ధర్మనిష్ఠుని స్వరూపలక్షణములని భావము.

**సావత్థి (జేతవనము)** **ఒకానొక బ్రాహ్మణుడు**

**266. న తేన భిక్ఖు[1] సో హోతి,[2] యావతా భిక్ఖతే పరే ।**
**విస్సం ధమ్మం సమాదాయ, భిక్ఖు హోతి న తావతా । 11 ।**

*(న తావతా భిక్షుర్భవతి, యావతా భిక్షతే పరాన్ ।*
*విశ్వం ధర్మం సమాదాయ, భిక్షుర్భవతి న తావతా । 11 ।)*

ఇతరులను (భిక్షార్థమై) యాచించు మాత్రమున నతడు భిక్షువు కాజాలడు. కేవలము బాహ్యమగు భిక్షు ధర్మమును సమస్తమును పరిగ్రహించుటచే నెవడును భిక్షువు కాజాలడు. ధర్మమును సంపూర్ణముగ ననుష్ఠించుట చేతనే భిక్షువు కాగలడు కాని, కేవలము భిక్షించుట వలన కాదని భావము.*

**267. యోధ పుఞ్ఞ ఞ్చ పాపఞ్చ, బాహేత్వా[3] బ్రహ్మచరియవా ।**
**సఙ్ఖాయ లోకే చరతి, సవే భిక్ఖూతి వుచ్చతి । 12 ।**

*(య ఇహ పుణ్యఞ్చ పాపఞ్చ, వాహయిత్వా బ్రహ్మచర్యవాన్ ।*
*సంఖ్యయా లోకే చరతి, సవై భిక్షురిత్యుచ్యతే । 12 ।)*

ఎవడిచ్చట పుణ్యపాపముల పరిత్యజించి - అతిక్రమించి - బ్రహ్మచర్యవంతుడై (పవిత్రుడై) సమ్యక్ జ్ఞానముతో లోకమున చరించునో అతడే భిక్షువనబడును.

---

(1) బౌద్ధ భిక్షువులు యాచింపరు; గృహస్థుల ఇండ్ల ముంగిట భిక్షార్థమై నిలుచుందురు. (నారదమహాథేరుడు)

(2) హోతీ - పాఠాంతరము.

* "ఇతరులను భిక్షార్థమై యాచించువాడు, భిక్షువు కాదు. ధర్మమును సంపూర్ణముగ (విస్సందమ్మం) ననుష్ఠించుట చేతనే భిక్షువు కాగలడు. కాని, కేవలము భిక్షాటనముచే భిక్షువు కాదు." - అని కూడ ఈ గాథను అనువదింపవచ్చును.

(3) బాహిత్వా - పాఠాంతరము.

**సావత్థి (జేతవనము)** **తిత్థియుడు (తీర్థికుడు)**

**268. న మోనేన మునీ హోతి, మూళ్హరూపో అవిద్దసు ।**
**యో చ తులం'వ పగ్గయ్హ, వరమాదాయ పణ్డితో । 13 ।**

*(న మౌనేన మునిర్భవతి, మూఢరూపోఽ విద్వాన్ ।*
*యశ్చ తులమివ ప్రగృహ్య, వరమాదాయ పణ్డితః । 13 ।)*

మూర్ఖుడు అవిద్వాంసుడునైనవాడు, మౌనధారణ మాత్రమున ముని కానేరడు. పండితుడు (వివేకవంతుడు) త్రాసు ధరించిన వానివలె ఉత్తమమైన దానినే స్వీకరించును.

**269. పాపాని పరివజ్జేతి, స మునీ(1) తేన సో మునీ ।**
**యో మునాతి ఉభో లోకే, మునీ తేన పవుచ్చతి ॥ 14 ॥**

*(పాపాని పరివర్జయతి, స మునిస్తేన స మునిః ।*
*యో మనుతే ఉభౌ లోకౌ, మునిస్తేన ప్రోచ్యతే । 14 ॥*

(త్రాసు ధరించిన వాని వలె ఉత్తమమైన దాని స్వీకరించి) పాపముల పరిత్యజించినవాడు ముని. ఆ హేతువుననే అతడు ముని. ఇహపరములగు ఉభయ లోకములను (బాహ్యాభ్యంతరములను) గ్రహించువాడే మునియనబడును.

**సావత్థి (జేతవనము)** **అరియుడు (బాలిసికుడు)**
**(జాలికుడు)**

**270. న తేన అరియో(2) హోతి, యేన పాణాని హింసతి ।**
**అహింసా సబ్బపాణానం, అరియో'తి ప వుచ్చతి । 15 ।**

---

(1) 'మన్ - మన జ్ఞానే, అవబోధనే - ఈ ధాతువు నుండి 'ముని' శబ్దము నిష్పన్నము; మననశీలుడని భావము. ముని యొక్క భావము మౌనము. శాక్యముని - బుద్ధుడు.

(2) 'అరియ' (ఆర్య) శబ్దము ధర్మవర్తనుల కందఱకన్వయించును. ఈ శబ్దమునకు సజ్జనుడు, సభ్యుడు, శిష్టుడు, గౌరవనీయుడునని ముఖ్యార్థము. (Respectable, Noble.)

*(న తేనాఽఽర్యో భవతి, యేన ప్రాణాన్ హినస్తి ।*
*అహింసా సర్వప్రాణానా మార్య ఇతిప్రోచ్యతే । 15 ।)*

ప్రాణుల హింసించువాడు ఆర్యుడు కాజాలడు. సర్వప్రాణి జాతమునెడల అహింస ననుష్ఠించువాడే, ఆర్యుడనబడును. (అరియుడు (ఆర్యుడు) అనుపేరుగల బెస్తవాని నుద్దేశించి బుద్ధుడీగాథను పల్కెను. సర్వభూతదయా ప్రసన్న భావమే ఆర్యలక్షణము.)

**సావత్థి (జేతవనము)** **శీలాదిసంపన్నులగు పలువురు భిక్షువులు**

**271. న సీలబ్బతమత్తేన, బాహుసచ్చేన వా పున ।**
**అథవా సమాధిలాభేన, వివిచ్ఛసయనేన[1] వా । 16 ।**

*(న శీలవ్రత మాత్రేణ, బహుశ్రుత్యేన వా పునః ।*
*అథవా సమాధిలాభేన, వివిక్తశయనేన [3] వా । 16 ।)*

కేవలము సదాచారవ్రతానుష్ఠానము చేతను, బహుశ్రుతత్వము (అధిక పాండిత్యము) చేతను ధ్యానసమాధిప్రాప్తి చేతను, ఏకాంతశయనము చేతను........ (ముందు గాథతో అన్వయము).

---

(1) వివిత్తసయనేన - పాఠాంతరము
(2) వివిచ్య శయనేన - రాహులసాంకృత్యాయనుని పాఠము.

**272. ఫుసామి నెక్ఖమ్మసుఖం, అపుథుజ్జనసేవితం ।**
**భిక్ఖు! విస్సాసమాపాది, అప్పత్తో ఆసవక్ఖయం । 17 ।**

*(స్పృశామి నైష్కర్మ్యసుఖ మపృథగ్జనసేవితమ్ ।*
*భిక్షో! విశ్వాసం మాపాదీః అప్రాప్త ఆస్రవక్షయమ్ ॥ 17 ।)*

జ్ఞానులకు మాత్రమే అనుభూతమగు నైష్కర్మ్య సుఖమును (నిర్వాణ సుఖమును) నేను స్పృశింప (అనుభవింప)జాలను. ఓ భిక్షూ! చిత్త మాలిన్య (ఆస్రవ)వినాశము ప్రాప్తించనంతవఱకు - నిర్వాణ సుఖప్రాప్తి కల్గునని - విశ్వసింపకుము. (విశ్రమింపక ప్రయత్నశాలివి కమ్ము.)

*19 ధమ్మట్ఠవగ్గో సమత్తో*

ధర్మిష్ఠవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## మగ్గవగ్గో వీసతిమో

## (మార్గవర్గో వింశః)

## 20 మార్గవర్గము – వింశతితమాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **ఐదువందల మంది భిక్షువులు**

273. **మగ్గాన'ట్ఠఙ్గికో సెట్ఠో, సచ్చానం చతురోపదా ।**
**విరాగో సెట్ఠో ధమ్మానం, దిపదానం చ చక్ఖుమా ॥ 1 ॥**

*(మార్గాణా మష్టాంగికః శ్రేష్ఠః, సత్యానాం చత్వారి పదాని ।*
*విరాగః శ్రేష్ఠో ధర్మాణాం, ద్విపదానాం చ చక్షుష్మాన్ ॥ 1 ॥)*

మార్గములలో, అష్టాంగమార్గము శ్రేష్ఠము. సత్యములలో, చతురార్య సత్యములు శ్రేష్ఠము. ధర్మములలో, వైరాగ్యము –(నిర్వాణము) శ్రేష్ఠము. మనుష్యులలో (జ్ఞాన) నేత్రము గలవాడు (బుద్ధుడు) శ్రేష్ఠుడు. (చక్ఖుమా (చక్షుష్మాన్) సత్యమును దర్శించునేత్రము కలవాడు)
(చూడు : గాథ : 190 –పాదటీక)

274. ఏసో'వ మగ్గో నత్థ' ఞ్ఞో, దస్సనస్స విసుద్ధియా।
ఏతమ్హి తుమ్హే పటిపజ్జథ, మారస్సేతం పమోచనం[1] । 2 ।

*(ఏష ఏవ మార్గోనాఽన్యోఽస్త్యన్యో,*
*దర్శనస్య విశుద్ధయే ।*
*ఏతం హి యూయం ప్రతిపద్యధ్వం,*
*మారస్యైతత్ ప్రమోచనమ్ । 2 ।)*

ఇదియే మార్గము. దర్శన (జ్ఞాన) విశుద్ధికి మఱి అన్యమార్గము లేదు. ఓ భిక్షువులారా! మీరిందు ఆరూఢులు కండు. ఇది మారుని నుండి విముక్తిని కలిగించును.

275. ఏతమ్హి తుమ్హే పటిపన్నా, దుక్ఖస్సన్తం కరిస్సథ।
అక్ఖాతో వె మయా మగ్గో, అఞ్ఞాయ సల్లసన్థనం [2] । 3 ।

*(ఏతం హి యూయం ప్రతిపన్నా, దుఃఖస్యాఽన్తం కరిష్యథ ।*
*ఆఖ్యాతో వై మయామార్గ, ఆజ్ఞాయ శల్యసంస్థానమ్ । 3 ।)*

ఈ మార్గమున ప్రవేశించి, మీరు మీ దుఃఖమును వినాశమొనరింపగలరు. దుఃఖ వినాశము(శల్యసంస్థానము) నెఱిగిన నాచే నీ మార్గముపదేశింపబడినది. (శల్యము - సహింపరాని దుఃఖము; సంస్థానమ్ - వినాశము - మృత్యువు. శల్య సంస్థానము - దుఃఖవినాశము).

276. తుమ్హేహి కిచ్చ మాతప్పం, అక్ఖాతారో తథాగతా।
పటిపన్నా పమోక్ఖన్తి, ఝాయినో మారబంధనా । 4 ।

*(యుష్మాభిః కార్యమాతప్య మాఖ్యాతారస్తథాగతాః ।*
*ప్రతిపన్నాః ప్రమోక్ష్యన్తే, ధ్యాయినో మారబన్ధనాత్ । 4 ।)*

---

(1) ప్రమోహనం - (సం) ప్రమోహనం - (పాఠాంతరము) - ఈ మార్గము మారునికి సమ్మోహము (మూర్ఛను) కలిగించును.

(2) సల్లసన్థనం (శల్యసంస్థానమ్). శల్యము - బాణము. దుఃఖశల్యము. లలిత విస్తరము 'మహాశల్యహర్త' యని బుద్ధుని వర్ణించును.

మీరు (సిద్ధి కొఱకు) ప్రయత్న మొనరింపవలయును. తథాగతులు కేవలము బోధకులు. ఈ మార్గమున నారూఢులై ధ్యానరతులగువారు, మార (పాపమృత్యువుల) బంధముల నుండి విముక్తులగుదురు.

**సావత్థి (జేతవనము)** **ఐదు వందల మంది భిక్షువులు**

**277. సబ్బే సఙ్ఖారా అనిచ్చా'తి యదా పఞ్ఞాయ పస్సతి ।**
**అథ నిబ్బిన్దతీ[1] దుక్ఖే, ఏ స మగ్గో విసుద్ధియా । 5 ।**

*(సర్వే సంస్కారా అనిత్యా, ఇతి యదా ప్రజ్ఞయా పశ్యతి ।*
*అథ నిర్విన్దతి దుఃఖాని, ఏష మార్గో విశుద్ధయే । 5 ।)*

సర్వ సంస్కారములు (సంఘాతరూపమగు సృష్టి యంతయు) అనిత్యమని ప్రజ్ఞచే దర్శించినపుడు, మానవుడు దుఃఖము నుండి నివృత్తిని బొందును. ఇదియే విశుద్ధి మార్గము.

(సృష్టియంతయు గతించిపోవునదే. ఇది దుఃఖరూపము, అనిత్యము, అసత్యము. కాన, ఛాయలను వెంటాడుట మాని విశుద్ధి మార్గముననుసరింప వలెననుటయే బుద్ధుని ఉపదేశము.)

**278. సబ్బే సఙ్ఖారా దుక్ఖా'తి, యదా పఞ్ఞాయ పస్సతి ।**
**అథ నిబ్బిన్దతీ దుక్ఖే, ఏస మగ్గో విసుద్ధియా । 6 ।**

*(సబ్బే సంస్కారా దుఃఖా ఇతి, యదా ప్రజ్ఞయా పశ్యతి ।*
*అథ నిర్విన్దతి దుఃఖాని, ఏష మార్గో విశుద్ధయే । 6 ।)*

సర్వ సంస్కారములు (సంఘాతరూపమగు సృష్టి యంతయు) దుఃఖమని ప్రజ్ఞచే దర్శించినపుడు, మానవుడు దుఃఖము నుండి నివృత్తిని బొందును. ఇదియే విశుద్ధి మార్గము.

---

(1) నిబ్బిన్దతి – పాఠాంతరము

**279. సబ్బే ధమ్మా అనత్తా*'తి, యదా పఞ్ఞాయ పస్సతి ।**
**అథ నిబ్బిన్దతి దుక్ఖే, ఏస మగ్గో విసుద్ధియా । 7 ।**

*(సర్వే ధర్మా అనాత్మాన ఇతి, యదా ప్రజ్ఞయా పశ్యతి ।*
*అథ నిర్విన్దతి దుఃఖాని, ఏష మార్గో విశుద్ధయే । 7 ।)*

సర్వధర్మములు (సంఘాత పదార్థ జాతమంతయు) అనాత్మకములని ప్రజ్ఞచే - (వివేకముచే) దర్శించినపుడు మానవుడు దుఃఖము నుండి నివృత్తిని బొందును. ఇదియే విశుద్ధిమార్గము.

---

* అనత్తా :- నిత్యమైన ఆత్మలేనివి; అనాత్మకములు. వస్తు జాతమంతయు అనిత్యము; అనాత్మకము. కావున, దుఃఖము. హేతుప్రభవములగుటచే సంఘాతవస్తుజాతమంతయు అనిత్యము. సంఘాత వస్తువులు సంస్కృత (నిర్మిత) లక్షణాత్మకములు. ఉత్పాదము (Origin) వ్యయము (Cessation) స్థిత్యన్యథాత్వము (Change of state) ఈ మూడును, సంఘాతవస్తులక్షణములని బౌద్ధ శాస్త్రములు చెప్పును. బ్రహ్మసూత్రముల ననుసరించి 'సద్ అకారణవాన్ నిత్యమ్' - కారణ రహితమగు సత్పదార్థమే నిత్యము ఆర్యదేవుడిట్లు వ్యాఖ్యానించును :- కారణ రహిత వస్తువేదియునెప్పుడు నెక్కడను లేదు సోపాధికవిశ్వమున నిత్యవస్తువు లేదు.

**"అప్రతీత్యోత్పన్నో నాఽస్తి, కదాచిత్ కశ్చిత్ క్వచిత్ ।**
**న కదాచిత్ క్వచిత్ కశ్చిత్, విద్యతే తేన శాశ్వతః ।"** (చతుశ్శతకము IX-2)

వికృతి బొందు వస్తువులు శాశ్వతములుకావు. హేతు ప్రభవములైన ధర్మములు (పదార్థములు) అన్నియు, నిరోధ (వినాశ) ధర్మములే. ఉత్పత్తి స్థితి నాశములు, మాయా స్వప్న గంధర్వ నగర తుల్యములని అర్వాచీన బౌద్ధుల వాదము.

**"యథా మాయా యథా స్వప్నో, గంధర్వనగరం యథా ।**
**తథోత్పాదస్తథా స్థానం, తథా భంగ ఉదాహృతః ।"** (మాధ్యమికకారిక VII-34)

దేశకాలబద్ధమైన జీవితము నిర్విరామ పరివర్తనాత్మకము. నిరంతర పరివర్తన శీలమైనది సద్రూపము కాజాలదు. ధమ్మా (ధర్మాః) = పంచస్కంధములు -సజీవదేహము వీనిచే నిర్మితము. వ్యక్తి పొందు అవస్థాపరంపరలన్నియు నిత్య సత్తా రహితములు. జీవితము నిరంతర పరివర్తనాత్మకము; నిలకడ లేనిది. హేతు ప్రభవములైన పంచస్కంధముల -సంఘాతముల - స్వభావమెఱిగిన వారు తమ వ్యక్తిత్వము (Individuality) నిత్యమని భావింపరు. నిర్వాణము, వ్యష్టి అహంకార మమకార రహితము. నిత్యము , సుఖరూపము.

సావత్థి (జేతవనము) తిస్సుడు (థేరుడు)

280. ఉట్ఠానకాలమ్హి, అనుట్ఠహానో,
యువా బలీ ఆలసియం ఉపేతో ।
సంసన్న[1]సఙ్కప్పమనో కుసీతో,
పఞ్ఞాయ మగ్గం అలసో న విన్దతి । 8 ।

(ఉత్థానకాలేఽ నుత్తిష్ఠన్,
యువా బలీ ఆలస్యముపేతః ।
సంసన్నసంకల్పమనాః కుసీదః,
ప్రజ్ఞాయా మార్గ మలసో న విన్దతి । 8 ॥)

ఉత్థాన సమయమున (ప్రయత్నకాలమున) ఉత్థాన (ప్రయత్న) మొనరింపనివాడు, యువకుడు, బలశాలియునై యుండియు, ఆలస్యము చేయువాడు, దుర్బల సంకల్ప చిత్తుడునైన దీర్ఘసూత్రుడు, అలసుడు, ప్రజ్ఞా మార్గమును పొందజాలడు.

రాజగృహము (వేళువనము) సూకరపేతుడు

281. వాచానురక్ఖీ మనసా సుసంవుతో,
కాయేన చ అకుసలం న కయిరా[2] ।
ఏతే తయో కమ్మపథే విసోధయే,
ఆరాధయే మగ్గం ఇసిప్పవేదితం । 9 ।*

(వాచానురక్షీ, మనసా సుసంవృతః,
కాయేన చాఽకుశలం నకుర్యాత్ ।
ఏతాన్ త్రీన్ కర్మపథాన్ విశోధయేత్,
ఆరాధయేన్మార్గమృషి ప్రవేదితమ్ । 9 ।)

(1) అసమ్పన్న - పాఠాంతరము.

(2) నాకుసలం - బ్రహ్మదేశీయ పాఠాంతరము.

* పోల్చు :- గీత XVII - 14, 15, 16 శారీర, వాఙ్మయ, మానస తపస్సులు

వాఙ్నియమము, మనస్సంయమము గల్గినవాడై, శరీరముచే పాపమాచరింపకూడదు. ఈ మూడుకర్మపథములను (వాక్కు, మనస్సు, శరీరములను) మొదట పరిశుద్ధ మొనరించుకొనవలెను. తరువాత, ఋషి (బుద్ధ) ప్రోక్తమైన మార్గమును సేవింపవలయును.

**సావత్థి (జేతవనము)** **పోఠిలుడు (థేరుడు)**

**282. యోగా* వె జాయతీ భూరి, అయోగా భూరిసఙ్ఖయో ।**
**ఏతం ద్వేధాపథం ఞత్వా, భవాయ విభవాయ చ ।**
**తథత్తానం నివేసెయ్య, యథాభూరి పవడ్ఢతి ॥ 10 ॥**

*(యోగాద్వై జాయతే భూరి, అయోగాద్భూరి సంక్షయః ।*
*ఏతం ద్వేధాపథం జ్ఞాత్వా, భవాయ విభవాయ చ ।*
*తథాఽఽత్మానం నివేశయేద్, యథా భూరి ప్రవర్ధతే ॥ 10 ॥)*

యోగా (ధ్యానా) నుష్ఠానము వలన జ్ఞానముత్పన్నమగును. యోగానుష్ఠానము లేమిచే జ్ఞానక్షయము గల్గును. లాభక్షయ రూపమగు నీ ద్వివిధమార్గము నెఱిగి, జ్ఞానము ప్రవృద్ధమగు పథమున తన్ను తాను నియోగించుకొనవలెను. (భూరి = జ్ఞానము, ఆనంత్యము).

**సావత్థి (జేతవనము)** **సంబహుల భిక్ఖూ (అనేక భిక్షువులు)**

**283. "వనం[1] ఛిన్దథ మా రుక్ఖం, వనతో జాయతీ భయం ।**
**ఛెత్వా వనఞ్చ వనథఞ్చ, నిబ్బనా హోథ భిక్ఖవో" ॥ 11 ॥**

---

(1) **వనం** :- 'వన' శబ్దమునకు అరణ్యము, కామము, అను అర్థములున్నవి. కాన, శ్లేషార్థమును గ్రహింపవలెను. వనసంబంధము వానము. నిర్ + వానము = నిర్వాణము. అరణ్యము భయంకరము. ఇది, క్రూర మృగములకు, ఘాతకులగు దస్యులకు ఆలవాలము. కాన, కామాదిచిత్త వికారరూపమైన అరణ్యమును ఛేదింపవలయునని కూడ వివరింపవచ్చును.

* యోగము : **'దానం స్వధర్మోనియమో యమశ్చ,**
**శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని ।**
**సర్వే మనో నిగ్రహ లక్షణాంతాః,**
**పరో హి యోగః మనసః సమాధిః ।'** (భాగ. XI 23-46)

మనస్సమాధి -ధ్యానము, చిత్తైకాగ్ర్యము - పరమమైన యోగము.

*(వనం ఛిన్ది మా వృక్షం, వనతో జాయతే భయమ్ ।*
*ఛిత్వా వనఞ్చ, వనథఞ్చ, నిర్వాణా భవత భిక్షవః ॥ 11 ॥)*

వనమును (విషయవాసనలను, కామమును) నఱికివేయుము. కేవలమొక వృక్షమును మాత్రమే నఱుకుట వలదు. వనము వలన భయ ముత్పన్నమగును. వనమును, గుల్మము (కామము, వాసనా సమూహము) రెంటిని సమూలముగ ఛేదించి, ఓ భిక్షువులారా! మీరు వనరహితులు (కామవాసనావిముక్తులు) కండు. నిర్వాణమును పొందుడు. (నిర్వాణమనగా - నిర్ + వానము - కామవాసనావిముక్తి)

**284. యావం హి వనథో న ఛిజ్జతి, అణుమత్తోపి నరస్స నారిసు ।**
**పటిబద్ధమనో వ తావసో, వచ్ఛో ఖీరపకోవ మాతరి ॥ 12 ॥**

*(యావద్ధి వనథో న ఛిద్యతే, అణుమాత్రోఽపి నరస్య నారిషు ।*
*ప్రతిబద్ధమనాః వై తావత్, స వత్సః క్షీరపక ఇవ మాతరి ॥ 12 ॥)*

ఎంత వఱకు పురుషునకు స్త్రీల యందు వనథము - కామవాసనా రూపమైన గుల్మము (పొదరులు) అణుమాత్రమైన ఛేదింపబడక, అఖండితమై యుండునో, అంత వఱకు పాలుద్రావు దూడ, తల్లి యావు నందు బద్ధమైయుండునట్లు అతని మనస్సు భవమునకు ప్రతిబద్ధమై యుండును. (1)

---

**'జ్ఞానస్యోపనిషచ్చైవ, సమాధిరుపధార్యతామ్ ।'** జ్ఞానమునకాధారము ధ్యానము (సౌందరనందము 13-23)

(1) పోల్చు :- **'పుంసః స్త్రియా మిథునీ భావ మేవం,**
**తయోర్మిథో హృదయగ్రన్థిమాహుః ।**
**అతో గృహక్షేత్ర సుతాప్త విత్తై,**
**జనస్య మోహోఽయమహం మమేతి ।'** (భాగ. V-5.8)

పురుషునకు స్త్రీతో మిథునీ భావము, వారిరువురికి **'హృదయగ్రంథి'** యని మహాత్ములందురు. ఈ గ్రంథి వలన, గృహ, క్షేత్ర, సుత, ఆప్త, విత్తాదులందు, జనులకు అహంకార మమకారరూపమగు మోహ ముదయించి భవము నిరవధికముగ కొనసాగునని భావము.

**సావత్థి (జేతవనము)** **సువణ్ణకారుదు (థేరుడు)**

**285. ఉచ్ఛిన్ద! సినేహమత్తనో, <u>కుముదం సారదికం వ పాణినా</u> I**
**సన్తి మగ్గమేవ బ్రూహయ, నిబ్బానం సుగతేన[1] దేసితం I 13 I**

*(ఉచ్ఛిన్ధి! స్నేహమాత్మనః, <u>కుముదం శారదికమివ పాణినా</u> I*
*శాన్తి మార్గమేవ బృంహయ, నిర్వాణం సుగతేన దేశితమ్ I 13 I)*

శరత్కాల కుముదము (కలువపూవు)ను చేతితో త్రుంచి వేసినట్లు స్వాత్మ ప్రేమను (తృష్ణను) త్రుంచివేయుము. బుద్ధోపదిష్టమైన నిర్వాణమును, శాంతి మార్గము నాశ్రయింపుము; పాలింపుము. నిర్వాణము సుగతుని (బుద్ధుని)చే నుపదేశింపబడినది.

**సావత్థి (జేతవనము)** మహాధనవాణిజుడు

**286. "ఇధ వస్సం వసిస్సామి, ఇధ హేమన్తగిమ్హిసు" I**
**ఇతి బాలో విచిన్తేతి, అన్తరాయం[2]న బుజ్ఝతి I 4 II**

*("ఇహ వర్షాసు వసిష్యామి, ఇహ హేమన్త గ్రీష్మయోః" I*
*ఇతి బాలో విచిన్తయతి, అన్తరాయంన బుధ్యతే I 14 II)*

---

(1) సుగతుడు :- ఆనందస్థితిని పొందినవాడు; ఆనందమయుడు బుద్ధుడు.
**'శోభనం గతం జ్ఞానమస్య ఇతి సుగతః' I 'సర్వజ్ఞ సుగతో బుద్ధః' I** చూడు : ధమ్మపదం - 419 గాథ.
(2) **అంతరాయములు** - విఘ్నములు (Dangers of Life)

**'వ్యాధి, స్త్యాన, సంశయ, ప్రమాదాలస్యాఽవిరతి భ్రాన్తి దర్శనాఽలబ్ధ భూమి కత్వాఽనవస్థితత్వాని చిత్త విక్షేపాస్తేఽ న్తరాయాః' I** (యోగదర్శనము I-30)

జ్వరాదివ్యాధులు, అకర్మణ్యత, సంశయము, ప్రమాదము, ఆలస్యము, విషయాసక్తి, భ్రాంతి దర్శనము, అలబ్ధభూమికత్వము (అస్థిరత) అనవస్థితత్వము అను ఈ తొమ్మిదియు చిత్త చాంచల్య కారణములు - ఇవియే అంతరాయములు -జీవితమున నెదురగు విఘ్నములు obstacles. 'జీవితమన్నది మృత్యు ప్రాప్తికి కఠోర పురోగతి. మన ఆశావల్లరికి ఆలంబనమగు భవిష్యత్తు గతము వలెనే మననుండి అపహరింపబడుచున్నది. అధికుడు, అల్పుడు అను భేదము లేకుండ, జీవితమార్గాంతమున మృత్యు వందటిని గ్రసించుచున్నది. (రాధాకృష్ణ పండితుడు)

"ఇచ్చట వర్షఋతువులందు నివసింతును. ఇచ్చట హేమంత గ్రీష్మములందు వసింతును" - అని మూర్ఖుడు తలపోయును; అంతరాయము (మృత్యువు) నెఱుగడు.

సావత్థి (జేతవనము) కిసాగోతమి

287. తం పుత్తపసుసమ్మత్తం, వ్యాసత్తమనసం నరం ।
సుత్తం గామం మహోఘోవ, మచ్చు ఆదాయ గచ్ఛతి ॥ 15 ॥

*(తం పుత్ర-పశు-సమ్మత్తం, వ్యాసక్తమనసం నరమ్ ।*
*సుప్తం గ్రామం మహౌఘఇవ, మృత్యురాదాయ గచ్ఛతి ॥ 15 ॥)*

నిద్రించుచున్న గ్రామమును, మహాజలప్రవాహమూడ్చుకొని పోవునట్లు, పుత్రులందు పశు సంపద యందు వ్యాసక్తితో మదమత్తుడై యున్న మనుష్యుని, మృత్యువు గ్రహించి, కొనిపోవును.

సావత్థి (జేతవనము) పటాచార (థేరి)

288. న సన్తి పుత్తా తాణాయ, న పితా నాపి బన్ధవా ।
అన్తకేనా ధిపన్నస్స, నత్థి ఞాతీసు[1] తాణతా ॥ 16 ॥

*(న సన్తి పుత్రా స్త్రాణాయ, న పితానాఽపి బాన్ధవా ।*
*అన్తకేనాఽధిపన్నస్య, నాఽస్తి జ్ఞాతిషు త్రాణతా ॥ 16 ॥)*

పుత్రులు గాని, తండ్రికాని, బంధువులు గాని, తన్ను రక్షించుట కుండరు. మృత్యుగ్రస్తుడగు వానికి, స్వజనుల యందు రక్షణ సిద్ధింపదు.

289. ఏత మత్థవసం ఞత్వా, పణ్డితో సీలసంవుతో ।
నిబ్బానగమనం మగ్గం, ఖిప్పమేవ విసోధయే ॥ 17 ॥

*(ఏత మర్థవశం జ్ఞాత్వా, పణ్డితః శీలసంవృతః ।*
*నిర్వాణగమనం మార్గం, క్షిప్రమేవ విశోధయేత్ ॥ 17 ॥)*

---

(1) ఞాతిసు – సింహళీయ పాఠాంతరము.

ఈ సత్యము నెఱిగి శీల సంయమవంతుడగు పండితుడు (వివేకశాలి) శీఘ్రముగ నిర్వాణ ప్రాపకమగు మార్గమును నిష్కంటక మొనరించుకొనవలెను. (బాహ్య సంబంధము లేవియు ఆధారపడదగినవి, భద్రమైనవి, కావు, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము నందే నిజమైన భద్రత నాకాంక్షింపవలయును. నూతన జీవితము నిర్మించుకొనవలెను. దుస్తరములైన కష్టములపుడు తమంత తామే విడిపోవును. దీప్త్యానందములలో జీవింపగల్గినపుడు అంధకారదుఃఖముల నెవడాశ్రయించును?

20 మగ్గవగ్గో నమత్తో

మార్గవర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## పకిణ్ణకవగ్గో ఏకవీసతిమో

## (ప్రకీర్ణకవర్గ ఏకవింశః)

## 21 ప్రకీర్ణకవర్గము – ఏకవింశాధ్యాయము

రాజగృహము (వేళువనము) (విషయము) అత్తనోపుబ్బకమ్మ.

290. మత్తాసుఖపరిచ్చాగా, పస్సే చే విపులం సుఖం ।
చజే మత్తాసుఖం ధీరో, సమ్పస్సం విపులం సుఖం* ॥ 1 ॥

(మాత్రాసుఖపరిత్యాగాత్, పశ్యేత్ చేద్విపులం సుఖమ్ ।
త్యజేన్మాత్రాసుఖం ధీరః, సంపశ్యన్ విపులం సుఖమ్ ॥ 1 ॥

అల్పసుఖ పరిత్యాగము వలన, విపుల (విస్తార) సుఖమును గాంచుచో,

---

* పోల్చు :- 'యోవై భూమా తత్సుఖం, నాఽల్పే సుఖమస్తి; భూమైవ సుఖమ్ ।
(ఛాం.ఉ. VII-23-1)

అనంతమైనదేసుఖము. అల్పమున సుఖము లేదు. అని సనత్కుమారుడు దేవర్షి నారదునకుపదేశించెను.

**మత్త (మాత్రా) – 'మాత్రా – త్రుటిః, లవ, లేశ, కణా, ఉణవః', 'మాత్రా... అల్పేచ పరిణామే చ కొంచమైనది; అల్పము.** (అమరకోశము. III-62,333.)

ధీశాలియగు మనుజుడు విపుల సుఖమును గాంచి, అల్ప సుఖమును త్యజింపవలెను.

**సావత్థి (జేతవనము)** **కుక్కుట అణ్డఖాదికుడు (ఒకానొక వ్యక్తి)**

291. **పరదుక్ఖూపధానేన[1], అత్తనో[2] సుఖమిచ్ఛతి ।**
**వేరసంసగ్గసంసట్ఠో, వేరా సో న పముచ్చతి । 2 ।**

*(పరదుఃఖోపదానేన, ఆత్మనః సుఖమిచ్ఛతి ।*
*వైరసంసర్గసంసక్తః[3], వైరాత్ స న ప్రముచ్యతే । 2 ।)*

పరులకు దుఃఖము గల్గించుట ద్వారా, తన సుఖము గోరువాడు, వైర సంబంధము వలన, ఆ వైరము నుండి విముక్తినందజాలడు.

**బద్దియనగరము (జాతీయావనము)** **బద్దియ భిక్షువులు**

292. **యం హి కిచ్చం అపవిద్ధం, అకిచ్చం పన కయిరతి[4] ।**
**ఉన్నళానం పమత్తానం, తేసం వడ్ఢన్తి ఆసవా । 3 ।**

*(యద్ధి కృత్య మపవిద్ధం, అకృత్యం పునః కరోతి[5] ।*
*ఉన్మలానాం ప్రమత్తానాం, తేషాం వర్ధన్తే ఆస్రవాః ॥ 3 ।)*

కర్తవ్యము విసర్జించి, అకర్తవ్యము మరల నాచరించు కలుషాత్ములు, (గర్వితులు) ప్రమత్తులునైన వారికి, ఆస్రవములు (చిత్త మాలిన్యములు) వృద్ధి చెందును.

---

(1) పరదుక్ఖూపదానేన - పాఠాంతరము.
(2) యో అత్తానం సుఖ మిచ్ఛతి - పాఠాంతరము.
(3) సంసృష్టః -పాఠాంతరము.
(4) కరీయతి - పాఠాంతరము.
(5) కుర్యుః -రాహుల సాంకృత్యాయనుని సంస్కృత పాఠము.

293\. **యేసం చ సుసమారద్ధా, నిచ్చం కాయగతా సతి ।**
**అకిచ్చం తే న సేవన్తి, కిచ్చే సాతచ్చకారినో ।**
**సతానం సమ్పజానానం, అత్థం గచ్ఛన్తి ఆసవా । 4 ।**

*(ఏషాఞ్చ సుసమారబ్ధా, నిత్యం కాయగతా స్మృతిః ।*
*అకృత్యం తే న సేవన్తే, కృత్యే సాతత్యకారిణః ।*
*సతాం[1] సంప్రజానానాం, అస్తం గచ్ఛన్త్యాస్రవాః । 4 ।)*

కాని, శరీర స్వభావమును (మాలిన్య క్షణభంగురత్వ ధర్మములను) గూర్చిన స్మృతి నిరంతర మెవరికుండునో వారు, అకృత్యముల నాచరింపరు. అట్టి స్మృతిమంతులగు సత్పురుషులకు – ఆస్రవములు నశించును. (కాయగతానుస్మృతి :- శరీర స్వభావమును గుఱించిన అనుస్మృతి (Meditation on the nature of the body) ముప్పది రెండు (32) శరీరభాగముల ధ్యానించుటే 'కాయగతానుస్మృతి'. దీని వలన శరీరము యొక్క అశుభస్వభావము బోధపడును. (1) శరీరరోమములు, (2) కేశములు, (3) గోర్లు, (4) దంతములు, (5) చర్మము, (6) మాంసము, (7) స్నాయువులు, (8) ఎముకలు, (9) మజ్జ, (10) మూత్రము కలుగజేయు మాంసగ్రంథి (Kidney), (11) గుండె, (12) కాలేయము (Liver), (13) నడిమిస్థానము (diaphragm), (14) ప్లీహము (Spleen), (15) ఊపిరితిత్తులు, (16) ప్రేవులు (Intestines), (17) పొత్తి కడుపులోని ప్రేవులు (Bowels), (18) కడుపు, (19) మలము, (20) పైత్యరసము, (21) కఫము, (22) చీము, (23) రక్తము, (24) చెమట, (25) క్రొవ్వు, (26) కన్నీరు, (27) చర్మముపైని మెఱుగు, (28) ఉమ్మి, (29) చీమిడి, (30) కీళ్లలోని చమురు, (31) మూత్రము, (32) మెదడు. ఇవియే శరీరమందలి 32 అంశములు. వీని ధ్యానించుట వలన, శరీరగత జాగుప్స, సంఘాతస్వభావము నెఱిగి, మనుజుడు శరీర వ్యామోహము నుండి, కామము నుండి మనస్సునకు విముక్తిని కల్గించుకొనగలడు.)

(1) స్మరతాం – సంస్కృత పాఠాంతరము.

**సావత్థి (జేతవనము) లకుణ్టక భద్దియ (థేరుడు)**

**294. మాతరం పితరం హన్త్వా, రాజానో ద్వే చ ఖత్తియే ।***
**రట్ఠం సానుచరం హన్త్వా, అనీఘో యాతి బ్రాహ్మణో ॥ 5 ॥**

*(మాతరం పితరం హత్వా, రాజానౌ ద్వౌ చ క్షత్రియౌ ।*
*రాష్ట్రం సానుచరం హత్వా, ఽనఘో యాతి బ్రాహ్మణః ॥ 5 ॥)*

తల్లిదండ్రులను, ఇద్దరు క్షత్రియ రాజులను, ప్రజాసహితమగు రాష్ట్రమును హతమొనర్చి బ్రాహ్మణుడు పాపరహితుడగును.

**295. మాతరం పితరం హన్త్వా, రాజానో ద్వేచ సోత్థియే ।**
**వెయ్యగ్ఘపఞ్చమం, హన్త్వా, అనీఘో యాతి బ్రాహ్మణః ॥ 6 ॥**

*(మాతరం పితరం హత్వా, రాజానౌ ద్వౌచ శ్రోత్రియౌ ।*
*వ్యాఘ్ర ఞ్చ పఞ్చమం[1] హత్వా, ఽనఘోయాతి బ్రాహ్మణః ॥ 6 ॥)*

---

* ఈ గాథను శబ్దార్థమున కాక, లాక్షణికార్థమున గ్రహింపవలెను. వ్యాఖ్యాతలిట్లు వివరించినారు.

మాత - తృష్ణ (తణ్హా)

పిత - అహంకారము (అస్మిమాన)

ఇద్దరు క్షత్రియరాజులు - శాశ్వతవాదము, (సస్సతదిట్ఠి), ఉచ్ఛేదవాదము.(ఉచ్ఛేదదిట్ఠి).

అనుచరులు - రాగాదులు

రాష్ట్రము - సంసారమున కుపాదానములైన పంచస్కంధములు - (రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానములు).

వీనిని హతమొనర్చి, బ్రాహ్మణుడు (జ్ఞాని) నిష్పాపుడగును; నిర్వాణమును ప్రాపించును. బ్రాహ్మణ శబ్దమిందు జ్ఞాని పరముగ ప్రయుక్తమగుట గమనార్హము. బ్రాహ్మణుడు = అర్హంతుడు.

(1) పంచవ్యాఘ్రములు : (1) కామము, (2) వ్యాపాదము (క్రోధము) (3) అలసత్వము, (4) అశాంతి, (5) విచికిత్స. ఐదవది యగు విచికిత్స (సంశయము) జ్ఞానమున కవరోధములైన వానిలో చాల విపత్కరమైనది.

వ్యాఘ్ర పఞ్చమమ్ - పాఠాంతరము.

బీల్ మహాశయుడు (Mr. Beal, Samuel - Beal) లంకావతార సూత్రము నుండి బుద్ధుడుచ్చరించిన గాథ నుదాహరించును. మహామతితో బుద్ధుడిట్లనును.

'తృష్ణయే తల్లి అవిద్యయే తండ్రి.

సంబోధియే బుద్ధుడు.

మాతాపితరులను, ఇద్దరు శ్రోత్రియరాజులను పంచమ వ్యాఘ్రమును (వ్యాఘ్రములలో నైదవ దానిని) హతమార్చి బ్రాహ్మణుడు పాపరహితు డగును.

**రాజగృహము (వేళువనము)** **దారుసాటికపుత్తుడు**

**296. సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ, నిచ్చం బుద్ధగతాసతి । 7 ।**

*(సుప్రబుద్ధం(1) ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషాం దివా చ రాత్రౌచ, నిత్యం బుద్ధగతా స్మృతిః ॥ 7 ।)*

దివారాత్రములు నిత్యము, **బుద్ధగతస్మృతి – (బుద్ధగుణానుస్మరణము)** గల గౌతమ (బుద్ధ) శిష్యులు, జ్ఞానోద్దీపితచిత్తులై సర్వదా జాగరూకులై యుందురు. (వారిని నిద్రాలస్య ప్రమాద లక్షణమగు తమోగుణము ఆవరింపదు).

**297. సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ, నిచ్చం ధమ్మగతాసతి । 8 ।**

---

సకల క్లేశములు రహితులు.

పంచస్కంధములు, పురోహితులు.

ఈ ఐదుగురిని చంపుట క్షమింపరాని పంచమహాపాతకములు. అయినను వాచ్యార్థమును గాక, లక్షణార్థమునిందు గ్రహించుట వలన హంతకు, పుణ్యప్రాప్తియే కాని, నరక బాధ లేదు.

బుద్ధుడు, బ్రాహ్మణుల కొసగిన పవిత్రత, గౌరవము, నీ గాథ వెల్లడించుచున్నది. 'బ్రాహ్మణ' శబ్దమును 'అర్హత్' శబ్దముతో సమానముగ బుద్ధుడిందు ప్రయోగించినాడు.

చూడు :- బ్రాహ్మణ వర్గము (26వ అధ్యాయము)

(1) సుప్రబుద్ధా – సంస్కృత పాఠాంతరము.

పోల్చు :- **'యత్రాఽఽసక్తి ర్మనస్తత్ర, తదాకారేణ తిష్ఠతి ।**
**స ఏష మనసో ధర్మః, స్వాఽమసాత్మనా స్థితిః ।'** (శంకరుడు)

మనమే వస్తువులను ప్రీతి పూర్వకముగ ధ్యానింతుమో మన మనస్సు ఆ వస్తువుయొక్క ఆకారము నొంది నిలుచును. ఇది మనస్సు యొక్క స్వభావము.

*(సుప్రబుద్ధం ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషాం దివా చ రాత్రౌ చ, నిత్యం ధర్మగతా స్మృతిః । 8 ।)*

దివారాత్రములు నిత్యము **ధర్మగతస్మృతి** (ధర్మగుణానుస్మరణము) గల గౌతమ (బుద్ధ) శిష్యులు జ్ఞానోద్దీపితచిత్తులై నిరంతర జాగరూకులై యుందురు.

**298. సుప్పబుద్ధం, పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ, నిచ్చం సంఘగతాసతి । 9 ।**

*(సుప్రబుద్ధం ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషా దివా చ రాత్రౌ చ, నిత్యం సంఘగతా స్మృతిః । 9 ।)*

దివారాత్రములు నిత్యము **సంఘగతస్మృతి** (సంఘగుణానుస్మరణము) గల గౌతమ (బుద్ధ) శిష్యులు జ్ఞానోద్దీపితచిత్తులై నిరంతర జాగరూకులై యుందురు.

**299. సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ, నిచ్చం కాయగతా సతి । 10 ।**

*(సుప్రబుద్ధం ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషాం దివా చ రాత్రౌ చ, నిత్యం కాయగతా స్మృతిః । 10 । )*

దివారాత్రములు నిత్యము **కాయగతస్మృతి** గల (కాయగుణానుస్మరణముగల) గౌతమ (బుద్ధ) శిష్యులు, జ్ఞానోద్దీపితచిత్తులై నిరంతర జాగరూకులై యుందురు.

**300. సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ, అహింసాయ రతో మనో । 11 ।**

*(సుప్రబుద్ధం ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషాం దివా చ రాత్రౌచ, అహింసాయాం రతం మనః । 11 ।)*

దివారాత్రములు నిత్యము, అహింసాసక్తమగు (అహింసయందానందించు) మనస్సు గల గౌతమ (బుద్ధ) శిష్యులు జ్ఞానోద్దీపితచిత్తులై. నిరంతర జాగరూకులై యుందురు.

301. **సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమసావకా ।**
**యేసం దివా చ రత్తో చ భావనాయ రతో మనో । 12 ।**

*(సుప్రబుద్ధం ప్రబుధ్యన్తే, సదా గౌతమశ్రావకాః ।*
*యేషాం దివా చ రాత్రౌ చ, భావనాయాం రతం మనః । 12 ।)*

దివారాత్రములు నిత్యము; భావన యందు (మైత్రీ ధ్యానము నందు) ఆనందించు మనస్సు గల గౌతమ (బుద్ధ) శిష్యులు జ్ఞానోద్దీపితచిత్తులై నిరంతర జాగరూకులై యుందురు.

**వేసాలి (మహావనము)** **వజ్జిపుత్తకుడు (భిక్షువు)**

302. **దుప్పబ్బజ్జం దురభిరమం, దురావాసా ఘరాదుఖా ।**
**దుక్ఖో అసమానసంవాసో, దుక్ఖానుపతితద్ధగూ ।**
**తస్మాన చద్ధగూ సియా, న చ దుక్ఖానుపతితో సియా । 13 ।**

*(దుష్ప్రవ్రజ్యం దురభిరామం, దురావాసం గృహం దుఃఖమ్ ।*
*దుఃఖోఽ సమానసంవాసో, దుఃఖాఽనుపతితోఽధ్వగః ।*
*తస్మాన్నచాఽధ్వగఃస్యా, న్నచ దుఃఖానుపతితః స్యాత్ । 13 ।)*

అయోగ్యునికి ప్రవ్రజ్య (సంన్యాసము) దురభిరమము (దుఃఖమయము). ఆనందము అంద తనికి లభింపదు. నివాసార్హముగాని గృహము దుఃఖదము. సమానులుగాని వారితో సహవాసము దుఃఖదము. సంసారదీర్ఘపథమున పరిభ్రమించువాడు దుఃఖము పాలగును. కాన, ఎవడును సంసారపథమున అధ్వగుడు (దారి నడచువాడు) కాకుండుగాక! దుఃఖానుపతితుడును కాకుండుగాక!

**సావత్థి (జేతవనము)** **చిత్తగహపతి**

303. **సద్ధో సీలేన సమ్పన్నో, యసోభోగసమప్పితో ।**
**యం యం పదేసం భజతి, తత్థ తత్థేవ పూజితో ॥ 14 ॥**

*(శ్రద్ధా శీలేన సమ్పన్నో, యశోభోగసమర్పితః ।*
*యం యం ప్రదేశం భజతే, తత్ర తత్రైవ పూజితః ॥ 14 ॥)*

శ్రద్ధాశీల సంపన్నుడు, యశోభోగవంతుడునగు మనుజుడు, యేయే ప్రదేశములకు వెళ్లినను, అచ్చటంతటను పూజింపబడును. (దేశమేదైనను, సర్వత్ర అతడు పూజింపబడును).

**సావత్థి (జేతవనము)** **అనాథపిణ్డకుని పుత్రిక (సుభద్ర)**

304. **దూరే సన్తో పకాసేన్తి హిమవన్తో వ పబ్బతో ।**
**అసన్తేత్థ న దిస్సన్తి, రత్తిం ఖిత్తా యథా సరా ॥ 15 ॥**

*(దూరే సన్తః ప్రకాశన్తే, హిమవన్త ఇవ పర్వతాః ।*
*అసన్తోఽత్ర నదృశ్యన్తే, రాత్రిం క్షిప్తా యథాశరాః ॥ 15 ॥)*

సత్పురుషులు, హిమవత్పర్వతములట్లు దూరము నుండియు ప్రకాశింతురు. దుష్టులు, రాత్రియందు ప్రయోగించిన బాణములట్లు సమీపమున నుండియు కన్పింపరు.

**సావత్థి (జేతవనము)** **ఏకవిహారిథేరుడు**

305. **ఏకాసనం ఏకసేయ్యం, ఏకో చరమతన్దితో ।**
**ఏకో దమయమత్తానం, వనన్తే రమితో సియా ॥ 16 ॥**

*(ఏకాసన ఏకశయ్య, ఏకశ్చర న్నతన్ద్రితః ।*
*ఏకో దమయన్నాత్మానం, వనాన్తే రతః స్యాత్ ॥ 16 ॥)*

ఏకాకిగ (ఒంటరిగ) నాసీనుడగుచు ఏకాకిగ (ఒంటరిగ) శయనించుచు, చరించుచు, జాగరూకుడు (అలసత్వరహితుడు) ఆత్మ సంయమ

శాలియునగు మనుష్యుడు, వనాంతమున (కామరాహిత్యమున) నానందింపవలెను.
(వనము = (1) కామము; (2) అడవి, చూడుః గాథ 283)

[ఆకస్మికముగ సిద్ధించునవియే మహోన్నత ధ్యానభూమికలు. అవి అవశ్యముగ మనల నావహించును. అప్పుడు, ధ్యానమును, దృశ్యముల నతిక్రమించి సత్యమును దర్శించుటయు వినా, మనకు గత్యంతరముండదు. ఏకాంతవనవాస మపుడనవసరము. మనయం దేకొంచెమైనను తీవ్రసంవేగము దయించినపుడు, కాలము పరిపక్వమైనపుడు, ఈశ్వరకృప మనల నావరించినపుడు, అట్టి ధ్యానభూమికలు ప్రాప్తించును. సకలావస్థల యందును, అనంతుడు నిత్యుడునైన ఈశ్వరునితో ఏకాంతముగ నుండు విధానము మనము తెలిసి కొనవలయును. పరమేశ్వరుడు పరమసుహృత్తుగా, సకల జగద్వ్యవహారముల మధ్యమున విముక్తభావము నుండగల విధము మన మెఱుగవలయును. (శ్రీమాత - అరవిందాశ్రమము-ధమ్మపద వ్యాఖ్యలు) ]

*21 పకిణ్ణకవగ్గో సమత్తో*

*(ప్రకీర్ణక వర్గము సమాప్తము)*





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## నిరయవగ్గో వావీసతిమో

## (నిరయవర్గః ద్వావింశః)

## 22 నిరయవర్గము – ద్వావింశాధ్యాయము

సావత్థి (జేతవనము) సుందరి (పరివ్రాజిక)

306. అభూతవాదీ నిరయం ఉపేతి ।
యో చా'[1]పి కత్వా 'న కరోమీ'తి[2]చా'హ ।
ఉభో పితే పెచ్చ సమా భవన్తి'
నిహీనకమ్మా మనుజా పరత్థ ॥ 1 ॥

(అభూతవాదీ నిరయ ముపేతి ।
యోచాఽపి కృత్వా 'నకరోమీ'తిచాఽహ ।
ఉభావపి తౌ ప్రేత్య సమా భవన్తి ।
నిహీనకర్మాణః మనుజాః పరత్ర ॥ 1 ॥)

అసత్యవాది నరకమును పొందును. పాపము జేసి 'నేను చేయలేద'ని

(1) వాపి – పాఠాంతరము

(2) 'నకరోమి' – పాఠాంతరము

చెప్పువాడును నరకమును పొందును. మరణానంతరము, వారిరువురు, పాపకర్ములగు మనుజులు, పరలోకమున సమానులగుదురు.

**రాజగృహము (వేళువనము)** **దుచ్చరితఫలానుభవపీళితసత్త**
**(దుశ్చరితఫలానుభవ పీడితప్రాణి)**

**307. కాసావకణ్ఠా బహవో, పాపధమ్మా అసఞ్ఞతా ।**
**పాపా పాపేహి కమ్మేహి, నిరయంతే ఉపపజ్జరే । 2 ।**

*(కాషాయకణ్ఠా బహవః, పాపధర్మా అసంయతాః ।*
*పాపాః పాపైః కర్మభి ర్నిరయం తే ఉపపేదిరే ॥ 2 ।)*

కాషాయవస్త్రధారులలో చాలమంది పాపధర్ములు; ఆత్మ సంయమహీనులు. పాపాత్ములు తమ పాపకర్మములచే నరకము పొందుచున్నారు. (కాషాయకంఠా – కంఠము వఱకు కాషాయవస్త్రము కప్పుకొన్నవారు)

**వేసాలి (మహావనము)** **వగ్గుముదాతీరవాసి భిక్షువులు**

**308. సెయ్యో అయోగుళో భుత్తో, తత్తో అగ్గిసిఖూపమో ।**
**యఞ్చే భుఞ్జేయ్య, దుస్సీలో, రట్ఠపిణ్డం[1] అసఞ్ఞతో । 3 ।**

*(శ్రేయోఽ యోగులం భుక్తం, తప్తమగ్నిశిఖోపమమ్ ।*
*యచ్చేద్భుఞ్జీత దుశ్శీలో, రాష్ట్రపిణ్డ మసంయతః । 3 ।)*

దురాచారుడు, ఆత్మ సంయమహీనుడునై మనుజుడు, రాష్ట్ర మొసగు అన్నము దినుటకంటె, అగ్నిశిఖాసమానమగు తప్తలోహపిండమును దినుట మేలు.

---

(1) **రట్ఠపిణ్డం** (రాష్ట్రపిణ్డమ్) – దేశము, భిక్షువులకు చేయు అన్నప్రదానము, భిక్షువులు పవిత్ర జీవనులైనచో, వారి కొసగు అన్నము సాఫల్యమొందును. పవిత్ర జీవనులు కాని భిక్షువులు కేవలము నిందిత పరపిండ నిరతులు.

**సావత్థి (జేతవనము) ఖేముడు (అనాథపిణ్డికుని-భాగినేయుడు)**

**309. చత్తారి ఠానాని నరో పమత్తో,**
**ఆపజ్జతి పరదారూపసేవీ ।**
**అపుఞ్ఞలాభం న నికామసెయ్యం[1],**
**నిన్దం తతీయం నిరయం చతుత్థం । 4 ।**

(చత్వారి స్థానాని నరః ప్రమత్తః,
ఆపద్యతే పరదారోపసేవీ ।
అపుణ్యలాభం, న నికామశయ్యాం,
నిన్దాం తృతీయాం నిరయం-చతుర్థమ్ । 4।)

పరకాంతారతుడు, ప్రమత్తుడునైన మనుజుడు, అపుణ్యలాభము (పాపము) సుఖనిద్రలేమి, నింద, నరకము నను చతుర్విధ దుర్గతుల పొందుచున్నాడు. (తాను అభిలషించినట్లు కాక, తన ఇష్టమునకు వ్యతిరేకముగ స్వల్పకాలము మాత్రమే విశ్రాంతి లభించుట 'న నికామసెయ్యం' ('యథా ఇచ్ఛతి ఏవం సెయ్యం అలభిత్వా, అనిచ్ఛితం పరిట్టకం ఏవ కాలం సెయ్యం లభతి.' - భదన్త బుద్ధఘోషుడు)

**310. అపుఞ్ఞ లాభో చ గతీ చ పాపికా ।**
**భీతస్స భీతాయ రతీచ థోకికా ।**
**రాజా చ దణ్డం గరుకం పణేతి ।**
**తస్మా నరో పరదారం నసేవే । 5 ।**

(అపుణ్యలాభశ్చ గతిశ్చ పాపికా ।
భీతస్య భీతాయా రతిశ్చ స్తోకికా ।
రాజా చ దణ్డం గురుకం ప్రణయతి ।
తస్మాన్నరః పరదారాన్ న సేవేత । 5 ।)

---

(1) **న నికామసెయ్యం (న నికామశయ్యాం)** = భయగ్రస్త స్త్రీ పురుషుల - క్షణిక సుఖము - సుఖశయ్యలేమి, అని కూడ వివరింపవచ్చును.

అపుణ్యలాభము (పాపము), దుర్గతి, భయగ్రస్తపురుషునకు భయగ్రస్తయగు స్త్రీతో గల్గు అత్యల్పమగు రతి సుఖము, రాజు విధించు ఘోర దండనము - ఇవి ప్రాప్తించుట వలన నరునకు పరకాంతాగమనము తగదు.

**సావత్థి (జేతవనము)** **అఞ్ఞతర దుబ్బచభిక్ఖు-**
**(ఒకానొక పరుషభాషియగు భిక్షువు)**

311. **కుసో యథా దుగ్గహితో, హత్థమేవానుకన్తతి ।**
**సామఞ్ఞం దుప్పరామట్ఠం, నిరయాయూపకడ్ఢతి[1] । 6 ।**

(కుశో యథా దుర్గృహీతో, హస్తమేవానుకృన్తతి ।
శ్రామణ్యం దుష్పరామృష్టం, నిరయాయోపకర్షతి ॥ 6 ॥)

కుశము (దర్భ)ను సరిగా పట్టుకొనకున్నచో, అది చేతిని కోయునట్లు, శ్రామణ్యము (సంన్యాసము) దురనుష్ఠానము వలన, నరకమున కీడ్చును.

312. **యం కిఞ్చి సిథిలం కమ్మం, సఙ్కిలిట్ఠం, చ యం వతం ।**
**సఙ్కస్సరం[2] బ్రహ్మచరియం, న తం హోతి మహప్ఫలం । 7 ।**

(యత్కిఞ్చిత్ శిథిలం కర్మ, సంక్లిష్టం చ యద్వ్రతమ్ ।
సంకృచ్ఛ్రం బ్రహ్మచర్యం, న తద్భవతి మహాఫలమ్ । 7 ।)

శిథిలకర్మము (నియమరహితకర్మము) క్లేశ(మనోమల, అపచార) యుక్తమైన వ్రతానుష్ఠానము, అనుమానాస్పదమైన (అశుద్ధమైన) బ్రహ్మచర్యము, మహాఫలదాయకములుకావు.

313. **కయిరా[3]చే కయిరాథేనం, దళ్హమేనం పరక్కమే ।**
**సిథిలో హి పరిబ్బాజో, భియ్యో ఆకిరతే రజం । 8 ।**

---

(1) 'నిరయాయ ఉపకడ్ఢతి' - పాఠాంతరము

(2) 'సఙ్కస్సరం':- ఈ శబ్దము సంస్కృతమందలి 'శఙ్కా', 'స్మర' అనురెండు శబ్దముల సమాసరూపమని డా॥ ఫాబ్‌బాల్ (Dr. Fausboll) పండితుని అభిప్రాయము. ఈ అర్థము భదన్తబుద్ధఘోషునికి సమ్మతమే. శంకతో స్మరించుట - సఙ్కస్సరన్తి పరిశఙ్కితము.

(3) కయిరఞ్చే - పాఠాంతరము

(కుర్యాచ్చేత్ కుర్వీతైతద్, దృఢమేతత్ పరాక్రమేత ।
శిథిలో హి పరివ్రాజకో, భూయ ఆకిరతే రజః । 8 ।)

ఏకార్యమైనను చేయవలసినచో, దానిని దృఢనిష్ఠతో, సామర్థ్యముతో చేయవలయును. ప్రమత్తుడైన భిక్షువు (సంన్యాసి, కామవికార) రజము నధికముగ విరజిమ్మును.

**సావత్థి (జేతవనము) ఒకానొక ఈర్ష్యాలువైన స్త్రీ**

314. **అకతం దుక్కతం[1] సెయ్యో, పచ్ఛా తపతి[2] దుక్కతం ।**
**కతం చ సుకతం సెయ్యో, యం కత్వా నానుతప్పతి । 9 ।**

(అకృతం దుష్కృతం శ్రేయః, పశ్చాత్తపతి దుష్కృతమ్ ।
కృతం చ సుకృతం శ్రేయః, యత్కృత్వా నాఽనుతప్యతి । 9 ।)

పాపకర్మము చేయకుండుట క్షేమకరము, అది (పాపకర్మము) పశ్చాత్తాపము కలిగించును. అనుతాపము కలిగింపని పుణ్యకర్మాచరణము శ్రేయోదాయకము.

**సావత్థి (జేతవనము) సమ్బహులే భిక్ఖూ (పలువురు భిక్షువులు)**

315. **నగరం యథా పచ్చన్తం, గుత్తం సన్తరబాహిరం ।**
**ఏవం గోపేథ అత్తానం, ఖణో వేమా ఉపచ్చగా ।**
**ఖణాతీతా హి సోచన్తి, నిరయమ్హి సమప్పితా । 10 ।**

(నగరం యథా ప్రత్యన్తం, గుప్తం సాన్తర్బాహ్యమ్ ।
ఏవం గోపయేదాత్మానం, క్షణో వై మా ఉపాతిగాః* ।
క్షణాతీతా హి శోచన్తి, నిరయే సమర్పితాః । 10 ।)

సీమాంతము (సరిహద్దు) నందలి నగరమును, లోపల బయటనెట్లు

---

(1) దుక్కటం – పాఠాంతరము

(2) తప్పతి – పాఠాంతరము

* 'ఉపాతిగాత్' – పాఠాంతరము.

రక్షింపవలెనో, అట్లు మనుజుడు తన యాత్మను రక్షించుకొనవలెను. క్షణమైన జారవిడువగూడదు. క్షణములు కడచి పోయినచో, (అట్టి ప్రమత్తులగు)వారు నరకమున బడి దుఃఖింతురు.

**సావత్థి (జేతవనము) నిగణ్ఠ (నిర్గ్రంథ) జైనభిక్షువు**

**316. అలజ్జితాయే లజ్జన్తి, లజ్జితాయే న లజ్జరే ।**
**మిచ్ఛాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛన్తి దుగ్గతిం ॥ 11 ॥**

*అలజ్జార్తే లజ్జన్తే, లజ్జార్తే న లజ్జితాః ।(1)*
*మిథ్యాదృష్టి సమాదానాః, సత్త్వా గచ్ఛన్తి దుర్గతిమ్ ॥ 11 ॥)*

సిగ్గుపడదగని కార్యమున సిగ్గుపడువారు, సిగ్గుపడదగిన కార్యమున సిగ్గుపడనివారు, మిథ్యాదృష్టి నవలంబించిన జనులు, దుర్గతిని పొందుదురు.

**317. అభయే భయదస్సినో, భయే చా భయదస్సినో ।(2)**
**మిచ్ఛాదిట్ఠిసమాదానా, సత్తాగచ్ఛన్తి దుగ్గతిం ॥ 12 ॥**

*(అభయే భయదర్శినో, భయే చాఽభయదర్శినః ।*
*మిథ్యాదృష్టిసమాదానాః, సత్త్వా గచ్ఛన్తి దుర్గతిమ్ ॥ 12 ।)*

అభయమున భయమును దర్శించువారు, భయమున అభయమును గాంచువారు - మిథ్యాదృష్టి నవలంబించిన జనులు దుర్గతిని పొందుదురు.

---

(1) 'అలజ్జితా యే లజ్జన్తే, లజ్జితా యే నలజ్జన్తే' - ఇది రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము.

(2) పోల్చు :- '**అస్పర్శయోగో వైనామ దుర్దర్శః సర్వయోగిభిః ।**
**యోగినో బిభ్యతి హ్యస్మా దభయే భయదర్శినః ।'** (మా.ఉ.గౌడపాదకారిక III.39)

మిథ్యాదృష్టి :- '**మిథ్యాదృష్టి ర్నాస్తికతా.....................**
**భ్రాన్తి ర్మిథ్యామతిర్భ్రమః ।** (అమరకోశము I-143,44)

**సావత్థి (జేతవనము) తిత్థియసావకుడు (తీర్థికుడు-శిష్యుడు)**

**318. అవజ్జే వజ్జమతినో, వజ్జే చావజ్జదస్సినో ।**
**మిచ్ఛాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛన్తి దుగ్గతిం ॥ 13 ॥**

*(అవద్యే వద్యమతయో, వద్యేచాఽవద్యదర్శినః ।*
*మిథ్యాదృష్టి సమాదానాః, సత్త్వా గచ్ఛన్తి దుర్గతిమ్ ॥ 13 ॥)*

అదోషమున దోష బుద్ధిగలవారు, దోషమున అదోషమును గాంచువారు - మిథ్యాదృష్టి నవలంబించిన జనులు దుర్గతిని పొందుదురు.

**319. వజ్జఞ్చ వజ్జతో ఞత్వా, అవజ్జఞ్చ అవజ్జతో ।**
**సమ్మాదిట్ఠిసమాదానా, సత్తా గచ్ఛన్తి సుగ్గతిం ॥ 14 ॥**

*(వద్యఞ్చ వద్యతో జ్ఞాత్వా, ఽవద్యఞ్చాఽవద్యతః ।*
*సమ్యగ్దృష్టి సమాదానాః, సత్త్వా గచ్ఛన్తి సుగతిమ్ ॥ 14 ॥)*

దోషమును దోషముగను, అదోషమును అదోషముగను గాంచువారు - సమ్యగ్దృష్టినవలంబించిన జనులు సుగతిని -(నిర్వాణమును) పొందుదురు.

(ప్రతి మానవుని హృదయాంతరస్థమగు ధర్మము (Inner law) చేతన సత్యము (The truth of being) నగు దివ్యసాన్నిధ్యము, (The Divine presence) మన సమస్త చేతనా ప్రవృత్తులను శారీరక ప్రవృత్తులను, పరిపాలింపవలయును. బాహ్య నైతిక నియమములకు, సమాజిక విధులకు కాక, తన హృదయాంతరస్థమగు నీ దివ్యతత్త్వమునకు వ్యతిరేకముగ చరించునపుడు, మనుజుడు తనచుట్టు సృజించుకొను నొకానొక ప్రత్యేక చిత్తాకాశమే, ఈ నిరయమునకు (నరకమునకు) నిజమైన అర్థము. మానవహృదయాంతరస్థమగు ధర్మమే (inner law) చేతన సత్యమే ఈ దివ్యసాన్నిధ్యము (The devine presence). ఇదియే, మన జీవితమును శాసించి, మార్గనిర్దేశ మొనరింపవలయును. ఈ సత్యము యొక్క రవంత దర్శనమును పొందవలయునన్న, మానవుడు తన హృదయాంతర్భాగమున

ప్రవేశించి దృశ్యములకు వెనుకనున్న ఆవేగశక్తుల ఖేలనమును, దాని వెనుక నున్న పరమ సాన్నిధ్యము (The Divine presence)ను దర్శించుటకు ప్రయత్నింపవలయును)

(చూడు:- ధర్మపదవ్యాఖ్యలు - శ్రీమాత, అరవిందాశ్రమము)

**22 నిరయవగ్గో సమత్తో**

**నిరయవర్గము సమాప్తము**





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## నాగవగ్గో తేవీసతిమో

## (నాగవర్గః త్రయోవింశః)

## 23 నాగవర్గము త్రయోవింశాధ్యాయము

*సావత్థి (జేతవనము)* — *అత్తానమారబ్భ (తన్ను గురించి)*

*(కోసమ్బి?)* — *(ఆనందథేరునితో)*

320. **అహం నాగోవ సంగామే, చాపతో[1] పతితం సరం ।**
**అతివాక్యం తితిక్ఖిస్సం[2], దుస్సీలో హి బహుజ్జనో ॥ 1 ॥**

*(అహం నాగ ఇవ సంగ్రామే, చాపతః పతితం శరమ్ ।*
*అతివాక్యం తితిక్షిష్యే, దుశ్శీలో హి బహుజనః[3] ॥ 1 ॥)*

---

(1) చాపాతో - సింహళీయ పాఠాంతరము.

(2) పోల్చు :- 'అతివాదం తితిక్షేత' - (మనుస్మృతి VI-47)

(3) 'దుశ్శీలా హి బహుజనాః' - రాహుల సాంకృత్యాయనుని - సంస్కృత పాఠము.

బుద్ధధర్మమున గజము సహనమునకు, బలమునకు, సంయమమునకు సంకేతరూపము. బుద్ధ గౌతమునకు 'నాగుడు' మహానాగు డను వాఖ్యలు (పేర్లు) కలవు (లలిత విస్తరము). భూతలమున జన్మించుటకు తుషితస్వర్గము నుండి గజరూపమున బుద్ధుడవతరించెనను ఐతిహ్యము కలదు. బుద్ధుడు భద్రగజము వలె 'సుదాన్తు'డగుటచే నాతనియందీ అభిధానము సార్థకము.

సంగ్రామమున గజము ధనుర్విముక్తమగు బాణమును సహించునట్లు, నేనును ఇతరుల పరుషవాక్యమును సహింపగలను. జగమున, అధికజనము దుశ్శీలయుక్తము. (అధికజనులు దుష్ట స్వభావము కలవారు).

321. **దన్తం నయన్తి సమితిం, దన్తం రాజాభిరూహతి ।**
**దన్తో సెట్ఠో మనుస్సేసు, యో'తివాక్యం తితిక్ఖతి । 2 ।**

*(దాన్తం నయన్తి సమితిం, దాన్తం రాజాఽభిరోహతి ।*
*దాన్తః శ్రేష్ఠో మనుష్యేషు, యోఽతివాక్యం తితిక్షతే ॥ 2 ।)*

సుశిక్షితమైన గజమునే యుద్ధమునకు గొనిపోదురు - లేదా, జన సంమర్దములోనికి గొనిపోదురు. అట్టి సుశిక్షిత గజమునే రాజు, ఆరోహించును. మనుష్యుల యందు సైతము వాక్పారుష్యము సహించు దమశాలియే శ్రేష్ఠుడు.

322. **వర మస్సతరా దన్తా, ఆజానీయా చ సిన్ధవా ।**
**కుఞ్జరా చ మహానాగా, అత్తదన్తో తతో వరం । 3 ।**

*(వర మశ్వతరా దాన్తా, ఆజానేయాశ్చ సిన్ధవః ।*
*కుఞ్జరాశ్చ మహానాగా, ఆత్మదాన్త స్తతో వరమ్ । 3 ।)*

సుశిక్షితమైన అశ్వతరములు (కంచర గాడిదలు) శ్రేష్ఠము. సింధుదేశపు మంచి జాతి గుఱ్ఱములును కుంజర జాతికి చెందిన మహా యుద్ధ గజములును శ్రేష్ఠమే. కాని, అన్నిటికంటెను ఆత్మసంయమశాలియే శ్రేష్ఠుడు.

---

దాన్తః - దమశాలి. 'నిగ్రహాద్బాహ్యవృత్తీనాం 'దమ' ఇత్యభిధీయతే ।' (శంకరుడు)
**'కుత్సితాత్ కర్మణో విప్ర! యచ్చ చిత్తనివారణమ్ । స కీర్తితో దమః।**
- బాహ్యవృత్తుల నిగ్రహము దమము. కుత్సిత కర్మముల నుండి చిత్తమును నివారించుట దమమనబడును.

**సావత్థి (జేతవనము)** **హత్థాచరియపుబ్బక భిక్ఖు (భిక్షువు)**

**323. న హి ఏతేహి యానేహి, గచ్ఛేయ్య అగతం దిసం।**
**యథా'త్తనా సుదన్తేన, దన్తో దన్తేన గచ్ఛతి ॥ 4 ॥**

*(న హి ఏతైర్యానైః, గచ్ఛేదగతాం దిశమ్ ।*
*యథాఽఽత్మనా సుదాన్తేన, దాన్తో దాన్తేన గచ్ఛతి ॥ 4 ।)*

(గజాశ్వాదులగు) ఈ యానములచే నెవడును, తాను మున్నెన్నడు పోని (దుష్ప్రాప్యమగు) - దిక్కునకు (నిర్వాణమునకు) పోజాలడు. కాని, ఆత్మ సంయమశాలి మాత్రమే సంయమితము, సుశిక్షితమునైన తన ఆత్మతో అచ్చటికి పోగలడు. (సంయమితాత్మారూఢుని యట్లు గజాశ్వాదియానములచే నెవరును అప్రాప్యమగు నిర్వాణదిశను చేరజాలరని భావము.)

**సావత్థి (జేతవనము)** పరిజిణ్ణ బ్రాహ్మణపుత్తుడు

**324. ధనపాలకో[1] నామ కుఞ్జరో, కటుకప్పభేదనో[2] దున్నివారయో।**
**బద్ధో కబళం న భుఞ్జతి, సుమరతి[3] నాగవనస్స కుఞ్జరో ॥ 5 ॥**

*(ధనపాలకో నామకుఞ్జరః, కటుకప్రభేదనో దుర్నివార్యః ।*
*బద్ధః కబళం నభుఙ్క్తే స్మరతి నాగవనస్య కుఞ్జరః ॥ 5 ।)*

మదజలస్రావముతో దుర్ధర్షమగు 'ధనపాలక'మను (కాశీరాజు యొక్క) గజము, బంధింపబడినపుడు, కబళము భుజింపదు. (ఆహారము ముట్టదు); నాగవనమును (ప్రేమతో) స్మరించును.

---

(1) ధనపాలో - బ్రహ్మదేశీయ పాఠాంతరము
(2) కటుకభేదనో - బ్రహ్మదేశీయ పాఠాంతరము
(3) సుసరతి - పాఠాంతరము

**కటుకప్పభేదనో** - (కటుకప్రభేదనః) - సైన్యమును ఛిన్నాభిన్నమొనరించునది యని రాహులసాంకృత్యాయనాదులు వివరించిరి. అరణ్యమున గ్రుడ్డిదైన తన తల్లిని పోషించుచు, దాని కాధారముగనున్న ఒకానొక ఏనుగు బంధింపబడిన విషయము నీగాథ తెలుపుచున్నదని 'ధమ్మపదాట్ఠ కథ' వివరించును.

సావత్థి (జేతవనము) పసేనది (కోసలరాజు)

325. మిద్ధీ యదా హోతి మహగ్ఘసో చ,
నిద్దాయితా హోతి సంపరివత్తసాయీ।
మహావరాహోవ నివాపపుట్ఠో।
పునప్పునం గబ్భ ముపేతి మన్దో। 6 ।

(మృద్ధో[1] యదా భవతి మహాఘసశ్చ
నిద్రాయితః సంపరివర్తశాయీ।
మహావరాహ ఇవ నివాప[2] పుష్టః।
పునః పునః గర్భముపైతి మన్దః। 6।)

అలసుడు, అమితాహారి, నిద్రాళువు, ఇటునటు దొర్లుచు పరుండువాడు, క్షుద్రాహారపిండములుదిని బలిసిన సూకరమును బోలు మూర్ఖుడు జన్మ పరంపరల బొందును. (భౌతికభోగలాలసుడై అలసత్వమున కవకాశ మొసగి, అతిభుక్తి, అతినిద్రలతో కాలము గడుపు మూర్ఖుడు జీవితగమ్యమును, పరమార్థము పొందక, జనన మరణ రూపమగు సంసార దుఃఖమునను భవించునని భావము).

సావత్థి (జేతవనము) సానుసామణేరుడు

326. ఇదం పురే చిత్తమచారి చారికం,
యేనిచ్ఛకం యత్థకామం యథా సుఖం।
తదజ్జహం నిగ్గహెస్సామి[3] యోనిసో,
హత్థిప్పభిన్నం వియ అంకుసగ్గహో। 7 ।

(1) 'మిద్ధీ' – పాఠాంతరము. ఈ రూపమే సరియైనది. 'మిద్ధం' చిత్తాభి సంక్షేపే క్లీబ మాలస్య నిద్రయోః।' (మేదినీకోశము) సంస్కృతము 'మృద్ధ' శబ్దము చింత్యము.
'మిద్ధో' – రాహులసాంకృత్యాయనుని పాళీపాఠము.
(2) 'పితృదానం నివాపస్స్యాత్।' (అమరకోశము) (పిండములని భావము)
(3) నిగ్గణ్హిస్సామి – పాఠాంతరము.

(ఇదం పురా చిత్త మచర చ్చారికాం,
యథేచ్ఛం యథాకామం యథా సుఖమ్ ।
తదద్యాఽహం నిగ్రహీష్యామి యోనిశో,
హస్తినం ప్రభిన్న మివాఽంకుశగ్రహః । 7 ।)

పూర్వము, ఈ నా మనస్సు యథేచ్ఛముగా, (ఇష్టానుసారముగా) యథాకామముగా(కోరినట్లుగా) యథాసుఖముగా సంచరించినది. ఇప్పుడు, అంకుశధారియగు మావటివాడు మదోత్కటమగు గజమును నిగ్రహించునట్లు నా మనస్సును సమూలకముగ నిగ్రహింపగలను. (యోనిశః - సమూలకముగ, నిశ్శేషముగ).

**సావత్థి (జేతవనము) పావెయ్యకము (కోసలాధిపతి యొక్క హస్తి)**

**327. అప్పమాదరతా హోథ, సచిత్త మనురక్ఖథ ।**
**దుగ్గా ఉద్ధరథ'త్తానం, పఙ్కే సత్తో[1]వ కుఞ్జరో । 8 ।**

(అప్రమాదరతా భవత, స్వచిత్త మనురక్షత ।
దుర్గా దుద్ధరతాఽఽత్మానం, పఙ్కే సక్తఇవకుఞ్జరః । 8 ।)

అప్రమాదరతులు కండు (అప్రమత్తత యందు ఆసక్తులు కండు) స్వచిత్తమును రక్షించుకొనుడు. పంకమగ్నమైన ఏనుగు, తన్ను తానుద్ధరించుకొనునట్లు రాగాదిదుర్గముల (క్లేశముల) నుండి, ఆత్మనుద్ధరించుకొనవలయును.

**పాలిలెయ్యకము (వనషండము) సంబహుళ భిక్ఖూ (పలువురు భిక్షువులు)**

**328. సచే లభేథ నిపకం సహాయం,**
**సద్ధించరం సాధువిహారిధీరం, ।**
**అభిభుయ్య సబ్బాని పరిస్సయాని,**
**చరెయ్య తేన'త్తమనో సతీమా । 9 ।**

(1) సన్నో'వ - పాఠాంతరము

(సచేత్ లభేత నిపక్వం సహాయం,
సార్ధం చరం[1] సాధువిహారి ధీరమ్ ।
అభిభూయ సర్వాన్ పరిశ్రయాన్,
చరేత్ తేనాఽఽత్తమనాః స్మృతిమాన్ ॥ 9 ॥)

పరిపక్వ బుద్ధిశాలి, సత్పథగామి, ధీరుడునైన మిత్రుడు, సహచరుడు లభించినచో, సర్వ విఘ్నములనతిక్రమించి ప్రసన్నచిత్తుడు, స్మృతిమంతుడు (అప్రమత్తుడు)నై అతనితో చరింపవలెను (వసింపవలెను).

**329. నో చే లభేథ నిపకం సహాయం,**
**సద్ధించరం సాధువిహారి ధీరం ।**
**రాజా'వ రట్ఠం విజితం పహాయ,**
**ఏకోచరే మాతఙ్గ'రఞ్ఞే'వ నాగో ॥ 10 ॥**

(నచేత్ లభేత నిపక్వం సహాయం,
సార్ధం చరం సాధువిహారి ధీరమ్ ।
రాజేవ రాష్ట్రం విజితం ప్రహాయ,
ఏకశ్చరేత్ మాతఙ్గోఽరణ్యే ఇవనాగః ॥ 10 ॥)

పరిపక్వ బుద్ధిశాలి, సత్పథగామి (సన్మార్గవర్తనుడు) ధీరుడునైన మిత్రుడు సహచరుడు లభింపనిచో, పరాజిత రాష్ట్రమును పరిత్యజించిన రాజువలె, నాగవనమునందలి గజరాజువలె, నీవొక్కడవే ఒంటరిగా చరింపవలెను.[2]

**330. ఏకస్స చరితం సెయ్యో,**
**నత్థి బాలే సహాయతా ।**
**ఏకో చరే న చ పాపాని కయిరా,**
**అప్పోస్సుక్కో మాతఙ్గ' రఞ్ఞే'వ నాగో ॥ 11 ॥**

(1) సార్ధం చరన్తమ్ - రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము

(2) 'సుత్తనిపాతము' 'ఖగ్గవిసాణ సుత్తము'న ఈ 328, 329 గాథలు కలవు. 329 గాథ యొక్క నాల్గవ పాదము మాత్రము భిన్నముగ నున్నది. 'ఏకోచరే ఖగ్గవిసాణకప్పో'.
(చూడు - సుత్తనిపాతము -I-2.11,12)

(ఏకస్యచరితం శ్రేయో, నాఽస్తి బాలే సహాయతా ।
ఏకశ్చరేన్నచ పాపాని కుర్యాద్
అల్పోత్సుకో మాతఙ్గోఽరణ్య ఇవ నాగః ॥ 11 ॥)

ఏకాంత జీవనము శ్రేష్ఠము. మూర్ఖునితో మైత్రి - సాహచర్యము - అసంభవము. పాపాచరణము తగదు. నాగవనమున గజరాజువలె చింతారహితుడవై - (అనాసక్తుడవై) ఏకాకిగ చరింపవలయును.

**హిమవంతపదేసే (కుటికాయం)** **మారుడు**

**(హిమవత్పర్వత ప్రాంతమందలి కుటీరమున)**

331. **అత్థమ్హి జాతమ్హి సుఖా సహాయా,**
**తుట్ఠీ సుఖా యా ఇతరీతరేన ।**
**పుఞ్ఞం సుఖం జీవితసఙ్ఖయమ్హి**
**సబ్బస్స దుక్ఖస్స సుఖం పహానం[1] ॥ 12 ॥**

(అర్థే జాతే సుఖాః సహాయాః,
తుష్టిః సుఖా యా ఇతరేతరేణ[2] ।
పుణ్యం సుఖం జీవితసంక్షయే,
సర్వస్య దుఃఖస్య సుఖం ప్రహాణమ్ ॥ 12 ॥)

అవసరము కల్గినపుడు మిత్రులు సుఖదాయకులు. కేవలము తనకు లభించిన పదార్థముతో కల్గు సంతృప్తి సుఖకరము. (పరస్పరము పంచుకొను సంతృప్తి సుఖకరము) జీవిత సమాప్తియందు, పుణ్యము సుఖకరము. సర్వదుఃఖ ప్రహాణము (సర్వదుఃఖవినాశము) అత్యంతసుఖకరము.

332. **సుఖా మత్తెయ్యతా లోకే, అథో పెత్తెయ్యతా సుఖా ।**
**సుఖా సామఞ్ఞతా లోకే, అథో బ్రహ్మఞ్ఞతా సుఖా ॥ 13 ॥**

---

(1) పహాణం - సింహళీయ పాఠాంతరము.

(2) 'సుఖాయేతరేతరేణ' - రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము.

*(సుఖా మాత్రీయతా లోకేఽథ పిత్రీయతా సుఖా ।*
*సుఖా శ్రమణతా లోకేఽథ బ్రాహ్మణతా సుఖా ॥ 13 ॥)*

లోకమున, మాతృత్వము ధన్యము. పితృత్వమును ధన్యమే. శ్రామణ్యము (భిక్షుజీవనము) ధన్యము. బ్రాహ్మణ్యము ధన్యము. (ఉన్నత జీవన భూమికల అవిచ్ఛిన్నత - సాతత్యము - ధన్యము, సుఖకరమునని భావము.)

**333. సుఖం యావ జరా సీలం, సుఖా సద్ధా పతిట్ఠితా ।**
**సుఖో పఞ్ఞాయ పటిలాభో, పాపానం అకరణం సుఖం ॥ 14 ॥**

*(సుఖం యావద్ జరా శీలం, సుఖా శ్రద్ధా ప్రతిష్ఠితా ।*
*సుఖః ప్రజ్ఞాయాః ప్రతిలాభః, పాపానామకరణం సుఖమ్ ॥ 14 ॥)*

వార్ధక్య పర్యంతము, సదాచార పాలనము సుఖకరము. సుప్రతిష్ఠితమైన (స్థిరమైన) శ్రద్ధ, సుఖదాయిని. ప్రజ్ఞాలాభము (జ్ఞానసిద్ధి) సుఖకరము. పాపముల నాచరింపకుండుట సుఖదాయము.

*23 నాగవగ్గో సమత్తో*

**నాగవర్గము సమాప్తము**



---

332 గాథ యందలి 'మత్తెయ్యతా' 'పెత్తెయ్యతా' శబ్దములకు క్రమముగా మాతృసేవ, పితృసేవ, అని భదన్త బుద్ధఘోషుని వివరణము. **'మత్తెయ్యతా మాతరి సమ్మాపటిపత్తి। పెత్తెయ్యా'తి పితరి సమ్మాపటిపత్తి' – (అట్ఠకథ.)** రాహులసాంకృత్యాయనాది ఆధునిక వ్యాఖ్యాతలు 'సామఞ్ఞతా' అను పాలీ శబ్దమునకు సంస్కృతచ్ఛాయ 'శ్రమణతా' అని అనువదించినారు. ఈ వివరణము భదన్త బుద్ధఘోషునికి సమ్మతము కాదు. 'సామఞ్ఞతా' శబ్దమునకు సంస్కృత రూపము 'సామాన్యతా' అనుట సమంజసము. సర్వప్రాణి జాతమునందు సమదృష్టియని దీని భావము. **'సామఞ్ఞతా'తి సబ్బజీవేసు సమ్మాపటిపత్తి'** –(అట్ఠకథ). బుద్ధఘోషుననుసరించి బౌద్ధథేరులు నారద మహాథేరుడు బుద్ధరక్షితథేరుడు మొదలగువారు గాథయందలి మొదటి రెండు పాదములను వివరించినారు. కాని 'సామఞ్ఞతా' శబ్దమును శ్రమణసేవయని 'బ్రహ్మఞ్ఞతా' శబ్దమును బుద్ధాదులసేవయని వివరించినారు.

పోల్చు :- **'ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం బ్రాహ్మణ్యం పదమద్వయం,**
**అనాపన్నాది మధ్యాంతం కిమతః పరమీహతే ।'** (మాం. ఉ. గౌడపాదకారిక )

పరిపూర్ణమైన సర్వజ్ఞత్వము, అద్వయము, ఆది మధ్యాంతవిరహితము, నైన బ్రాహ్మణ్య పదమును పొందినమీదటనిక కోరదగినదేమున్నది?



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## తణ్హావగ్గో చతువీసతిమో

## (తృష్ణావర్గశ్చతుర్వింశః)

## 24 తృష్ణావర్గము – చతుర్వింశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **కపిలమచ్ఛుడు**

**334. మనుజస్స పమత్తచారినో, తణ్హా వడ్ఢతి మాలువా వియ ।**
**సో ప్లవతి[1] హురాహురం, ఫలమిచ్ఛం'వ వనస్మి[2] వానరో ॥ 1 ॥**

(మనుజస్య ప్రమత్తచారిణః, తృష్ణా వర్ధతే మాలువేవ ।
స ప్లవతేఽహరహః, ఫలమిచ్ఛన్ ఇవ వనే వానరః ॥ 1 ॥)

ఆలోచనా రహితుడై ప్రమత్తజీవనుడగు మనుజునకు తృష్ణ, మాలువాలత వలె వృద్ధి చెందును. వనము నందు ఫలము కాంక్షించు కోతి వలె నతడు,

(1) ప్లవతీ, పలవతీ, పలవేతి – పాఠాంతరములు.

(2) వనస్మిం – పాఠాంతరము. 'వనస్మిం' – అను సింహళీయ పాఠమున ఛందోభంగ దోషము కలదు. 'వనస్మి' పాఠమున ఛందోభంగదోషము లేదు. '**హురాహురం**' శబ్దమునకు సంస్కృత రూపము అనిశ్చితము. ఇతస్తతః – 'ఇటునటు' అనుట సుసంగతము.

ఇటునటు (ప్రతిదినము) - ఒక జన్మము నుండి మఱొక జన్మమునకు - గంతు లిడుచుండును.

335. **యం ఏసా సహతే[1] జమ్మీ, తణ్హా లోకే విసత్తికా ।**
**సోకా తస్స పవడ్ఢన్తి, అభివట్టం[2]వ వీరణం[3] । 2 ।**

*(య మేషా సాహయతి జన్మినీ, తృష్ణా లోకే విషాత్మికా ।*
*శోకాస్తస్య ప్రవర్ధన్తే, ఽభివర్ధమాన మివ వీరణమ్[4] । 2 ।)*

దుర్జాతియు, విషాత్మికయు (సమ్మోహినియు) నగు నీతృష్ణ, లోకమున నెవని నావరించునో, వాని దుఃఖములు శీఘ్రముగ వృద్ధినొందు వీరణపుగడ్డి వలె విస్తరించును. (తృష్ణయే దుఃఖకారణము. తృష్ణా విముక్తియే దుఃఖవిముక్తి.)

336. **యో చేతం[5] సహతే[6] జమ్మీ,* తణ్హం లోకే దురచ్చయం ।**
**సోకా తమ్హా పపతన్తి, ఉదబిన్దూ'వ పోక్ఖరా । 3 ।**

*(యశ్చైతాం సాహయతి జన్మినీం, తృష్ణాం లోకే దురత్యయామ్ ।*
*శోకా స్తస్య ప్రపతన్త్యుదబిన్దురివ పుష్కరాత్ । 3 ।)*

దుర్జాతియు దురతిక్రమయు (జయింపనలవి కాని దుర్నివారయు)నగు ఈ తృష్ణ నెవడీ లోకమున నిగ్రహించునో - పరాస్త మొనరించునో - వాని దుఃఖములన్నియు కమలపత్రము నుండి జలబిందువుల వలె, నిర్గళితములై నశించును.

---

(1) సహతీ - పాఠాంతరము. జమ్మీ (జన్మినీ) - దుర్జాతి, నీచజన్మ.

(2) అభివడ్ఢం, అభివట్టం, అభిరూళ్హం - పాఠాంతరములు.

(3) బీరణం (వీరణం) - తృణవిశేషము. (అవురుగడ్డి) దీని వేర్లే - వట్టి వేర్లు - పరిమళించు ఉశీరములు

'స్యాద్ వీరణం వీరతరం మూలేఽస్యోశీరమ్' - (అమరకోశము II.210)

(4) అభివృద్ధమివవీరణమ్ - సంస్కృత పాఠాంతరము

(5) వేతం - పాఠాంతరము.

(6) సహతీ - సింహళీయ పాఠాంతరము.

* జమ్మిం - పాఠాంతరము

337. "తం వో వదామి భద్దం వో, యావన్తేత్థ సమాగతా ।
తణ్హాయ మూలం ఖణథ, ఉసీరత్థో వ బీరణం ।
మా వో నళం[(1)] వ సోతో వ, మారో భఞ్జ పునప్పునం" । 4 ।

(తద్ వో వదామి భద్రం వో, యావన్తోఽత్ర సమాగతాః ।
తృష్ణాయా మూలం ఖనత! ఉశీరార్థీవ వీరణమ్ ।
మా వో నల మివ స్రోతో, మారో భనక్తు పునః పునః । 4 ।)

ఇది (హితవచనము) మీకు చెప్పుచున్నాను. ఇచ్చట సమాగతులైన మీకందఱకు భద్ర(శుభ)మగుగాక! ఉశీరముల(వట్టివేర్లను) కాంక్షించువాడు, అవురుగడ్డిని త్రవ్వివేయునట్లు, తృష్ణ యొక్క మూలములను త్రవ్వివేయుడు. స్రోతస్సు (ప్రవాహము) మృణాలమును వలె మారుడు మాటి మాటికి మిమ్ము భంజింపకుండుగాక! (లేక, ప్రవాహము, తీరమందలి రెల్లుగడ్డిని వలె మారుడు (మృత్యువు) మాటిమాటికి మిమ్ము నాశ మొనర్పకుండుగాక!)

రాజగృహము (వేళువనము) — గూథసూకరపోతికుడు

338. యథా పి మూలే అనుపద్దవే దళ్హే ।
ఛిన్నోపి రుక్ఖో పునరేవ రూహతి ।
ఏవమ్పి తణ్హానుసయే అనూహతే ।
నిబ్బత్తతి[(2)] దుక్ఖమిదం పునప్పునం । 5 ।

---

(1) నలః - పోటగలే...కమలే... (మేదినీకోశము) కిక్కసగడ్డి, పద్మము, అని అర్థములు.

* పోల్చు :- నిర్దగ్ధవాసనాబీజసత్తాసామాన్యరూపవాన్ ।
సదేహో వా విదేహో వా, న భూయో దుఃఖభాగ్భవేత్ ।।
(యోగవాసిష్ఠము - నిర్వాణ-10-22)

(వాసనాబీజముల నిశ్శేషముగ దగ్ధమొనరించి సత్తాసామాన్య (పరతత్త్వ) స్వరూపస్థితి నందినవాడు సశరీరుడైనను అశరీరుడైనను మరల జన్మింపడు; దుఃఖభాజనుడు కాడు.)

(2) నిబ్బత్తతి - పాఠాంతరము

(యథాఽపి మూలేఽనుపద్రవే దృఢే,
ఛిన్నోఽపి వృక్షః పునరేవ రోహతి।
ఏవమపి తృష్ణాఽనుశయే ఽనిహతే,
నిర్వర్తతే దుఃఖమిదం పునః పునః । 5 ।)

మూలమునకు (తల్లి వేరుకు) హాని కలుగక, అది దృఢముగ నున్నపుడు, వృక్షము ఛేధింపబడినను, మరల చిగిరించునట్లు, తృష్ణయొక్క సంస్కారము నశింపనిచో, నీ దుఃఖము మాటి మాటికి నుత్పన్నమగుచుండును.

(పోల్చు - బృహదారణ్యకోపనిషత్తున యాజ్ఞవల్క్య మునీంద్రుడీట్లు బోధించెను.

**"యద్వృక్షో వృక్ణో రోహతి మూలాన్నవతరః పునః ।**

**..................................................**

**ధానారుహ ఇవ వై వృక్షోఽఞ్జసా ప్రేత్య సంభవః ।**
**యత్సమూల మావృహేయుర్వృక్షం న పునరాభవేత్।"**

(బృ.ఉ. III-9-28 )

నఱికివేసినను, వృక్షము భూగర్భమున నున్న మూలమునుండి మరల క్రొత్తగ చిగిరించును. దుఃఖమయజన్మపరంపరకు హేతువైన కర్మమును, అవిద్యను, అసంగశస్త్రమున సమూలముగ ఛేదింపగల్గిన, దుఃఖవిముక్తి-ఆనందస్వరూపమగు పరమగతి సిద్ధించును.

"The axe must be laid to the root of the tree, that being separated and freed from the restless desires of nature and self we may possess our souls in the peace of God"– (Thomas A. Kempis - Imitation of Christ.)

**339. యస్స ఛత్తింసతి[1] సోతా, మనా పస్సవా[2] భుసా ।**
**వాహా వహన్తి దుద్దిట్ఠిం, సఙ్కప్పా రాగనిస్సితా । 6 ।**

(1) ఛత్తిసతి - పాఠాంతరము

(2) మనాపసవా - పాఠాంతరము

**ఛత్తింసతీ సోతా** (షట్ త్రింశత్ స్రోతాంసి)= 36 ప్రవాహములు. **తృష్ణ, కామతృష్ణ** (విషయసుఖాభిలాష) **భవతృష్ణ** (శాశ్వతముగ నుండవలయునను దృష్టి). **విభవతృష్ణ** (నశించిపోవలయునను దృష్టి) అవి

(యస్య షట్ త్రింశత్ స్రోతాంసి, మనః ప్రస్రవణాని భూయాసుః ।
వాహో వహన్తి దుర్దృష్టిం, సఙ్కల్పా రాగనిఃసృతా ॥ 6 ॥)

ఎవని యందు తృష్ణ యొక్క ముప్పదియారు స్రోతస్సులు, విషయసుఖముల వైపు ప్రవహించుచు, ప్రబలముగ నుండునో, ఆ మూర్ఖుని (దుర్బుద్ధిని) రాగలిప్తసంకల్పరూపములగు వాహినులు అపవహించుకొనిపోవును (అపహరించుకొనిపోవును).

**340. సవన్తి సబ్బధీ[(1)] సోతా, లతా ఉబ్భిజ్జ[(2)] తిట్ఠతి ।**
**తం చ దిస్వా లతం జాతం, మూలం పఞ్ఞాయ ఛిన్దథ ॥ 7 ॥**

(స్రవన్తి సర్వతః స్రోతాంసి, లతోద్భిద్య తిష్ఠతి ।
తాఞ్చ దృష్ట్వా లతాం జాతాం, మూలం ప్రజ్ఞయా ఛిన్దత ॥ 7 ॥)

ఈ తృష్ణా వాహినులు సర్వతోముఖముగ ప్రవహించుచున్నవి. తృష్ణాలత (6 ఆఱు ఇంద్రియ ద్వారములనుండి) ఉద్భిదమై అంకురించుచున్నది. ఉత్పన్నమై వ్యాపించుచున్న ఈ లతను కాంచిన వెంటనే ప్రజ్ఞచే దాని మూలమును ఛేదింపుడు.

---

మూడు విధములు. చక్షుః, శ్రోత్ర, ఘ్రాణ, జిహ్వా, త్వక్, మానసములు అను ఆధ్యాత్మికములు, (ఇంద్రియములు) రూప, శబ్ద, గంధ, రస, స్పర్శ, ధర్మములు అను ఆధిభౌతికములు (ఇంద్రియ విషయములు)నగు స్రోతస్సులు తృష్ణ యొక్క త్రివిధరూపములకు సంబంధించి (12 x 3 = 36) ముప్పదియారు వాహినులుగా రూపొందును. మనుజుని కోరికలు అడ్డులేక కొనసాగినచో, కామతృష్ణా తరంగము లాతని ముంచివేయునని భావము.

పోల్చు :- **'సవన్తి సబ్బధి సోతా (ఇచ్చాయస్మా అజితో) సోతానం కిం నివారణం ।**
**సోతానం సంవరం బ్రూహి, కేన సోతా పిథియ్యరే'**

(సుత్తనిపాతము V-2-3)

'తృష్ణాసరిత్తులు సర్వత్ర ప్రవహించుచున్నవి. ఈ వాహినులకు నివారణమేది? ఈ స్రోతస్సుల నిరోధించుటెట్లు? వీనిని స్తంభింపజేయుటెట్లు'ని అజితుడనువాడు బుద్ధుని ప్రశ్నించెను.

(1) సబ్బధి – బ్రహ్మదేశీయ పాఠాంతరము.

(2) ఉప్పజ్జ – బ్ర.దే. పాఠాంతరము.

**341. సరితాని సినేహితాని చ, సోమనస్సాని భవన్తి జన్తునో।**
**తే సాతసితా సుఖేసినో, తే వే జాతిజరూపగా నరా ॥ 8 ॥**

*(సరితః స్నిగ్ధాశ్చ సౌమనస్యా భవన్తి జన్తోః।*
*తే స్రోతః సృతాః సుఖైషిణస్తే వై జాతిజరోపగా నరాః ॥ 8 ॥)*

తృష్ణాసరిత్తులు (తృష్ణా రూపములగు ప్రవాహములు) ప్రాణులకు హితకరముగ మనస్సునకు సుఖకరముగ నుండును. (అట్లు కాన్పించును). విషయ సుఖాపేక్షతో, ఈ వాహినుల యందు జాఱినవారు (పడినవారు) జన్మజరాదిదుఃఖముల పొలగుదురు.

**342. తసిణాయ పురక్ఖతా పజా, పరిసప్పన్తి ససోవ బాధితో[1]।**
**సంయోజన సఙ్గ సత్తా[2], దుక్ఖము పెన్తి పునప్పునం చిరాయ ॥ 9 ॥**

*(తృష్ణయా పురస్కృతాః ప్రజాః, పరిసర్పన్తి శశ ఇవ బాధితః।*
*సంయోజన సఙ్గసక్తకాః, దుఃఖముపయన్తి పునః పునశ్చిరాయ ॥ 9 ॥)*

తృష్ణచే పురస్కృతులగు జనులు - (తృష్ణాక్రాంతులగు జనులు) జాలబద్ధమైన కుందేలు వలె, ఇటునటు పరుగులెత్తుదురు. సంయోజన (బంధ) రూపములైన కామాదిసంగములచే, దృఢబద్ధులై వారు చిరకాలము మాటి మాటికి దుఃఖము పొలగుచున్నారు.

**343. తసిణాయ పురక్ఖతా పజా, పరిసప్పన్తి ససోవ బాధితో।**
**తస్మా తసిణం వినోదయే, భిక్ఖు ఆకఙ్ఖీ విరాగమత్తనో ॥ 10 ॥**

*(తృష్ణయా పురస్కృతాః ప్రజాః, పరిసర్పన్తి శశ ఇవ బాధితః।*
*తస్మాత్ తృష్ణాం వినోదయేద్, భిక్షురాకాంక్షీవిరాగమాత్మనః ॥ 10 ॥)*

---

(1) బన్ధితో - పాఠాంతరము.

(2) సంసత్తకా - పాఠాంతరము.

'సఞ్ఞోజనసఙ్గసత్తా' - సింహళీయ పాఠాంతరము.

దశ సంయోజనములు - చూడు :- 31 గాథ - పాదటీక. పంచ సంగములు - కామ, ద్వేష, మోహ, గర్వ, మిథ్యాదృష్టులు.

తృష్ణచే పురస్కృతులగు (తృష్ణాక్రాంతులగు) జనులు జాలబద్ధమైన కుందేలు వలె, ఇటునటు పరుగులెత్తుదురు. కావున, ఆత్మవైరాగ్యము (నిర్వాణము) నాకాంక్షించు భిక్షువు, తృష్ణను దూరమొనరింపవలెను.

రాజగృహము (వేళువనము) విబ్భ్రకభిక్షు

**344. యో నిబ్బనథో[1] వనాధిముత్తో,**
**వనముత్తో వనమేవ ధావతి ।**
**తం పుగ్గలమేవ[2] పస్సథ,**
**ముత్తో బన్ధనమేవ ధావతి ॥ 11 ॥**

*(యో నిర్వనతో వనేఽధిముక్తో,*
*వనముక్తో వనమేవ ధావతి ।*
*తం పుద్గల మేవ పశ్యత ।*
*ముక్తో బన్ధనమేవ ధావతి ॥ 11 ॥)*

ఎవడు వనము (కామతృష్ణ) నుండి సంపూర్ణ విముక్తుడై వనమునకు (కామతృష్ణకు) బద్ధుడగుచున్నాడో, వన (కామతృష్ణా) విముక్తుడై మరల వనజీవనమునకే (కామతృష్ణా బంధమునకే) పరువెత్తుచున్నాడో – ఆ పురుషుని చూడుడు. అతడు ముక్తుడయ్యును బంధమునకే పరుగులెత్తుచున్నాడు.

(వనము = కామతృష్ణ; అరణ్యము – ఈ శబ్దము పైని శ్లేషార్థమును గ్రహింపవలెను)

---

(1) 'నిబ్బన' శబ్ద ప్రయోగము వినువారికి నిర్వాణమును స్ఫురింపజేయుట కుద్దేశింపబడినదని మాక్సిముల్లర్ పండితుని అభిప్రాయము. 'నిబ్బనథో' అనునదే సరియైన పాఠము. 'యో నిర్వాణార్థీ... అను రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము సరికాదు.
నిర్ + వనతః = నిష్కామతః, తృష్ణారాహిత్యము వలన
(2) పుగ్గల మేథ – బ్రహ్మదేశీయ పాఠాంతరము
పుగ్గం (పుద్గలః) – **పుద్గలః మందరాకారే త్రిషు పుంస్యాత్మ దేహయోః ।** జీవము, శరీరము (మేదినీకోశము)

(శ్రద్ధావంతుడై భిక్షుసంఘమున చేరి, తరువాత విషయసుఖములయందలి ఆకర్షణచే మరల గృహజీవనమునకు మరలిన ఒకానొక యువకునుద్దేశించి భగవంతుడీగాథ నుచ్చరించెనని 'ధమ్మపదాట్ఠకథ' యందు బుద్ధఘోషుడు వివరించును.)

**సావత్థి (జేతవనము)** **బంధనాగారవిషయము**

**345. న తం దళ్హం బన్ధన మాహు ధీరా |**
**యదాయసం దారుజం బబ్బజఞ్చ[1] |**
**సారత్తరత్తా మణికుణ్డలేసు,**
**పుత్తేసు దారేసు చ యా అపెక్ఖా[2] | 12 |**

*(న తద్దృఢం బన్ధన మాహుర్ధీరాః |*
*యదాయసం దారుజం పర్వజఞ్చ |*
*సారవద్రక్తా మణికుణ్డలేషు,*
*పుత్త్రేషు దారేషు చ యాఽపేక్షా || 12 ||)*

లోహ దారు రజ్జు నిర్మిత బంధనమును దృఢబంధనమని బుద్ధిమంతులు తలపరు. ధనరక్తి, మణికుండలములందును, పుత్రులందును, భార్యలందును గల అపేక్ష – వ్యామోహము – దృఢబంధనమని వారందురు.

---

(1) 'దారుజ పబ్బజం' – బ్రహ్మదేశీయ పాఠాంతరము. ఛందో దృష్టి ననుసరించి ఈ పాఠమే సముచితమైనది.

(2) అపేఖా – పాఠాంతరము

పోల్చు :- **'వంసో విసాలోవ యథా విసత్తో,**
**పుత్తేసు దారేసు చ యా అపెక్ఖా |**
**వంసాకళీరోవ అసజ్జమానో |**
**ఏకో చరే ఖగ్గవిసాణ కప్పో |** (సుత్తనిపాతము I. 3.4)

**అనేకశాఖలు పరస్పరము సంశ్లిష్టమై (జటిలమై) విస్తారమైయున్న వెదురు వంటిది పుత్రదారాపేక్ష.** కాని, దేనికి సంబంధించని వెదురు మొలకవలె నిర్లిప్తుడై ఖడ్గవిషాణము (ఖడ్గమృగము) వలె ఏకాకిగ వ్యక్తి సంచరింపవలయును.

**346. ఏతం దళ్హం బన్ధన మాహు ధీరా ।**
**ఓహారినం సిథిలం దుప్పముఞ్చం ।**
**ఏతమ్పి ఛేత్వాన పరిబ్బజన్తి,**
**అనపేక్ఖినో కామసుఖం పహాయ ॥ 13 ॥**

*(ఏతద్దృఢం బన్ధన మాహుర్ధీరాః,*
*అవహారి శిథిలం దుష్ప్రమోచమ్ ।*
*ఏతదపి ఛిత్త్వా పరివ్రజ*
*న్త్యనపేక్షిణః కామసుఖం ప్రహాయ ॥ 13 ॥)*

పైన పేర్కొన్న ధనాది వ్యామోహ రూపబంధనము చూచుటకు శిథిలము (వదులు)గ గాన్పించినను, మనుజుని క్రిందికి లాగును. దీనిని వదలించుకొనుట (దీని నుండి విముక్తి పొందుట) దుష్కరము. కాన ఈ బంధనము దృఢ బంధనమని వివేకవంతులందురు. ఈ బంధనమును ఛేదించి, నిఃస్పృహులగు (నిష్కాములగు) మహాత్ములు కామసుఖమును త్యజించి సంన్యసించుచున్నారు.

**రాజగృహము (వేళువనము)** **ఖేమా అగ్గమహేసీ**
**(బింబిసారుని అగ్రమహిషి క్షేమాదేవి)**

**347. యే రాగరత్తా నుపతన్తి సోతం, సయంకతం మక్కటకో[1]వ జాలం ।**
**ఏతమ్పి ఛెత్వాన వజన్తి ధీరా, అనపెక్ఖినో సబ్బదుక్ఖం పహాయ ॥ 14 ॥**

*(యే రాగరక్తా అనుపతన్తి స్రోతః,*
*స్వయంకృతం మర్కటక ఇవజాలమ్ ।*

---

(1) మక్కటక (మర్కటకః) = లూత, సాలెపురుగు.

**'లూతా (స్త్రీ) తన్తు వాయోర్ణనాభ మర్కటకా సమాః'** - అమరకోశము

సాలెపురుగు, తన వలనల్లుకొని, దాని మధ్యభాగమున నుండును. ఈగ కాని, సీతాకోకచిలుకకాని, వలలో చిక్కినపుడు, తీవ్రవేగముతో పై బడి, దానిని చంపి, రసము పీల్చి, మరల యథాస్థానము చేరి కూర్చుండును. ఇట్లే రాగవశులైన జీవులు, విద్వేషకలుషితులై, క్రోధోన్మత్తులై స్వయంకృత తృష్ణా వాహిని యందు చిక్కి దాని నెప్పుడును దాటజాలరని టీకాకారుడు - భదన్త బుద్ధఘోషుడు - ఈ సాదృశ్యమును వివరించును.

*ఏతదపి ఛిత్త్వాఽను వ్రజన్తి ధీరాః,*
*అనపేక్షిణః సర్వదుఃఖం ప్రహాయ I 14 II)*

సాలెపురుగు తాను నిర్మించుకొన్న జాలమును వలె, రాగానురక్తులగు వారు తృష్ణాస్రోతస్సు (ప్రవాహము) ననుసరింతురు. ధీరులు, నిరపేక్షులు నగువారు, దీనిని (తృష్ణను) ఛేదించి, సర్వ దుఃఖమును విసర్జించి, సంసారమును పరిత్యజింతురు.

**రాజగృహము (వేళువనము)** **ఉగ్గసేనుడు (శ్రేష్ఠి)**

**348. ముఞ్చ పురే ముఞ్చ పచ్ఛతో, మజ్ఝే ముఞ్చ భవస్స పారగూ I**
**సబ్బత్థ విముత్తమానసో, నపున జాతిజరం ఉపేహిసి I 15 I**

*(ముఞ్చ పురా[1] ముఞ్చ పశ్చాత్, మధ్యే ముఞ్చ భవస్య పారగః I*
*సర్వత్ర విముక్తమానసో, న పునర్జాతిజరా ముపేష్యసి[2] I 15 II)*

భూత భవిష్యవర్తమానములను (ముందు, వెనుక, మధ్యములకు సంబంధించిన వానిని) పరిత్యజింపుము. సంసార సాగర పారము (ఆవలితీరమును) పొందుము. సర్వవిషయములందును విముక్త చిత్తుడవైనచో, మరల జన్మమును, జరను పొందవు (జన్మజరామృత్యురూప భవచక్రము నుండి విముక్తుడవు కాగలవు).

**సావత్థి (జేతవనము)** **చూళధనుగ్గహ పండితుడు**
**(ధమ్మపదాట్ఠకథ సింహళదేశీయ పాఠము**
**ననుసరించి ఒక దహరభిక్షువు)**

**349. వితక్కపమథితస్స జన్తునో, తిబ్బరాగస్స సుభానుపస్సినో I**
**భియ్యో తణ్హా పవడ్ఢతి, ఏస ఖో దళ్హం[3] కరోతి బన్ధనం I 16 I**

---

(1) పురో - రాహుల సాంకృత్యాయనుని పాఠము
(2) 'న పునః జాతి జరే ఉపైషి' - రాహుల సాంకృత్యాయనుని పాఠము
(3) గాళ్హం (గాఢమ్) పాఠాంతరము.

*(వితర్కప్రమథితస్యజన్తోః, తీవ్రరాగస్య శుభానుపశ్యతః ।*
*భూయః తృష్ణా ప్రవర్ధతే, ఏష ఖలు దృఢం కరోతి బన్ధనమ్ ॥ 16 ॥)*

సందేహగ్రస్తుడు (దుశ్చింతల వలన లేక, విశేష తర్కము వలన క్షోభ జెందిన మనస్సు కలవాడు) తీవ్రరాగయుక్తుడు, విషయసుఖముల యందు శుభమును కాంచువాడు నగు మనుజునికి (జంతువునకు) తృష్ణ ప్రవృద్ధమగును. అతడు తన బంధనమును, దృఢ మొనరించు కొనుచున్నాడు.

**50. వితక్కూపసమే చ యో రతో, అసుభం భావయతి[1] సదా సతో ।**
**ఏస ఖో వ్యన్తి కాహితి, ఏసో ఛెచ్ఛతి[2] మారబన్ధనమ్ । 17 ।**

*(వితర్కోపశమే చ యో రతో, ఽశుభం భావయతే సదా స్మృతః ।*
*ఏష ఖలు వ్యన్తీకరిష్యతి, ఏష ఛేత్స్యతి మారబన్ధనమ్ ॥ 17 ॥)*

ఎవడు సందేహముల (వితర్కముల) నుపశమింపజేసికొనుట యందా సక్తుడో, సాంసారికవిషయముల యందు అశుభమును ధ్యానించునో[3] నిరంతరజాగరూకుడో, అతడే, తృష్ణ నంతమొనరింపగలడు; మార బంధనమును ఛేదింపగలడు.

---

1) భావయతే - బ్రహ్మదేశీయ పాఠాంతరము.
భావయతీ - పాఠాంతరము.

2) ఏసచ్ఛెచ్ఛతి - ఏసఛెజ్జతి, ఏసఛెచ్ఛతి, ఛిన్దతి - పాఠాంతరములు.

3) దేహము జుగుప్సావహమని ధ్యానించుట. రూపరాగమును జయించుటయే ఇందలి ముఖ్యోద్దేశ్యము.
**'అమేధ్యపూర్ణం క్రిమిజన్తుసంకులం ,**
**స్వభావ దుర్గన్ధ మశౌచ మధ్రువమ్ ।**
**కళేబరే మూత్ర పురీష భాజనే,**
**రమేత మూఢో, న రమేత పణ్డితః'**

**సావత్థి (జేతవనము)** **మారుడు**

**351. నిట్ఠం గతో అసంతాసీ, వీతతణ్హో అనఙ్గణో ।**
***అచ్ఛిద్ది భవసల్లాని, అన్తిమోయం సముస్సయో । 18 ।**

*(నిష్ఠాగతోఽసంత్రాసీ, వీతతృష్ణోఽ నఙ్గణః*
*అచ్ఛిన్నద్భవశల్యాని, అన్తిమోఽయం సముచ్ఛ్రయః । 18 ।)*

నిష్ఠాసంపన్నుడు (గమ్యమును చేరినవాడు), నిర్భయుడు, తృష్ణారహితుడు, క్లేశరహితుడు (నిర్మలుడు)ను, జీవితశల్యములను ఛేదించినవాడునునగు మనుజున కిదియే అంతిమదేహము (తుది జన్మము).

(సంస్కృత 'అఞ్జన' శబ్దమునకు, పాళీ 'అఙ్గణ' శబ్దమొక వికృతియని భావింపవలెను. చూడుః గాథ. 125. పాదటీక. కాని, సంస్కృతమున ఈ రెండు శబ్దములకు అర్థభేదము కలదు.
అనఙ్గణః = అచలితుడు; అనఞ్జనః = పాపరహితుడు.
సముచ్ఛ్రయః - ఉత్సేధః = దేహము)

**352. వీతతణ్హో అనాదానో, నిరుత్తి పదకోవిదో ।**
**అక్ఖరానం సన్నిపాతం, జఞ్ఞా పుబ్బాపరానిచ**
**స వే అన్తిమసారీరో మహాపఞ్ఞోతి వుచ్చతి[2] । 19 ।**

*(వీతతృష్ణోఽ నాదానో, నిరుక్తి పదకోవిదః ।*
*అక్షరాణాం సన్నిపాతం, జానాతి పూర్వాఽపరాణి చ ।*
*స వై అన్తిమశారీరో, మహాప్రాజ్ఞ ఇత్యుచ్యతే । 19 ।)*

---

(1) మహాపురిసోతి వుచ్చతి - పాఠాంతరము
నిరుత్తిపదకోవిదో = పటిసంభిదాఞాన. చతుర్విధపరిశీలనాత్మకజ్ఞానము. అర్థము, మూలగ్రంథము (Text), వ్యుత్పత్తి (Etymology) అంతర్జ్ఞాన పూర్వకమైన గ్రహణశక్తి (Intutive understanding)- ఇవియే, చతుర్విద పరిశీలనాత్మక జ్ఞానము. (ప్రతిసంవిద్ జ్ఞానము).
* ఉచ్ఛిజ్జ - ఉత్సృజ్య - రాహుల సాంకృత్యాయనుని పాఠములు
అచ్ఛిన్ది - పాఠాంతరము

తృష్ణా రహితుడు, అపరిగ్రహుడు, శబ్దార్థజ్ఞానకుశలుడు, అక్షర సన్నిపాతము (వర్ణ సంయోగము)ను, అక్షర పూర్వాపర క్రమమును నెఱిగినవాడును నగు మనుజుడు, మహాప్రాజ్ఞుడనియు మహాపురుషుడనియు చెప్పబడును. అతడు నిశ్చయముగా అంతిమ శరీరధారి. (అతనికిదియే తుది జన్మము).

**అన్తరమగ్గ – (గయనుండి వారణాసికి పోవు మార్గమున)** **ఉపకుడు (ఆజీవకుడు)**

353. **సబ్బాభిభూ సబ్బవిదూ'హమస్మి,**
**సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తో ।**
**సబ్బఞ్జహో తణ్హక్ఖయే విముత్తో,**
**సయం అభిఞ్ఞాయ కముద్దిసెయ్యం? * । 20 ।**

(సర్వాభిభూః సర్వవిదహమస్మి,
సర్వేషు ధర్మేష్వనుపలిప్తః ।
సర్వఞ్జహః తృష్ణాక్షయే విముక్తః,
స్వయ మభిజ్ఞాయ కముద్దిశేయమ్ । 20 ॥)

నేను (రాగాదుల) నన్నిటిని పరాస్తమొనరించితిని. (జయించితిని). నేను సర్వజ్ఞుడను. జీవన సర్వావస్థలయందు నేను నిర్లిప్తుడను; సర్వమును త్యజించితిని. తృష్ణ నశించుట వలన నేను విముక్తుడను. స్వయముగ

---

*పోల్చు :- **'సబ్బాభిభుం సబ్బవిదుం సుమేధం,**
**సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తం ।**
**సబ్బం జహం, తణ్హక్ఖయే విముత్తం,**
**తం వాపి ధీరా, మునిం వేదయన్తి ।'** (సుత్తనిపాతము I-12-5)

'ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం, బ్రాహ్మణ్యం పదమద్వయమ్ ।
అనాపన్నాది మధ్యాన్తం, కిమతః పరమీహతే ॥'

'పరిపూర్ణ సర్వజ్ఞత్వమును, అద్వయమును, (ద్వైతరహితమును) ఆది మధ్యాంత విరహితమునగు 'బ్రాహ్మణ్య' పదమును పొందిన మీదట, ఇంకేమీ కోరవలయును?' అని శంకరుని పరమగురువగు గౌడపాదాచార్యులు ఈ పరమజ్ఞాన భూమికను వర్ణించినారు.

(మా. ఉ. గౌడపాదకారిక VI-85)

సర్వము నెఱిగిననేను, ఎవరిని నా గురువని ఉద్దేశింతును.

(గయ నుండి వారణాసికి పోవుచు మార్గమధ్యమున బుద్ధగౌతముడు ఉపకుడను జైనసంన్యాసితో నిల్లనెను. నీ గురువెవరని ఉపకుడు తథాగతుని ప్రశ్నించెను. ఈ గాథయే బుద్ధుని సమాధానము. సర్వజ్ఞత్వభూమిక యందు తాను ప్రతిష్ఠితుడని బుద్ధుని అపరోక్షానుభూతిని, ఈ గాథ ప్రకాశిత మొనరించుచున్నది.)

**సావత్థి (జేతవనము)** **సక్కుఁడు (శక్రుడు) దేవరాజు**

**354. సబ్బదానం ధమ్మదానం జినాతి,**
**సబ్బం రసం ధమ్మరసో జినాతి।**
**సబ్బం రతిం ధమ్మరతీ జినాతి,**
**తణ్హక్ఖయో సబ్బదుక్ఖం జినాతి(1)। 21 ।**

*(సర్వదానం ధర్మదానం జయతి,*
*సర్వరసం ధర్మరసోజయతి ।*
*సర్వరతిం ధర్మరతిర్జయతి,*
*తృష్ణాక్షయః సర్వదుఃఖం జయతి । 21 ।)*

ధర్మదానమన్ని దానముల కంటె నుత్కృష్టమైనది. ధర్మరసము అన్నిరసముల కంటె శ్రేష్ఠమైనది. ఆనందములన్నిటిని ధర్మానందమే అతిశయించును. తృష్ణానాశమే సర్వదుఃఖములను నిర్జించును.

**సావత్థి (జేతవనము)** **అపుత్రకుడగు శ్రేష్ఠి**

**355. హనన్తి భోగా దుమ్మేధం నో చే(2) పారగవేసినో ।**
**భోగతణ్హాయ దుమ్మేధో, హన్తి అఞ్ఞేవ అత్తనం । 22 ।**

(1) పోల్చు :- **శ్రద్ధాధనం శ్రేష్ఠతమం ధనేభ్యః,**
**ప్రజ్ఞారస తృప్తి కరో రసేభ్యః ।**
**ప్రధాన మధ్యాత్మ సుఖం సుఖేభ్యో ఽ**
**విద్యారతి ర్దుఃఖతమా రతిభ్యః ।**

(అశ్వఘోషకృత సౌందరనందము V-25)

(2) నో చ - బ్రహ్మదేశీయ పాఠము

*(ఘ్నన్తి భోగా దుర్మేధసం, న చేత్ పారగవేషిణః ।*
*భోగతృష్ణయా దుర్మేధా, హన్త్యన్యమివాఽఽత్మానమ్ ॥ 22 ॥)*

సంసార పారము నన్వేషింపని వారు కానిచో, విషయ భోగములు దుర్బుద్ధియగు మనుజుని నాశమొనరించును. విషయసుఖతృష్ణచే (మూర్ఖుడు), అన్యులను వలెనే తన్నును నాశమొనరించుకొనును.

**వణ్ణుకమ్బులసిల (దేవలోకము)** **అంకురుడు**

**356. తిణదోసాని ఖెత్తాని, రాగదోసా అయం పజా ।**
**తస్మాహి వీతరాగేసు, దిన్నం హోతి మహప్ఫలం ॥ 23 ॥**

*(తృణదోషాణి క్షేత్రాణి, రాగదోషేయం ప్రజా ।*
*తస్మాద్ధి వీతరాగేషు, దత్తం భవతి మహాఫలమ్ ॥ 23 ॥)*

కలుపుగడ్డి పంట భూములకు చేటు. మానవజాతికి రాగము (కామము) చేటు. కాన, రాగరహితులగు మహాత్ములకు చేసిన దానము మహాఫలదాయకము.

**357. తిణదోసాని ఖెత్తాని, దోసదోసా అయం పజా ।**
**తస్మా హి వీతదోసేసు, దిన్నం హోతి మహప్ఫలం ॥ 24 ॥**

*(తృణదోషాణి క్షేత్రాణి, ద్వేషదోషేయం ప్రజా ।*
*తస్మాద్ధి వీతద్వేషేషు, దత్తం భవతి మహాఫలమ్ ॥ 24 ॥)*

కలుపుగడ్డి పంట భూములకు చేటు. ద్వేషము మానవజాతికి చేటు. కాన, ద్వేషరహితులగు మహాత్ములకు చేసిన దానము మహాఫలదాయకము.

**358. తిణదోసాని ఖెత్తాని, మోహ దోసా అయం పజా ।**
**తస్మా హి వీతమోహేసు దిన్నం హోతి మహప్ఫలం ॥ 25 ॥**

*(తృణదోషాణి క్షేత్రాణి, మోహదోషేయం ప్రజా ।*
*తస్మాద్ధి వీతమోహేషు, దత్తం భవతి మహాఫలమ్ ॥ 25 ॥)*

కలుపుగడ్డి పంట భూములకు చేటు. మోహము మానవ జాతికి చేటు. కాన, మోహరహితులగు మహాత్ములకు చేసిన దానము మహాఫలదాయకము.

**359. తిణదోసాని ఖేత్తాని, ఇచ్ఛాదోసా అయం పజా[1]**
**తస్మా హి విగతిచ్ఛేసు దిన్నం హోతి మహప్ఫలం । 26 ।**

*(తృణదోషాణి క్షేత్రాణి, ఇచ్ఛా[2]దోషేయం ప్రజా ।*
*తస్మాద్ధి విగతేచ్ఛేషు, దత్తం భవతి మహాఫలమ్ । 26 ।)*

కలుపుగడ్డి పంట భూములకు చేటు. ఇచ్ఛ (కామము) మానవ జాతికి చేటు. కాన ఇచ్ఛారహితులగు మహాత్ములకు చేసిన దానము మహాఫలదాకయము. లాలస, అనర్థహేతువని భావము.

(ఈ గాథార్థము ధ్యానార్హము - శ్రీమాత, శ్రీఅరవిందాశ్రమము-8/8/58)

*24 తణ్హావగ్గో నమత్తో*

తృష్ణావర్గము నమాప్తము



(1) ఈ క్రింది గాథ, నాలందా సంస్కరణ ధమ్మపద గ్రంథమున కాన్పించుచున్నది. ఇది 'అట్ఠ కథా' సహిత సింహళ దేశీయ సంస్కరణమున గాని, బ్రహ్మదేశీయ ప్రతిలో గాని, డా॥ పాడ్‌బాల్ మహాశయుడు సంపాదించిన ప్రతిలో గానీ లేదు.

**'తిణ దోసాని ఖేత్తాని, తణ్హాదోసా అయం పజా ।**
**తస్మాహి వీతతణ్హేసు, దిన్నంహోతి మహప్ఫలం ।'**

(కలుపుగడ్డి పంటభూములకు చేటు, తృష్ణ (లిప్స-ఆశ) మానవజాతికి చేటు, కాన, తృష్ణారహితులగు మహాత్ములకు చేసిన దానము మహాఫలదాయకము)

ఆధునిక వ్యాఖ్యానకర్తలందఱును ఈ గాథను వదలివేసినారు. ఇది ప్రక్షిప్తము కావచ్చును.

(2) ఇచ్ఛా - దోహదమ్.

**'ఇచ్ఛా, కాంక్షా, స్పృహేహా, తృడ్వాంఛా, లిప్సా మనోరథః ।**
**కామోఽభిలాషః తర్షశ్చ, సమహాన్ లాలసా......।'** (అమరకోశము I.209,210)



నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## భిక్ఖువగ్గో పఞ్చవీసతిమో

## (భిక్షువర్గః పఞ్చవింశః)

## 25 భిక్షువర్గము – పంచవింశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **పంచభిక్షువులు**

**360. చక్ఖునా సంవరో సాధు, సాధు సోతేన సంవరో ।**
**ఘానేన[1] సంవరో సాధు, సాదు జివ్హాయ సంవరో ॥ 1 ॥**

*(చక్షుషా సంవరో సాధుః, సాధుః శ్రోత్రేణ సంవరః ।*
*ఘ్రాణేన సంవరః సాధుః, సాధుః జిహ్వాయా సంవరః ॥ 1 ॥)*

నేత్రేంద్రియసంయమము రమ్యము. అట్లే శ్రోత్ర, ఘ్రాణ, జిహ్వేంద్రియముల (చెవి, ముక్కు, నాలుకల) సంయమమును రమ్యము (శ్రేయస్కరము). కావున ప్రయత్నపూర్వకముగ ఇంద్రియసంవరము (సంయమము) కర్తవ్యము. ఇంద్రియరక్షాఽభావము దుఃఖమునకు భవమునకు (జన్మపరంపరకు) హేతువగును.

---

(1) ఘానేన – సింహళదేశీయ పాఠము, ఫాస్‌బాల్ పండితుడు స్వీకరించినది.

"కార్యః పరమయత్నేన తస్మాదింద్రియ సంవరః ।
ఇంద్రియాణి హ్యగుప్తాని దుఃఖాయ చ భవాయ చ ।"

(సౌందరనందము XIII-54)

**361. కాయేన సంవరో సాధు, సాధు వాచాయ సంవరో ।**
**మనసా సంవరో సాధు, సాధు సబ్బత్థ సంవరో**
**సబ్బత్థ సంవరో భిక్ఖు, సబ్బదుక్ఖా పముచ్చతి । 2 ।**

*(కాయేన సంవరో సాధుః, సాధుః వాచా సంవరః ।*
*మనసా సంవరః సాధుః, సాధుః సర్వత్ర సంవరః ।*
*సర్వత్ర సంవృతో భిక్షుః, సర్వదుఃఖాత్ ప్రముచ్యతే । 2 ।)*

శరీర సంయమము రమ్యము. వాక్సంయమము రమ్యము. మనస్సంయమము రమ్యము. సర్వత్ర – సర్వేంద్రియ విషయమున – సంయమము రమ్యము. సర్వత్ర సంయమశాలియగు భిక్షువు, సర్వదుఃఖముల నుండి విముక్తుడగును.

**సావత్థి (జేతవనము) హంసఘాతకుడు (భిక్షువు)**

**362. హత్థసంయతో పాదసంయతో, వాచాయ సంయతో సంయతుత్తమో[1]।**
**అజ్ఝత్తరతో[2] సమాహితో, ఏకో సన్తుసితో తమాహు భిక్ఖుం । 3 ।**

*(హస్తసంయతః పాదసంయతో, వాచా సంయతః సంయతోత్తమః ।*
*అధ్యాత్మరతః సమాహిత, ఏకః సన్తుష్టస్తమాహుర్భిక్షుమ్ । 3 ।)*

హస్తపాదసంయమము, వాక్సంయమము గలవాడు, ఉత్తమ సంయమి. అధ్యాత్మరతుడు, సమాహితచిత్తుడు (సమాధియుక్తుడు) ఏకాంతవాసి, సంతుష్టుడునగువాడు భిక్షువనబడును.

---

(1) సిం.దే. పాఠమున, ఈ గాథ యందలి 'సంయతో' శబ్దమునకు బదులు 'సఞ్ఞతో' శబ్దము కూర్చబడినది. అర్థభేదము లేదు.

(2) అజ్ఝత్త (అధ్యాత్మ) శబ్దము ధ్యాన విషయమును ప్రతిపాదించును.

సావత్థి (జేతవనము) కోకాలికుడు

363. యో ముఖసంయతో భిక్ఖు, మన్తభాణీ[1] అనుద్ధతో ।
అత్థం[2] ధమ్మం చ దీపేతి, మధురం తస్స భాసితం ॥ 4 ॥

(యో ముఖసంయతో భిక్షుః, మన్త్ర భాణీ, అనుద్ధతః ।
అర్థం ధర్మఞ్చ దీపయతి, మధురం తస్య భాషితమ్ ॥ 4 ॥)

వాక్సంయమశాలి (నోటిపై అదుపుగలవాడు) సవివేకవచస్కుడు (చక్కగా విచారించి మాట్లాడువాడు) గర్వరహితుడు, (వినయశాలి), అర్థమును, ధర్మమును వివరించువాడునైన భిక్షువు యొక్క వాక్కు మధురమైనది (జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సంయమము ధర్మపథమున పరమకర్తవ్యము.)

సావత్థి (జేతవనము) ధమ్మారామథేరుడు

364. ధమ్మారామో ధమ్మరతో, ధమ్మం అనువిచిన్తయం।
ధమ్మం అనుస్సరం భిక్ఖు, సద్ధమ్మా[3] న పరిహాయతి ॥ 5 ॥

---

(1) భాష్యకారుడు భదన్త బుద్ధఘోషుడు, 'మన్తభాణీ' శబ్దము నిట్లు వివరించును. 'మన్తభాణీ'తి మన్తా వుచ్చతి పఞ్ఞా. తయాభణన సీలో' (అట్ఠకథ). ప్రజ్ఞాయుక్తముగ భాషించువాడని అర్థము. ఆధునిక వ్యాఖ్యాతలకీ యర్థము సమ్మతమే. 'Who speaks wisely' - Dr. S. Radha Krishnan, 'Speaks Wisdom' - Prof. N.K. Bhagwat. పాళీ భాషయందు 'వేద' 'మన్త' (మన్త్ర) శబ్దములకు జ్ఞానమని అర్థము. వేదార్థమున, మన్త (మన్త్ర) శబ్దప్రయోగము ప్రాయికముగ బహువచనమున కాన్పించును. 'వేద' శబ్దమునకు వ్యుత్పత్తి అర్థము, జ్ఞానమగుట వలన క్రమముగా 'మన్త' శబ్దము (బహువచనాంతము) సైతము జ్ఞానము, లేక, ప్రజ్ఞ అనునర్థమున రూఢి గాంచినది.

(2) అత్థం (అర్థం) ధమ్మంచ = ఐహికవిషయము, ఆధ్యాత్మిక విషయము. (Temporal and spiritual matters)

(3) సద్ధమ్మం= అష్టాంగమార్గము, నిర్వాణము, అను తొమ్మిది అలౌకిక ధర్మములను, ముప్పదియేడు (37) బోధి పక్షియ ధర్మములను నిర్దేశించునని ఆచార్య బుద్ధరక్షితథేరుని వివరణము. 'ధర్మారామ' శబ్దము ఏకారామ (నిర్ద్వంద్వ) శబ్దముతో సమమని మాక్సిముల్లరు పండితుడు భారత శ్లోకముదాహరించును..

పోల్చు :- 'ధమ్మారామో ధమ్మరతో, ధమ్మే ఠితో ధమ్మవినిచ్ఛయఞ్ఞూ।
నేవాచరే ధమ్మసన్దోసవాదం, తచ్ఛేహి నీయేథ సుభాసితేహి'

-ధర్మమునే క్రీడోద్యానముగ కలవాడై, ధర్మరతుడై, ధర్మస్థితుడై, ధర్మ వినిశ్చయవేదియై, ధర్మదూషణవాదరహితుడై, సత్య సదుపదేశములోనే కాలము గడుపవలయును.

(సుత్తనిపాతము II 9-4)

ముప్పదియేడు (37) బోధిపక్షీయధర్మములు
చూడు :- బుద్ధ దర్శనము (డా॥ రత్నాకరం బాలరాజు) 1962 పుటలు 207, 208

(ధర్మారామో ధర్మరతో, ధర్మ మనువిచిన్తయన్ ।
ధర్మ మనుసరన్ భిక్షుః, సద్ధర్మాన్న పరిహీయతే ॥ 5 ॥)

ధర్మమునే క్రీడోద్యానముగ కలవాడు (ధర్మమున నధివసించువాడు) ధర్మమునందే ఆనందించువాడు, ధర్మమునే ధ్యానించువాడు, ధర్మమునే అనుసరించువాడునైన భిక్షువు సద్ధర్మము నుండి చ్యుతిని (పతనమును) పొందడు. (చూడు గాథ - 32)

**రాజగృహము (వేళువనము)** **విపక్షసేవకుడు (భిక్షువు)**

365 **సలాభం నాతిమఞ్ఞెయ్య, నాఞ్ఞేసం పిహయం చరే ।**
**అఞ్ఞేసం పిహయం భిక్ఖు, సమాధిం[1] నాధిగచ్ఛతి ॥ 6 ॥**

(స్వలాభం నాఽతిమన్యేత, నాఽన్యేభ్యః స్పృహయన్ చరేత్ ।
అన్యేభ్యః స్పృహయన్ భిక్షుః, సమాధిం నాఽధిగచ్ఛతి ॥ 6 ॥)

భిక్షువు తనకు లభించిన దానిని నిరసింప (తిరస్కరింప) కూడదు; ఇతరులయెడ ఈర్ష్యతో చరింపకూడదు. అన్యుల లాభములకు ఈర్ష్యపడు (అసూయపడు) భిక్షువు, సమాధిని - సమాహితచిత్తమును - పొందజాలడు.

366. **అప్పలాభోపి చే భిక్ఖు, సలాభం నాతిమఞ్ఞతి ।**
**తం వే దేవా పసంసన్తి, సుద్ధాజీవిం అతన్దితం ॥ 7 ॥**

(అల్పలాభోఽపి చేద్ భిక్షుః, స్వలాభం నాతిమన్యతే ।
తం వై దేవాః ప్రశంసన్తి, శుద్ధాజీవ మతన్ద్రితమ్ ॥ 7 ॥)

అల్పలాభమైనను, తనకు లభించిన దానిని నిరసింపని, పరిశుద్ధ జీవనుడును, అప్రమత్తుడునైన భిక్షువును దేవతలు ప్రశంసింతురు.

---

(1) సమాధి - చిత్తైకాగ్ర్యము - ధ్యానము

**సావత్థి (జేతవనము) పఞ్చగ్గదాయకుడు (బ్రాహ్మణుడు)**

**367. సబ్బసో నామరూపస్మిం[1], యస్స నత్థి మమాయితం ।**
**అసతా చ న సోచతి, స వే భిక్ఖూ'తి వుచ్చతి ॥ 8 ॥**

*(సర్వశో నామరూపయో, యస్య నాఽస్తి మమాయితమ్ ।*
*అసతి చ న శోచతి, స వై భిక్షురిత్యుచ్యతే ॥ 8 ॥)*

నామరూపాత్మకమైన సంసారమున (మనః శరీరములయందు) నెవనికి మమత్వములేదో, తనకేమియు లేకున్నను, - తాను అకించనుడైనను - నెవడు దుఃఖింపడో, అట్టి వాడే భిక్షువనబడును.

**సావత్థి (జేతవనము) సంబహులభిక్ఖూ (అనేక భిక్షువులు)**

**368. మెత్తావిహారీ యో భిక్ఖు, పసన్నో బుద్ధసాసనే ।**
**అధిగచ్ఛే పదం సన్తం, సఙ్ఖారూపసమం సుఖం ॥ 9 ॥**

*(మైత్రీవిహారీ యో భిక్షుః, ప్రసన్నో బుద్ధశాసనే ।*
*అధిగచ్ఛేత్ పదం శాన్తం, సంస్కారోపశమం సుఖమ్ ॥ 9 ॥)*

సర్వభూతమైత్రీభావనతో జీవించువాడు, బుద్ధోపదిష్టమైన ధర్మమున ప్రసన్నుడు (శ్రద్ధావంతుడు), శాంతము, సర్వసంస్కారోపశమము (దేహోత్పత్తి హేతువులైన సంస్కారముల నాశము) పరమ సుఖరూపమైన (నిర్వాణ) పదమును పొందును.

**369. సిఞ్చ భిక్ఖు! ఇమం నావం, సిత్తా తే లహుమేస్సతి ।**
**ఛేత్వా రాగఞ్చ దోసఞ్చ, తతో నిబ్బానమేహిసి ॥ 10 ॥**

---

(1) బౌద్ధ సిద్ధాంతమున నామరూపములనగా మనః శరీరములు. 'నం' అను ధాతువునకు వంగుట అని అర్థము. విషయార్థమై వంగునది మనస్సు - నామము. రూపము = రక్తాస్థిమయ శరీరము మమాయితం = నామరూపముల (మనః శరీరముల) యందు తాదాత్మ్యము.

పోల్చు :- "నిర్మమో నిరహంకారః" - గీత- II-72 అసత్ - లేనిది. లేదా, నామ రూపములకు, అసత్ శబ్దము వర్తించును. యౌవన సౌందర్యము, మానసిక బలము - ఇవి, స్థిరమైనవి కావు. కాన ఇవియు అసత్తులే. అసత్య పదార్థములకై భిక్షువు దుఃఖింపడు.

(సిఞ్చ భిక్షో! ఇమాం నావం, సిక్తా తే లఘుత్వ మేష్యతి ।
ఛిత్త్వా రాగఞ్చ ద్వేషఞ్చ, తతో నిర్వాణ మేష్యసి । 10 ।)

శ్రమణుడా! ఈ నావను (దేహమును) జలవిముక్తమొనరింపుము. (నావయందలి జలము (అశుభవాసనల)ను తొలగింపుము.) జలవిముక్తమై నావ నీకు తేలిక కాగలదు. (ప్రయాణము సుగమము కాగలదు) రాగద్వేషముల ఛేదించినందున, నిర్వాణమును పొందగలవు.

(ఇది అర్హత్త్వము. జీవన్ముక్తిని, ఉపాధిశేష నిర్వాణమును నిర్దేశించును. **"రాగాది దోసబన్ధనాని ఛిన్దిత్వా అరహత్తం పత్తో తతో అపరభాగే, అనుపాదిసేస నిబ్బానం ఏహిసీతి అత్థో"** (బుద్ధఘోషుడు).

370. **పఞ్చ ఛిన్దే పఞ్చ జహే, పఞ్చచుత్తరి భావయే ।**
**పఞ్చ సఙ్గాతిగో భిక్ఖు, 'ఓఘతిణ్ణో'తి వుచ్చతి । 11 ।**

(పఞ్చ ఛిద్యాత్ పఞ్చ జహ్యాత్, పఞ్చాత్తరం భావయేత్[1] ।
పఞ్చ సఙ్గాతిగో భిక్షు, 'ఓఘతీర్ణ' ఇత్యుచ్యతే । 11 ।)

---

(1) పఞ్చ ఛిన్ధి పఞ్చ జహీహి పఞ్చోత్తరం భావయే । అని రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము.

పఞ్చ + ఆతరం = ప్రవాహమును దాటుటకు చెల్లింపవలసిన ఐదు తరపణ్యములు (పడవ నడుపువానికిచ్చు కూలి డబ్బులు (fare or freight) ('ఆతరస్తరపణ్యం స్యాత్' (అమరకోశము I-246)

**ఐదు ఛేదింపవలసినవి** - (పంచసంయోజనములు) (1) సక్కాయదిట్ఠి, (2) విచికిచ్ఛా, (3) సీలబ్బతపరమాస(4) కామతణ్హా, (5) పటిఘ

**ఐదు-త్యజింపవలసినవి:** (1) రూపరాగము, (2) అరూపరాగము, (3) మానము (4) ఉద్ధచ్చ (ఔద్ధత్యము) (5) అవిద్య. ఇవి (5+5) అన్నియు దశ సంయోజనములనబడును.

చూడు :- గాథ - 31 పాదటీక - దశసంయోజనముల వివరణము.

**ఐదు-అభ్యసింప (భావింప) వలసినవి** (1) శ్రద్ధ, (2) వీర్యము, (3) స్మృతి, (4) సమాధి, (5) ప్రజ్ఞ.,

**ఐదు-సంసర్గము నతిక్రమింపవలసినవి** (1) కామము లేక, లోభము, (2) ద్వేషము (3) మోహము, (4) మానము (5) మిథ్యా దృష్టి.

ఈ ఐదును క్రమముగ రూప (form), వేదనా (feeling), సంజ్ఞా (Notion), సంస్కార (predisposition), విజ్ఞానము (Intelligence) అను పంచస్కంధముల కన్వయింపవచ్చునని డా॥ రాధాకృష్ణ పండితుని వివరణము.

ఐదింటిని ఛేదింపవలెను. ఐదింటిని త్యజింపవలెను. తరువాతి ఐదింటిని భావింపవలెను (అభ్యసింపవలెను). ఐదింటి సంగతిని అతిక్రమించిన భిక్షువు 'ఓఘతీర్ణుడు' (ప్రవాహమును దాటినవాడు) అని అనబడును.

**371. ఝాయ భిక్ఖు! మా చ పమాదో,**
**మా తే కామగుణే భమస్సు[1] చిత్తం।**
**మా లోహగుళం[1] గిళీ పమత్తో,**
**మా కన్ది 'దుక్ఖమిదం'తి దయ్హ మానో[3] । 12 ।**

*(ధ్యాయ భిక్షో! మా చ ప్రమాదః,*
*మా తే కామగుణే భ్రమతు చిత్తమ్ ।*
*మా లోహగోళం గిల ప్రమత్తో,*
*మా క్రన్దీః 'దుఃఖ మిద'మితి దహ్యమానః ॥12 ।*

శ్రమణుడా! ధ్యానింపుము. ప్రమత్తత వలదు. నీ మనస్సు కామసుఖముల యందు భ్రమింప(రమింప)కుండుగాక! ప్రమత్తుడవై తప్తలోహపిండమును మ్రింగకుము. దహింపబడుచు, 'ఇది దుఃఖ'మని విలపింపకుందువు గాక! (చూడు. గాథ - 308)

**372. నత్థి ఝానం అపఞ్ఞస్స, పఞ్ఞా నత్థి అఝాయతో ।**
**యమ్హి ఝానఞ్చ పఞ్ఞాచ, స చ వే నిబ్బాన సన్తికే[4] । 13।**

---

ఇట్టి గూఢార్థవంతములగు శ్లోకములు మహాభారతాదుల యందును కాన్పించుచున్నవి. చూడు : మ.బా. ఉద్యోగ – (విదురనీతి).

**"ఏకయా ద్వే వినిశ్చిత్య, త్రీం శ్చతుర్భిర్వశే కురు**
**పంచ జిత్వా విదిత్వా షట్, సప్త హిత్వా సుఖీ భవ" ।**

1 – ప్రజ్ఞ, 2 – నిత్యానిత్యములు, 3– కామక్రోధ లోభములు, 4– శమ, దమ, శ్రద్ధా, ఉపరతులు, 5 – పంచేంద్రియములు, 6 – షడూర్మలు – ఆకలిదప్పులు, జరామరణములు, శోకమోహములు. 7 – పంచేంద్రియ మనో బుద్ధులు. వాని వ్యాపారములు.

(1) రమస్సు – బ్ర.దే.పా. (2) పోల్చు :- గాథ – 308 (3) డయ్హమానో–సింహళదేశీయపాఠాంతరము.

(4) పోల్చు :- **'నాస్తి బుద్ధి రయుక్తస్య, నచాఽయుక్తస్య భావనా ।**
**నచాఽభావయతః శాంతి, రశాంతస్యకుతః సుఖమ్ ।'** (భ.గీ. II. 66)

(అజితేంద్రియునకు ప్రజ్ఞయు, ధ్యానము సిద్ధింపవు. ధ్యానరహితునకు చిత్తశాంతియుండదు. అశాంత చిత్తునకు సుఖము–మోక్షానంద మెక్కడిది?)

*(నాఽస్తి ధ్యాన మప్రజ్ఞస్య, ప్రజ్ఞా నాఽస్త్యధ్యాయతః ।*
*యస్మిన్ ధ్యానఞ్చ ప్రజ్ఞాచ, స వై నిర్వాణస్యాఽన్తికే । 13 ।)*

ప్రజ్ఞా (వివేక) రహితునకు ధ్యానము లేదు. ధ్యానహీనునకు, ప్రజ్ఞ ఉండదు. ఎవని యందు ధ్యానము, ప్రజ్ఞయు నుండునో వాడే, నిర్వాణమునకు సమీపమున నుండును.

373. **సుఞ్ఞాగారం పవిట్ఠస్స, సన్తచిత్తస్స భిక్ఖునో ।**
**అమానుసీ రతీ హోతి, సమ్మా ధమ్మం విపస్సతో । 14 ।**

*(శూన్యాఽగారం ప్రవిష్టస్య, శాన్తచిత్తస్య భిక్షోః ।*
*అమానుషీ రతిర్భవతి, సమ్యగ్ధర్మం విపశ్యతః । 14 ।)*

ఏకాంతప్రదేశమున నివసించువాడు, శాంతచిత్తుడు, పరిపూర్ణధర్మమును దర్శించినవాడునైన శ్రమణునకు అతిమానుషమైన - దివ్యమైన-రతి-ఆనందము ప్రాప్తించును.

374. **యతో యతో సమ్మసతి, ఖన్ధానం ఉదయబ్బయం ।**
**లభతీ పీతిపామోజ్జం, అమతం తం విజానతం । 15 ।**

*(యతోయతః సంమృశతి, స్కన్ధానా ముదయవ్యయమ్ ।*
*లభతే ప్రీతి ప్రామోద్య, మమృతం తద్విజానతామ్ । 15 ।)*

మనఃశరీరతత్త్వములగు పంచస్కంధముల (రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానముల) ఉత్పత్తి వినాశముల గూర్చి మనుజు డెపుడు విచారించునో, అపు డతడు ప్రీతి, ప్రమోదముల అనుభూతిని పొందును. ఈ విచారము, (నిర్వాణదాయకమగుటచే) జ్ఞానులకు, అమృతరూపము.

375. **తత్రాయ మాది భవతి, ఇధ పఞ్ఞస్స భిక్ఖునో ।**
**ఇన్ద్రియగుత్తి సన్తుట్ఠి[1] పాతిమోక్ఖే చ సంవరో ।**
**మిత్తే భజస్సు కల్యాణే, సుద్ధాజీవే అతన్దితే । 16 ।**

---

(1) 'ఇన్ద్రియగుత్తీ', సన్తుట్ఠీ - పాఠాంతరములు.

*(తత్రాఽయ మాదిర్భవతీహ, ప్రాజ్ఞస్య భిక్షోః ।*
*ఇన్ద్రియగుప్తిః సన్తుష్టిః, ప్రాతిమోక్షే చ సంవరః ।*
*మిత్రాణి భజస్వ కల్యాణాని, శుద్ధాజీవాన్యతన్ద్రితాని* (1) *। 16 ।)*

ఇంద్రియసంయమము, సంతుష్టి, ప్రాతిమోక్షపాలనము, ఇది, ఇచ్చట, వివేకశాలియగు శ్రమణునకు పావన జీవితమునకు ప్రారంభము. ఇందు కొఱకు, సుగుణవంతులు, పరిశుద్ధజీవనులు, అప్రమత్తులు,(నిరాలసులు) నగు మిత్రుల సేవింపుము. (ప్రాతిమోక్షపాలనము - చూడు గాథ - 185 పాదటీక).

**376. పటిసన్థారవుత్తస్స**(2) **ఆచారకుసలో సియా ।**
**తతో పామోజ్జబహులో దుక్ఖస్సన్తం కరిస్సతి । 17 ।**

*(ప్రతిసంస్తారవృత్తః స్యాత్, ఆచారకుశలః స్యాత్ ।*
*తతః ప్రామోద్యబహులో, దుఃఖస్యాన్తం కరిష్యతి । 17 ।)*

శ్రమణుడు, సేవాసత్కారస్వభావుడును, ఆచారపాలనమున కుశలుడు (నిపుణుడు)ను, కావలయును, అందువలన, ఆనందభరితుడై దుఃఖమును నాశమొనరింపగలడు.

***సావత్థి (జేతవనము) వస్సికతే భిక్ఖూ (ఐదువందల మంది భిక్షువులు)***

**377. వస్సికా వియ పుప్ఫాని, మద్దవాని**(3) **పముఞ్చతి ।**
**ఏవం రాగఞ్చ దోసఞ్చ, విప్పముఞ్చేథ భిక్ఖవో । 18 ।**

---

(1) పోల్చు :- '**మిత్తే భజస్సు కల్యాణే, పన్తంచ సయనాసనం ।**
**వివిత్తం అప్పనిగ్ఘోసం, మత్తఞ్ఞూ హోహి భోజనే**' (సుత్తనిపాతము II-11-4)
'సుగుణవంతులగు మిత్రుల సాంగత్యమున నుండుము. గ్రామమునకు దూరమున ఏకాంత ప్రశాంతస్థానమున వసింపుము. భోజనమున సముచితమగు మితమును పాటింపుము.' - అని బుద్ధభగవానుడు తన కుమారుడగు రాహులున కుపదేశించెను. 375 గాథ చివరి పాదము కొన్ని ప్రతులలో 376 గాథ యొక్క ప్రథమ పాదముగ కూర్చబడియున్నది.
(2) 'పటిసన్థారవుత్త్యస్స' - బ్రహ్మదేశీయ పాఠము. 'ప్రతి సంస్తారవృత్తస్యాఽఽచారకుశలఃస్యాత్' - అని రాహులసాంకృత్యాయనుని సంస్కృతపాఠము.
(3) 'పచ్చవాని' (ప్రచ్యవాని) - పాఠాంతరము

(వర్షికా ఇవ పుష్పాణి, మృదూని[1] ప్రముఞ్చతి ।
ఏవం రాగఞ్చ ద్వేషఞ్చ, ప్రవిముఞ్చత భిక్షువః । 18 ।)

'వస్సికా'లత (మాలతీలత) తన మెత్తని - వాడిన-పూలను రాల్చునట్లు, శ్రమణులారా! మీరు రాగద్వేషములను త్యజింపుడు.

**సావత్థి (జేతవనము)** **సన్తకాయుడు (థేరుడు)**

**378. సన్తకాయో సన్తవాచో, సన్తమనో* సుసమాహితో ।**
**వన్తలోకామిసో భిక్ఖు, 'ఉపసన్తో'తి వుచ్చతి । 19 ।**

(శాన్తకాయో శాన్తవాక్, శాన్తమనాః సుసమాహితః ।
వాన్తలోకామిషో[2] భిక్షుః, 'ఉపశాన్త' ఇత్యుచ్యతే । 19 ।)

---

(1) మర్దితాని - రాహులసాంకృత్యాయనుని సంస్కృత పాఠము. ఇది సరికాదు.
'వస్సికా' శబ్దమును కొందఱు పండితులు మాలతీలత (Jasmine Creeper) సన్నజాజితీగ అని వివరించినారు. కాని దాని సంస్కృత రూపము 'వార్షికా' అని నా అభిప్రాయము. **'వార్షికం త్రాయమాణాప్యత్త్రాయన్తీ బలభద్రికా' । వార్షికమ్, త్రాయమాణా, త్రాయన్తీ, బలభద్రికా,** అనునవి **'కలుగానుగు' చెట్టు** - కలుక్రాంతవృక్షమునకు పేర్లు. (అమరకోశము II.196) (A medical plant). **'వార్షికం త్రాయమాణాయాం క్లీబం వర్షాభవే త్రిషు (మేదినీకోశము)**. మాక్సిముల్లర్, రాధాకృష్ణుడు మొదలగు వారు 'Vassika Plant' అని వ్రాసి, అనువదింపలేదు. 'వస్సిక' శబ్దమును 'మాలతి' అని అనువదించుట సముచితము కాదు. వాడిన జాజిపూలు 'మర్దవాని' మృదువుగనుండవు. **వన్తలోకామిసో** = వాంతి చేసికొన్న లోకసుఖములు కలవాడు. **ఆమిషమ్ = 'ఆమిషం భోగ్యవస్తుని, సంభోగే, ఉత్కోచే, పలలేఽపిచ।** = భోగ్యవస్తువు, సంభోగము, లంచము, మాంసము. ఇవన్నియు సాంసారిక ప్రలోభములే.
* 'సన్తమనో' - అనుటకు 'సన్తవా' (శాన్తవాన్) అని బ్ర.దే.పా., సిం.దే.పా. ఇది పౌజ్‌బాల్ పండితునకు సమ్మతము.

(2) పోల్చు :- **'వన్తలోకామిసో భిక్ఖు ఉపసన్తో తి' –**
**'సామిషం కురరం జఘ్నుర్బలినో యే నిరామిషాః'**
**తదామిషం పరిత్యజ్య స సుఖం సమవిన్దత'**

ముక్కున మాంసము గఱచుకొని పోవు లకుముకి పిట్టను బలవంతములైన గ్రద్దలు కొట్టగా ఆమిషము (మాంసము) వదలి అది సుఖించినది. (భాగ. XI.9-2)

**శ్యేనవత్ సుఖ దుఃఖీ త్యాగవియోగాభ్యామ్**

ఆమిషయుక్తమైన శ్యేనము - (డేగ) బలవంతమై మఱొక డేగ కొట్టగా ఆమిషమును విడిచి దుఃఖమును, స్వయముగా త్యజించి సుఖమును పొందుచున్నది. (సాంఖ్యదర్శనము-IV- 5)

మనోవాక్కాయముల యందు ప్రశాంతుడు,(సౌమ్యుడు) సుసమాహితుడు (సమాధియుక్తుడు), సాంసారిక ప్రలోభముల (భోగముల) త్యజించిన వాడునైన శ్రమణుడు 'ఉపశాంతు'డనబడును.

**సావత్థి (జేతవనము)** నజ్జలథేరుడు

**379. అత్తనా చోదయ'త్తానం, పటిమాసే అత్తమత్తనా(1) ।**
**సో అత్తగుత్తో సతిమా, సుఖం భిక్ఖు విహాహిసి । 20 ।**

*(ఆత్మనాచోదయే దాత్మానం, ప్రతివసేదాత్మా సమాత్మనా ।*
*స ఆత్మగుప్తః స్మృతిమాన్, సుఖం భిక్షో! విహరిష్యసి । 20 ।)*

శ్రమణుడా! నిన్ను నీవే చోదన (ప్రేరణ) చేసికొనుము. నిన్ను నీవే పరీక్షించుకొనుము. (నిన్ను నీతో సంయుక్తమొనరించుకొనుము) ఇట్లు ఆత్మగుప్తుడు (ఆత్మరక్షితుడు) స్మృతిమంతుడునై (అప్రమత్తుడునై) నీవు సుఖముగ విహరింపగలవు.

**380. అత్తా హి అత్తనోనాథో, అత్తా హి అత్తనో గతి(2) ।**
**తస్మా సంయమయ'త్తానం, అస్సం భద్రం'వ వాణిజో । 21 ।**

---

(1) పటిమంసేథ అత్తనా - పటిమాసేథ అత్తనా - పాఠాంతరములు
'పటివాసే అత్తమత్తనా' - రాహులసాంకృత్యాయనుని పాఠము.

(2) కో హి నాథో పరో సియా? - పాఠాంతరము
(ప్రొ. ఎన్.కె. భగ్వత్ స్వీకరించినది. ధమ్మపదం - బుద్ధసొసైటి, బాంబే).

పోల్చు :- **"ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ, రిపురాత్మనః ।**
**బంధురాత్మాఽఽత్మనస్తస్య, యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే, వర్తేతాత్మైవ శత్రువత్ ।'** (భ.గీ. VI-5,6)

బుద్ధుడనాత్మవాదియైనచో ఈ వాక్యములర్థరహితములు కాగలవు.

ఈ గాథ యందు నిత్యపరివర్తనాత్మకము క్షణికమునైన వ్యావహారికాత్మకు (Emperical self or psychophysical self) పరమార్థమైన సత్యాత్మకు గల భేదమును బుద్ధుడు నిర్దేశించుట గమనార్హము. పంచస్కంధములు అనాత్మకములు. ఇవి నా ఆత్మకాదు ('న మే సో అత్తా'). 'సబ్బే ధమ్మా అనత్తా' - సమస్తమానసికావస్థలు - వేదనా సంజ్ఞాసంస్కారములు - విజ్ఞాన స్కంధము (చిత్తము), దృశ్యమగు బాహ్యాభ్యంతర జగత్తు, సర్వము, అనాత్మకమను సిద్ధాంతమే, బుద్ధుని అనాత్మ

*(ఆత్మా హ్యాత్మనో నాథః, ఆత్మా హ్యాత్మనో గతిః।*
*తస్మాత్ సంయమయాఽఽత్మానం, అశ్వం భద్రమివ వాణిజః। 21 ।)*

తనకు తానే ప్రభువు; తనకు తానే గతి. కాన, వణిజుడు, భద్రాశ్వమును (ఉత్తమ జాతి గుఱ్ఱమును) వశపఱచుకొనునట్లు, నీవు నీ యాత్మను నిగ్రహించుకొనుము (వశీకరించుకొనుము).

**రాజగృహము (వేళువనము)** **వక్కలిథేరుడు**

381. **పామొజ్జబహులో భిక్ఖు, పసన్నో బుద్ధసాసనే।**
**అధిగచ్ఛే పదం సన్తం, సఙ్ఖారూపసమం సుఖం। 22 ।**

*(ప్రామోద్యబహులో భిక్షుః, ప్రసన్నో బుద్ధశాసనే।*
*అధిగచ్ఛేత్ పదం శాన్తం, సంస్కారోపశమం సుఖమ్। 22 ।)*

బుద్ధోపదేశమున ప్రసన్నుడు (శ్రద్ధావంతుడు) నిర్భరానందశాలియునగు శ్రమణుడు, శాంతము, సంస్కారోపశమము (జన్మహేతువులైన సంస్కారముల నశింపజేయునది) పరమ సుఖమయమునైన పదమును (నిర్వాణమును) పొందును.

---

(అనత్త) వాదము. దీనిని అపార్థమొనరించుకొని బుద్ధుడు అనాత్మవాదియని, క్షణికవాదియని, అతడు పరమార్థము నిరాకరించెనను అసత్యవాదము వ్యాప్తి చెందినది. (......... and it is almost universally claimed that the Buddha taught that there is no self – thus ignoring that what is actually denied is the reality of the mutable Ego or Psycho-Physical "individuality"..... (The living thoughts of Gotama the Buddha - Ananda K. Coomaraswamy and I. B. Horner 1956. page 23.)

సావత్థి (పుబ్బారామము) సుమనసామణేరుడు

382. యో హ వే దహరో భిక్ఖు, యుఞ్జతీ బుద్ధసాసనే ।
సో ఇమం[1] లోకం పభాసేతి, అబ్భాముత్తోవ చన్దిమా ॥ 23 ॥

*(యో హ వై దహరో భిక్షు, ర్యునక్తి బుద్ధశాసనే ।*
*స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చన్ద్రమాః ॥ 23 ॥)*

యౌవనముననే (చిఱుప్రాయముననే) బుద్ధధర్మమున సంలగ్నుడగు శ్రమణుడు (భిక్షువు) ఈ లోకమును మేఘనిర్ముక్తుడగు చంద్రుని వలె ప్రకాశింపజేయును. (దహరః - బాలకః)

*25 భిక్ఖువగ్గో సమత్తో*

భిక్షువర్గము సమాప్తము





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం

## బ్రాహ్మణవగ్గో – ఛబ్బీసతిమో

## (బ్రాహ్మణవర్గః – షడ్వింశః)

## 26 బ్రాహ్మణవర్గము – షడ్వింశాధ్యాయము

**సావత్థి (జేతవనము)** **పసాదబహులుడు (బ్రాహ్మణుడు)**
**(అధికశ్రద్ధావంతుడగు బ్రాహ్మణుడు)**

**383. ఛిన్ద సోతం పరక్కమ్మ, కామే పనుద బ్రాహ్మణ ।** (1)
**సంఖారానం ఖయం ఞత్వా, అకతఞ్ఞూసి బ్రాహ్మణ ॥ 1 ॥**

---

(1) వేదోక్తమగు బ్రాహ్మణ శబ్దమును పరమార్థమును పొందిన ఋషిపరముగ బుద్ధుడంగీకరించును. సర్వాహంకృతికి, కామములకు మూలాధారమగు వ్యష్టి అస్తిత్వము నిత్యమను విశ్వాసమును పరిత్యజించినవాడే బ్రాహ్మణుడు. కర్మములు, క్రతువులు, ఏకాంతవాసము, తన్మయావస్థ (Trance)– వీని వలన నెవడును బ్రాహ్మణుడు కాడు. అహంతావిస్మృతి, జీవసేవారూపమగు కర్మయోగము వలన మనుజుడు అహము నతిక్రమించి, అకృతమగు (uncreate)నిర్వాణము నెఱిగి బ్రాహ్మణుడగును. కృతము(నశ్వరము) అకృతము(అనశ్వరము) – వీనికి గల భేదమును బుద్ధుడిచ్చట స్పష్టమొనరించును. **బౌద్ధమతము సంస్కరింపబడిన బ్రాహ్మణ (హిందూ) మతమనుట మఱువరాదని జె.సి. జెన్నింగ్సు మహాశయుని అభిప్రాయము.** బ్రాహ్మణసంజ్ఞను నియతముగా గౌతముడు, గౌరవవాచకముగ నుపయోగించును. కాన, బుద్ధధర్మము, కొన్ని వేద వేదాంత మూల సిద్ధాంతములను నంగీకరించెననుట స్పష్టము. **బౌద్ధబ్రాహ్మణధర్మములు రెంటికి ఆధారభూమిక, బ్రహ్మమే.** బ్రహ్మము సకల వ్యష్టిత్వములకు,

(ఛిన్ధి స్రోతః పరాక్రమ్య, కామాన్ ప్రణుద బ్రాహ్మణ ! ।
సంస్కారాణాం క్షయం జ్ఞాత్వా, ఒకృతజ్ఞోఒసి బ్రాహ్మణ! ।। 1 ।)

---

సకలాహంతలకు, సకలభేదములకు, సకలవివాదములకు, ఆధారభూమియై, సమరసపఱచు దివ్య అవ్యక్త తత్త్వము (Impersonal Divine Unity)

(The Vedantic Buddhism of the Buddha - J.G. Jennings - 1947)

చూడు :- ధమ్మపదము గాథ 383 - డా॥ రాధాకృష్ణ పండితుని వివరణము.

"అథాత ఆదేశః - 'నేతినేతి', నహ్యేతస్మాదితి నేత్యన్యత్పర మస్తి; అథ నామధేయం - సత్యస్య సత్యమితి; ప్రాణా వై సత్యమ్, తేషా మేష సత్యమ్ I" - (బృహదారణ్యకోపనిషత్ II-3-6) 'నేతి నేతి' అనునదియే బ్రహ్మము యొక్క ఆదేశము (Specification)· 'దీనికి మించిన విశేష నిర్దేశము బ్రహ్మమునకు లేదు. ప్రాణములు (Vital forces) సత్యము. బ్రహ్మము సత్యమునకు సత్యము. 'నేతి నేతి' అను రెండు నిషేధార్థక ప్రత్యయములు స్థూల సూక్ష్మోపాధుల నిరసించుట మాత్రమే కాక, నిర్విశేషత్వము వలన బ్రహ్మము నేవిధముగనైనను నిర్దేశించుట శక్యము కాదని తెలుపుచున్నవి.

**"నాంతః ప్రజ్ఞం, న బహిః ప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం,**

**న ప్రజ్ఞానఘనం, న ప్రజ్ఞం, నాప్రజ్ఞమ్, అదృష్ట మవ్యవ**

**హార మగ్రాహ్య మలక్షణ మవ్యపదేశ్యమైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమనం, శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః (మాండూక్యోపనిషత్ - 10)**

బ్రహ్మమును - ఆత్మను-గుఱించిన ఈ ఉపనిషద్వర్ణనము, గౌతమబుద్ధుని నిర్వాణ వర్ణనము (అమతో గాధం నిబ్బాణో గాధం) నొక్కటియే. బుద్ధుడు అనాత్మయని నిరసించినది స్కంధములలోని అహమును, బౌద్ధులు, దీనిని ఆత్మగా భావించి, బుద్ధుని అనాత్మవాదియని క్షణికవాదియని అపార్థము జేసికొన్నారు. అవిద్యనతిక్రమించిన (నశించిన) మహాత్ములకు సంసార (Becoming) నిర్వాణము (Being) లేకరూపమే. **జనన మరణాద్యవస్థల పొందునది, విజ్ఞానమయకోశమున ప్రతిబింబితమైన సోపాధిక చైతన్యమే. పరాత్మకు - బ్రహ్మమునకు - జనన మరణాది అవస్థలు లేవు. అని వేద సిద్ధాంతము. సాంఖ్యుల కేవల జ్ఞానము, యోగుల చిత్తవృత్తి నిరోధము, ఉపనిషత్తుల పరమపదము - తద్విష్ణోః పరమంపదమ్ - ఇవన్నియు ఒకే తత్త్వము యొక్క విభిన్న వర్ణనములనుట సిద్ధాంతము.**

"In this identification, there is effected a reconcilliation of religion with the world, which remained beyond the grasp of Theravada Buddhists. The distinctions between early Buddhism and Brahmanism, however practically important, are thus merely temperamental, fundamentally there is absolute agreement that bondage consists in the thought of I and Mine, and that this bondage may be broken only for those in whom all craving is extinct. **In all essentials Buddhism and Brahmanism (Hinduism) form a single system."** (Buddha and the Gospel of Buddhism - Ananda K. Kumara Swamy 1974 - First Indian edition)

ఓ బ్రాహ్మణా! పరాక్రమించి (ప్రయత్నించి) తృష్ణావాహినిని విచ్ఛిన్న మొనరింపుము. కామసుఖముల పారద్రోలుము. సంస్కారముల (కృతవస్తు సముదాయము యొక్క ఉపాదానములగు పంచస్కంధముల) వినాశము నెఱిగినపుడు, అకృతము (అనశ్వరము - నిర్వాణము) నెఱుగగలవు. (నిర్వాణము పంచస్కంధముల నిరోధము (నాశము extinctions) 'పంచానం ఖందానం నిరోధో' - (విసుద్ధిమగ్గము). నిరోధ, నిర్మోక్ష నిర్వృతి నిర్వేద శబ్దములు నిర్వాణమునకు పర్యాయపదములు).

**సావత్థి (జేతవనము) సమ్బహులేభిక్ఖూ (పలువురు భిక్షువులు)**

**384. యదా ద్వయేసు ధమ్మేసు, పారగూ హోతి బ్రాహ్మణో ।**
**అథ'స్స సబ్బే సంయోగా, అత్థం గచ్ఛన్తి జానతో । 2 ।**

*(యదా ద్వయోర్ధర్మయోః, పారగో భవతి బ్రాహ్మణః ।*
*అథాఽస్య సర్వే సంయోగా, అస్తం గచ్ఛంతి జానతః । 12 ।)*

బ్రాహ్మణుడు, రెండు ధర్మముల (చిత్త సంయమము, ధ్యానము వలన సిద్ధించు జ్ఞానము) యొక్క పారము (ఆవలితీరము)ను జేరినపుడు, జ్ఞానియగు నాతని సర్వసంయోగములు (బంధములు) అస్తమించును (నశించును). (బ్రాహ్మణ సంజ్ఞ, 'అర్హత్' సంజ్ఞకు పర్యాయశబ్దముగ ఇచ్చట ప్రయుక్తము. రెండు ధర్మములు - ఆధ్యాత్మికములగు ఇంద్రియములను, బాహ్యములగు శబ్దాది విషయములను, నిర్దేశించునని భాష్యకారుడు భదన్త బుద్ధఘోషుని వివరణము. ఇది సరికాదని మాక్సీముల్లర్ పండితుని అభిప్రాయము).

**సావత్థి (జేతవనము) మారుడు**

**385. యస్స పారం అపారం వా, పారాపారం న విజ్జతి ।**
**వీతద్దరం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం[1] । 3 ।**

(1) **ఈవలి తీరము** - ఆధ్యాత్మికములగు త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, మనస్సులను, **ఆవలి తీరము** బాహ్యములగు స్పర్శ, రూప, శబ్ద, రస, గంధ, ధర్మములను, **ఉభయతీరములు,** అహంకార మమకారములను నిర్దేశించునని బౌద్ధభాష్యకారుల వివరణము. ఆధ్యాత్మికములగు ఇంద్రియములకు మనస్సుతో కలిసి ఆఱగు ఇంద్రియములకు 'షడాయతనము'లని బౌద్ధుల పరిభాష.(The sense - Bases).

*(యస్య పారమపారం వా, పారాఽపారం న విద్యతే ।*
*వీతదరం విసంయుక్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 3 ।)*

ఎవనికి ఆవలి తీరము, ఈవలి తీరము - ఉభయ తీరములును లేవో, నిర్భయుడు, అనాసక్తుడునగు అట్టి వానిని బ్రాహ్మణుడని నేనందును.

**సావత్థి (జేతవనము)**　　　**అఞ్ఞతర బ్రాహ్మణుడు (ఒకానొక బ్రాహ్మణుడు)**

**386. ఝాయిం విరజ మాసీనం, కతకిచ్చ మనాసవం ।**
**ఉత్త మత్థ మనుప్పత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 4 ।**

*(ధ్యాయినం విరజమాసీనం, కృతకృత్యమనాస్రవమ్ ।*
*ఉత్తమార్థ మనుప్రాప్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 4 ।*

ధ్యాని, రజోగుణరహితుడు, స్థిరుడు (ఆసనబద్ధుడు) కృతకృత్యుడు, నిర్మలుడు, పరమార్థప్రాప్తుడునగు మనుజుని బ్రాహ్మణుడని నేనందును.

**సావత్థి (మిగారమాతు పాసాదము)**　　　**ఆనందథేరుడు**

**387. దివా తపతి ఆదిచ్చో, రత్తి మాభాతి చన్దిమా ।**
**సన్నద్ధో ఖత్తియో తపతి, ఝాయీ తపతి బ్రాహ్మణో ।**
**అథ సబ్బ మహోరత్తిం, బుద్ధో తపతి తేజసా । 5 ।**

*(దివా తపత్యాఽదిత్యో, రాత్రావాభాతి చన్ద్రమాః ।*
*సన్నద్ధః క్షత్రియస్తపతి, ధ్యాయీ తపతి బ్రాహ్మణః ।*
*అథ సర్వ మహోరాత్రం, బుద్ధస్తపతి తేజసా । 5 ।)*

పగలు సూర్యుడు ప్రకాశించును. రాత్రి చంద్రుడు ప్రకాశించును. కవచధారియై క్షత్రియుడు ప్రకాశించును. ధ్యాననిష్ఠుడై బ్రాహ్మణుడు ప్రకాశించును. కాని, బుద్ధుడు దివారాత్రములరెంటను స్వతేజముతో అందఱికంటె నధికముగ ప్రకాశించును.

**సావత్థి (జేతవనము)** **అఞ్ఞతర బ్రాహ్మణ పబ్బజితుడు**
**(ఒకానొక బ్రాహ్మణ సంన్యాసి.)**

**388. బాహితపాపో'తి బ్రాహ్మణో, సమచరియా సమణో'తి వుచ్చతి ।**
**పబ్బాజయమత్తనో మలం, తస్మా పబ్బజితో'తి వుచ్చతి । 6 ।**

*(బాహితపాప ఇతి బ్రాహ్మణః, శమచర్యః శ్రమణ ఇత్యుచ్యతే ।*
*ప్రవ్రాజయన్నాత్మనోమలం, తస్మాత్ ప్రవ్రజిత ఇత్యుచ్యతే । 6 ।)*

పాపము తొలగించుకొన్నవాడు (నిష్కాసితపాపుడు), బ్రాహ్మణుడనబడును. శమముతో (శాంతితో) చరించువాడు శ్రమణుడనబడును. చిత్తమాలిన్యమును సంన్యసించినందున ప్రవ్రజితుడు (సంన్యాసి) అనబడును. (ఈనిరుక్తులు కేవలము మనఃకల్పితములు. 'బాహ్' నుండి బ్రాహ్మణశబ్దము నిష్పన్నమైనపుడు దానిని 'బాహ్మణో' అని ఉచ్చరింపవలెను. బౌద్ధ సంస్కృతమున 'బాహ్' శబ్దము, తొలగించు అనునర్థమున తఱచుగ ప్రయుక్తము. సమ్ నుండి 'సమణ' శబ్దము, పబ్బజ్ నుండి 'పబ్బజిత' శబ్దము నిష్పన్నములు. ఈ కల్పిత నిరుక్తులు (వ్యుత్పత్తి అర్థములు) భారతదేశమున వ్యావహారిక భాషా (Spoken Language) శబ్దముల వ్యుత్పత్తిజీవనభ్రంశమును, చాటుచున్నవి. ఇట్టి భ్రంశావస్థ యందే ఇట్టి కల్పిత నిరుక్తులు సాధ్యపడును. (చూడుః గాథలు 184, 265 - పాదటీకలు - మాక్సిముల్లర్; రాధాకృష్ణ పండితుడు).

**సావత్థి (జేతవనము)** **సారిపుత్తథేరుడు**

**389. న బ్రాహ్మణస్స పహరెయ్య, నా'స్స ముఞ్చేథ బ్రాహ్మణో ।**
**ధీ[1] బ్రాహ్మణస్స హన్తారం, తతో ధీ యస్స ముఞ్చతి । 7 ।**

*(న బ్రాహ్మణం ప్రహరే, న్నాఽస్మై ముఞ్చేద్బ్రాహ్మణః ।*
*ధి గ్బ్రాహ్మణస్య హన్తారం, తతోధిగ్ యస్మై ముఞ్చతి । 7 ।)*

---

(1) ధి - పాఠాంతరము. (రాహులసాంకృత్యాయనుడు)

బ్రాహ్మణుని ప్రహరింప (హింసింప)కూడదు. తన్ను ప్రహరించిన (హింసించిన) వాని యెడ బ్రాహ్మణుడు( ప్రహారము-దెబ్బ-వదలకూడదు). ప్రతిహింసకు పూనకూడదు. బ్రాహ్మణహంత నింద్యుడు. తన్ను హింసించిన వాని యెడ ప్రతిహింసకు పూనువాడు, మఱింత నింద్యుడు.

(బ్రాహ్మణుడు అపకారికి ప్రత్యపకారము చేయకూడదు. తన్ను హింసించినపుడు, అతడు తన చిత్త సమతను కోల్పోకూడదు. శ్వాసించు ఏ ప్రాణి ప్రాణమును, బ్రాహ్మణుడు హరింపకూడదు. తన ప్రాణత్యాగము, తన తోడి ప్రాణిని రక్షించునట్టైన, తాను చిందింపవలసిన ఒకే రక్తము తన రక్తమే. (రాధాకృష్ణపండితుడు).)

**390. న బ్రాహ్మణస్సేతదకిఞ్చి సెయ్యో,**
**యదా నిసేధో మనసో పియేహి।**
**యతోయతో హింసమనో నివత్తతి,**
**తతో తతో సమ్మతిమేవ దుక్ఖం। 8 ।**

*(న బ్రాహ్మణస్యైతదకిఞ్చిత్ శ్రేయః,*
*యదా నిషేధో మనసా ప్రియేభ్యః।*
*యతోయతో హింస్రమనో నివర్తతే*
*తతస్తతః శామ్యత్యేవ దుఃఖమ్ । 8 ।)*

తనకు ప్రియములైన ప్రాపంచికవిషయసుఖముల నుండి మనస్సును నిరోధించినపుడు, బ్రాహ్మణునికి కల్గు శ్రేయస్సు అల్పము కాదు. ఎపుడు క్రూరమైన మనస్సు (హింసాకృత్యముల నుండి) నివర్తించునో, అప్పుడే దుఃఖ ముపశమించుచున్నది.

*సావత్థి (జేతవనము)* *మహాప్రజావతి గౌతమి)*

**391. యస్స కాయేన వాచాయ, మనసా నత్థి దుక్కతం[1] ।**
**సంవుతం తీహి ఠానేహి, తమహం బ్రూమి బ్రాహ్మణం । 9 ।**

(1) దుక్కటం - బ్ర.దే.పా.

(యస్య కాయేన వాచా, మనసా నాఽస్తి దుష్కృతమ్ ।
సంవృతః త్రిభిః స్థానైః, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 9 ।)

శరీరముతో, వాక్కుతో, మనస్సుతో నెవడు దుష్కృతమొనరింపడో, ఈ త్రికరణముల యందెవడు సంయమశాలియో, వానిని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **సారిపుత్తథేరుడు**

**392. యమ్హా ధమ్మం విజానెయ్య, సమ్మాసంబుద్ధదేశితం ।**
**సక్కచ్చం తం నమస్సెయ్య, అగ్గిహుత్తం'వ బ్రాహ్మణో ॥ 10 ॥**

(యస్మాద్ధర్మం విజానీయాత్, సమ్యక్సంబుద్ధదేశితమ్ ।
సత్కృత్య తం నమస్యే దగ్నిహోత్రమివ బ్రాహ్మణః ॥ 10 ॥)

సమ్యక్సంబుద్ధునిచే (పరిపూర్ణ జ్ఞానియగు బుద్ధునిచే) నుపదిష్టమైన ధర్మము నెవని నుండి మనుజుడు చక్కగ గ్రహించునో వానిని, బ్రాహ్మణు డగ్నిహోత్రమును వలె, సత్కరించి నమస్కరింపవలెను.

**సావత్థి (జేతవనము)** **ఒక జటిల బ్రాహ్మణుడు**

**393. న జటాహి న గొత్తేన, న జచ్చా హోతి బ్రాహ్మణో ।**
**యమ్హి సచ్చఞ్చ ధమ్మో చ, సో సుచీ (1) సో చ బ్రాహ్మణో ॥ 11 ॥**

---

(1) సుఖీ - ప్రొ. ఎన్.కె. భగ్వత్ స్వీకరించిన పాఠము.

పోల్చు :- **'న జచ్చా వసలో హోతి, న జచ్చా హోతి బ్రాహ్మణో ।**
**కమ్మునా వసలో హోతి, కమ్మునా హోతి బ్రాహ్మణో ।**

జన్మముచే నెవడును వృషలుడు (శూద్రుడు) కాని, బ్రాహ్మణుడు కాని, కాడు. కర్మము చేతనే వృషలుడు కాని, బ్రాహ్మణుడు కాని అగుచున్నాడు. (సుత్తనిపాతము I-7-21))

**'మా జాతిం పుచ్ఛ చరణం చ పుచ్ఛ ।**
**కట్ఠా హవే జాయతి జాతవేదో ।**
**నీచా కులీనోపి ముని ధితిమా,**
**ఆజానియో హోతి హిరీనిసేధో ।'**

బుద్ధుడు సుందరికభరద్వాజుడను బ్రాహ్మణున కిట్లుపదేశించెను. 'జాతి విషయమై ప్రశ్నింపకుము. ఆచరణవిషయమై ప్రశ్నింపుము. కాష్ఠము నుండి అగ్ని జనించును. ఇట్లే, నీచకులమున జన్మించినను, ముని, పాపాచరణమునకు లజ్జించి - ఆత్మసంయమశాలియైనచో ధృతిమంతుడు నుత్తమోత్తముడు నగుచున్నాడు. (సుత్తనిపాతము-III-4-8)

*(న జటాభి ర్నగోత్రేణ, న జాత్యా భవతి బ్రాహ్మణః ।*
*యస్మిన్ సత్యఞ్చ ధర్మశ్చ, సశుచిః స చ బ్రాహ్మణః ॥ 11 ॥)*

జటాధారణచే గాని, గోత్రముచే గాని, జన్మముచే గాని నెవడును బ్రాహ్మణుడు కాడు. ఎవని యందు సత్యము, ధర్మము నుండునో వాడే పవిత్రుడు; వాడే బ్రాహ్మణుడు.

**వేసాలి (కూటాగారసాల)** **ఏకవగ్గులివలకుహక బ్రాహ్మణ.**
**(ఒక పాషండ బ్రాహ్మణుడు)**

**394. కిం తే జటా హి దుమ్మేధ!, కిం తే అజినసాటియా? ।**
**అబ్భన్తరం తే గహనం, బాహిరం పరిమజ్జసి ॥ 12 ॥**

*(కిం తే జటాభి ర్దుర్మేధః!, కిం తే ఉజిన శాట్యా? ।*
*అభ్యన్తరం తే గహనం, బాహ్యం పరిమార్జయసి ॥ 12 ॥)*

మూర్ఖుడా! (దుర్బుద్ధీ) జటాధారణచేగాని, మృగచర్మధారణచే గాని, నీకేమి ప్రయోజనము? నీ అంతరంగము అంధకారమయము (రాగాది మలభరితము) బాహ్యమును మాత్రము శుభ్రపఱుచుచున్నావు. (సంన్యాస చిహ్నముల దాల్చుచున్నావు). బాహ్యవేషధారణ, రాగాదివాసనాదూషితుడగు వ్యక్తిని శుద్ధిపఱుపజాలవు.
(చూడు - గాథ 141- పాదటీక).

**రాజగృహము (గిజ్ఝకూటము)** **కిసాగోతమి**

**395. పంసు కూలధరం జన్తుం, కిసం ధమనిసన్థతం ।**
**ఏకం వనస్మిం ఝాయన్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 13 ॥**

*(పాంశుకూలధరం జన్తుం, కృశం ధమనిసన్తతమ్ ।*
*ఏకం వనే ధ్యాయన్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ॥ 13 ॥)*

ధూళిధూసరితజీర్ణవస్త్రధారి, కృశించి నరములేర్పడిన దేహము కలవాడు, వనమున నేకాంతవాసియై ధ్యాననిమ్నడునైన జనుని, నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **ఒక బ్రాహ్మణుడు**

**396. న చాహం బ్రాహ్మణం బ్రూమి, యోనిజం మత్తిసంభవం।**
**'భో' వాది నామ సో హోతి, స చే హోతి సకిఞ్చనో(1)।**
**అకిఞ్చనం అనాదానం, తమహం బ్రూమి బ్రాహ్మణం। 14।**

*(న చాఽహం బ్రాహ్మణం బ్రవీమి, యోనిజం మాతృసంభవమ్ ।*
*'భో'వాదీ నామ స భవతి, స వై భవతి సకిఞ్చనః ।*
*అకిఞ్చనమనాదానం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 14 ।)*

---

(1) కిఞ్చన - ధనము (Wealth); అసంగము అని రెండర్థములు. సకించనుడు - కలవాడు; ధనవంతుడు (కించ-సాకల్యే). 'భో' వాది - బుద్ధని కాలమున బ్రాహ్మణులు గుణప్రసక్తి లేకుండ తమ్ము జాతిమాత్రముననే, ఇతరుల కంటె మహోన్నతులని భావించెడివారు. అది దైవదత్తమగు విశేషాధికారమని వారి నిశ్చయము. బ్రాహ్మణేతరుల నందఱిని, క్షత్రియుడగు బుద్ధభగవానుని సైతము, వారు గర్వితులై తమ ఆధిక్యమును నిరూపించుకొనుటకు తక్కువవారిని, లేక, సమానులను నిరాదరముగ సంబోధించునట్లు 'భో' 'భోః' అని పిలుచుచుండిరి బుద్ధభగవానుని బ్రాహ్మణులు 'భోః' అని సంబోధింపగా, ఆయన శిష్యులు ఆయనను 'భన్తే' - ప్రభూ- అని సంబోధించుచుండిరి కాన, బ్రాహ్మణులు 'భో'వాదులు. అనగా, దృప్తులు, గర్విష్ఠులు. బౌద్ధులు, బ్రాహ్మణులను నిందార్థమున 'భో' వాదులని వ్యవహరించుచుండిరి. (బుద్ధరక్షితథేరుడు; మాక్సిముల్లరు, రాధాకృష్ణుడు) ఈ అభిజాత్యగర్వము ఎవరియందున్నను, మోక్షశాస్త్రములైన వేదశ్రుతులకు, ఉపనిషత్తులకు, గీతకు, సాంఖ్య, యోగాది షడ్దర్శనశాస్త్రములకు విరుద్ధము. మహర్షివసిష్ఠుడు, యోగవాసిష్ఠమున సర్వభూతబంధుత్వమును మనోజ్ఞముగ నిరూపించినాడు.

**'అయం బంధురయం నేతి, గణనా లఘుచేతసామ్।**
**ఉదారచరితానాం తు, విగతావరణైవ ధీః।**
**ఏకత్వే విద్యమానస్య, సర్వగస్య కిలాత్మనః।**
**అయం బంధు పరశ్చాయ మిత్యసౌ కలనా కుతః ?।**
**సర్వా ఏవ హి తే భూతజాతయోరామ ! బంధవః।**
**అత్యన్తాసంయుతా ఏతాస్తవ రామ! న కాశ్చన।"**

(యో వా. V.18.61; V.20.4: V.18.64 )

('ఇతడు బంధువు, ఇతడు శత్రువు' - అను పరిగణన (భేదదృష్టి), అల్పబుద్ధులకు మాత్రమే యుండును. ఉదారచరిత్రులకు బుద్ధి, ఆవరణరహితము. (భేదదృష్టియుండదు).

ఏకరూపమున సర్వగతమైయున్న ఆత్మకు - 'ఇతడు బంధువు,
ఇతడు శత్రువు' - అను కల్పన యెక్కడిది?
రామా! సృష్టి యందలి జీవజాతులన్నియు నీ బంధువులే. జన్మపరంపరలను బట్టి, నీతో

కేవలము బ్రాహ్మణియగు తల్లి గర్భమున జనించిన వానిని నేను బ్రాహ్మణుడనను. (అతడు కేవలము జాతి మాత్రోపజీవి) వస్తుధనసంగ్రహపరాయణుడై అతడు 'భో'వాది అగుచున్నాడు. అకించనుడు. అపరిగ్రహశీలుడునైన వానిని నేను బ్రాహ్మణుడందును.

(పోల్చు :– సుత్తనిపాతము – వాసెట్ఠ, సుందరిక భరద్వాజ –సుత్తములు)

---

సంబంధ బాంధవ్యములు లేని జీవజాతి యేదియులేదు.)

ఉపనిషద్గీతాదిమోక్షసంహితల యందలి సమదర్శనత్వము, సర్వభూతహితరతి – వాసుదేవః సర్వమ్ – ఇత్యాది మహోన్నత తత్త్వ దర్శమును గూర్చి ప్రత్యేకముగ వివరింప నవసరము లేదు. కాని జన్మబద్ధులగు మనుష్యులు నాడు, నేడు, స్వార్థపరులై సర్వశ్రేయస్సుకు అనారోగ్యకరమైన ఆభిజాత్యగర్వముతో ప్రవర్తించుచుండుట వలన, భగవంతుడగు బుద్ధుడు దానిని ఖండించి వేదోక్తమగు బ్రాహ్మణ్యము ప్రబోధించి స్థాపింపవలసి వచ్చినది. 'భో వాది' శబ్దమును నింద్యార్థమున 'arrogant' (గర్వితుడు) అని మాక్సిముల్లర్ పండితుడు, Supercilious - అత్యుద్ధతుడు – అని బుద్ధరక్షిత థేరుడును వివరించినారు. రాధాకృష్ణ పండితుడును వారినే అనుసరించినాడు కాని, 'భోః' శబ్దము వారు భావించినట్లు తక్కువ వారిని గుఱించిన సంబోధన శబ్దము కాదు. అది కేవలము సంబోధనార్థకము '......**భోఽథ సంబోధనార్థకాః – (అమరకోశము). 'భోస్తు సంబోధన విషాదయోః – మేదినీకోశము)**. 'భోవాది = భోః శబ్ద సంబోధనమునకు యోగ్యుడు అని ప్రొ. ఎన్.కె. భగ్వత్ పండితుడు (ధమ్మపదం Buddha Society, Bombay 1935) వివరించును. ఇది గౌరవ వాచకమని ఆయన భావము.

**"భోః వస్తద్వీవవర్తి వో రాజానశ్చేతయధ్వమ్"–**

**అయి భో మహర్షిపుత్ర!** (శాకుంతలము) ఇత్యాది వాక్యములు **భోః** శబ్దము నీచ సంబోధనమున నుద్దిష్టము కాదని తెలుపుచున్నవి. భోః శబ్దము ఆంగ్ల శబ్దము **'Sir'** అనుటకు సమానమని విజ్ఞులు కొందరు వివరించినారు. వాస్తవమిట్లుండగా, బుద్ధభగవానుడు గాని ఆయన శిష్యులు గాని, బ్రాహ్మణుల నిందించుచు వారి పట్ల నీ శబ్దము ప్రయోగించినారనుట సత్యదూరము; మిథ్యారూపము. గాథ యందలి రెండవ పాదము నకర్థము – 'అతడు సకించనుడు (ధనాఢ్యుడు) అయినచో, భోః (Sir) సంబోధనమునకు యోగ్యుడగును' – 'భో వాది'కాగలడు. అని వివరించినారు కొందఱు పండితులు. ఇదియే వాస్తవార్థము. **బుద్ధగౌతముడు 'బ్రాహ్మణ' – శబ్దమును 'అర్హత్' శబ్దమునకు పర్యాయముగా నుపయోగించుట గమనార్హము. ధమ్మపదమందలి ఈ బ్రాహ్మణ వర్గము, వేదోక్తమైన పరమాదర్శము – 'బ్రాహ్మణ్యం పదమద్వయమ్' – మనోజ్ఞముగ నిరూపించినది.**

సారతత్త్వము నెఱుగని మిథ్యాచారుల; జాతిబద్ధులగు దురహంకారుల దుర్భావములను మాత్రమే గౌతముడు నిరసించినాడు; సత్యధర్మమును ప్రతిష్ఠించినాడు. అంతేకాని, క్షుద్రమగు జాతివాదమును తథాగతున కారోపించుట విషాదకరము.. ఈ సత్యమును పలు సందర్భములలో ఈ ధమ్మపదవివరణమున మాచే విశదమొనరింపబడినది.

**సావత్థి (జేతవనము)** **ఉగ్గసేనసెట్ఠి పుత్తుడు**
**(రాజగృహము- (వేళువనము)?)**

397. **సబ్బసంయోజనం ఛెత్వా, యో వే న పరితస్సతి ।**
**సఙ్గాతిగం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 15 ।**

*(సర్వ సంయోజనం ఛిత్త్వా, యో వై న పరిత్రస్యతి ।*
*సఙ్గాతిగం విసంయుక్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 15 ।)*

ఎవడు సర్వబంధములను త్రుంచివేసి, భయకంపితుడు కాడో, సంగవిముక్తుడు, అనాసక్తుడునైన అట్టి మనుజుని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **ఇద్దరు బ్రాహ్మణులు**

398. **ఛెత్వా నన్దిం[1] వరత్తఞ్చ, సన్దానం[2] సహనుక్కమం ।**
**ఉక్ఖిత్త పళిఘం[3] బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 16 ।**

*(చిత్త్వా నన్దిం వరత్రాఞ్చ, సన్దానం సహనుక్రమమ్[4] ।*
*ఉత్క్షిప్త పరిఘం బుద్ధం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 16 ।)*

నందిని (తోలువారు-క్రోధము), వరత్ర (తోలుమోకు-తృష్ణ)ను, సందానము (పగ్గము - 63 పాషండసిద్ధాంతములు)ను, సహనుక్రమముగ - సపరివారముగ(నిగూఢపాపసంస్కారములతో కూడ) విచ్ఛిన్న మొనరించి, పరిఘ (ఇనుపకట్ల గుదియ- అవిద్య)ను భగ్నమొనరించిన బుద్ధుని (జ్ఞానిని) నేను బ్రాహ్మణుడందును.

---

(1) 'నద్ధిం' - సిం. దే.పా. 'నన్ధిం' - పాఠాంతరము.
(2) 'సన్దామం'; 'సన్దనం' - సిం.దే.పా.
(3) 'పలిఘం' - బ్ర.దే.పా.
(4) సహనుక్రమమ్ = 'హనుః' - ఈ శబ్దమునకు మృత్యువు, బాణము, రోగము, అను అర్థములున్నవి. **'మృత్యావస్త్రేగదే' - (మేదినీకోశము).** కాన 'సహనుక్రమ'మనగా అనర్థదాయకములైన నిగూఢపాప సంస్కారములని వివరింపవచ్చును. కాని ఈ శబ్దమును 'appendages' - (అనుబంధములు) అని కొందఱు, (ముఖ్ పర్ బాంధనే కా వస్త్ర.) 'ముఖ బంధము' అని మఱి కొందఱు వివరించినారు.

**రాజగృహము (వేళువనము) అక్కోసకభరద్వాజుడు**

**399. అక్కోసం వధబన్ధఞ్చ, అదుట్ఠో యో తితిక్ఖతి ।**
**ఖన్తీబలం[1] బలానీకం[2], తమహం బ్రూమి బ్రాహ్మణం । 17 ।**

*(అక్రోశం వధబన్ధం చాఽదుష్టో యస్తితిక్షతి ।*
*క్షాన్తిబలం బలానీకం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 17 ।)*

తాను, అదుష్టుడు (కలుషరహితుడు) అయినను, నిందను, హింసను, బంధనము (కారాగారవాసము), నెవడు సహించునో, ఎవనికి బలమును, సేనావాహినియును క్షాంతియో, అట్టి వానిని నేను బ్రాహ్మణుడందును.

**రాజగృహము (వేళువనము) సారిపుత్తథేరుడు**

**400. అక్కోధనం వతవన్తం, సీలవన్తం అనుస్సుతం[3] ।**
**దన్తం అన్తిమసారీరం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 18 ।**

*(అక్రోధనం వ్రతవన్తం, శీలవన్త మనుశ్రుతమ్ ।*
*దాన్త మన్తిమశారీరం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 18 ॥)*

క్రోధరహితుడు, వ్రతనిష్ఠుడు, శీలవంతుడు, బహుశ్రుతుడు, జితేంద్రియుడు, అంతిమశరీరధారియునగు వానిని నేను బ్రాహ్మణుడందును. (జన్మ హేతువులైన సంస్కారములు నశించుటచే అతని కిది కడపటి జన్మము).

**సావత్థి (జేతవనము) ఉప్పలవణ్ణ (థేరి)**

**401. <u>వారి పొక్ఖర పత్తేవ, ఆరగ్గేరివ సాసపో</u> ।**
**యో న లింపతి[4] కామేసు, తమహం బ్రూమి బ్రాహ్మణం । 19 ।**

---

(1) ఖన్తిబలం -, బలాణీకం - సిం.దే. పా. (చూడు గాథ-184 పాదటీక)

(3) అనుస్సదం - బ్ర.దే.పా.

(4) లిప్పతి - పాజ్‌బాల్ పండితునికి సమ్మతమైన పాఠము. రాహుల‌సాంకృత్యాయనుడు స్వీకరించినది.

పోల్చు :- 'యస్స రాగో చ దోసో చ మానో మక్ఖో చ పాతితో ।
సాసపోరివ ఆరగ్గా, తమహం బ్రూమి బ్రాహ్మణం "।

రాగద్వేషములు మానము (గర్వము) మ్రక్షము (కాపట్యము) సూది మొననుండి జారిపడు

*(వారి పుష్కరపత్ర ఇవాఽఽ రాగ్ర ఇవ సర్షపః ।*
*యో నలిప్యతే కామేషు, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 19 ।)*

పద్మపత్రమున జలము వలె, ఆరాగ్రమున (సూది మొనపైన) ఆవగింజవలె, నెవడు కామభోగములందు లిప్తుడు (సక్తుడు) కాడో, అట్టి వానిని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **ఒకానొక బ్రాహ్మణుడు**

**402. యో దుక్ఖస్స పజానాతి, ఇధేవ ఖయమత్తనో ।**
**పన్నభారం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 20 ।**

*(యోదుఃఖస్య ప్రజానాతీ, హైవ క్షయమాత్మనః ।*
*పన్నభారం విసంయుక్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 20 ।*

ఇచటనే - ఈ జన్మముననే తన దుఃఖనాశము నెఱిగిన వాడును, (సంసార) భారవిముక్తుడు, అనాసక్తుడు నగు వానిని నేను బ్రాహ్మణుడందును.

(పన్నః = చ్యుతిగలది. అధోగమనే = క్రిందికిపోవుట, పడుట.)

(పన్నం = గళితం, భారం = సంసారభారము = జాఱిపడిపోయిన సంసార భారము కలవాడు).

**రాజగృహము (గిజ్ఝకూటము)** **ఖేమ - భిక్షుణి**

**403. గంభీరపఞ్ఞం మేధావిం, మగ్గా మగ్గస్స కోవిదం ।**
**ఉత్తమత్థం అనుప్పత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 21 ।**

*(గంభీర ప్రజ్ఞం మేధావినం, మార్గాఽమార్గస్య కోవిదమ్ ।*
*ఉత్తమార్థ మనుప్రాప్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 21 ।)*

---

ఆవగింజవలె ఎవని నుండి పడిపోయినవో, అట్టి వానిని వేను బ్రాహ్మణుడందును (సుత్తనిపాతము - III-9-38)

పోల్చు :- సుత్తనిపాతము - III - 9 - 32 గాథ. ఇది ఈ గాథ (401)తో అభిన్నము. కాని, 'లింపతి' శబ్దము యొక్క స్థానమున 'లిప్పతి' అని కలదు.

గంభీర ప్రజ్ఞ (జ్ఞానము) కలవాడు, వివేకశాలి, మార్గామార్గముల నెఱిగినవాడు (సదసద్వివేకచతురుడు) ఉత్తమార్థము (సత్యము) ప్రాపించినవాడునునైన మనుజుని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **పబ్భారవాసి–తిస్సథేరుడు**

**404. అసంసట్ఠం గహట్ఠేహి, అనాగారేహి చూభయం ।**
**అనోకసారిం అప్పిచ్ఛం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 22 ॥**

*(అసంస్పృష్టం గృహస్థై రనాగారైశ్చోభాభ్యామ్ ।*
*అనోకః సారిణ మల్పేచ్ఛం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ॥ 22 ॥)*

గృహస్థులతో కాని, గృహరహితుల (సంన్యాసుల)తో కాని ఉభయులతోను సంయోగము లేనివాడు (అనాసక్తుడు) అనికేతుడు (స్థిరనివాసరహితుడు)నై చరించువాడు, వాంఛారహితుడునైన మనుజుని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **ఒకానొక భిక్షువు**

**405. నిధాయ దణ్డం భూతేసు, తసేసు థావరేసు చ[1] ।**
**యో నహన్తి న ఘాతేతి, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 23 ॥**

*(నిధాయ దణ్డం భూతేషు, త్రసేషు స్థావరేషు చ ।*
*యో నహన్తి న ఘాతయతి, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ॥ 23 ॥)*

చరాచరములగు సకలప్రాణుల విషయమున దండమును ప్రయోగించి, చంపువాడు, చంపించువాడును కాని మనుజుని, నేను బ్రాహ్మణుడందును.

(త్రసః - జంగమే - సంచరించెడి ప్రాణులు) చూడు - గాథ. 142 పాదటీక, నిధాయ దండం భూతేషు = ప్రాణుల విషయమున దండమును విసర్జించి అనియు వివరింపవచ్చును.

---

(1) తసేసు, థావరేసు – దుర్బలులు, బలవంతులు – **feeble and strong** - అని మాక్సుముల్లర్ మఱియు కొందఱు సింహళీయ థేరులు వివరించినారు. కాని, ఆవివరణము సరికాదు.
త్రసః (అ. త్రి.) జంగమే, వనే. – 'త్రస' శబ్దమునకు సంచరించెడు ప్రాణులు, అడవి, అను అర్థములున్నవి.

**సావత్థి (జేతవనము) నల్బ్యురు సామణేరులు**

**406. అవిరుద్ధం విరుద్ధేసు, అత్తదణ్డేసు నిబ్బుతం ।**
**సాదానేసు అనాదానం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 24 ।**

(అవిరుద్ధం విరుద్ధేషు, ఆత్తదణ్డేషు నిర్వృతమ్ ।
సాదానేష్వనాదానం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 24 ।)

విరోధుల నడుమ విరోధరహితుడు, దండధారుల నడుమ నిర్వృతుడు (శాంతచిత్తుడు), ధనసంగ్రహుల (ధనమును పరిగ్రహించువారి) నడుమ, పరిగ్రహరహితుడు (అనాసక్తుడు) నగు వానిని నేను బ్రాహ్మణుడందును.

**రాజగృహము (వేళువనము) మహాపంథకుడు**

**407. యస్స రాగో చ దోసోచ, మానో మక్ఖో చ పాతితో ।**
**సాసపోరివ ఆరగ్గా[1], తమహం బ్రూమి బ్రాహ్మణం । 25 ।**

(యస్య రాగశ్చ ద్వేషశ్చ, మానో మ్రక్షశ్చ పాతితః ।
సర్షప ఇవాఽఽరాగ్రాత్, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 25 ।)

ఎవని నుండి రాగద్వేషములు, దర్ప దంభములు, సూదిమొన నుండి ఆవగింజవలె, జాఱిపడి పోయినవో, అట్టి వానిని నేను బ్రాహ్మణుడందును.

**రాజగృహము (వేళువనము) పిలిన్దవచ్ఛథేరుడు**

**408. అకక్కసం విఞ్ఞాపనిం[2], గిరం సచ్చం ఉదీరయే ।**
**యాయ నాభిసజే కఞ్చి[3], తమహం బ్రూమి బ్రాహ్మణం । 26 ।**

(అకర్కశాం విజ్ఞాపనీం, గిరం సత్యా ముదీరయేత్ ।
యథా నాఽభిషజేత్ కించిత్, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 26 ।)

---

(1) ఆరగ్గే – బ్ర. దే. పా.
(2) విఞ్ఞాపణిం – సిం.దే.పా. విఞ్ఞాపనిం – బ్ర.దే.పా.
(3) కిఞ్చి – పాఠాంతరము.

సౌమ్యము, జ్ఞానవర్ధకము (ఉపదేశకము), సత్యమునగు వాక్కును, ఇతరులకు కొంచమైనను బాధాకరము కానట్లు పలుకునట్టి వానిని, నేను బ్రాహ్మణుడందును. (అభిషజనము - అగౌరవము).

**సావత్థి (జేతవనము)** **ఒకానొకథేరుడు**

409. **యో' ధ దీఘం వ రస్సం వా, అణుం థూలం సుభాసుభం ।**
**లోకే అదిన్నం నాదియతి, తమహం బ్రూమి బ్రాహ్మణం ‌। 27 ।**

*(య ఇహ దీర్ఘం వా హ్రస్వం, వాఽణుం స్థూలం శుభాఽశుభమ్ ।*
*లోకేఽదత్తం నాదత్తే, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 27 ।)*

దీర్ఘమైనను, హ్రస్వమైనను, సూక్ష్మమైనను స్థూలమైనను, శుభమైనను అశుభమైనను, ఈ లోకమున తనకు ఈయని ఏ వస్తువునైనను, గ్రహింపని వానిని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **సారిపుత్తథేరుడు**

410. **ఆసా యస్స న విజ్జన్తి, అస్మిం లోకే పరమ్హి చ**
**నిరాసయం[1] విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 28 ।**

*(ఆశాః యస్య నవిద్యన్తే, ఽస్మిన్‌లోకే పరస్మిన్ చ ।*
*నిరాశయం విసంయుక్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 28 ।)*

ఇహపరలోకములందాశలు (తృష్ణలు) లేనివాడు, నిరాశ్రయుడు (ఆశ్రయ రహితుడు) అనాసక్తుడు (విముక్తుడు) నైన వానిని నేను బ్రాహ్మణుడందును.

---

(1) నిరాసయం (నిరాశయం) - ఆశ్రయము లేనివాడు.
**'ఆశయః స్యాదభిప్రాయే పనసేఽఽధారయోరపి (మేదినీకోశము)**
ఆశయః = అభిప్రాయము, పనసచెట్టు, ఆధారము (ఆశ్రయము.)
నిరాసాసం - బ్ర.దే.పా.

**సావత్థి (జేతవనము)** **మహామొగ్గల్లానుడు (థేరుడు)**

**411. యస్సాలయా న విజ్జన్తి, అఞ్ఞాయ అకథంకథీ ।**
**అమతోగధం అనుప్పత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 29 ।**

*(యస్యాఽఽలయా నవిద్యన్తే, ఆజ్ఞాయాఽకథంకథీ ।*
*అమృతాగాధమనుప్రాప్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 29 ।)*

తృష్ణారహితుడు, సత్యము నెఱుగుటచే సంశయరహితుడు, **అమృతరూపము, నగాధమగు నిర్వాణమును** బొందినవాడు నగు మనుజుని నేను బ్రాహ్మణుడందును.

(ఆలయాః - తృష్ణాః) 'అకథంకథీ' శబ్దమునకు సంశయరహితుడని భదన్త బుద్ధఘోషుని వివరణము. 'కథంకథా' - శబ్దమునకు విచికిత్స, లేక, సంశయమని అతని వివరణము. అది ఎట్లు? కథం? అని అడుగని వాడు-సంశయరహితుడు - 'అకథంకథీ' - అని భావము, చూడు- గాథ - 414).

**సావత్థి( పుబ్బారామము)** **రేవతథేరుడు**

**412. యోధ పుఞ్ఞ ఞ్చ పాపఞ్చ, ఉభో సఙ్గ ముపచ్చగా ।**
**అసోకం విరజం సుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 30 ।**

*(య ఇహ పుణ్యఞ్చ పాపఞ్చోభయోః సఙ్గముపాత్యగాత్ ।*
*అశోకం విరజం శుద్ధం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 30 ।)*

ఎవ డిచ్చట (ఈలోకమున) పుణ్యపాపముల రెంటి సంగమును పరిత్యజించెనో, శోకరహితుడు, నిర్మలుడు, పవిత్రుడో, అట్టి వానిని నేను బ్రాహ్మణుడందును.

(నిర్వాణకాంక్షతో కర్మరహితుడై సర్వసంగ పరిత్యాగి యగు వానికి, పుణ్య పాపముల భేదమంతరించుచున్నది. చూడు- గాథ - 39).

**సావత్థి (జేతవనము)** **చన్దాభథేరుడు**

413. **చన్దం వ విమలం సుద్ధం, విప్పసన్న మనావిలం ।**
**నన్దీ[1]భవపరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 31 ॥**

*(చన్ద్రమివ విమలం శుద్ధం, విప్రసన్నమనావిలమ్ ।*
*నన్దీభవపరిక్షీణం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ॥ 31 ॥)*

చంద్రుని వలె నిర్మలుడు, పరిశుద్ధుడు, ప్రశాంతుడు, నిష్కళంకుడు. భవ (జన్మ) నందిని (తృష్ణను) నశింపజేసిన వాడు నగు మనుజుని నేను బ్రాహ్మణుడందును.

**కుణ్డకోలియ (కుండధానవనము)** **సీవలిథేరుడు**

414. **యో ఇమం[2] పలిపథం దుగ్గం, సంసారం మోహ మచ్చగా ।**
**తిణ్ణో పారగతో[3] ఝాయీ, అనేజో అకథంకథీ ।**
**అనుపాదాయ నిబ్బుతో, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 32 ॥**

*(య ఇమం ప్రతిపథం దుర్గం, సంసారం మోహ మత్యగాత్ ।*
*తీర్ణః పారగతో ధ్యాయ్యనేజోఽ కథంకథీ ।*
*అనుపాదాయ నిర్వృతః, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ॥ 32 ॥)*

(తృష్ణా) పంకదూషితమార్గము, దుర్గమము, మోహరూపమునగు సంసారము (జననమరణసాగరము) నతిక్రమించి ఉత్తీర్ణుడై, పారము (ఆవలితీరము) చేరినవాడు, ధ్యానశీలుడు, అప్రకంపనుడు సంశయరహితుడు అనాసక్తుడునై నిర్వాణమును పొందినవానిని నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **సుందరసముద్దథేరుడు**

415. **యోధ కామే పహత్వాన[4], అనాగారో పరిబ్బజే ।**
**కామభవపరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥ 33 ॥**

---

(1) భవనంది – విషయసుఖ ప్రధానమగు స్వర్గలోకము, రూప–బ్రహ్మలోకము, అరూప బ్రహ్మలోకము –ఈ మూడు లోకములలో జన్మించి ఆనందింపవలెనను తృష్ణ (నంది.)

(2) యోమం – బ్ర.దే.పా. (3) పారఙ్గతో – బ్ర.దే.పా. (4) పహన్త్వాన – బ్ర.దే.పా.

(య ఇహ కామాన్ ప్రహాయాఽనాగారః పరివ్రజేత్ ।
కామభవపరిక్షీణం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 33 ।)

ఈ లోకమున సర్వకామనలను పరిత్యజించి, అనికేతుడును, పరివ్రాజకుడునై, జన్మకారకమగు కామమును (విషయరాగమును) నశింపజేసిన వానిని నేను బ్రాహ్మణుడందును.

రాజగృహము (వేళువనము) జటిలథేరుడు; జోతికథేరుడు

416. యోధ తణ్హం పహత్వాన, అనాగారో పరిబ్బజే ।
తణ్హాభవపరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం[1] । 34 ।

---

(1) పోల్చు :- 'యేనకేనచిదాఽఽచ్ఛన్నో యేనకేనచిదాఽఽశిత ।
యత్రక్వచన శాయీ స్యాత్ తం దేవా బ్రాహ్మణం విదుః ॥'
'నిరాశిష మనారంభం, నిర్నమస్కార మస్తుతిమ్ ।
నిర్ముక్తం బంధనై సర్వై స్తందేవా బ్రాహ్మణం విదుః ॥'
మ.భా. శాంతి-245 - 12, 24

మ.భా. శాంతి – మోక్షధర్మ పర్వమున (245 అధ్యాయమున) వ్యాసమహర్షి తన పుత్రుడగు శుకునకు జ్ఞానవంతుడైన భిక్షులక్షణములను వివరించును. అట్టి విశిష్టలక్షణసంపన్నుడు, ప్రజ్ఞానతృప్తుడు, నిర్భయుడు, అనికేతుడునైన వానిని దేవతలు బ్రాహ్మణుడందురని వ్యాసమహర్షి బ్రాహ్మణ సమగ్ర లక్షణములను వర్ణించినాడు.

'సీ. ఆత్మయందగ్ని సమారోపణము చేసి,
యజినమాంతరముగ నకృత సంధి
విగ్రహుండగుచు, పరిగ్రహ విముఖుడై
ముండుండు, ననికేతనుండు, వృక్ష
మూలవాసియును, గపాలధారుండు నే
కాకియు,నక్రోధకామశోకు
డును, గాగవలయు; భిక్షునకు నిందాస్తుతుల్
తనయందు యడగంగ, దాను బరుల

తే. దిక్కు పలుకక, దివియెల్ల దిక్కటంగ
దాన యున్నట్లు కనుచు, నేమేని గుడిచి,
యెద్ది యేనియు గట్టి, యెందే శయించు,
నతని, దేవతల్ బ్రాహ్మణుడందురు పుత్ర! ॥ (ఆంధ్ర మ. భా. శాంతి V-142)

ధమ్మపదము నందలి బ్రాహ్మణవర్గమునందలి గాథలతో సమానార్థకములగు శ్లోకములు మహా భారతమున అనేకములు గలవు.

(య ఇహ కామాన్ ప్రహాయాఽనాగారః పరివ్రజేత్ ।
కామభవపరిక్షీణం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 33 ।)

ఈ లోకమున సర్వకామనలను పరిత్యజించి, అనికేతుడును, పరివ్రాజకుడునై, జన్మకారకమగు కామమును (విషయరాగమును) నశింపజేసిన వానిని నేను బ్రాహ్మణుడందును.

**రాజగృహము (వేళువనము) జటిలథేరుడు; జోతికథేరుడు**

**416. యోధ తణ్హం పహత్వాన, అనాగారో పరిబ్బజే ।**
**తణ్హాభవపరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం[1] । 34 ।**

---

(1) పోల్చు :- 'యేనకేనచిదాఽఽచ్ఛన్నో యేనకేనచిదాఽఽశిత ।
యత్రక్వచన శాయీ స్యాత్ తం దేవా బ్రాహ్మణం విదుః ।'
'నిరాశిష మనారంభం, నిర్నమస్కార మస్తుతిమ్ ।
నిర్ముక్తం బంధనై సర్వై స్తందేవా బ్రాహ్మణం విదుః ।'
మ.భా. శాంతి-245 - 12, 24

మ.భా. శాంతి – మోక్షధర్మ పర్వమున (245 అధ్యాయమున) వ్యాసమహర్షి తన పుత్రుడగు శుకునకు జ్ఞానవంతుడైన భిక్షులక్షణములను వివరించును. అట్టి విశిష్టలక్షణసంపన్నుడు, ప్రజ్ఞానతృప్తుడు, నిర్భయుడు, అనికేతుడునైన వానిని దేవతలు బ్రాహ్మణుడందురని వ్యాసమహర్షి బ్రాహ్మణ సమగ్ర లక్షణములను వర్ణించినాడు.

'సీ. ఆత్మయందగ్ని సమారోపణము చేసి,
యజినమాంతరముగ నకృత సంధి
విగ్రహుండగుచు, పరిగ్రహ విముఖుడై
ముండుండు, ననికేతనుండు, వృక్ష
మూలవాసియును, గపాలధారుండు నే
కాకియు,నక్రోధకామశోకు
డును, గాగవలయు; భిక్షునకు నిందాస్తుతుల్
తనయంద యడగంగ, దాను బరుల

తే. దిక్కు పలుకక, దివియెల్ల దిక్కటంగ
దాన యున్నట్లు కనుచు, నేమేని గుడిచి,
యెద్ది యేనియు గట్టి, యెందే శయించు,
**వతని, దేవతల్ బ్రాహ్మణుడండ్రు పుత్ర! ।** (ఆంధ్ర మ. భా. శాంతి V-142)

**ధమ్మపదము నందలి బ్రాహ్మణవర్గమునందలి గాథలతో సమానార్థకములగు శ్లోకములు మహా భారతమున అనేకములు గలవు.**

*(హిత్వా రతిఞ్చాఽరతిఞ్చ, శీతీభూతం నిరూపధిమ్ ।*
*సర్వలోకాభిభువం వీరం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 36 ।)*

రాగవిరాగముల త్యజించి, శాంత(శీతల) స్వభావుడు, జన్మ హేతుకములగు ఉపాధుల(క్లేశముల) నుండి విముక్తుడు, సర్వలోకవిజేతయు వీరుడునైన వానిని, నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **వఙ్గీసథేరుడు**

**419. చుతి యో వేది సత్తానం, ఉపపత్తిఞ్చ[(1)] సబ్బసో ।**
**అసత్తం సుగతం బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 37 ।**

*(చ్యుతిం యోవేద సత్త్వానా ముత్పత్తి ఞ్చ సర్వశః ।*
*అసక్తం సుగతం బుద్ధం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 37 ।)*

ప్రాణుల వినాశోత్పత్తుల సంపూర్ణముగ నెఱిగినవాడు, ఆసక్తిరహితుడు, సుగతుడు, బుద్ధుడునైన వానిని, నేను బ్రాహ్మణుడందును.

**420. యస్స గతిం న జానన్తి, దేవాగన్ధబ్బ[(2)] మానుసా,**
**ఖీణాసవం అరహన్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం[(3)] । 38 ।**

---

(1) ఉపపత్తిఞ్చ – సిం.దే.పా.

చుతవేది, సుగతుడు – బుద్ధుని విశేషణములు.

**సుగతః – నిర్వాణప్రాప్తుడు – శోభనం గతం జ్ఞాన మస్య – ఇతి– సుగతః (భానుజీ దీక్షితకృత వ్యాఖ్యాసుధ – అమరకోశము)**

**బాహ్యాభ్యంతర ప్రపంచము సర్వము పంచస్కంధ నిర్మితము.** పునర్జన్మమును నిరోధించుటచే పంచ స్కంధ వాహినిని బుద్ధుడు నిలిపివేయుచున్నాడు. కావున అతడు **వీరుడు, లోకజిత్తు, జినుడని వర్ణితుడు. చూడు :- గాథ 285.**

(2) **విద్యాధరోఽప్సరో యక్షరక్షోగంధర్వకిన్నరా ।**
**పిశాచో గుహ్యకస్సిద్ధో, భూతోఽమీ దేవయోనయః ।**
విద్యాధరాదులు దేవజాతులు (అమరకోశము I - 11)

(3) పోల్చు :- **'సర్వ భూతాత్మ భూతస్య, సర్వభూతహితస్య చ ।**
**దేవా మార్గే విముహ్యంతి, హ్యపదస్య పదైషిణః ।**
**శకునీనా మివాకాశే, గతిర్నైవోప లభ్యతే ।**
(మాం.ఉ. గౌడపాదకారిక - IV - 95 - శంకరభాష్యము)

(సర్వభూతములంకాత్మస్వరూపుడు, సర్వభూతహితరతుడునై పొందదగిన పదమేదియునులేని పరిపూర్ణుడైన జ్ఞాని యొక్క పరమగతిని, ఆకాశమున పక్షుల గతిని (మార్గము) నెఱుగజాలనట్లు, దేవతలు సైత మెఱుగజాలరు.)

*(యస్య గతిం నజానన్తి, దేవాగంధర్వమానుషాః ।*
*క్షీణాస్రవ మర్హన్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ ।। 38 ।)*

దేవగంధర్వమానవులెవని మార్గము (గతి) నెఱుగజాలరో, ఎవడు ఆస్రవ విముక్తుడో (రాగాది రహితుడో) అర్హంతుడో, వానిని నేను బ్రాహ్మణు డందును.

**రాజగృహము (వేళువనము)** **ధర్మదిన్న (థేరి)**

421. **యస్స పురే చ పచ్ఛా చ, మజ్ఝే చ నత్థి కిఞ్చనం ।**
**అకిఞ్చనం[1] అనాదానం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 39 ।**

*(యస్య పురశ్చ పశ్చాచ్చ, మధ్యే చ నాఽస్తి కిఞ్చన ।*
*అకిఞ్చన మనాదానం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 39 ।)*

భూత భవ్య వర్తమానములందు దేనియందును ఆసక్తిలేని వాడు, అకించనుడు, పరిగ్రహరహితుడునైన వానిని, నేను బ్రాహ్మణుడందును.

**సావత్థి (జేతవనము)** **అఙ్గులీమాలుడు (థేరుడు)**

422. **ఉసభం పవరం వీరం, మహేసిం, విజితావినం ।**
**అనేజం నహాతకం బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 40 ।**

*(ఋషభం ప్రవరం వీరం, మహర్షిం విజితవన్తమ్ ।*
*అనేజం స్నాతకం బుద్ధం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ । 40 ।)*

మనుష్యులలో శ్రేష్ఠుడు, (భయరహితుడు) ప్రవరుడు, (సర్వాధికుడు), వీరుడు, మహర్షి, వాసనల జయించినవాడు (విజేత) అప్రకంపనుడు, స్నాతకుడు (పవిత్రుడు - నిష్పాపుడు) బుద్ధుడునైన వానిని, నేను బ్రాహ్మణుడందును.

---

(1) అకిఞ్చనం - న విద్యతే కించన ద్రవ్యం యస్యసో - ద్రవ్య మేమాత్రము లేనివాడు.

**సావత్థి (జేతవనము)** **దేవహితుడు (బ్రాహ్మణుడు)**

423 **పుబ్బే నివాసం యో వేది[1], సగ్గాపాయఞ్చ పస్సతి ।**
**అథో జాతిక్ఖయం పత్తో, అభిఞ్ఞావోసితో ముని ।**
**సబ్బవోసితవోసానం, తమహం బ్రూమి బ్రాహ్మణం । 41 ।**

*(పూర్వ నివాసం యోవేద, స్వర్గాఽపాయఞ్చ పశ్యతి ।*
*అథ జాతిక్షయం ప్రాప్తో, ఽభిజ్ఞావ్యవసితో మునిః ।*
*సర్వవ్యవసితాఽవ సానం[2], తమహం బ్రవీమి బ్రాహ్మణమ్ [3] । 41 ।)*

పూర్వజన్మజ్ఞానము కలవాడు, స్వర్గనరకములను (జ్ఞాననేత్రముతో) దర్శించువాడు, జన్మరాహిత్యము ప్రాపించినవాడు, అభిజ్ఞా (దివ్యజ్ఞాన)

---

(1) పోల్చు :- '**సంస్కార సాక్షాత్కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్ ।**' యో.ద. III-18
చిత్తమందలి అనాది వాసనల సాక్షాత్కారము వలన పూర్వజన్మజ్ఞానము కల్గును.
చూడు :- 144 గాథపైని పాదటీకా.

(2) సర్వవ్యవసితాద్యవసానం – రాహుల సాంకృత్యాయనుని సంస్కృత పాఠము

(3) '**తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా ।**' (పా.యో.ద. II-27)
జీవన్ముక్తునికి మహోన్నతమైన (ప్రాన్తభూమి), సప్తవిధప్రజ్ఞ సిద్ధించును. కర్తవ్య విముక్తిరూపమైన నాల్గు ప్రజ్ఞలు, –( (1) జ్ఞేయము నిశ్శేషముగ నెఱిగితిని, (2) క్లేశములు నిశ్శేషముగ నశించినవి, (3) జ్ఞాన మధిగతము, (4) వివేకఖ్యాతి సిద్ధించినది – ఇవి కర్తవ్య విముక్తి ప్రజ్ఞలు ) – చిత్త విముక్తి రూపమైన మూడు ప్రజ్ఞలును, –((1) నా బుద్ధి చరితార్థమైనది, (2) ప్రకృతి గుణములు – సత్త్వరజస్తమములు – లయించినవి, (3) నా సమాధి (గుణాతీతమైన ఆత్మస్థితి), స్వస్థీభూతమైనది – ఇవి చిత్త విముక్తి ప్రజ్ఞలు) – జీవన్ముక్తుడైన మహాత్మునకు సిద్ధించును. ఇవియే సప్త విధ ప్రజ్ఞలు. ఇవి పరమ నివృత్తి ఫలరూపములు. ఇట్లు యోగదర్శనము, బుద్ధుడు నిర్వచించిన బ్రాహ్మణుని ప్రజ్ఞావైభవమును సమర్థించుచున్నది.
చూడు – 'ధమ్మచక్క పవత్తన సుత్తం – 14. తనకు ఇట్టి జ్ఞానము సిద్ధించినదని బుద్ధుడు ప్రకటించినాడు.

పరాయణుడు, ముని, కృతకృత్యుడు (సర్వప్రయత్నముల గమ్యమును ప్రాపించినవాడు) నైన వానిని నేను బ్రాహ్మణుడందును.

**26 బ్రాహ్మణవగ్గో నమత్తో**

**బ్రాహ్మణవర్గము – సమాప్తము**

**"తం వందే పర మనుకమ్పకం మహర్షిం,**
**మూర్ధ్నాఽహం ప్రకృతి గుణజ్ఞ మాశయజ్ఞం।**
**సంబుద్ధం దశబలినం భిషక్ప్రధానం,**
**త్రాతారం పునరపి చాఽస్మి సంనతస్తమ్॥"**

---

* (ధర్మపదము యొక్క ఉపసంహారము – నిష్పాదనమిట్టిది. మనకిందుపదేశింపబడిన ధర్మమున ఆవగింజంత అనుష్ఠించినచో (ఈ 'ఆవగింజ' కల్పన ఇందలిదే), మనము మనకాలమును వ్యర్థపఱుపలేదని భావము.

ఇందు (ధమ్మపదమున) పేర్కొనని అర్థమొకటి యున్నది. పరమనిస్సంగత్వము, పరమవిముక్తి (a Supreme disinterestedness and a Supreme liberation), – ఇవి ఆత్మ పరిపూర్ణతా – సంపన్నతా – శిక్షణము ననుసరింపవలయును. ఇందు వర్ణించినట్లు, అది, 'నిర్వాణ' మను నిర్దిష్టగమ్యమును దృష్టి పథమున నుంచుకొని పురోగమించుట కాదు. ఏలయన, ఈ పురోగతి – పరిణామము – ప్రగాఢ ధర్మము (Law) నకు, భౌతికజీవన ప్రయోజనమునకు, జగదస్తిత్వము (Universal existence) నకు సంబంధించినది. ఈ (దివ్య) పరిణామమునకు అవిరోధముగ, ఐక్యభావమున, ఫలాకాంక్షారహితముగ నిన్ను నీవు సమర్పించుకొన్నావు.

పరమేశ్వరుని దివ్యకృపయందు ప్రగాఢవిశ్వాసము, ఆదివ్యసంకల్పమునకు సంపూర్ణాత్మ సమర్పణము, వ్యక్తిని, ఫలాభిసంధిరహితముగ కర్మము ననుష్ఠింపజేయు ఆదివ్యయోజన (The Divine Plan) యందు సమగ్ర సంసక్తి – సంలగ్నత – ఇదియే పరిపూర్ణ విముక్తి (The perfect liberation) కి అర్థము.

వాస్తవముగ నిదియే, దుఃఖోపశాంతి. చేతన (Consciousness) నిశ్చలానందనిర్భరమై, నీ ప్రతిపదన్యాసము – (వేయు ప్రతి అడుగు) అద్భుతావహమైన పరమవిభూతి (Splender) ని వ్యంజింపజేయును.

మానవాభ్యున్నతికి ఈ 'ధమ్మపదము'ను ప్రకటపఱచినందుకు బుద్ధునకు మనము కృతజ్ఞులము. ఆయన బోధించిన రమణీయార్థములందు, ఏ స్వల్పమైన సాధించుటకు మనము ప్రయత్నింతుము. కాని, మన ప్రయత్నఫలము – గమ్యము – బుద్ధ్యతీతమైన ఆ పరమేశ్వరుని పరమజ్ఞానమునకే, వదలివేయుదము.

(శ్రీమాత – అరవిందాశ్రమము 5-9-1958)

(ప్రాణుల ప్రకృతిగుణములను; ఆశయములను, నెఱిగినవాడు, పరమ దయాళువు, దశబలధారి, ప్రధాన చికిత్సకుడు, మహర్షి, త్రాతయునైన **సంబుద్ధునకు శిరము వంచి పునః పునః ప్రణమిల్లుదును.**

**"వనప్పగుమ్బే యథా ఫుస్సితగ్గే, గిమ్హాన మాసే పఠమస్మింగిమ్హే ।**
**తథూపమం ధమ్మవరం అదేసయి, నిబ్బాణగామిం పరమం హితాయ**
**ఇదమ్పి బుద్ధే రతనం పణీతం, ఏతేన సచ్చేన సువత్థి హోతు !"**

(సుత్తనిపాతము -II-1-12)

(వసంత ఋతు ప్రారంభమున, తరులతాగుల్మములు పుష్పితాగ్రములై, మనోరమములైయుండును. అట్లు మనోజ్ఞమై, నిర్వాణపదగామియగు పరమధర్మమును, లోకమునకు పరమహితార్థమై, బుద్ధుడుపదేశించెను. ఈ (పరమధర్మ) రత్నము, బుద్ధుని యందు ప్రణీతమైయున్నది. ఈ సత్య భాషణముచే, జగమునకు స్వస్తి (మంగళము) కలుగుగాక.!)

**బుద్ధం శరణం గచ్ఛామి ।**
**ధర్మం శరణం గచ్ఛామి ।**
**సంఘం శరణం గచ్ఛామి ॥**

ధమ్మపద వ్యాఖ్యానము

సర్వము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు





నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

# ధమ్మపదం-అనుబంధము I

## పాళీసాహిత్యము

**పాళీశబ్దనిరుక్తి** - పాళీశబ్దమునకు పంక్తి, శ్రేణి అనునర్థములున్నవి. ఇది, పాళిః, పాళీ - సంస్కృత శబ్దము. బౌద్ధ సాహిత్యమున వినయపిటక మందలి ఐదు గ్రంథములు (1) **పారాజికపాళీ**, (2) **పాచిత్తియపాళీ**, (3) **మహావగ్గపాళీ**, (4) **చుల్లవగ్గపాళీ**, (5) **పరివారపాళీ**, అని పేర్కొనబడినవి. కాన, త్రిపిటకభాష, పాళీభాషయను పేర ప్రసిద్ధి గాంచినదని కొందఱు పండితుల అభిప్రాయము.

**పాటలీపుత్ర నగర భాష** 'పాటలి' అనియు, ఈ పాటలీ శబ్దమే కాలగమనమున 'పాళీ' రూపమున పరిణమించినదని కొందఱందురు.

పల్లి - (పల్లీ) - అను సంస్కృతశబ్దమునకు, కుగ్రామమని అర్థము. **పల్లిభాష** పాళీభాషగా మాఱినదని మఱి కొందఱి భావము.

త్రిపిటకములలో **'బుద్ధదేసనా'** అను శబ్దము యొక్క అర్థమున **'ధర్మ పరియాయ'**మను శబ్దము ప్రయుక్తము. అశోకసమ్రాట్టుశిలాశాసనము అందు ఈ **'ధమ్మపరియాయ'** శబ్దము **'ధమ్మపలియాయ'**(1) రూపమును పొందినది. ఈ **పలియాయ** శబ్దమే క్రమక్రమముగ **'పాళీ'**గా పరివర్తన పొందినదని కొందఱి

---

(1) చూడు :- బైరాతుశిల - "ఇమాని భంతే ధంమపలియాయాని వినయసముకసే".... "భగవతా బుధేన భాసితే ఏతాని భంతే ధంమపలియాయాని ఇఛామి" - (అశోకుని ధర్మశాసనములు)

అభిప్రాయము. **పాళీభాషకు జన్మస్థానము మగధదేశము.**

మగధదేశము యొక్క ప్రాచీననామము **'పలాస'**, లేక, **'పరాస'** అనియు ఈ **పలాసదేశపు** భాషయే, **'పలాసి'**. ఈ **'పలాసి'**యే **'పలాయి'**గా పరిణమించి క్రమముగ **పాళీ**గా రూపొందినదని మఱికొందఱు విద్వాంసుల మతము.

వైదిక సంస్కృతము నుండి లౌకికసంస్కృతము, దాని నుండి ప్రాకృతము జనించినవనియు, ప్రాకృతమే 'పాళీ'గా పరిణమించినదనియు అనేక సిద్ధాంతములున్నవి. **'పాళీ' సంస్కృతము యొక్క జనసామాన్యవ్యవహారభాష.** ఇది పశ్చిమమున కురుదేశము నుండి, తూర్పున మగధ వఱకు, ఉత్తరమున శ్రావస్తి నుండి నేపాల్ ప్రాంత మందలి కుశినగరము వఱకు, దక్షిణమున ఉజ్జయిని వఱకు, క్రీ.పూ. ఏడవ శతాబ్దమున వ్యవహారమం దుండినది. పిటకత్రయమును అశోకుని పుత్రుడగు మహిందుడు, పుత్రిక సంఘమిత్ర, సింహళమునకు గొనిపోయినారు. దానికి అట్ఠకథను (భాష్యమును) సింహళభాషయందు రచించినాడు.[1] (241 B.C.)

క్రీ.పూ. 241 ప్రాంతమున, అశోకుని పుత్రుడు మహిందుడు, పుత్రిక సంఘమిత్ర, త్రిపిటకములు, సింహళమునకు కొనిపోయినారని, కొందఱు పండితులు నిర్ణయించినారు. సర్వభాషలకు మూలభాషయైన మాగధీభాషలోనికి, సింహళ భాషయందు మహిందుడు(అశోకుని పుత్రుడు) రచించిన 'అట్ఠకథ'ను సంపూర్ణముగ బౌద్ధాచార్యుడు - భదన్త బుద్ధఘోషుడు(క్రీ.శ. ఐదవ శతాబ్దము) అనువదించినాడని, మాగధీభాష, సర్వభాషలకు హితావహమైనదని మహావంశగ్రంథము పేర్కొనును.[2]

---

(1) **"సింహళట్ఠకథా సుద్ధా మహిందేన మతీమతా ।**
**సంగీతిత్తయం ఆరూళ్హం సమ్మాసంబుద్ధదేసితం ।**
**సారిపుత్తాదిగీతం చ కథామగ్గం సమేక్ఖియ ।**
**కతా సీహలభాసాయా సీహలేసు పవత్తతి ॥"** (మహావంశము)

మహామతియైన మహిందుడు, సంగీతిత్రయమున (Three Budhist Councils) నిరూఢముగ పరిష్కరింపబడినది, సమ్యక్సంబుద్ధునిచే నుపదిష్టమైనది, సారిపుత్తాదులచే గానము చేయబడినదియునైన త్రిపిటకత్రయమునకు, బుద్ధప్రవచనకథామార్గమును (Discourses of the Buddha) చక్కగా విచారించి సింహళభాషయందు శుద్ధమైన అట్ఠకథను (భాష్యమును) రచించెనని భావము.

(2) బౌద్ధయుగము II సంపుటి - డా॥ రత్నాకరం బాలరాజు, - పుట 662. (1960)

కావున 'మాగధి' అనునది పాళీ భాషకు పర్యాయనామమని విశదమగుచున్నది. బుద్ధఘోషుడు సింహళద్వీపమున, అనురాధ పురమందలి 'గంథాకర' విహారమున నివసించి, ఈ అనువాదము నిర్వహించినాడు.

"Pali is the eldest daughter of Sanskrit. From Pali the other Vernaculars of India are derived. The language of Asoka used in the edicts proved this. From the Himalayas to the Vindhyas, from the Indus to the Ganges Asoka used a language intelligible to all with slightest variations".

(Hindu History – Akshoy Kumar Mazundar).

"It is from the Prakrit and not from the literary Sanskrit that the modern Vernaculars of India branched off in course of time."

(Prof. Maxmuller)

**దేశభాషలకు పాళీ మూలభాష**

దీని వలన, పాళీభాష, భారతవర్షమందలి వివిధదేశభాషలకు (ప్రాంతీయ భాషలకు) మూలభాష యని స్పష్టమగుచున్నది. అశోకుని శిలాశాసనములందలి భాషను భారతదేశమునందలి వివిధప్రాంతప్రజలు ఆనాడు అర్థమొనరించుకొనుట కిదియే హేతువు.

బుద్ధాదిమహనీయులు జనసామాన్యము నుద్ధరించి, ప్రబోధించుటకు వారి భాషయందే బోధించినారు. దేవతాప్రియుడైన ప్రియదర్శి అశోకచక్రవర్తి ప్రజల భాషయందే తన ధర్మశాసనములు వ్రాయించినాడు.[1]

పాళీభాష ఒకేయొక భాష (సంస్కృతము) యొక్క వ్యవహారరూపమని విశదమైనది.

**భాష యొక్క ద్వివిధరూపములు**

నాట్యశాస్త్రమున భరతుడు సంస్కృతప్రాకృతములు వేర్వేరు భాషలు

---

(1) By preaching the common spiritual right of all men whatever their birth, He (Buddha) created a nationality in India which leapt into spontaneous and over whelming expression so soon as His message touched the heart of Asoka the people's king. (The foot falls of Indian History - Sister Nivedita).

కావని, అవి రెండును ఒకే భాష యొక్క వ్యవహారరూపములని చెప్పును. శ్రీ భండార్కరుగారు తన 'అశోక' గ్రంథమున, భరతుని యభిప్రాయము నుదాహరించి, అశోకుని శాసనములలోని భాష, పాణిని, కాత్యాయన, పతంజలులు వ్యాకరణము వ్రాసిన భాష కంటె భిన్నమైనది కాదని నిరూపించినారు.

వీరు వ్యాకరణము రచించిన భాషయే, జనసామాన్యము యొక్క ఉచ్చారణమున, అశోకశాసనములలోని భాషారూపమును పొందినదని భండార్కరు అభిప్రాయము. పాణిని (క్రీ.పూ. 800) మొదలు పతంజలి (క్రీ.పూ. 150) వఱకు, బ్రాహ్మణులు శుద్ధము సుసంస్కృతమునైన భాష యందు మాట్లాడుచుండిరనియు, ఈ శిష్టుల వ్యవహార భాషకే పాణిన్యాదుల వ్యాకరణములు రచించిరనియు ప్రజలలోని భాష, ఉచ్చారణభేదము వలన కల్గిన వికృతరూపమేనని భండార్కరు పేర్కొన్నారు. ఆంధ్రదేశమున వివిధప్రాంతములలో ప్రజలు మాట్లాడు భాష, ఆంధ్ర (తెలుగు) భాషే అయినను, ఉచ్చారణభేదము ననుసరించి భాషయందు కొంత భేదము కాన్పించుచున్నట్లే, ఆనాడును ఆయా ప్రాంతముల భాష యందును భేదముండినది. **ప్రజల ఉచ్చారణ మేవిధముగ నుండెనో, ఆ విధముగనే ఈ భాష, అశోక శాసనములలో వ్రాయబడినది.**[1] ఇది పాళీభాషయే.

**త్రిపిటకములు**

బుద్ధభగవానుడు పరినిర్వాణమందిన వెంటనే (క్రీ.పూ. 543) అతని ప్రియ శిష్యులు, 500 మంది అర్హంతులు (బౌద్ధభిక్షువులు) రాజగృహసమీపమున గల సప్తపర్ణిగుహలో మహాకాశ్యపుని అధ్యక్షతన సమావేశమై బుద్ధోపదేశములను సంకలన మొనరించినారు. భగవంతుడు తన ముప్పదియైదవయేట బుద్ధత్వసిద్ధినంది, యెనుబదవయేట పరినిర్వాణ మందినాడు. కావున నా మునీంద్రుని ప్రబోధ చర్య నలువదియైదు సంవత్సరములు. ఈ కాలమున ఆ మహాశాస్త అనుగ్రహించిన వినయమునకు (Discipline) ధర్మమునకు సంబంధించిన బోధలు, ధారణాసంపన్నులై శ్రుతిధరులైన ఆశ్రమణులు, తమ స్మృతిపేటిక లందు భద్రపఱచుకొన్నారు.

---

(1) The inscriptions may safely be taken as representing the actual pronunciation - ("Asoka" – D.R. Bhandarkar).

కంఠస్థముగ వల్లెవేసి స్మృతియందు స్థిరపఱచుకొన్న తథాగతుని ధర్మబోధలు ముఖపాఠముచేతనే ఒకతరమునుండి మఱొక తరమున కందజేయబడినవి. ఈ సమావేశములకు **'సంగీతు'**లని (Councils) పేరు. ప్రథమసంగీతి యందే బుద్ధదేవుని ప్రియశిష్యుడైన **ఆనందుడు** తాను విన్నది విన్నట్లు ధమ్మము(సుత్తములు)ను వల్లింపగా, **ఉపాలి** బుద్ధసంఘ శాసన(నియమ) రూపములైన వినయసుత్తములను వల్లించినాడు. వీరిరువురు బుద్ధోపదిష్టమైన సుత్తవినయగ్రంథముల నుద్ధరించి జగన్మాన్యులైనారు. మహాకశ్యపుడు **అభిధమ్మమును** వల్లించెనని చెప్పుదురు. ఇట్లు క్రీ.పూ. 543 ప్రాంతముననే - భగవంతుడు మహాపరినిర్వాణ మొందిన వెంటనే - వినయ, సుత్త, అభిధమ్మ పిటకములు ప్రస్తుతరూపమున సంకలితములై సంవిధానకములైనవి (క్రమబద్ధ మొనరింపబడినవి).

'పిటక' శబ్దమును పేటక, పేట, మంజూష (పెట్టె) అని అమరకోశము వివరించును. **('పిటకః పేటకః పేటా మంజూషా'– అమరకోశము II - 217)**

బుద్ధోపదేశరూపమై, పవిత్రమైన పాళీసాహిత్యమంతయు శాశ్వతముగ కొనసాగుటకై, క్రీ.పూ. ప్రథమశతాబ్దముననే సింహళద్వీపపాలకుడైన **వట్టగామని అభయుని కాలమున (క్రీ.పూ. 88–76) ప్రప్రథముగ గ్రంథస్థ మొనరింపబడి అక్షరరూపమును దాల్చినదని మహావంశగ్రంథము (క్రీ.త 5వ శతాబ్దము) వలన దెలియుచున్నది.** "పూర్వకాలమున జ్ఞానులైన భిక్షువులు పాళీత్రిపిటకములు, వాని అట్ఠకథలు (వ్యాఖ్యానములు) కంఠస్థముగ వల్లించి ముఖపాఠము చేతనే వానిని పారంపర్యముగ అందజేయుచుండిరి. ధారణాసంపన్నులైన అట్టి భిక్షువులు అంతరించిపోవుటచే అలేఖ్యముగ - శ్రుతి రూపముగ - నున్న బుద్ధగౌతముని ధర్మబోధలు, నశింపక శాశ్వతముగ నుండుటకు భిక్షువులందఱు సమావేశమై, పాళీత్రిపిటకములను, అట్ఠకథను, లేఖ్యమొనరించి వానికి అక్షరత్వ మాపాదించినారు." కాని, వ్రాత - లిపి - ప్రాచీన కాలమున వ్యాప్తి యందున్నట్లు శ్రుతులు, పాణినిఅష్టాధ్యాయి, భారతాదులు, బౌద్ధుల శీలగ్రంథముల వలన నిరూఢమైనను, గ్రంథరచనకు బౌద్ధులు దాని నుపయోగించుకొనలేదని

తెలియుచున్నది.[1] సింహళీ భాష యందు అశోకుని కుమారుడైన మహిందుడు (మహేంద్రుడు) రచించిన 'అట్ఠకథ'ను భదన్తబుద్ధఘోషుడు పాళీభాషలోని కనువదించిన విషయము ముందే పేర్కొనబడినది. కాని, మహాకశ్యపుని ఆదేశమును పురస్కరించుకొని త్రిపిటకములు ప్రథమసంగీతి (First Buddhist Council) జరిగిన వెంటనే వ్రాయబడి గ్రంథస్థ మొనరింపబడినవని యువన్‌ఛ్వాంగ్ (Yuanchwang) క్రీ.శ. ఏడవ (7) శతాబ్దమున ప్రకటించినాడు.

**పిటకత్రయము:** ఇవి, వినయపిటకము, సుత్తపిటకము, అభిధమ్మపిటకము అనునవి.

**వినయపిటకము :** సంఘ మందలి భిక్షుణీభిక్షుల కొఱకు బుద్ధభగవానుడు విధించిన ప్రవర్తనశాసననియమావళి ఇందు కలదు. వినయ పిటకములోని గ్రంథములు ఇతర పిటకములకంటె విశదతరముగ అదృశ్య ప్రపంచమును (Invisible World) గూర్చి తెలుపుచున్నవి. In addition to the rules of discipline, we have also in this VINAYA a large number of teachings given by the Buddha more mystical in their character than those of some of the other volumes; being specially intended for the training of the monastic order, specially intended for the teaching of the disciples, these books speak out more plainly as to the invisible world than do some others ...........this is really a true and essential part of Buddhist teachings........
(Seven Great Religions - Buddhism - p.107- Annie Besant - 1966)
ఐదు గ్రంథములిందున్నవి.

1) **పారాజికపాళి :–** బహిష్కరణార్హములైన ప్రధానదుష్కర్మముల నిది వివరించును. (Sins involving expulsion – Major offences).

2) **పాచిత్తియ పాళి :–** అప్రధానపాతకములు, తపస్సు చేత క్షయించునవి. (Minor offences or Sins involving penance) ఇందు వివరింపబడినవి. ఈ రెంటిని కలిపి 'సుత్తవిభంగ' మందురు. పాతిమొక్షసుత్తములకు సరళార్థ మిందు కూర్చబడినది. విభంగ మనగా సంపూర్ణవివరణము. (exposition in full)

(1) చూడు : బౌద్ధయుగము II సంపుటి. పుట 648 (1960) డా॥ రత్నాకరం బాలరాజు

3) **మహావగ్గపాళి :– (Greater section)** బుద్ధధర్మమున ప్రవేశించుటకు కావలసిన నియమావళి, ఉపోసథావిధి, ఆహారవిహారములు వర్షావాసముల నియమములు, భిక్షువుల ఔషధములు, వేషభూషల వర్ణనములిందున్నవి. ప్రాచీనభారతవర్షములోని అనుదినజీవితమును గురించి ఇది కొంత వఱకు తెలియజేయుచున్నది.

4) **చుల్లవగ్గ పాళి:– (Shorter section)** ఇందు మొత్తము పండెండ్రు (12) ఖంధకములు (వర్గములు) కలవు. మొదటితొమ్మిదిఖంధకములు(వర్గములు) భిక్షు నియమావళిని, పాపము, ప్రాయశ్చిత్తము, భిక్షువుల పరస్పర కర్తవ్యము, పాతిమొక్ష సంబంధమైన విధులను వివరించును. దశమఖంధకము భిక్షుణీధర్మముల వర్ణించును. తరువాతి రెండు ఖంధకములు రాజగృహ వైశాలీ నగరములలో జరిగిన సంగీతుల (Councils) గూర్చి వివరించును. మహావగ్గచుల్లవగ్గములు రెంటిని కలిపి 'ఖంధక'మని వ్యవహరింతురు.

5) **పరివారపాళి :– (Appendix)** ఇందు ఇరువదియైదువర్గములున్నవి. మహిందుడు, దీని నెఱుగునని 'దీపవంశము' వలన తెలియుచున్నది. వినయ శిక్షణముల (వినయపిటకము) యొక్క సారసంగ్రహరూపమైన గ్రంథమిది. వినయపిటకమున గౌతమ మునీంద్రుని జీవితము, ప్రబోధకచర్యలకు సంబంధించిన వివరములుసైతము గలవు. ప్రాచీనభారతవర్షచరిత్రకు సంబంధించిన ప్రధానాంశములు, విద్యాపద్ధతులు మొదలగు ఆసక్తికర విషయముల వినయపిటకము పరోక్షముగ వెల్లడించుచున్నది. వినయపిటకము, గౌతముని బుద్ధత్వప్రాప్తి మొదలుకొని **సారనాథమందలి ఇసిపతనమున** ధర్మచక్ర ప్రవర్తనము వఱకు గల వృత్తాంతమును వివరించును. **సుప్రసిద్ధమగు ధమ్మచక్కపవత్తనసుత్తము ఇందుకలదు.**

**సుత్త పిటకము: –** వివిధ సందర్భములలో తథాగతు డొనరించిన ప్రవచనములు, అతని ముఖ్యశిష్యులైన మహాత్ములు, సారిపుత్త,ఆనంద,మొగ్గల్లానాదుల ప్రసంగములును ఇందు కూర్పబడినవి. ఇందలి సుత్తములు (సూత్రములు) విభిన్న సందర్భములలో విభిన్న మనోధర్మముగల అనేక వ్యక్తుల కుపయుక్తముగ, హితావహముగ వివరింపబడినవి. ఇవి రుజాపీడితులకు నిర్దేశింపబడిన ఔషధవిధుల (prescriptions) వంటివి. శ్రద్ధావంతుల విషయమున బుద్ధుడు ధర్మమును విస్తరించి వివరించును; అశ్రద్ధధానుల విషయమున మౌనము వహించును.

సుత్తములలో నధికభాగమున శ్రమణుల హితమును, పావనజీవితమును, బుద్ధధర్మమును నుద్దేశించి చెప్పబడినది. గృహస్థులగు ఉపాసకుల అభ్యుదయ నిశ్శ్రేయసముల గుఱించిన అనేక ప్రసంగములును ఇందు కలవు. The Suttas form that part of the Buddha's teachings which were given to the people, his ethical teachings and discussions, disputations, questionings, explanations arising out of them, and out of circumstances that he met with in his daily life. Here are the great records of the life and teachings of The Buddha showing that life as it was lived in India, and those teachings as they fell from his sacred lips. (Seven Great Religions - Buddhism – P.109 - Annie Besant- 1966)

సుత్తపిటకము ఐదు నికాయములు (సూత్ర-సూక్త సముదయములు)గ విభక్తము.

అవి, (1) దీఘనికాయము, (2) మజ్ఝిమనికాయము, (3) సంయుక్త నికాయము, (4) అంగుత్తరనికాయము, (5) ఖుద్దకనికాయము, అనునవి.

**దీఘనికాయము : (Collection of Long Discourses)**

బుద్ధధర్మసిద్ధాంతమును వివరించు సుదీర్ఘములైన ముప్పది నాలుగు - (34) సూత్రములిందుకలవు. బుద్ధభగవానుని అంతిమజీవనము, అంతిమోపదేశము నిర్వాణప్రాప్తిని తెలుపు అధికప్రామాణికమైన **'మహాపరినిబ్బానసుత్త'** మిందు కలదు. **బ్రహ్మజాలసుత్తము, మహానిదానసుత్తము,** బుద్ధునకు మగధాధిపతి అజాతశత్రునితో కల్గిన సంవాదమును తెలుపు **సామఞ్ఞఫలసుత్తము** అను ప్రధానసుత్తములును ఇందు కలవు. గృహస్థ ధర్మమును నిరూపించు **సిగాలోవాద సుత్త**మిందలిదే.

**మజ్ఝిమనికాయము : (Collection of Middle - length Discourses)**

మధ్యమ దైర్ఘ్యము (నిడివి) గల నూట యేబది రెండు (152) సుత్తములిందు గలవు. ధర్మమునకు సంబంధించిన మనోజ్ఞసంవాదములు, వర్ణనములు నిందున్నవి. గౌతముని మహాభినిష్క్రమణమును, సత్యాన్వేషణమును తపశ్చర్యను వివరించు **'అరియపరియేసనసుత్త'** మిందలిదే. చతురార్యసత్యములు, కర్మసిద్ధాంతము, తృష్ణ యొక్క నిస్సారత, నిర్వాణము, వివిధధ్యానప్రకారవర్ణనము లిందుకలవు.

అనేక గాథలిందు ధర్మస్వరూపమును హృదయంగమముగ వర్ణించును. అంగుళీమాలుని కథ వంటి సుందరమైన కథలు, శ్రమణుల జీవితము, నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు, ఇందు వర్ణింపబడినవి. తాత్త్వికవిచారమున కంటే నిర్వాణకారణమైన శీలప్రతిష్ఠయే ముఖ్యమని ఇందు స్థాపింపబడినది.

ఈ రెండు నికాయములు గౌతమబుద్ధుని దర్శనము ననుసరించి జీవిత స్వరూపమును, తత్త్వమును వ్యాఖ్యానించును. తత్త్వవివేచనమున అంతర్దృష్టి వైభవమున నివి ప్లేటో మహాశయుని సంవాదముల కంటె మిన్నలని చెప్పవచ్చును.(1) ఈరెండునికాయములశైలి ప్రసన్నగంభీరమై దివ్యావేశయుక్తమై పండితపామర జనరంజకమై యున్నది.

**సంయుక్తనికాయము : (Collection of Kindered Sayings)**

ఇందు సైతము 'ధమ్మచక్కపవత్తనసుత్తము' కలదు. ఇది బుద్ధగౌతముని ప్రథమ ప్రవచనమనుట తెలిసినదే. కోసలాధిపతి ప్రసేనజిత్తునకు బుద్ధభగవానునికి కల్గిన సంభాషణము. వారి మైత్రిని ఈ నికాయము వర్ణించును. ఇందు సజాతీయములైన (Groups) సుత్తనికాయములు యేబది యారు (56) కూర్పబడినవి. భారతమందలి యక్షప్రశ్నలవంటి విందు కలవు. ఈ యక్షప్రశ్నలకన్నిటికి తథాగతుని చక్కనిసమాధానములు కలవు. ఇందలి కావ్యకళ, మనోజ్ఞము. బుద్ధుని, భిక్షుణీభిక్షులను మారుడు ప్రలోభపెట్టు ప్రయత్నములు వాని వైఫల్యము పరమసుందరముగ వర్ణింపబడినవి.

---

(1) In depth of Philosophic insight, in method of Socratic questioning often adopted, in the earnest and elevated tone of the whole, in the evidence they afford of the most cultured thought of the day, these discourses constantly remind the reader of the Dialogues of Plato..........

And it is quite inevitable that, as soon as it is properly translated and understood, this collection of the Dialogues of Gotama will come to be placed in our Schools of Philosophy and history on a level with the Dialogues of Plato.

The History and Literature of Buddhism -(1896) - T.W. Rhys Davids (Page 41)

**అంగుత్తరనికాయము: (Collection of Discourses arranged in accordance with numbers)**

ఇది పదునొకండు (11) నిపాతములుగా విభజింపబడినది. స్మృతి సౌలభ్యము కొఱకు ఈ నికాయమున, 1,2,3, అని క్రమముగ 11 వఱకు అర్హత్‌సిద్ధికి సోపానసదృశములగు గుణములు వర్ణింపబడినవి. అంగుత్తరనికాయము నాటి కాలపు దోషుల శిక్షించు విధానమును (కఠినమైన శిక్షాస్మృతిని) మనకు తెలియజేయుచున్నది. ఇది అతి విస్తృతమైన గ్రంథము. ఇందించుమించు రెండువేలామున్నూటయెనిమిది (2308) సుత్తములున్నవి. పదునొకండు (11) వర్గములుగ విభజింపబడినది.

**ఖుద్దకనికాయము:- (Smaller Collection)**

ఇందు పదునైదు (15) గ్రంథములు కలవు. అవి :-

(1) ఖుద్దకపాఠము (Shorter Texts)

(2) ధమ్మపదము (Way of Truth)

(3) ఉదానము, (ఆనందఘోష - Paeans of joy)

(4) ఇతివృత్తకము ("Thus said" Discourses)

(5) సుత్తనిపాతము (Collected Discourses)

(6) విమానవత్థు (Stories of Celestial Mansions)

(7) పేతవత్థు (Stories of pretas or departed spirits)

(8) థేరగాథలు (Psalms of monks)

(9) థేరీగాథలు (Psalms of nuns)

(10) జాతకకథలు (Former births of Buddha)

(11) నిద్దేశము (Expositions of certain Suttas by Sariputta)

(12) పటిసంభిదామగ్గము (The road of discrimination and intuitive insight)

(13) అపదానము (Lives of Arahats – Legends)

(14) బుద్ధవంశము (The Poetical memoranda on the legends of twenty four preceding Buddhas and of Gotama)

(15) చరియాపిటకము (Basket of conduct, Buddhas' meritorious actions - Modes of Conduct) అనునవి.

**ఖుద్దకపాఠము :–** బౌద్ధధర్మ ప్రారంభికపాఠము;

**'బుద్ధం సరణం గచ్ఛామి,**
**ధమ్మం సరణం గచ్ఛామి**
**సంఘం సరణం గచ్ఛామి'** -

అను దివ్యమంత్రముతో ప్రారంభమై, శరీరస్వరూపమును, దాని యందలి ముప్పదినాల్గు (34) ధాతువులను గుఱించి వివరించును. మహనీయభావ సమన్వితములైన గాథల సంకలనమిది.

**ధమ్మపదము :–** నన్నూటయిరువది మూడు (423) మహోపదేశాత్మకములైన గాథలతో ధర్మపథమును శీల(సదాచార)మును నిర్దేశించు దివ్యగ్రంథము. బుద్ధధర్మమును విశదీకరించుట యందు దీనిని మించినది మఱొకటి లేదు. బుద్ధధర్మాధ్యయనమునకు ఆద్యపాఠ్యగ్రంథమిది; సూక్త్యాత్మకగాథలసముచ్చయము (Anthology). జీవితక్షణభంగురతను, దుఃఖమును, మర్మభేదకమైన విషాదకరపదజాలముతో నిది వర్ణించును. (చూడు :- గాథలు, 41, 47, 48, 146ఇత్యాది.) ఇట్టి మర్మభేదక విషాదకరశబ్ద జాలము బుద్ధసంవాద రూపములైన సుత్తములందు తఱచుగ నుండదు. **యథార్థపండితుని, భిక్షువును, శ్రమణుని, బ్రాహ్మణుని, ధమ్మపదము నిర్వచించినది.** ఇందలి గాథలకు సమానార్థకములగు శ్లోకములు మహా భారతములో ఇతర పురాణాదులలో, పంచతంత్ర హితోపదేశ గ్రంథములందుసైతము కాన్పించుచున్నవి. ఇందు కేవలము బౌద్ధములు, సగమునకు మించిలేవు.

అతిపురాతనకాలము నుండి లోకరూఢము (popular)-లైన ఉపదేశాత్మ కములు, ప్రబోధకములునైన గీతములు–సుభాషితములు, సులభముగ, జ్ఞప్తియం

దుంచుకొని, మననమొనరించుకొనుట కనువుగా, రమ్యోపమాలం కృతములై సుగమమైన సంస్కృతభాషయందు వ్యాప్తినందియుండెను. **ఈ సుభాషితరాశిలో కొంతభాగము బౌద్ధమునందును, కొంతభాగము జైనమునందును చేరినది.** పరిశిష్ట సుభాషితరాశి, సంస్కృతవాఙ్మయమూలవాహిని యందు, అవిచ్ఛిన్నముగ కొనసాగినది.

(See: Great Integraters: The Saint - Singers of India - Dr. V. Raghavan - p. 18-1964)

**ఉదానము (ఆనందఘోష) :–** బుద్ధభగవానుని దివ్యావేశనిర్భరములైన యెనుబది రెండు (82) సుత్తములిందుగలవు. అర్హతాదర్శమును, సమాధిసంపన్నుడైన తథాగతుడు, భావమనోజ్ఞఫణితి యందు వర్ణించినాడు. బుద్ధునిదైన పరమార్థవర్ణన మిందు కలదు.

(చూడు :- బుద్ధదర్శనము – పుట 269– (1962)–డా॥ రత్నాకరం బాలరాజు.)

**ఇతివుత్తకము :– 'ఇతివుత్తం భగవతా'** – భగవంతునిచే నిట్లు చెప్పబడెను– అను బుద్ధప్రవచనకథాగ్రంథము; ఆనాటి (క్రీ.పూ. 500) జనుల ఆధ్యాత్మికతృష్ణ నిది ప్రతిబింబించుచున్నది.

**సుత్తనిపాతము :–** ఇది ఐదు (5) వర్గములుగ విభక్తమై డెబ్బదిరెండు (72) సుత్తములుగల అత్యంతప్రాచీనగ్రంథము. ధర్మమును గూర్చిన బుద్ధభగవానుని పావనోపదేశము లిందు గలవు. దీనిని, **బుద్ధవచనామృతమని పేర్కొనవచ్చును.** జాతిభేదములు నామమాత్రములని, సౌశీల్యమే జాతి కంటె ప్రధానమని ఇందలి **'వసల' 'వాసెట్ట' సుత్తములు మానవజాతి ఏకత్వమును నిరూపించును.** మహామంగళములను అభివర్ణించు మహామంగళసుత్త మిందలిదే. **జన్మముపైన ఆధారపడిన వర్ణభేదమిందు నిరసింపబడినది. దివ్యసమాధిమగ్నుడైన మహాత్ముడు తప్ప, అట్టి పరిపూర్ణవాక్కులితరులు పల్కజాలరని స్వామి వివేకానందుల అభిప్రాయము.**[1] నిర్వాణప్రాప్తియందు తత్పరుడై యేకాంతజీవనుడైన శ్రమణుని

(1) See: 'The Master as I saw Him" - Chapter XVIII. The Swami Vivekananda and his attitude to Buddha. (Sister Nivedita) Pages 253-274. నిర్వాణానందానుభూతి – జీవన్ముక్త్యనుభూతి – ప్రకాశకమైన సుత్తనిపాతమందలి ధనియ సుత్తమును స్వామి ఈ సందర్భమున నుదాహరించెను.

చర్యను, ఇందలి **'ఖగ్గవిషాణ', 'ధమ్మచరియ', 'సమ్మాపరిబ్బాజనీయ' 'సారిపుత్త' సుత్తములు** మనోజ్ఞసరణి నభివర్ణించును. **గృహస్థులైన సంసారులకు 'పరాభవ', 'మంగళ', 'హిరి', 'ధమ్మిక' సుత్తములు ధర్మచర్యను బోధించును.**

**'పబ్బజ్జ', 'పధాన', 'నాలక' 'అత్తదణ్డ'** సుత్తములందు, జన్మము మొదలుకొని, సంబోధిప్రాప్తి పర్యంతమగు భగవంతుని అనుపమానజీవనచర్యను సముజ్జ్వలముగ ప్రకాశింపజేయు రమణీయ ఘట్టములు కలవు. సుందరికభరద్వాజాది సుత్తములు యాగహోమాదికముల గూర్చిన భగవంతుని విచారసరణిని సుస్పష్టమొనరించును. **బ్రాహ్మణధమ్మసుత్తము,** బుద్ధుని సమకాలమందును తత్పూర్వమునందును, బ్రాహ్మణుల జీవనమును గుఱించిన రెండు విభిన్నచిత్రముల నావిష్కరించి, గోహత్యను నిరసించి, పురాతన సద్బ్రాహ్మణధర్మము నభివర్ణించును.

దక్షిణాపథమున గోదావరీనదీతటమున ఆశ్రమవాసియైయున్న, **'బావరి'** యను కోసలదేశబ్రాహ్మణుని పదునాఱువురు (16) శిష్యులు, తమ గురువునకు మఱొక బ్రాహ్మణుడొసగిన శాపమును నివారించుటకు, అట నుండి బయలుదేరి దీర్ఘ ప్రయాణమొనరించి రాజగృహమున బుద్ధుని సందర్శించి, ప్రశ్నించి, సద్ధర్మమెఱిగి విముక్తులైన విషయము, బావరి ధన్యతను పారాయణవగ్గమున నభివర్ణితము. ఉత్తరాపథము దక్షిణాపథము – వీనికి గల సంబంధ మిందు వర్ణితము. ధర్మ, దర్శన, ఇతిహాస దృష్టిననుసరించి సుత్తనిపాత మత్యంతమహత్తర గ్రంథము. **అత్యంతప్రాచీనమైనఈ సుత్తనిపాతభాషపై విశేషముగ వైదికభాష ప్రభావమున్నదని 'ఫౌజ్‌బాల్' (V. Fousboll) పండితుడు స్థాపించును.**

**విమానవత్థు :–** దేవతల దివ్యప్రాసాదముల వర్ణనమిందు కలదు; కుశలకర్మ పరాయణులు, శీలసంపన్నులునగు వారు దేవలోకముల పొందుదురని చెప్పబడినది.

**పేతవత్థు :–** ప్రేతాత్మల వర్ణనమిందుకలదు. మరణానంతరము పాపకర్ములు నరకబాధల ననుభవింతురని చెప్పబడినది.

**థేరగాథలు :–** ఇవి భిక్షుగీతములు. ఆధ్యాత్మికానుభూతి ప్రకాశకములైన ఇన్నూటఅఱువదినాల్గు (264) గీతములిందున్నవి. ఇందలి కవితామాధుర్యము హృదయైకవేద్యము. రమణీయప్రకృతివర్ణనముతోడి ఉపమల మనోరమత్వమనుపమానము. విరక్తులైనను ఆ థేరులు, వసంతఋతువును ఎంతో

మనోహరముగ వర్ణించినారు. వీరు అర్హత్‌స్థితి నందికొన్న జీవన్ముక్తులు.

**థేరీగాథలు :–** ఇవి భిక్షుణీ గీతములు. థేరగాథల వలె నివియును ఆధ్యాత్మికగీతములు. అర్హత్‌స్థితిని బొందిన శ్రమణీమణులనిర్వాణానుభూత్యభివ్యంజకము లీ దివ్యావేశగీతములు. నిర్వాణపథమున స్త్రీపుం వివక్షలేదు. దుఃఖ విముక్తిని సర్వజీవులు ఆకాంక్షింతురు. ఉపనిషత్కాల మందలి గార్గి, మైత్రేయి, సులభ, మొదలగు వారి నీ స్త్రీరత్నములు విస్మరింపజేసినారు. క్రీ.పూ. 500 నాటి ఈ శ్రమణీమణుల జీవితము నేటి ప్రమదాలోకమునకు చిరంతనాదర్శము. **సౌందర్యములో, కావ్యకళానైపుణ్యములో, నివి, ఋగ్వేద ఋక్కులు, కాళిదాసజయదేవాది మహాకవుల రసనిర్భరరమ్యగీతములతో సమానమని పండితాభిప్రాయము.** ఈ థేరీథేర గాథలు స్త్రీ పురుష మనస్తత్వ భేదమును వెల్లడించుచుండుట ఆసక్తిజనకము. థేరీగాథలు అధికముగ వైయక్తికములు; కథాత్మకములు.

థేరగాథలు అధికముగ ఆంతరజీవితమును ప్రకృతిసౌందర్యమును అత్యంత సుందరముగ వర్ణించును. ఈ గాథల (పాటల) పల్లవి, వారుపొందిన శాంతిమయానందము; వాచామగోచరమైన పరమశాంతి; కామవిముక్తి; దుఃఖవిముక్తి. ప్రతిగాథయు ఒక దివ్యావేశపూర్ణమైన విజయగీతిక.

(See: Buddha and the Gospel of Buddhism - Ananda K. Kumara Swamy - (1974). page 286)

**జాతకగ్రంథము :–** బుద్ధధర్మమందలి అపూర్వరమణీయకథావాఙ్మయము. గౌతమబుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన ఐదునూటయాభై (550) కథ లిందు కలవు. ఇందుకొన్ని కథలు ప్రాచీనభారతదేశపు ప్రజల ఆర్థిక, సాంఘిక ఆధ్యాత్మిక జీవన విధానమును, కన్నులకు కట్టినట్లు తెలియజేయును. అశోకుని కుమారుడైన మహిందుడు, క్రీ.పూ. 250 లో సింహళద్వీపమునకు, ఈ జాతక గ్రంథమును తీసికొని పోయినాడని బౌద్ధ సంప్రదాయము చెప్పును. జాతకకథలో అవతారికారూపమైన మొదటి భాగము, **(ప్రత్యుత్పన్న వస్తువు)**, పాత్రలతో బుద్ధునికి అతని అనుచరులకు అభేదనిరూపణ రూపమైన **సమాప్తి** వచనము, ఈ రెంటి మధ్యమున గల కథ **(అతీత వస్తువు)**, అను మూడు అంగములుండును. కథాసారమైన గాథ, వీనితో కూర్చబడి యుండును.

తన పూర్వసర్గానుభవముల గూర్చి బుద్ధుడు చెప్పిన కొన్ని గాథల ననుకరించుచు, తరువాతి కాలమున, కేవల మతాభినివేశపరులైన బౌద్ధు లనేక కథలను కల్పించినారు; తమ ధర్మమునకు మాతృభూతయగు వేద సంస్కృతిని వక్రీకరించి అవహేళనాత్మకముగ కృతఘ్నులై, కథాకల్పన మొనర్చుట దురదృష్ట పరిణామము. కాన, ప్రచలితముగ నున్న జాతకకథలన్నియు విశ్వాసార్హములు కావు. కొన్ని జాతకకథలు ఉపదేశాత్మకములుగను, జానపదుల సదసద్వివేకముకు దర్పణములుగనున్నను, అవియన్నియు బుద్ధప్రోక్తములు కావు. ధర్మశాస్త్రచరిత్రను రచించిన మహామహోపాధ్యాయ పి.వి. కాణేమహాశయుడు జాతకకథలనిట్లు నిరసించెను. **పూర్వభవము లందు బుద్ధుని మహనీయతను నిరూపించుటకే జాతకగాథ లుద్దిష్టములైనను, ఇవి సుప్రసిద్ధ వ్యక్తుల నామముల నుద్దేశపూర్వకముగ నుపయోగించి, బోధిసత్త్వుని తప్ప, మిగత వ్యక్తులను (జాతకకథ యందలి ఇతర పాత్రలను) అవహేళన మొనర్చుటకు ప్రయత్నించినవి.**

"It is not unreasonable to suppose that the germs of most of the Jataka Stories were derived from the folk lore of India existing in those times. They are meant to glorify Buddha in his supposed previous existances and **while using well-known names, try (probably purposely) to make these names except those of the Bodhisattva ridiculous"**.

(History of Dharmasastra - Vol I Part I page 392)

**నిద్దేశము :–** సుత్తనిపాతమందలి చివరివర్గములు – 'అట్ఠకవగ్గ', 'పారాయణ' వగ్గములలోని ముప్పదిమూడు (33) సుత్తములకు భగవంతుని శిష్యుడైన సారిపుత్తథేరుడు రచించిన భాష్య మీగ్రంథము. ఈ పాళీభాష్య మతిప్రాచీనము. గుణోత్కృష్టత వలన, నిది నికాయగ్రంథమున చేర్పబడినది.

**పటిసంభిదామగ్గము:–** (ప్రతిసంవిద్ మార్గము) అర్థంతుల జ్ఞానప్రాప్తి ప్రకారము నభివర్ణించును. శ్రమణుల అంతర్దృష్టివైభవమును, ధర్మమందలి ముఖ్యాంశములను ప్రశ్నోత్తరరూపమున ఇది వివరించును.

**అపదానము :–** (అవదానము) అర్హంతుల స్వార్థత్యాగమును సౌశీల్యమయ జీవనమును,శౌర్యోద్యోగములను వర్ణించు కథాసముచ్చయము; పద్యకావ్యము.

జాతక కథలు బుద్ధుని పూర్వజన్మ కర్మములను వర్ణించును. అపదానము అర్హంతుల - అర్హత్ సిద్ధిని పొందిన స్త్రీ పురుషుల - పూర్వజన్మ చరిత్రలను వివరించును. **'అపదానం కర్మ వృత్తమ్'** - పూర్వము నడిచిన ప్రశస్తకర్మము - అని అమరసింహుని నిర్వచనము. (అ.కో.III-116)

**బుద్ధవంశము :-** గౌతమ బుద్ధునికి పూర్వము గత పండెండ్రు (12) కల్పముల జన్మించిన ఇరువదినలువురు (24) బుద్ధుల గూర్చి ఇది వివరించును. వక్త గౌతమబుద్ధుడు. పూర్వబుద్ధుల ధర్మచక్రప్రవర్తనవిధానమును వర్ణించు పద్యకావ్యమిది. ఇందు గౌతమబుద్ధుని చరిత్రము కూడ కలదు.

**చరియాపిటకము :-** ఇది ముప్పదినాల్గు (34) జాతకకథలు గల పద్యకావ్యము. ఈ ముప్పదినాల్గు (34) జన్మములలో బోధిసత్త్వుడు ప్రతిజన్మమునను శీలప్రతిష్ఠితుడై పది (10) పారమితలను సాధించిన విధాన మిందభివర్ణితము. బోధిసత్త్వభావము పది (10) పారమితల భావము నికాయగ్రంథములలో లేదని, ఇది అర్వాచీనగ్రంథమని కొందఱు పండితుల అభిప్రాయము.

**అభిధమ్మపిటకము :-** ఇది చివరి పిటకము. అభిధమ్మమనగా ధర్మమును చక్కగా, విస్తృతిపూర్వకముగ చెప్పుట అని బుద్ధఘోషుని వివరణము. గహనమైన ఆత్మవిచారముతో సంబంధము లేకుండగనే గౌతమబుద్ధుడు ధర్మమును ప్రవచించినాడు. అభిధమ్మమున కర్థము తత్త్వశాస్త్రమని భావించుట సరికాదు. ఇందలి విషయము వినయసుత్త పిటకము లందలిదే. పాండితీప్రకర్షకముగ నిది రచితము. కాని థేరులు ఈ అభిప్రాయము నంగీకరింపరు. **ఇందు సప్తప్రకరణము లని చెప్పబడు ఏడు (7) గ్రంథములున్నవి.**

(1) **ధమ్మసంగిణి :-** ఇది ధర్మసాధకుల మనోభూమికలను వర్ణించును. మనోవిజ్ఞానచర్చ యిందు కలదు.

(2) **విభంగము :-** ఇందు సైతము మనోవిజ్ఞానచర్చ కలదు. అష్టాదశవర్గయుక్తమై వివిధ విషయముల నిది వర్ణించును.

(3) **కథావత్థు :-** అశోకచక్రవర్తి సమకాలికుడు మొగ్గలిపుత్తతిష్యముని దీనిని రచించెను. ఇది వేయివిషయములకు సంబంధించిన వాదగ్రంథము. బుద్ధధర్మమును

పరిశుద్ధముగ ప్రతిష్ఠింపవలె నన్న అశోకుని ఆకాంక్ష కనుగుణముగ తిష్యముని తథాగతుని గుఱించి పూర్వపక్షవాదుల ఇన్నూటయేబదిరెండు (252) మూఢ విశ్వాసాత్మకములైన అపవాదముల నిందు ఖండించెను. ఇది బుద్ధ ధర్మము యొక్క ఇతిహాసమని చెప్పవచ్చును.

(4) **పుగ్గల పఞ్ఞత్తి :–** ('పఞ్ఞత్తి', declaration on పుగ్గల, or personality)

ఇందు ప్రశ్నోత్తర రూపమున వ్యక్తులను గుర్తించు విధానము వర్ణింపబడినది. స్త్రీ పురుషులను నైతికదృష్టితో వర్గీకరించి వారి గుణముల నిది వర్ణించును. 'పుగ్గల పఞ్ఞత్తి' అనగా **వ్యక్తిప్రత్యభిజ్ఞ** అని అర్థము.

**పుద్గలః సుందరాకారే త్రిషు పుంస్యాత్మదేహయో : (మేదినీకోశము)**

పుగ్గలశబ్దము 'పుద్గల' (సం) శబ్దము యొక్క పాళీరూపము. సౌందర్యము, జీవము, శరీరము అని దీని అర్థము.

(5) **ధాతుకథ :–** ఇందు తత్త్వముల (elements) గుఱించిన చర్చ కలదు. ఇది స్వభావగుణముల మూలములను, (bases of character) శ్రద్ధాప్రవృత్తులలో కన్పించు మానసికలక్షణములను వర్ణించును.

(6) **యమకము :–** (ద్వంద్వము) ప్రపంచమున పరస్పరవిరుద్ధములుగ విధినిషేధ ద్వంద్వ రూపమున గోచరించు విషయముల నిది వర్ణించును. ఇందు పది వర్గములు కలవు.

(7) **పట్ఠాన పకరణము :–** ఇది అభిధమ్మ పిటకమున చివరి గ్రంథము. ఇందు వివిధ విషయముల గూర్చిన వర్ణనములు కలవు. ఇది కారణజాతమును గుఱించి వివరించును. (The book of relations or causes)

అభిధమ్మమున కర్థము బుద్ధఘోషు ననుసరించి విస్తరణము (expansion), ధమ్మము యొక్క విపులవివరణము. ధమ్మ మనగా సత్యము, (Truth) నియమము (Norm); తత్త్వశాస్త్రము కాదు.

కాని కొందఱు థేరులీ అభిప్రాయముతో నేకీభవింపరు. సుత్తపిటకమందలి బుద్ధోపదేశములు కేవలమువ్యావహారిక బోధలు (వోహారదేసనా). అభిధమ్మపిటక మందలి బోధలు పారమార్థికబోధలని వారినిశ్చయము. వివేకవంతులకు

అభిధమ్మము అపరిహార్యమగు మార్గదర్శకము; ఆలోచనల కాహారము. నైతిక దృక్పథమున ననుసరించి మానసికవ్యాపారముల విశ్లేషణ మిందుకలదు. పదార్థ (Matter)ము యొక్క ధర్మములు, దాని మూలములు, మనస్సునకు పదార్థమునకు గల సంబంధము, వివరింపబడినది. ఈ విచార మాధారముగ శీల-సదాచార-రూపమగు నైతికదర్శనము రూపొందినది. ఇది పరమార్థ మగు నిర్వాణప్రాప్తికి సోపానరూపము.

సత్యసంపన్నమై ప్రకృతిసౌందర్య ప్రణయముతో మిళితమైన హాస్య వక్రోక్తులు, గాఢశ్రద్ధాత్మకమై, గభీరజీవితసమస్యల పరిష్కరింపగల అద్భుతావహమైన జ్ఞానము, ఈ పిటకత్రయమున గలదని పండితు లందరు. ఉపనిషత్తులకు ఆదిశంకరుడు భాష్యము రచించినట్లు భదన్తబుద్ధఘోషుడే త్రిపిటకములకు భాష్యము రచించి బుద్ధదర్శనమును నిర్ణయించి క్రమబద్ధ మొనరించినాడు. 'భదన్త బుద్ధఘోషుని కాలము ఐదవ శతాబ్దము. (క్రీ.శ.420).

అశోకుని శాసనములను బట్టి, బౌద్ధసాహిత్యమంతయు పిటక, నికాయ, సుత్తాంతము లను విభాగములు కల్గి యుండినదనియు, ఐదు నికాయములు సైత ముండియుండెననియు తెలియుచున్నది. ఈ నికాయగ్రంథములలో అశోకుని పేరెక్కడను కనిపింపదు. కావున ఆ తరువాత కూడ వీనిలో మార్పులు చేర్పులు జరుగలేదని చెప్పవచ్చును. అట్లు జరిగియున్నచో, బౌద్ధధర్మము నుపాసించి, దాని కపారసేవ చేసిన ఆరాజర్షిని గుఱించిన ప్రశస్తిని బౌద్ధభిక్షువులు ఈ పిటకత్రయమున చేర్చియుందురు. **కావున మూడవ బౌద్ధ సంగీతి నాటికే (క్రీ.పూ. 241) తత్పూర్వమే ఈ గ్రంథ సంకలనము పూర్తియయి యుండునని చెప్పవచ్చును.***

ఇది పిటకత్రయ పాళీసాహిత్య సంక్షేపదర్శనము.





---

* డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడిట్లు వ్రాయును.

'In the Tripitaka itself no mention is made of the Third Council under Asoka at Pataliputra about 247 B.C. There are references to the First Council at Rajagrha (477 B.C.) and the Second Council of Vaisali (377 B.C.). Evidently the Buddhist canon as it has come down to us was closed after the Second Council and before the Third Council.' (The Dhammapada - Introduction - p.2)

గౌతమబుద్ధుని జనన,పరినిర్వాణకాలమును గూర్చి అనేకభిన్నాభిప్రాయములున్నవి. సింహళీయ సంప్రదాయము ననుసరించి గౌతముని జననము క్రీ.పూ. 623; పరినిర్వాణము క్రీ.పూ. 543 బుద్ధగయ శాసనము పరినిర్వాణము క్రీ.పూ. 544 న జరిగినదని తెలుపుచున్నది. జీవితకాలము యెనుబది (80) సంవత్సరములు. పరినిర్వాణకాలమును గుఱించి నలువది యెనిమిది (48) అభిప్రాయభేదములున్నవి. పరస్పర విరుద్ధత, వాని నిస్సారతను వెల్లడించుచున్నది. కాని భారతీయ సంప్రదాయకాలపరిగణనము ననుసరించి గౌతముని జననము క్రీ.పూ. 1873; పరినిర్వాణము క్రీ.పూ. 1793. జీవితకాలము యెనుబది (80 ) సంవత్సరములు. గౌతమబుద్ధుని పరినిర్వాణానంతరమున, మహాకాశ్యపుని అధ్యక్షతన ప్రథమసంగీతి క్రీ.పూ. 1793 న జరిగినది. ద్వితీయ తృతీయ సంగీతులు క్రమముగ క్రీ.పూ. 1690 క్రీ.పూ. 1457 సంవత్సరములందు జరిగినవి. అశోకుడు మౌర్యసింహాసనము నధిష్ఠించిన కాలము క్రీ.పూ. 1474.

కాని ప్రస్తుతము, ఆధునికభారతీయచారిత్రకపరిశోధకపండితులు మాత్రము, పాశ్చాత్య పండితుల కాలనిర్ణయమునే భారతచరిత్రవిషయమున పరమప్రామాణికముగ నంగీకరించి, అభిమానించుచుండుట చింత్యము.

(See: Indian Chronology - Dr. D.S. Triveda - Published by Bharatiya Vidya Bhavan, Bombay - 1963)



నమో భగవతే బుద్ధాయ

# ధమ్మపదం–అనుబంధము - II

## బుద్ధ సంబంధమగు సంస్కృత సాహిత్యము :

## బౌద్ధ సంస్కృత సాహిత్యము :

**లలితవిస్తరము :–** ఇది సువిస్తరము, రమణీయమునైన బుద్ధలీలాచరిత్ర కావ్యము. ఇందు ఇరువదియేడు (27) అధ్యాయములు గలవు. అధ్యాయములకు 'పరివర్తము'లని పేరు. ఇది యొక పురాణము వంటిది. శ్రద్ధ, సారభూతమైన ధర్మ స్వరూపము, నిరూఢముగ నిందు బోధింపబడినది. 'ధర్మపర్యాయ'మని దీనికి మఱొకపేరున్నది. అశ్వఘోషుని బుద్ధచరితకావ్యవస్తువున కిది మూలము. దీని రచనా కాలము నిర్ణయించుట కష్టము. అయినను క్రీ.శ. మొదటి శతాబ్దము దీని రచనాకాలము కావచ్చును. క్రీ.పూ. మూడవశతాబ్దమున రచింపబడినదని కొందఱి అభిప్రాయము. ఆంగ్లమున 'ఎడ్విన్ ఆర్నాల్డు' కవి (Edwin Arnold) రచించిన 'ది లైట్ ఆఫ్ ఏషియా' (The Light of Asia) అను మనోజ్ఞ కావ్యమున కిది మూలగ్రంథము. ఇందలి సూక్తులు కొన్ని నా ధమ్మపదవ్యాఖ్యానమున నుదాహరింపబడినవి. గౌతమ మునీంద్రుని సంబోధిప్రాప్తి కగు వజ్రసంకల్పము తెలుపు శ్లోకమిందలిదే.

**"ఇహాసనే శుష్యతు మే శరీరం, త్వగస్థిమాంసం ప్రళయం చ యాతు ।**
**అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం, నైవాసనాత్ కాయ మతశ్చలిష్యతే ।।"**

ధర్మచక్రప్రవర్తనపర్యంతమగు బుద్ధచరిత్రము మాత్రమే ఇందుగలదు.

తరువాతి పరినిర్వాణ పర్యంతమగు ఉత్తరచరిత్రమిందులేదు. లలితలలితములైన కాంతపదావళులచే, నతి విస్తరముగ(విపులముగ) నిర్మితమైనందున, నీగ్రంథమునకీ పేరు సార్థకమైనది. వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లిందుగలవు. పాణిని(అష్టాధ్యాయి) వ్యాకరణమునకు లొంగని పెక్కు శబ్దప్రయోగము లిందున్నంత మాత్రమున నిది పాణినికి పూర్వమున రచిత మైనదని చెప్పుట సరికాదు. బౌద్ధుల సంస్కృతమున సాధారణముగ వ్యాకరణ విలక్షణ ప్రయోగములుండుననియందురు. కాని, వ్యాకరణ విరుద్ధములగుశబ్దప్రయోగములు, ఆర్షగ్రంథములయందునునుండుట, గమనార్హము.

**బుద్ధచరితము, సౌందరనందము :**

బౌద్ధకవులలో మాత్రమే కాక, సంస్కృతమున సుప్రసిద్ధ మహాకవులలో నొకడగు అశ్వఘోష మహాకవి ఈ రెండు కావ్యములకు కర్త. ఇతని కాలము క్రీ.శ. మొదటి శతాబ్దము (క్రీ.శ.79) కావచ్చునని పండితుల అభిప్రాయము. కాళిదాసమహాకవి, క్రీ.పూ. ప్రథమశతాబ్దికి చెందినవాడనునది నిజమైనచో అశ్వఘోషుడు ఆ మహాకవికి తరువాతివాడు కాగలడు.

అశ్వఘోషుడు మహాయానప్రవర్తకులగు మహాత్ములలో నగ్రగణ్యుడు. ప్రపంచ నిస్సారతను ధర్మస్వరూపమును గాయకబృందసహితుడై జనపదముల యందు ప్రబోధ మొనరించుచుండెనని జీవితచరిత్ర చెప్పుచున్నది. (చూడు:- Buddha and the Gospel of Buddhism - Ananda K. Kumara Swami 1974 first Indian edition).) జనసమూహము లీమహనీయుని మధురగానమున నిమగ్నులై మౌనమున నాలకించుచుండిరట.

శ్రీరాముని పావన జీవితోపదేశములను మహర్షి వాల్మీకి, సులలిత మధుమయ ఫణితి నాదమయమైన రామాయణ మహాకావ్యము ద్వారా ప్రచారమొనరించినట్లు, శ్రీకృష్ణ జీవితోపదేశములను మహర్షి వ్యాసుడు, భారత, హరివంశ, భాగవతాది, దివ్యగ్రంథముల రచించి ప్రచార మొనరించినట్లు, అశ్వఘోషుడు, బుద్ధుని లోకోత్తరజీవితముయొక్కసజీవచిత్రమును, ఉపదేశమును, బుద్ధచరిత మహాకావ్యము ద్వారా ప్రచారమొనరించెను. బుద్ధచరితము ఇరువదియెనిమిది (28) సర్గల మహాకావ్యము. ఇందు పూర్వార్థము పదునాల్గు(14) సర్గలు మాత్రమే భారతదేశమున ఉపలబ్ధము. ఇందు భగవంతుని జన్మము మొదలుకొని బుద్ధత్వప్రాప్తిపర్యంతమగు

కథగలదు. ఉత్తరార్ధము భారతదేశమున లభించుటలేదు. కాని, సంపూర్ణ గ్రంథము చీనీ, టిబెట్ భాషల యందనువదింపబడి లభించుచున్నది. ఉత్తరార్ధము (ధర్మచక్ర ప్రవర్తనము మొదలుకొని, మహాపరి నిర్వాణ పర్యంతమగు బుద్ధచర్యను వర్ణించు చతుర్దశసర్గాత్మకము). ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయము (Oxford University) న, సంస్కృత భాషాధ్యాపకుడగు జాన్స్టన్ మహాశయుడు టిబెట్, చీనీ భాషల నుండి ఆంగ్లమున దీనికి భావానువాదమొనరించెను. దానిననుసరించి శ్రీసూర్యనారాయణచౌధరీ మహాశయుడు హిందీ భాషయందను వాదమును రచించెను. ఇట్లు భారతవర్ష జ్ఞాన గౌరవము- సాహిత్యవైభవము - చాలకాలము విదేశములందు గడిపి, మరల స్వజన్మ స్థానమును - భారతదేశమును భగవత్కృపా వశమున పొందగల్గినది. దీనిని సంస్కృత పద్యమయ కావ్యరూపమున మహంత శ్రీరామచంద్ర దాస శాస్త్రియను పండితుడు రచించినాడు. ఇట్లు నేడు, అశ్వఘోషకృతమగు నీ దివ్యకావ్యకృతి సంపూర్ణముగ ఇరువదియెనిమిది (28) సర్గలతో, స్వస్వరూప సంస్కృతభాషాశరీరధారిణియై. మన కుప లబ్ధమగుచున్నది.[1] చీనీ భాషానువాదము 'ధర్మరక్షకుడ'ను బౌద్ధ భిక్షువుచే క్రీ.శ. ఐదవ (5) శతాబ్దియందొనరింపబడినది. ఏడెనిమిది (7,8) శతాబ్దులలో టిబెట్ భాషలోనికిది పరివర్తితము.

ఈ కావ్యమున భగవంతుని దివ్యజీవనముతో, త దుపదిష్టమైన వైరాగ్యము, త్యాగము, దృఢత, అవిచలనిశ్చయము, లోకహితరతి, మొదలగు గుణసంపద హృదయంగమముగ సమన్వయింపబడినది.

ఉద్వేగము, మదము, శ్రమము, పరాపచారఫల మగు ధర్మపీడ - వీని కాశ్రయమై మోహాయతనమగు నృపత్వమును వివేకవంతు డెట్లు కాంక్షించునని గౌతముడు రాజ్యాధికారమును నిరసించును.

**"కథం ను మోహాయతనం నృపత్వం, క్షమం ప్రపత్తుం విదుషా నరేణ।**
**సోద్వేగతా, యత్ర మదః శ్రమశ్చ, పరాఽపచారేణ చ ధర్మపీడా ॥"**

(బు.చ. IX-40)

ఆషాఢమున కర్షకులు, భూమిని దున్నినపుడు హతమైన సూక్ష్మ

(1) చౌఖాంబా విద్యాభవన్, వారాణశివారు దీనిని ప్రకటించియున్నారు.

క్రిమికీటాదులగాంచి, తమవారు హతులైనట్లు భావించి గౌతముడు శోకించును.

**"హలభిన్న వికీర్ణశష్పదుర్భాం, హత సూక్ష్మక్రిమికీటజంతుకీర్ణమ్ ।
సమవేక్ష్య రసాం తథావిధాం తాం, స్వజనస్యేవ వధే భృశం శుశోచ"**

(బు.చ. V-5)

జీవితము క్షణభంగురము. ధర్మమునకు కాలము నిర్ధారితము కాదు. యౌవనావస్థయందే శ్రేయస్సును సంగ్రహింప కాంక్షించితిని. మృత్యురూప శత్రువుండగా జీవితమెట్లు విశ్వాసార్హమగును?

**"యదపి స్యాదనమయే, యాతో వన మసావితి,
అకాలో నాఽస్తి ధర్మస్య, జీవితే చంచలే సతి ।
తస్మా దద్యైవ మే శ్రేయశ్చేతవ్య మితి నిశ్చయః ।
జీవితే కో హి విస్రంభో, మృత్యౌ ప్రత్యర్థిని స్థితే?" ।**

(బు.చ. VI-21,22)

యశోధరాదుఃఖము, హృదయస్పర్శకమై కరుణరసనిర్భరముగ వర్ణింప బడినది. బుద్ధచరితమీరీతి ధర్మమధుస్ఫీతమై రసాత్మకమై, మానవజాతికి మార్గదర్శకమగు ఆధ్యాత్మికధర్మదీపమై వెలయుచున్నది.

**"ప్రజ్ఞాంబువేగాం స్థిరశీలవప్రాం, సమాధిశీతాం, వ్రతచక్రవాకామ్ ।
అస్యోత్తమాం ధర్మనదీం ప్రవృత్తాం, తృష్ణార్దితః పాస్యతి జీవలోకః ।"**

(బు.చ. I.71)

సద్ధర్మము నదీరూపమున సైతము వర్ణితము. ఈ యుత్తమ ధర్మనదికి ప్రజ్ఞయే జలప్రవాహము, స్థిరశీలమే తటము. ఇందు సమాధిరూపమైన శీతలత్వమున్నది. వ్రతములే యిందలి చక్రవాకములు. తృష్ణారూపమగు దప్పిచే వ్యాకులమైన జీవలోక మిందలి జలమును గ్రోలును.

**సౌందరనందము :–**

ఇది అష్టాదశ (18) సర్గాత్మకమగు మహాకావ్యము. గౌతమబుద్ధుని సవతి తమ్ముడు, ప్రజాపతి గౌతమీదేవి పుత్రుడునైన, సుందరనందుని చరిత్ర మిందు

విపులముగ వర్ణింపబడినది. ప్రణయైకజీవి నందుని కథ, బుద్ధజీవనచరితమున నొక అంగము. సుందరీనందులు, రూపరూపానుగుణచేష్టల వలన క్రమముగ లోకమున స్త్రీ పురుషులందు అనుపములని, మనుష్యజాతికి, దేవజాతికి, నడుమ నుండునట్లు విధాత వారిని సృష్టించెనని కవి వర్ణించును.

**"రూపేణ చాత్యంత మనోహరేణ, రూపాఽనురూపేణ చ చేష్టితేన।**
**మనుష్యలోకే హి తదా బభూవ, సా సుందరీ, స్త్రీషు, నరేషు నందః॥**
**సా దేవతా నందనచారిణీవ, కులస్యనందీ జననశ్చ నందః।**
**అతీత్య మర్త్యా ననుపేత్య దేవాన్, సృష్టావభూతా మివ భూతధాత్రా।"**

(సౌం.నం. IV- 5,6)

విషయరతులై మోక్షవిముఖులైన జనులను, మోక్షపథచరిష్ణువులుగా నొనరించుటకు కవి రసమయకావ్యమార్గము నాశ్రయించెను.

**"స్వాదుకావ్యరసోన్మిశ్రం, శాస్త్రమ ప్యుపయుఞ్జతే।**
**ప్రథమాఽఽలీఢమధవః, పిబన్తి కటుభేషజమ్।"**

(భామహుడు - కావ్యాలంకారము V-3)

మనోజ్ఞకావ్యరసోన్మిశ్రమైన శాస్త్రము సైతము, ఆస్వాదోపయుక్తము కాగలదు. తేనెను మొదట లేహనమొనర్చినవారు, కటువైన ఔషదమును గ్రోలగలరు.

జాతిహృదయమును స్పృశించి, సంస్కరింపగల భాషారూపము, కావ్యమేయని, దానినిపరమార్థబోధకుసాధనముగ నీ కవి గ్రహించి సౌందరనందముతో పాటు, సారిపుత్రప్రకరణనాటకము, మహాయాన శ్రద్ధోత్పాదము, వర్ణభేదమును విమర్శించు వజ్రసూచి మొదలైన గ్రంథముల రచించెను. శ్రీకృష్ణమిశ్రయోగికృత ప్రబోధచంద్రోదయనాటకము, వేదాంతదేశికకృతసంకల్పసూర్యోదయనాటక మీ కోవకు చెందినవే.

ఈ కథకు ఆధారము, పాళీసాహిత్యము. ఉదాన,జాతక, ధమ్మపదాట్ఠ కథలందు (13, 14 గాథలు) నందుని కథ చెప్పబడినది.

నందుని బలవంతపు ధర్మదీక్ష, సుందరి విలాపము, వైరాగ్య విముఖుడైన నందుని విలాపము, నందుని స్వర్గదర్శనము, అప్సరసల నాతడు కాంక్షించుట,

చతురార్యసత్యవ్యాఖ్య, అప్సరసలకై నందుని తపస్సు, నందుని అమృతప్రాప్తి ఇత్యాది కథాఘట్టములు, రమ్యాతిరమ్యముగ నీ కావ్యమున వర్ణితములు. నందుని రూపరాగమును రూపరాగము చేతనే ఉపాయకుశలుడైన భగవంతుడు నిరసింపజేసి, అతనిని మోక్షపథగామి నొనరించును. **మోక్షమున కాధారము వైరాగ్యము; వైరాగ్యమున కాధారము సంవేదము (సమ్యక్ జ్ఞానము); సంవేదమున కాధారము జ్ఞాన దర్శనము.**

శీలము, ఇంద్రియసంయమము, పరిమితాశనము, అల్పనిద్ర, ఏకాంత సేవనము, వితర్కవిచార పరిత్యాగము, ధ్యానము, యోగాభ్యాసము మొదలగు మోక్షోపాయము లిందు మనోజ్ఞముగ వివరింపబడినవి. జీవమున్నపుడే, మృత్యువు రాకమునుపే, వయస్సు యోగవిధికి సమర్థముగ నున్నపుడే, శ్రేయస్సునందు బుద్ధినిల్పుము.

**"త ద్యావదేవ క్షణసన్నిపాతో, న మృత్యురాఽఽగచ్ఛతి యావదేవ।**
**యావద్వయో యోగవిధౌ సమర్థం, బుద్ధిం కురు శ్రేయసి తావదేవ॥"**
(సౌం. నం. I. 49)

వీర్యము (ప్రయత్నము, ఉద్యోగము, పురుషకారము) కార్యసఫలతకు మూలము. సమస్తసంపదలు వీర్యజన్యములు. నిర్వీర్యత, సకలపాపరూపము, పతనహేతువు, వినాశకారకమని బుద్ధోపదేశము. మానవుల యందు నిద్రాణమై యున్న ఆధ్యాత్మికవిభూతికి మూలములైన దానశీలాదులగు పారమితలు ఈ వీర్యశక్తి చేతనే అభివ్యక్తములగుచున్నవి.

**"వీర్యం పరం కార్యకృతౌ హి మూలం, వీర్యాదృతే కాచన నాస్తి సిద్ధిః।**
**ఉదేతి వీర్యా దిహ సర్వసంపత్, నిర్వీర్యతా చేత్సకలస్య పాప్మా॥"**
(సౌం. నం. XVI-94)

నందుడు భగవదుపదేశము నాలకించి, తద్ధర్మము ననుష్ఠించి సకల క్లేశములను జయించినాడు. ధ్యానానుష్ఠానమున అర్హత్త్వభూమికను (జీవన్ముక్తిని) సాధించి, ఔత్సుక్యము, స్నేహము, ఆశ, భయము, శోకము, మదము, రాగము మొదలగు చిత్తవికారముల నుండి విముక్తుడైనాడు. ఇప్పుడు ప్రియవిప్రియములు, అనుకూలప్రతికూలములును, లేవు. పరమానందపరమశాంతులు అనుభూతము లైనవి; కృతకృత్యత సిద్ధించినది.

నందుడు, స్వస్థుడు, సమచిత్తుడు, ప్రశాంత హృదయుడునై, పరిపూర్ణకార్యుడై ధన్యతను పొందినాడు.

శాంతుడు, సంతుష్టుడు, తత్త్వజ్ఞుడునైన వానికి సుఖముగ వివేకము సిద్ధించును. మానరహితుడు, నిర్మదుడు, అనాసక్తుడునైన వానికి సుఖముగ వైరాగ్యము సిద్ధించును. తత్త్వము చక్కగా నెఱిగి దోషముల **ను**న్మూలించి శాంతిని పొందిన నేనిపుడు గృహస్థాశ్రమమునుగాని, సుందరినిగాని, అప్సరసలను గాని దేవతలను గాని చింతించుట లేదు - కాంక్షించుటలేదని నందుడు తన అపరోక్షానుభవమును వెల్లడించినాడు.

**"అథో హి తత్త్వం పరిగమ్య సమ్య,**
**జ్నిర్ధూయ దోషా నధిగమ్య శాంతిమ్ ।**
**స్వం నాశ్రమం సంప్రతి చింతయామి,**
**న తం జనం నాఽప్సరసో న దేవాన్ ।** " (సౌం. నం.XVIII-43)

కార్యసిద్ధిని పొంది పరమావస్థ నధిగమించిన నీ కిక చేయవలసిన కార్యము లణుమాత్రమైనను లేవు. ప్రియదర్శనా! ఇక మీదట కారుణ్యముతో భాధాగ్రస్తులైన యితరులకు సైతము దుఃఖవిముక్తిని, శాంతిని కల్గించుటకు పాటుపడవలయుననని భగవంతు డుద్బోధించును.

**"అవాప్తకార్యోఽపి పరం గతిం గతో,**
**న తేఽస్తి కించి త్కరణీయ మణ్వపి ।**
**అతః పరం సౌమ్య! చరాఽనుకంపయా,**
**విమోక్షయన్ కృచ్ఛ్రగతాన్ పరానపి ।"** (సౌం. నం. XVIII-54)

నందుడు, పరమకారుణికుడు, శాస్త్రయునగు భగవంతుని ఆజ్ఞను, చరణములను, సమముగ శిరోధార్యమొనరించుకొని, **(మూర్ధ్నా వచశ్చ చరణౌ చ సమం గృహీత్వా)** మోక్షధర్మమును వ్యాప్తి చేయుచు, దుఃఖితులగు జనులకు దుఃఖవిముక్తిని, పరమోపశాంతిని కల్గించి, ఆజ్ఞను నిర్వర్తించి, అంధకారావృత లోకమున ధర్మజ్ఞానదీపమై మార్గదర్శియైనాడు. నందపత్నియగు సుందరియు, విషయార్థముల నుండి విరాగిణియై, ధర్మపథమున చరించి నిర్వాణసిద్ధి పొందినది.

భాషా విషయమున నీ రెండు కావ్యములు (బుద్ధచరిత సౌందరనందములు) సరళము, లలితము, ఉజ్జ్వలమునైన శైలితో ఉపజాతి, వంశస్థ, శిఖరిణీ, మందాక్రాంతాది వివిధ ఛందోరీతులతో శ్రవణసుభగములై దీర్ఘసమాసరహితములై సులభ గ్రాహ్యములుగ, ఉపశాంతి దాయకములుగ నున్నవి. విషయసుఖపరాయణులై మోక్షధర్మవిముఖులైన జనుల నాకర్షించుటకు మోక్షార్థగర్భితమైన కృతుల కావ్యశైలి యందు అశ్వఘోషుడు రచించినాడు. కటువగు నౌషధమును రోగగ్రస్తులు సుఖముగ త్రాగుట కందు మధువు (తేనె)ను వైద్యుడు మిళితము చేసినట్లు, మహాకవి, సులభగ్రాహ్యము కాని, మోక్షధర్మమును రసమయకావ్యధర్మమున మిళిత మొనరించి లోకహితమును సాధించినాడు.

**ఇత్యేషా వ్యుపశాంతయే, న రతయే, మోక్షార్థగర్భా కృతిః ।**
**శ్రోతౄణాం గ్రహణార్థ మన్యమనసాం కావ్యోపచారాత్కృతా ।**
**"యన్మోక్షాత్కృత మన్యదత్ర హి మయా తత్కావ్యధర్మాత్ కృతమ్ ।**
**పాతుం తిక్త మివౌషధం మధుయుతం హృద్యం కథం స్యాదితి ॥"**

(సౌం. నం. XVIII-63)

అశ్వఘోషునిపై భగవద్గీతాప్రభావము కన్పించును. గీత, అష్టాదశాఽధ్యాయాత్మకము. సౌందరనందమును అష్టాదశసర్గాత్మకము. గీతయందు భగవదుపదేశానంతరము అర్జునుడు తదాజ్ఞను నిర్వర్తించినట్లే సౌందరనందము నందును,నందుడు, భగవదాజ్ఞను నెఱవేర్చును. సౌందరనంద మందలి 'కర్మయోగ' (XVII-19) 'అభ్యాసయోగ' (XVI-20) 'ఇంద్రియాణీంద్రియార్థేభ్యః' (XIII-30) మొదలగు పదములు అశ్వఘోషునిపై భగవద్గీతా ప్రభావమును చాటుచున్నవి. ఉపనిషత్తుల ప్రభావము సైతము అశ్వఘోషునిపై కలదు.

**"స యథా శకునిః సూత్రేణ ప్రబద్ధో దిశం దిశం పతిత్వాఽన్యత్రాఽఽయతన మలబ్ధ్వా బంధన మేవోపాఽఽశ్రయతే"** (ఛాందోగ్యోపనిషత్తు VI-8-2) ఈ శ్రుతి వాక్యము సమగ్రముగ సౌందరనందమునందలి ఈ శ్లోకమున ననువదింపబడినది.

**"సూత్రేణ బద్ధో హి యథా విహంగో, వ్యావర్తతే దూరగతోఽపి భూయః।**
**అజ్ఞానసూత్రేణ తథాఽవబద్ధో, గతోఽపి దూరం పునరేతి లోకః॥"**
(సౌం. నం. 11-59)

భావము, భాష, ఉపమాఽలంకార ప్రయోగములందు రామాయణ ప్రభావము ఇందు స్పష్టముగా కన్పించును. సిద్ధార్థుని, తపోవనమున శ్రీరాముని సుమంత్రుని వలె పరిత్యజించి, తాను పురమున కేగజాలనని సారథి ఛన్న (ఛందకు)డనును.

**నాఽస్మి యాతుం పురం శక్తో దహ్యమానేన చేతసా।**
**తపోవనే పరిత్యజ్య సుమంత్ర ఇవ రాఘవమ్॥** (బు.చ. VI-36)

ఇత్యాదులు (బు.చ. VIII-79; IX-9) అనేకములు, అశ్వఘోషునిపై రామాయణప్రభావమును విశద మొనర్చుచున్నవి. బుద్ధచరితము తన చిత్త పరిపక్వదశయందు అశ్వఘోషుడు రచించెనని, సౌందరనందము పూర్వరచనయని పండితాభిప్రాయము.

వైదికవాఙ్మయసంస్కృతుల యందు అశ్వఘోషుని నిరుపమాన భక్తిగౌరవము లాతని కావ్యములయందు ప్రకాశితములు. వేదవిరుద్ధ సిద్ధాంతము లెందును ఈ కావ్యముల కన్పింపవు. కాన, బుద్ధ ధర్మము వేదవిరుద్ధమనుట విడ్డూరము, అజ్ఞానజన్యము. విజ్ఞులైన సాహిత్యవిమర్శకులందఱి అభిప్రాయ మిదియే.

"In his works we see the great reverence which the poet had for the Vedic literature and culture. There is nothing in the poems that can be taken as an indication of the poet's dissatisfaction of the Vedic religion and Vedic rituals and Vedic practices and Vedic customs. It is usually said that Buddhism is a revolt against the Vedic rituals and Vedic customs and Vedic practices. There can be no doubt about the fact that the poet is a true representative of the ideals of Buddha's teachings. Yet no follower of the Vedic path can detect in his poems anything that goes against the Vedic beliefs and the Vedic practices.

(Survey of Sanskrit Literature (P. 133) C. Kunhan Raja - 1962 Bharatiya Vidya Bhavan Publication)

భారతవర్ష ప్రాచీనాధ్యాత్మిక తత్త్వమునకు బుద్ధధర్మమున సంపూర్ణ సమర్థనము కలదనుటను ఈ మహాకవి కావ్యములు ప్రకటీకరించుచున్నవి:

**పద్యచూడామణి :—**

ఇది దశ (10) సర్గాత్మకమైన మహాకావ్యము. భదన్త బుద్ధఘోష రచితము. వివిధఛందోరీతులలో నిందు ఆఱునూటనలువదియొకటి (641) శ్లోకములున్నవి. అష్టాదశవర్ణనములలో సముద్ర, మధుపాన, రతోత్సవ, మంత్ర, దూత, వర్ణనములు కాక, మిగత వర్ణనములన్నియు నిందు గలవు. బౌద్ధకావ్యము వైరాగ్యప్రధానమగుటచే నవి ఇందు లేకుండుట సహజము.

లలిత విస్తరము, అశ్వఘోషుని బుద్ధచరితము, నందిలి బుద్ధజీవితకథాంశములు పద్యచూడామణికి మూలములు.

కపిలవస్తునగరవర్ణనముతో ప్రారంభమై గౌతమసిద్ధార్థుని జననము, వివాహము, వార్ధక్య రోగ మరణాది దుఃఖసంబంధి దోషదర్శనము, తపోధనదర్శనము, మహాభినిష్క్రమణము, తపశ్చరణము, నిర్వాణప్రాప్త్యుపాయచింతనము, మారవిజయము, బుద్ధత్వప్రాప్తి పర్యంతమగు బుద్ధ జీవితఘట్టములు రసరమ్యముగ నీ కావ్యమున వర్ణితములు. ఉత్తరబుద్ధచరితమిందులేదు. ఇంద్రవజ్ర, మాలిని, వసంతతిలక, వియోగిని ఉపజాతి, శాలిని, మందాక్రాంత, శార్దూలవిక్రీడితవృత్త ఛందోరీతు లిందు ప్రయుక్తములు.

బుద్ధఘోషుని వర్ణనములు, విస్తృతములు సమృద్ధములునై, పఠితల హృదయములకు రససంస్పర్శను కల్గించి తన్మయులను గావించును. ఉపమలు మనోజ్ఞములు.

అనన్యసామాన్యధీశాలియగు కుమారసిద్ధార్థుని పొందిన విద్యలు, శరత్కాల నిర్మలాకాశమును పొందిన చంద్రకిరణసమూహము లట్లు అతిశయముగ ప్రకాశించినవి.

**"అనన్య సామాన్యధియం కుమార,**
**మాసాద్య విద్యాః సుతరాం విరేజుః।**
**శరత్ప్రసన్నం గగనావకాశం,**
**తారాధిపస్యేవ మయూఖమాలాః।"** (ప.చూ. III. 44)

చంద్రోదయసందర్భమున పూర్వదిశావర్ణనము. కుమారుని ఉద్వహించు కాంతాముఖము ధవళమైనట్లు తూర్పు దిక్కు తెల్లబడినది.

**సముద్రగర్భాంతర మాశ్రయంతం,**
**తమోఽపం చంద్రమసం తనూజమ్।**
**సముద్వహంతీ శతమన్యుకాష్ఠా**
**శనైర్ముఖే పాండురతా మయాసీత్।** (ప.చూ. VIII-26)

సిద్ధార్థుని తపోధనవేషవర్ణనమున ఆ వేషము ఆదికల్పసముద్భూతమని, ఆదిబ్రహ్మగృహీతమని బుద్ధఘోషుడు వర్ణించును.

**"ఆదికల్పసముద్భూతా మాదిబ్రహ్మసమాహృతామ్।**
**అగ్రహీ దగ్రణీః పుంసాం తపోధనపరిష్క్రియామ్।"**

(ప. చూ. IX.19)

ఇట్లుపమామనోరమమై ప్రసాదగుణప్రధానము, రసనిర్భరమునై పద్యచూడామణి బుద్ధుని సంబోధిప్రాప్తిపర్యంతమగు పావనచరిత్రమును పాఠకుల కనులకు కట్టునట్లు వర్ణించును.

బుద్ధఘోషుడు పాళీ త్రిపిటక భాష్యకారుడు. 'విశుద్ధి మార్గము'ను గ్రంథమునీతడు అనురాధపురమున రచించెను. పద్యచూడామణి యందెచ్చటను నీ కవి తన్ను గుఱించి ప్రస్తావింపడు. ప్రథమసర్గమున, 2,3, శ్లోకముల యందు బుద్ధచరితాఽపదానము రచించుటకు తా ననర్హుడై నను బుద్ధుని యందలి భక్తిశక్తి వలన దానిని రచించుటకు తాను ప్రవీణుడై నాడని మాత్రము చెప్పి వినయమును చాటును. ఈతని కాలము క్రీ.శ. ఐదవ (5) శతాబ్దియని పండితాభిప్రాయము. బుద్ధఘోషకృత **'సమంతపాసాదిక'** అను గ్రంథమును సంఘభద్రుడను బౌద్ధభిక్షువు క్రీ.శ. 488న చీనీ భాషలోనికి పరివర్తించెను.

**జాతకమాల :-** ఇది ఆర్యసూరునిచే రచింపబడినది. జాతకమాల యొక్క చీనీ భాషానువాదము - క్రీ.శ. 434న లిఖింపబడినది - లభించినందున, ఆర్యసూరుని కాలము క్రీ.శ. మూడవ శతాబ్దియని పండితులు నిర్ణయించినారు. క్రీ.శ. 671-614 మధ్యకాలమున భారతవర్షమును సందర్శించిన చైనాదేశయాత్రికుడు 'ఇత్సింగ్' మహాశయుడు, ఆకాలమున బౌద్ధుల కీగ్రంథ మత్యంత ప్రీతిపాత్రమై ప్రచారమున నుండెనని వచించెను. అజంతాగుహల యందలి శిలాచిత్రముల లేఖనకాలమున నీకావ్యము ప్రచారమున నుండెననియు, కొందఱి అభిప్రాయము.

**అవదానకల్పలత :-** కాశ్మీరనివాసి క్షేమేంద్రుడు, బుద్ధుని జీవితమును గూర్చిన, అప్రతిమానకావ్యమును 'అవదానకల్పలత'ను రచించెను. భావవ్యంజకత యందును, ఉదాత్తత యందును నీకావ్యమద్వితీయము.

జాతకమాల లనబడు కొన్ని గ్రంథములు పూర్వము నూటయెనుబదిమూడు (183) సంస్కృతమున నున్నట్లు అవదానకల్పలత యొక్క ప్రస్తావన యందు క్షేమేంద్రుని కుమారుడు సోమేంద్రు డిట్లు చెప్పును.

**"ఆచార్యగోపదత్తాద్యై రవదానక్రమోజ్ఝితాః,**
**ఉచ్ఛ్రిత్యోచ్ఛ్రిత్య విహితా గద్యపద్యవిశృంఖలాః ।**
**ఏకమార్గానుసారిణ్యః పరం గాంభీర్యకర్కశాః,**
**విస్తీర్ణవర్ణనాః సన్తి జినజాతకమాలికాః ।"**

ఆర్యసూరుని జాతకమాల రమణీయ **చంపూకావ్యము**. పాళీ జాతక గ్రంథమందలి ఐదునూటయేబది (550) కథలలో అత్యంతసుందరములైన ముప్పదినాల్గు(34) పావనకథల నెన్నుకొని పఠితల హృదయమున సద్ధర్మమును ప్రతిష్ఠించు నుద్దేశముతో సూరుడీ కావ్యమును రచించెను.

**"గద్యానుబంధరసమిశ్రిత పద్యసూక్తి**
**ర్హృద్యా హి వాద్యకలయా కలితేవగీతిః ।**
**తస్మాద్దధాతు కవిమార్గజుషాం సుఖాయ**
**చంపూప్రబంధరచనాం రసనా మదీయా ।"**

(చమ్పూరామాయణము. బాల. 3)

అని భోజుని సూక్తి. కుసుమసుకుమారమైన గద్యముతో హృద్యములైన శ్లోకములు మిశ్రితమైన ఈ కావ్యసరణి, అత్యంతసుందరము. మధురము, సరళము. భావమాధుర్యము, శయ్యామాధుర్యము నీ కావ్యమున నొకటిని మఱొకటి అతిశయించుచున్నట్లు తోచును.

కావ్యేందిర సహజసౌందర్యమును మఱుగు పఱపని కొలది మనోజ్ఞాలంకారములు మాత్రమే ఆర్యసూరుడు గ్రహించెను. ప్రఫుల్ల వర్ణనము, పావనబోధ, ప్రసన్నకథాకథనము, నొకదానితో నొకటి అపూర్వసామరస్య మొంది కావ్య ప్రపంచమున నీకవికి, అజరామరమైన యశస్సును సంపాదించినవి.

మత్తమయూర, భుజంగప్రయాత, ప్రహరణకళిక, ప్రమితాక్షరాది ఛందోరీతులతో నీకావ్యము పఠితల రసతన్మయుల నొనర్చును.

కథాప్రారంభమున బోధాత్మకమైన గద్యసూక్తి యుండును. ఆ సూక్తికి వ్యాఖ్యానరూపమే కథ. సమాప్తి సైతము గద్యరూపమే.

ధర్మబోధ, కావ్యమున సర్వత్ర స్పందించుచుండును.

**"న సజ్జనా ద్దూరచరః క్వచిద్భవే -**
**ద్భజేత సాధూ న్వినయక్రమానుగః ।**
**స్పృశ త్యయత్నేన హి తత్సమీపగం,**
**విసర్పిణ స్తద్గుణపుష్పరేణవః ।"** (జా.మా. XXXI - 72)

సజ్జనులకెప్పుడును నీవు దూరముగ నుండకూడదు. నమ్రభావమున వారిననుసరించి సేవింపవలెను. వారి సన్నిధినున్న వ్యక్తిని, ప్రసరించు స్వభావము గల వారి సద్గుణపుష్పపరాగకణములు అయత్నముగనే స్పృశించును.

**"త్యక్తవ్యం వివశేన యన్న చ తథా కస్మైచిదర్థాయ యత్,**
**యన్న్యాయేన ధనం త్యజన్యది గుణం కిఞ్చిత్సముద్భావయేత్ ।**
**కోఽసౌ తత్ర భజేత మత్సరపథం జానన్ గుణానాం రసం,**
**ప్రీత్యాద్యా వివిధాశ్చ కీర్త్యనుసృతా దానప్రతిష్ఠా గుణాః ।"**

వివశత్వమున త్యజింపదగిన ధనము నిరర్థకము. కాని, న్యాయముగ ధనమును త్యజించినచో ఏదేనొక గుణమునకు హేతువు కావచ్చును.

సద్గుణములందలి మనోరమత్వము–రసము–నెఱిగిన వాడెవడు స్వార్థపరత్వము – మత్సర పథము – ననుసరించును? యశస్సు అనుసరించు ప్రీత్యాది సద్గుణములన్నియు దానగుణమునందే ప్రతిష్ఠితములు. (జా.మా. III-20)

**"రథా నృపాణాం మణిహేమ భూషణా,**
**వ్రజన్తి దేహాశ్చ జరావిరూపతామ్ ।**
**సతాం తు ధర్మం న జరాఽభివర్తతే,**
**స్థిరాఽనురాగా హి గుణేషు సాధవః ।"** (జా.మా. XXXI - 74)

మణిహేమభూషితములైన రాజరథములు, శిథిలములై నశించును. ఆ రాజుల దేహములును, వార్ధక్యముచే విరూపములగును. సత్పురుషుల ధర్మమును జర, మార్కొనజాలదు. కాన, సద్గుణములందు సాధువులు స్థిరమైన అనురాగమును గల్గియుందురు.

జాతకమాల, ఆర్యసూరుని అపారసారస్వతాధ్యయనము, మహోన్నతమైన వ్యుత్పన్నతను వ్యంజించుచున్నది.

దేశమున సర్వతోముఖముగ విలసిల్లిన సారస్వతవసంతసమయముననే ఇట్టి కావ్యకుసుమగుచ్ఛము వికసింపగలదు. కాన, ఆర్యసూరుడు కాళిదాస సమకాలికుడు కావచ్చునని ప్రొ. కెర్న్ (Prof. Kern) అభిప్రాయపడినాడు.

టిబెట్ చరిత్రకారుడు తారానాథుడు, అశ్వఘోషుడే ఆర్యసూరుడని వ్రాసెను. కాని, బుద్ధచరిత జాతకమాలల శైలీ విభేదమును బట్టి యిది అంగీకార యోగ్యము కాదు. బుద్ధుని వలెనే ఆర్యసూరుడును క్షుదార్తమైన వ్యాఘ్రమునకు తన దేహము నాహారముగ నొసగినాడని తారానాథుని కథనము, స్వరక్తముతో సూరుడీసమయమున డెబ్బది (70) ప్రార్థన శ్లోకములు రచించినాడట.

అశ్వఘోషాదులైన ఈ ముువ్వురు మహాకవులు, **పరమార్థబోధకై భాషామహారాజ్య సింహపీఠికపైన చేయి వైచి,** శాంతరసప్రధాన కావ్యముల రచించి, జ్ఞానమయ ప్రదీపములను ప్రజ్వాలిత మొనరించి, అజ్ఞానతమోఽంధమైన ఈ లోకమున మార్గదీపకులై మానవజాతి కృతజ్ఞతకు శాశ్వతభాజనులై కీర్తిశరీరులై నేడును ప్రకాశించుచున్నారు.

**"జయన్తి తే సుకృతినః రససిద్ధా కవీశ్వరాః ।**
**నాఽస్తి తేషాం యశః కాయే, జరామరణజం భయమ్ ।"**

(భర్తృహరి -I.20)

(సుకృతాత్ములు (ధన్యాత్ములు) రససిద్ధులు (సిద్ధరసులు-పరమార్థ సాక్షాత్కారవంతులు నగు కవీశ్వరులు (క్రాంతదర్శులు-త్రికాలజ్ఞులగు యోగీంద్రులు) సర్వోత్కృష్టులై సర్వదా ప్రకాశించుచున్నారు. వారి యశః శరీరము నందు జరామరణజమైన భయములేదు.)

**శివ మస్తు సర్వజగతః, పరహితనిరతా భవన్తు భూతగణాః ।**
**దోషః ప్రయాన్తు నాశం, సర్వత్ర సుఖీ భవతు లోకః ।**

(సర్వజగమునకు శుభమగుగాక! ప్రాణులు పరహితాచరణమతులగుదురు గాక! రాగద్వేషాది దోషములు నశించు గాక! సర్వత్ర లోకము సుఖవంతమగుగాక!)

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

*ఓం శాంతిః శాంతిః శాంతిః*



# ధమ్మపదం—అనువాద వైశిష్ట్యం

ధమ్మపదం బౌద్ధుల త్రిపిటకాలలో ఒకటయిన సుత్తపిటకంలోని ఖుద్దక నికాయంలోని పదహైదు భాగాలలో రెండవది. దీనికి ప్రపంచంలోని వివిధ భాషలలో అనువాదాలు వెలువడ్డాయి.

డాక్టర్. రత్నాకర బాలరాజుగారు వైదికషడ్దర్శనాలను బౌద్ధజైనదర్శనాలను, పాశ్చాత్యదర్శనాలను అధ్యయనం చేసిన విద్వద్వరేణ్యులు. జైన బౌద్ధాలు, వేదోపనిషన్మతానికి నాతిభిన్నములని, దానితో ప్రభావితమైన సంస్కరణమతాలని నమ్మినవారు. కనుక ఈ అనువాదం ఆదృష్టితోనే సాగింది.

వీరి అనువాదపద్ధతి విలక్షణమైనది - పాలీగాథ, దాని సంస్కృతచ్ఛాయ, తెలుగులో దాని తాత్పర్యం, అధస్సూచికలలో పాఠాంతరాలు, ప్రామాణిక భారతీయ విద్వాంసులు గ్రహించిన వివిధపాఠాంతరాల ఔచిత్యవిచారచర్చ, వేదోపనిషద్భారత రామాయణాదులలోని శ్లోకాలతో గాథల పోల్చు, విశేషసాంప్రదాయిక విషయాల వివరణ - ఈ రీతిగా కొనసాగింది. అధస్సూచికలు వీరి అపారప్రాచ్యపాశ్చాత్య పాండితికి, ఆధునిక పరిశోధన సంప్రదాయ పరిణతికి తార్కాణాలు. అనువాదమంటే- ముఖ్యంగా శాస్త్రగ్రంథానువాదమంటే ఇట్లా వుండాలి సుమా! - అని పరిశోధన ప్రవణులకు కనువిప్పును, జిజ్ఞాసువులకు మదిమెప్పును కలిగించే ఉత్తమ గ్రంథమిది. చివరి అనుబంధాలలో వీరు బౌద్ధపాలీసాహిత్య, బౌద్ధసంస్కృతసాహిత్యచరిత్రను పాఠకుల మనోవికాసం కోసం పొందుపరచారు.

బౌద్ధదర్శనంపై ఎన్నో ఉద్గ్రంథాలు రచించిన డాక్టర్. బాలరాజుగారు పిటకాలు తెలిగిస్తే ఎంత బాగుండును! అని అనిపించింది; ఈ అనువాదం చదివిన తర్వాత. భగవంతుడు వీరికి అలాటి అవకాశం కలిగించు గాక!

నాతో ఈ రెండు మాటలు వ్రాయించి, నన్ను గౌరవించిన డాక్టర్ బాలరాజు గారికి సదా ఋణిని.

హైదరాబాద్ - 380
పద్గుచ్ఛణం - 28-3-1994

భాషా సేవకుడు
**తిరుమల రామచంద్ర**

# పాళీ (విశేష) శబ్దానుక్రమణిక

## (సంఖ్యలు గాథలను నిర్దేశించును)

# ధమ్మపదం
## పాళీగాథానుక్రమణిక



* ఇది గాథా సంఖ్యను తెలుపును.

with Text, Translation and Commentary 'n Telugu

by


Dr. Ratnakaram Bala Raju [illegible]

Formerly, Lecturer & Head
Dept. of Telugu, Govt. College,
Anantapur (A.P.)


. . . Buddha's words have a special relevance for us in India and the Telugu reading public must thank Sri Bala Raju for rendering this service. I wish the book a wide circulation.

SWAMI RANGANATHANANDA
Vice President, Ramakrishna Math,
and Ramakrishna Mission, Hyderabad.

. . . Dr. Ratnakara Bala Raju needs no introduction to the philosophical elite of Andhra Pradesh. He is the author of several classical works in the area of Ancient Indian Thought including one on **Brahma Sutras.** His **Buddha Darshanam** is a monumental undertaking which reveals his insight into Buddhism and wide scholarship. The present work **Dhammapada** provides the original text in Pali and its translations in Sanskrit and Telugu with cross-references whereever necessary to other scriptures prior to the advent of the Buddha, especially **Chhandogya, Brihadaranyaka** and **Mandukya Upanishads.**

V. MADHUSUDAN REDDY
Chairman,
Institute of Human Study,
Sri Aurobindo Darshan, Hyderabad.

. . . All things considered we can say that the wisdom of the ages is in the pages of this book. Dr. Bala Raju's translation of DHAMMAPADA is a mammoth undertaking, especially when we consider his pains-taking research and scholarly interpretation while quoting profusely from scriptures.

Prof. I.V. CHALAPATHI RAO
Editor, Triveni, Hyderabad.

. . . డాక్టర్ రత్నాకర బాలరాజు గారు వైదికషడ్దర్శనాలను, బౌద్ధ జైన దర్శనాలను, పాశ్చాత్య దర్శనాలను అధ్యయనం చేసిన విద్వద్వరేణ్యులు.

. . . వీరి అనువాద పద్ధతి విలక్షణమైనది - పాలీగాథ, దాని సంస్కృతచ్ఛాయ, తెలుగులో దాని తాత్పర్యం, అధస్సూచికలలో పాఠాంతరాలు, ప్రామాణిక భారతీయ విద్వాంసులు గ్రహించిన వివిధపాఠాంతరాల ఔచిత్యవిచారచర్చ, వేదోపనిషద్భారత రామాయణాదులలోని శ్లోకాలతో గాథల పోల్పు, విశేష సాంప్రదాయిక విషయాల వివరణ - ఈ రీతిగా కొనసాగింది.. . .

. . . ముఖ్యంగా శాస్త్రగ్రంథానువాద మంటే ఇట్లా వుండాలి సుమా! - అని పరిశోధనా ప్రవణులకు కనువిప్పును, జిజ్ఞాసువులకు మది మెప్పును కలిగించే ఉత్తమ గ్రంథమిది.

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర, హైదరాబాదు

శ్రీః

॥ ధమ్మం సుచరితం చరే ॥

# ధమ్మపదం

పాళీ, సంస్కృతచ్ఛాయా, ఆంధ్రానువాద

వ్యాఖ్యానసహితము



డా॥ రత్నాకరం బాలరాజు, M.A., Ph.D.